పిఠాపురం మహారాజా
శ్రీ రాజారావు వేంకట కుమార మహీపతి
సూర్యారావు బహద్దర్ గారికి

బాబూ !

మా కుటుంబాన్నీ నన్నూ చిన్నప్పటి నుంచీ తమరూ, అమ్మగారు శ్రీ మహారాణీగారూ అత్యంత వాత్సల్యంతో పెంచారు, తమ కరుణ వల్ల చదువులూ, సంస్కారాలూ అబ్బేయి భోగభాగ్యాలు అనుభవించాము

స్వర్గంలోవున్న తమకు పూర్వస్మృతులు రేకెత్తించే ఈ పుస్తకం కృతజ్ఞతా పూర్వకంగా దాఖలు చేస్తున్నాను

స్వీకరించండి

కురుమెళ్ళ వేంకట రావు.

పెమ్మరాజు వెంకటరావు

సంతపేట, ఒంగోలు

7-7-66

ప్రియమిత్రుడు కురుమెళ్ళ వేంకటరావుకు

నీ జాబు చేరింది. ఇంత కాలానికైనా మన లేఖావళి ప్రకటిస్తున్నందుకు చాలా సంతోషం. ఇవి కేవలం ఇరువురికై వ్రాసుకున్న లేఖలు కావు. సాహిత్యపు విలువ యిందులో యిమిడి వున్నాయనే అభిప్రాయంతోనే, వీటిని భద్రంగా దాచి వుంచి యిచ్చాను. అప్పట్లో, ఈ లేఖలు చదువుతూ నేనే ప్రపంచ ప్రదక్షిణ చేస్తున్నట్లు ఫీలయ్యాను. పాఠకలోకం గూడా అదే అనుభూతిని పొందగలదని ఆశిస్తున్నాను. ఈ లేఖావళిని శ్రీ మహారాజావారికి అంకితం చేయడం చాలా సమంజసంగా వుంది.

నీ

వెంకటరావు

# పీఠిక

"మా మహారాజుతో దూరదేశాలు (లేఖావళి)" అని యీ గ్రంథశీర్షిక. ఇక్కడ 'మా మహారాజు' అనగా అద్యతన యుగంలో ఆంధ్రభాషా పోషకులలో, కలకాలము సంస్మరించదగిన మహాపురుషులు కీర్తిశేషులు శ్రీ పిఠాపురం మహారాజావారు వారి విదేశయాత్రా పర్యటనలో సహచరులుగా వారి కుటుంబముతో నున్న శ్రీ కురుమెళ్ళ వెంకటరావుగారు తమ యాత్రా విశేషాలను, ఉత్తరముల మూలంగా, ఆయా దేశాలనుంచి, పిఠాపురంలో ఉన్న తమ ప్రియమిత్రులైన పెమ్మరాజు వెంకటరావుగారికి వ్రాసేవారు. ఆ వ్రాసిన లేఖలన్నింటిని నేడు గ్రంథరూపంగా లేఖాకర్తలైన వెంకటరావుగారు ఆంధ్ర లోకాని కందించారు. అందుచేతనే ఇది 'లేఖావళి'గా వెలసినది.

ఈ లేఖల వయస్సు ముప్పయి ఆరు సంవత్సరాలు. అయినను ఈనాటికి, ఆ లేఖలను అచ్చువేయవలెననే సంకల్పము తత్కర్తలకు కలిగినది. వెంటనే గ్రంథరూపంగా సంతరించి ముద్రించారు. ముద్రించిన ఫారములను సంపుటీకరణం చేసి ఈ నడుమనే అనగా కొద్దిరోజుల క్రిందట నా వద్దకు వచ్చి పుస్తకమును చూపించి, ఇలా అన్నారు - "పీఠికలేని గ్రంథం తిలకంలేని స్త్రీ వలె ఉంటుంది. అందుచేత ఈ గ్రంథానికి ఒక పీఠిక వ్రాయించవలచాను. మహారాజావారికి మీకుగల సన్నిహిత సంబంధాన్ని బట్టి మీరిది వ్రాయక తప్పదు."

ఇతరత్ర నాకెన్నో పనులున్నవి. తీరిక బొత్తిగా లేకపోయినా, మిత్రులూ, సహృదయులూ, అయిన వెంకటరావుగారి మాట కాదనలేక పోయాను. సరే అని అంగీకరించి ఉపక్రమించాను.

ఈ రచనా సంఘటన చిత్రమైనదే. అసలు లేఖారచయిత వెంకటరావు. లేఖల నెవరి పేర వ్రాసేరో వారు వెంకటరావు నామధేయులే. ఇక నీ లేఖా గ్రంథపీఠికాకర్త వెంకటరావే. ఈ సంఘటీకరణంలో త్రిపుటీకరణం విశేషం.

శ్రీ మహారాజా వారి యూరపు అమెరికా ఖండ పర్యటన తే. 2-5-1930 దిని ప్రారంభమై 7-12-1930 తేదితో ముగిసింది. ఈ ఏడు నెలల కాలములో జరిగిన వృత్తాంతముల నన్నింటిని వెంకటరావుగారు 31 లేఖలలో తెలిపియున్నారు వీనిలో ఒకపేజీ ఉత్తరము మొదలుకొని పది పేజీల ఉత్తరాల వరకు ఉన్నవి. ఉత్తరాలు పెద్దవిగా ఉండడము ఆయా స్థలవిశేషాలనుబట్టి యేర్పడుతుంది. అట్టి రచన కొన్నిపట్ల అవశ్యకముకూడా.

ఇంతేకాదు ఈ గ్రంథముద్రణలోనూ ఒక విశిష్టత, చిత్రమూ ఉన్నవి. ఆయా లేఖల ప్రారంభంలో, స్థలనిర్దేశం, తేదికి ఎదురుగా, ఆ లేఖ లే యే దేశాలనుండి వ్రాయబడినవో తెలుపుటకు, ఆయా దేశాలలోని ముఖ్య నైసర్గిక విశేషమొకటి చిహ్నముగా ముద్రించారు లేఖ చదువుతూన్నప్పుడు అందలి విశేషము, మనకు గోచరిస్తుంది.

ముందు నెను చెప్పినట్లుగా, ఈ రచన ముప్పయి ఆరేండ్ల క్రిందటిదైనా, ప్రస్తుతము వెలుగులోనికి రావడ మత్యంతమూ అభిలషణీయం. ఏమంటే, మనవారిలో కొందరు ప్రముఖులు, పాశ్చాత్యదేశాలలో, ముఖ్యంగా ఇంగ్లండు వెళ్లినా, వారు అందలి విశేషాలను తెలుపలేదు. చాలాకాలం క్రిందట శ్రీమతి కంగళ వాణీబాయిగారు 'నా ఐరోపాఖండ యాత్ర' యని ఒక వ్యాసమూలంగా తమ విదేశ పర్యటనను గూర్చి తెలిపారు కాని అది వ్యాసము మాత్రమే. ఆ వెనుక క్రీ శ 1935, ఉత్కలరాష్ట్ర విభజన సందర్భమున కళాప్రపూర్ణ డాకరు గిడుగు సీతాపతిగారు, ఇంగ్లండు వెళ్లారు కాని వారు రచయితలైనా, అందలి విశేషాలు వివరించలేదు. భారతవర్ష స్వాతంత్ర్యానంతరం విదేశ పర్యటన మనకు విద్యామూలంగా గాని, వ్యాపారమూలంగా గాని, రాజకీయ కార్యాలమూలంగా గాని, నిర్ణీతమయ్యే యున్నది విదేశాలలో ఏళ్ళ తరబడిగా నున్నను అందలి విశేషాలు మాత్రం గ్రంథస్థం చేయడం జరగలేదు. మొక్కపాటి వారి బారిష్టరు పార్వతీశం వంటివి అత్యల్పంగా అక్కడి సందర్భాలను మాత్రమే తెలుపుతవి దినదినము అంతర్జాతీయంగా సన్నిహితుల మగుచున్న మనకు విశేషాలన్ని విశదంగా, విపులంగా, విద్యార్థులకు విద్వాంసులకు తెలియవలసిన ఆవశ్యకత ఎంతో ఉన్నది. అట్టి గ్రంథముకూడా ఒకటి కొలుతగానే నేటి వరకు ఉండిపోయినది.

వెంకటరావుగారి ప్రస్తుత లేఖాసంకలనం పై లోటును తీర్చుచున్న దనుట కేమాత్రమును సందేహములేదు. ఆ విషయమును గ్రంథవిమర్శనము నందు తెలిపెదను

ఇక సాహిత్య వాఙ్మయ చారిత్రకదృష్ట్యా చూచినా, ఈ లేఖావళికి రెండు విధములుగా ఆద్యతనవాఙ్మయంలో స్థానమున్నది.

## లేఖా వాఙ్మయము (Letter-writing)

ఆంగ్లేయ భాషా వాఙ్మయంలో లేఖా వాఙ్మయానికి విశిష్టత వున్నది. కవులు తాము వ్రాసిన కావ్యాలలోకన్నా లేఖల మూలంగా, వారి ఆత్మీయత సువ్యక్తమవుతుంది. కనుక బట్టే ఆ వాఙ్మయంలో, కవులు వ్రాసిన లేఖలను సంపుటీకరించి, లోకములో వెలువరించడము జరుగుతుంది వానిని విశ్వవిద్యాలయాధికారులు పఠనీయగ్రంథాలుగా నిర్ణయిస్తారు

ఆధునికాంధ్ర వాఙ్మయంలో ఒక ప్రత్యేక శాఖగా, లేఖా వాఙ్మయ మింతవరకు పరిగణితమే కాలేదు బ్రౌను దొరవారి లేఖలనుగూర్చి అముద్రిత గ్రంథచింతామణిలోని లేఖలను గూర్చి నేను తొలుత వ్రాసి ఆ శాఖకొక ప్రత్యేక స్థానమును గలుగజేసితిని*. కాని విమర్శకులెవ్వరును దీనిపై దృష్టి సారించినట్లు లేదు వాస్తవముగా, లేఖావాఙ్మయమును పెంపుచేయవలసిన యావశ్యకత ఎంతయేని యున్నది

లేఖల మూలముగా మనోగత భావములు వ్యక్తములైనట్లు, మరియొక లిఖిత రూపమున వ్యక్తములు గావు లేఖలు వ్రాసేది చేతితోనైనా, మనస్సే వ్రాసేవారితో మాట్లాడుతుంది ఇందు చేతనే ఉత్తరాలు హృదయానికి హత్తుకొని పోవడము జరుగుతుంది అట్టి ఆత్మీయత, భావవ్యక్తీకరణ, ఈ లేఖావళిలో ఏలాగున ప్రపంచింపబడినవో ఆయా ఘట్టాలలో నిరూపిస్తాను.

---

* ఇప్పటికి నలభై నాలుగేండ్ల క్రింద నేను పట్టపరీక్షకు (బి ఏ. కు) Cowper's Letters అనే గ్రంథాన్ని పఠనీయ గ్రంథంగా చదువుకొన్నాను.

• ఆంధ్రవచన వాఙ్మయము, చూ. పుట, 92-95.

## యాత్రా చరిత్ర వాఙ్మయము (Tourist Literature)

ఆద్యతన యుగములోనే. యీ వాఙ్మయం ప్రారంభమైనది. మొదట వెలువడిన వన్నియు కేవలము భారతవర్షమునకు సంబంధించినవే వానిలో తొలిగా పేర్కొనదగినవి తెలుపుచున్నాను

| | | | |
|---|---|---|---|
| క్రీ శ | 1836 | కాశీయాత్రా చరిత్ర | ఏనుగుల వీరాస్వామయ్య |
| ,, | 1846 | నీలగిరియాత్ర | కోలా శేషాచలకవి |
| ,, | 1877 | ప్రిన్సుపువేల్సు హిందూస్థాన సందర్శనము | కొక్కొండ వెంకటరత్నము |
| ,, | 1886 | కాశీయాత్ర ప్రకాశిక | మానవల్లి త్యాగయ్య |
| ,, | 1887 | గంగా సేతు యాత్రా ప్రకరణము | ఉ వెంకటేశ్వరయ్య |
| ,, | 1892 | యాత్రా చరిత్ర | మండపాక పార్వతీశ్వరశాస్త్రి |
| ,, | 1893 | ,, ,, | శ్వేతాచలపతి రంగారావు (బొబ్బిలిమహారాజు) |
| ,, | 1930 | నామహారాష్ట్ర యాత్ర | జొన్నలగడ్డ సత్యనారాయణ |

ఈ తరువాత 'ఉత్తర భారతయాత్ర' మున్నగునవి వెలువడినవి భారతవర్షముకాక. పాశ్చాత్యదేశములందలి యాత్రా వివరములను, సంపూర్ణముగా తెలుపునది ప్రస్తుత గ్రంథము - 'లేఖావళి'యే

## లేఖల ప్రత్యేక విమర్శన

ఈ లేఖావళిలో అన్ని ప్రదేశాలనుండి వ్రాసిన ఉత్తరాలకంటె, లండను పట్టణమునుండి వ్రాసిన ఉత్తరాలే ఎక్కువ. అవి ఏడే అయినప్పటికి అచ్చులో ముప్పయి పుట లున్నాయి. ఇది సమంజసమే. ఏమంటే విదేశ యాత్రలో మహారాజావారు హెచ్చుకాలము గడిపినది లండను, ఆ పరిసరాల్లోనే. ఎనిమిది రోజులు తక్కువగా రెండునెల లున్నారు. ఈ లేఖాకర్తలే

---

వీనిలో కొన్నింటిని గూర్చి, 'నా ఆంధ్రవచన వాఙ్మయము' చూడనగును. పుట 80-85

తే 24-6-1930 ది రోజున వ్రాసిన ఉత్తరంలో "లండను పట్టణానికి పాత కాపులం అయిపోయామా అన్నట్టుగా ఊరంతా తెలిసిపోయింది" అని వ్రాశారు క్రీ శ 1930 నాటికి భారతదేశంలో స్వాతంత్ర్య సమరము ప్రారంభమై, ఒక దశాబ్దికి పైగా అయినది కాని అప్పటికి బ్రిటిషువారె పరిపాలకులు రాజకీయంగా వా రప్పటికే నూట డెబ్బయి యేండ్లనుండి భారతవర్షాన్ని పరిపాలిస్తున్నారు ఆ నాటి నుండి భారతవర్షానికి బ్రిటిషు రాజదాని అయిన లండనునకు నిరంతర సంబంధ మేర్పడింది క్రీ శ 1886లో సూయెజ్ కాలువ త్రవ్విన తరువాత ఇంగ్లండు ఇండియాకు దగ్గరయైనది ఆనాటినుండి రాకపోకలు హెచ్చినవి ఉన్నత విద్యకొరకు భారతీయులు అక్కడకు వెళ్ళుట ఆచారమైపోయినది అందును మహారాజులు, జమీందార్లు, భూస్వాములు, రాజకీయంగా లండనులో కొంత కాలము ఉండడము అవశ్యకమే అయినది పిఠాపురం మహారాజావారు ఆ సంగతిని గ్రహించే అక్కడ అంతకాల మున్నారు

## తెలుగు సాహిత్యములో లండను —

## కొక్కొండవారు

ఈ లేఖలలో లండను పట్టణము, పరిసరాలు ఎంతో విపులంగా వర్ణితమై ఉన్నవి లండను పట్టన వర్ణన మాత్రము తెలుగు సాహిత్యంలో అప్పటికి నలభై ఆరెండ్ల క్రిందటనే మనకు కనబడుతుంది పట్టణ ప్రశంసయే గాక థేమ్సునది వర్ణనకూడా తెలుగు సాహిత్యంలో కనబడుతుంది ఇది ఆధునిక సాహిత్య చరిత్రకు క్రొత్తవిషయము కాబట్టి కొంచెము వివరిస్తాను

తెలుగు సాహిత్యంలో వర్ణనల మూలంగా, లండనును మొదట పరిచయమొనరించినవారు కొక్కొండ వెంకటరత్నము పంతులుగారు దానికి కారణ మిది క్రీ శ 1876 లో బ్రిటిషు రాజ్యము విక్టోరియా రాణి పరిపాలనలో ఉండేది అప్పటికి యువరాజుగా నున్న ఏడవ యెడ్వర్డు చక్రవర్తి మన భారతదేశమును సందర్శించారు ఇంగ్లీష్‌లో యువరాజును 'ప్రిన్సఫ్‌వేల్సు' అని అందురు ఆ ప్రిన్సఫ్‌వేల్సు హిందుస్థాన సందర్శనమును పురస్కరించుకొని ఆ సందర్శనమును సాహిత్యమున చిరస్థాయిగా చేయుటకు, లండనులో "The London Crown Perfumery Company" అని యొక

సంస్థ ఏర్పడినది. వారు భారతవర్షములోనున్న దేశభాషలలోను, సంస్కృతము లోను, ఇంగ్లీషులోను, ఆ యువరాజుగారి రాకను వర్ణించుచు కావ్యములు వ్రాసి పంపమని, వానిలో నుత్తమమైనదానికి బహుమతి నిచ్చెదమని ఆహ్వానము నీ దేశమునకు పంపినారు. దేశభాషలో రచనలను ఇంగ్లీషు భాషలోనికి భాషాంతరీకరణము చేసి పంపవలయునను నియమము వారే చేశారు. ఈ విధముగా, ఆ కంపెనీవారి కోరిక ననుసరించి వివిధ భాషలలోను 108 కావ్యములు రచితములై వారికి పంపబడినవి

అప్పుడు చెన్నపట్టణములో కొక్కొండ వెంకటరత్నము పంతులుగారు యువరాజ శబ్దము శ్లేషించుచు, నిరువది యేడు పద్యముల తారకమాలను వ్రాసి దానికి శ్రీ శివశంకరస్వామిగారి భాషాంతరీకరణముతో ఆ కంపెనీవారికి బంపిరి. ఆ కంపెనీవారు, ఈ కావ్యములన్నింటిని పరిశీలించి, బహుమతి నిర్ణయము చేశారు ఆ నూట యెనిమిది కావ్యములలోను ఆంగ భాషాంతరీ కరణములో నున్న కొక్కొండ వారి తెలుగు కావ్యానికి ప్రథమ బహుమతి లభించినది ఇది ఇంగ్లాండులో ఆ కాలమున ప్రసిద్ధ పత్రిక "లండన్ టైమ్స్" (London Times) "హిందూదేశాని కిది గర్వకారణమని ప్రశంసించింది " ఆ కావ్యాన్ని పంపుతూ, కొక్కొండవారు చివర ఇట్లు వ్రాశారు కవిరాజ విరాజితము –

> సిరిగల "లండను" పట్టణమందున జెన్నువహించి చెలంగిన యా
> వరమతి గ్రాన్ పెర్ఫ్యూమరి కంపెని వారికి వారని వేడుకతో
> వరకవి వెంకటరత్నము పంతులు వన్నెగ నీ కృతి జేసె యశ
> స్థిరముగ ప్రిన్సఫ్ వేల్సు మహాప్రభు తారక చంద్రుని హారమనన్.

పై రచనము వలన కొక్కొండవారే పాశ్చాత్య దేశములో తెలుగు భాషకు అఖండ గౌరవమును తెచ్చినవారిలో ఆద్యులైనారు

ఈ బహుమతిని పొందిన వెనుక తెలుగున వచన కావ్యములు కొరతగా నున్నవనియు, వానిలోనైన ఇట్టి నూతన వృత్తాంతములను తెలుపు రచనలు లేవనియు, నాకాలపు విద్వాంసులు కొక్కొండ వారిని, పై యువరాజా సందర్శనమును, వచనమున వ్రాయ ప్రోత్సహించిరి. వారామరుసటి సంవత్సరమే అనగా క్రీ శ. 1877 లో "ప్రిన్సపువేల్సు హిందుస్థాన

సందర్భము'' అను గ్రంథము రచించి ప్రకటించిరి. ఆ కాలపు పత్రికలీ గ్రంథమును మిక్కిలి శ్లాఘించినవి. సలక్షణమైన వచనరచనలో నుండుటచేత చెన్నపురి సర్వకళాధికారులు, దీనిని ప్రకటితమైన సంవత్సరమునందే క్రీ. శ 1878 లో జరుగు ప్రథమ శాస్త్ర పరీక్షకు (F A) పఠనీయ గ్రంథము గావించిరి.

ఇది పూర్వభాగము, ఉత్తరభాగము అను రెండు భాగములుగా నున్నది. పూర్వభాగమున ఇంగ్లండుదేశము రాజధాని లండను, ప్రిన్సుపువేల్సు వంశక్రమము, దేశాటనము వలన లాభములు, ప్రిన్సుపువేల్సు హిందూదేశాగమనము వర్ణితములు. రెండవ భాగమున భారతవర్షమునందు యువరాజా పర్యటనము వర్ణితములు. అందు మొదటి భాగమునగల థేమ్సునది లండను పటణ వర్ణనము నిందుదాహరించుచున్నాను.

## థేమ్సునది

''అందు న్మందాకిని చందంబున నందంబైన థేమ్సునది గలదు. అద్ది తద్దేశస్థుల యేకపరోదీర్ణితం బెలుపు సెసఁగఁ దెలుపై, తద్దైకమత్యంబునే గురు వన నేకముఖంబై వారి యాశయంబున కొజ్జయనం బాత్ర వైశ్యాలంబుఁ గలిగి, వారియొక్క నిత్యోద్యమంబునకుం బ్రోత్సాహకంబుగ నెపుడును నెడపక ప్రవహింపుచుండును. అట్లయ్యుం బ్రవాహఘోష మంతగాలేక, కడు మందర పము గాక, వారి మితహిత భాషిత్వంబునకు గురుతుగా నలఁతియయిన యలల మ్రోతయు, గలిగియుండును తదీయ నీతిన్యాయ పక్షైకావలంబును దనే యుభయతీరముల మేరమీరకుచేఁదదయుం దోఁచఁజేయు తద్దేవభక్తి స్నిబ నాయక సంగంబునం బ్రకటీకరించు వారి లోకోపకార కార్యపితతి వితమునే సర్వజనోపయోగ మధుర వారి పూరితంబు–వారల హృదయంబునుం బోలె మహా గాధంబు అయయది వారలయొక్క సర్వతోముఖ వ్యాప్తికి దారిజూపునా దాను సర్వదా సర్వత్ర సర్వతోముఖవ్యాప్తి గలిగి యుండుటయేగాక, వాఁవారి దారికి యాత్రాసత్రంబులనం బలువితములైన పెక్కు లోడలతోడ నెక్కాలమునను గూడికొని యుండును వెండియు దేశాంతర ఖండాంతరాగతములైన నానావిధానేక నౌకలయొక్క టెక్కెముల వలువలను చీట్లచేఁ దనవారియొక్క గౌరవాధిక్యత బ్రకటించు చుండును

అయ్యది య య్యపరిమిత తరుల చేతను కొన్ని సమయంబుల మంచు గ్రుమ్మటం ఘనీభవించి కాల్నడ కొనరుపడి యుండుట చేతను నూతన మహా ద్భుతపనంబో యన్నట్టు కన్పట్టు మరి యశేషవిశేషవిషయ గతాగత వివిధ తరిణి శతయుతంబగుటం జూడ సర్వదేశస్థులం గలిపికోలు తనంబునం గూడు కొని యింకంగల పుడమి నెల్ల నప్పగింపుమని రత్నాకరునిపై దాడివెట్ట దనవారిని సారెకుం బ్రేరించునాగ బొడకట్టు అంతేకాక తన గట్టున నున్నట్టి నగరీ రత్నముయొక్క ప్రతిబింబముం దనయందు జూపుటకు దోపజేయుటచే దానికి సీడైన ఓపీ డదియేకాని వేఱిలోకములో లేదని తెలుపుటయేగాక, యక్కడి ప్రభుత్వ'మీ గోళముయొక్క వెనుక ప్రక్కగూడ నెరసి నెక్కొని యుండు ననుట స్ఫుటీకరించును

లండను పట్టణవర్ణన నుదాహరించుచున్నాను

## లండను - పట్టణము

''ఆ మహాస్రోతస్విని యొక్క యుత్తరతటంబున లండను పట్టణము రాజిల్లు చుండును అదియు బ్రిటిషుసామ్రాజ్యమున కెల్ల బ్రధాన రాజధాని దానికి మృచ్ఛిలామయమయి యున్నచోటనే యుండి మరొండెడకుం బనికిరాని స్థావరమైన సామాన్యపుగోటలేదు గాని, యెక్కడెక్కడ న్వేలాను సరణంబై యాభీలశతఘ్నికా ముఖంబుల న్మహాగ్నిమయామో గోళములం గ్రక్కి పగర నుక్కడంపగల యసాధారణ దారులోహమయ జంగమ ప్రాకారము గలదు దాని యగడ్తయో దేవ నిర్మితంబె గాని మానవ నిర్మితంబు గాదు పూనియార ఖ్యగా బూర్వోక్త కారణంబున నదే మహా వాహిని యని పెరొ్కనందగినది అట్లది పీర్ధరస విరాజితంబయ్యుం బరికింప నింపుమెయి శృంగార రసలసితం బనియుం బొరిబొగడదగియుండు ఎట్లన్నం దత్సంప్రవర్ధితోద్యానంబులందు నిరంతర పల్లవ కుసుమ ఫల సల్లలిత లతావేల్లితమంజు నికుంజయ మానకాయ మానంబులచేతను, సంతత సముల్లసిత విటపో చ్ఛాయచ్ఛాయా పుష్పఫల ప్రధానభూరుహములచేతను ప్రఫుల్లారవిందోత్పల బృంద సుందర సరోవర ములచేతను, మధుమధ్యముఖర మధుకరనికర ఝంకార రవానూన గానముల చేతను, సకల శకునికుల మంజుల కలకలము చేతను, సతత సంజాత కౌతుక స్త్రీపురుషనివహ విహారముచేతను, వసంత నిశాంతములన నితాంతకాంతములగు.

ఆ ప్రోలు చాల విరివిఁ గలదయ్యు నెక్కడఁ జూచినం జనబాహుళ్యముచే గ్రిక్కిరిసి యుండును అందుందచ్చి కడల గెలువ నొక్కుమ్మడి నిగిడింపఁ బడిన వాలమ్ముల నడలఁ దెలిపెడు పెద్దారులు నలరారును. వానియం దనయము పఱచు గుఱ్ఱమ్ముల గిట్టెలకొట్టులు తాళములుగాను, బలు బండ్లచక్రముల ఘట్టనలవలనఁ బుట్టినట్టి మహాధ్వని మృదంగధ్వానముగాను, వాహినీపతి మనోనుగత హృద్య వాద్యోపస్కృత నానా సేనాటనములుగాను, వానిఁగని పొగడు చరుగు తెరువరులు గంధర్వులు గాను గ్రొత్తగాఁ గాంచువారికి స్ఫురించును ఇదే-వింత ? ఊర్ధ్వలోకముల జయింప సమకట్టి గట్టిమొన గట్టి దిట్టతనమున నిలిచియున్నట్టి జోదులబారులనా నా రథ్యల యిరుగడల మింటి నెంటు నుప్పరిగెలు గడు నొప్పుచుండు అవి, యా యచ్చెరియ మెప్పుడుం దప్పక చూచిచూచి నుతులొనర్పునాఁ బ్రతి బ్రతు లీనుచు రసిక సభికులవలె నచలతఁ గనియుండును

అందువలననే కొన్ని నెలలందు మధ్యందినంబునం గాక మరి యెప్పుడుం దత్పథమ్ముల నివమునూడు చూడనేరకుండు కాననే కొన్నాళ్ళవి యివమ్ము గ్రమ్మ మిఱుపల్లంబు లెఱుంగరాక తెల్లఁగా నిగనిగలాడుచు, పాలగచ్చు చేసినట్టు కన్పట్టు మఱి మంచుకొండ దండ నలరారెడు సెలయేఱుల యట్టుల చూపట్టు

ఆ పట్టణము స్థలచర, జలచర, ఖచర విచిత్ర వివిధ నూత్న నూత్న శిల్పకల్పనానల్ప చాతుర్య ధుర్యంబగుచు, నానా యంత్రంబులవలన నుండి వెండియుం గుప్పుగుప్పున లేచియేఁచి యుప్పరంబునం గప్పికొను గొప్పపొగల గముల చేతను, మానక కురియు మంచుతుంపరల పెంపుచేతను, తరచుగం దన యందు వానకారుచూపు ఆ పొవమబ్బులం దనచేరువఁ జేరనీక వీచు కొనం గైకొన్న వీవెన లా యా మేడలపై నడియాలంబులైయున్న పలువన్నియల పడగలు పవనకంపితములై పటపటాత్కారములగుచుఁ దమ పటిమఁజాటు ఆ వీటియు దాని పేటలయుఁ గొటారుల యందుం జరుగు బేరము సారములఁ బోల నాలోకించిన నంతటిబేహార మీ మహీతలంబున నింకెందుం గనంబడకుండుట సిద్ధము సమిద్ధసకల విదగ్ధజన సమంచితం బగుటచేతను, సమస్త ప్రశస్త వస్తు సంపూర్ణంబవుటచేతను దత్పురీరత్నము రత్నాకరమని పేర్కొనందగు, కావుననే యెల్ల దేశములవారలం బెక్కండ్ర నక్కడ ననాయాసంబునం గేననగ

ఆయు లగుటవలన నప్పుటభేదన మీ మధ్యమ లోకమునకెల్ల మాతృకాప త్తనమని గీ ర్తింపఁదగు. అంతమాత్రముననా ? కొంతయైనఁ దఱుగ కొగి నెంతయుం బెరుగు పలుసిరులచేతఁ దన్నగరి గరమొన్నదగి యుండును ''

లండను ప్రశంస తిరుపతి వెంకటేశ్వరకవుల బుద్ధచరిత్రలో కూడ కన్పట్టుచున్నది.

మ॥ నలినాక్ష బ్రహ్మ శూలుల్ త్రిమూర్తులు ''గవర్నర్లై సురల్ క్రిందవ
ర్తిలు నుద్యోగి జనంబులై ఘనమణిద్వీపంబునున్ "లండనై"
యలరం దానొక రాణియై జగము లే యంబామహాదేవి ని
ర్వలు పాలించు కృపాబ్ధి యా జనని కృష్ణారాయు మన్నించుతన్
[1-12]

ఆ కాలమున కలకత్తా, మదరాసు, బొంబయి రాజధాని పాలకులు ముగ్గురే గవర్నరులు కాబట్టి త్రిమూర్తుల పోలిక సమంజసము. దేవిస్థానము, మణిద్వీపము లండనుతో పోలిక చక్కఁగ నున్నది.

## లండన్ సంకల్పము

ఈ లేఖావళి రచనకు కొంచము పూర్వముగానే లండన్ సంకల్పము" రచితమైనది. అందులో శ్రీ వెంకటరావుగారి గ్రంథములో నిరూపించిన హంశాలు కొన్ని సూత్ర ప్రాయంగా ఉన్నవి. ఒక్కప్పు డిది ప్రకటితమైనా, I

---

* పుటలు 6, 7, 8, 9 ఇందు రెండవ భాగమున భారతవర్షము నందలి ముఖ్యపట్టణముల ప్రసక్తియున్నది. ముఖ్యముగా చెన్నపురి ఆకాలమున నెట్లున్నదో ఇది తెలుపును. సలక్షణ భాషలలో, పఠనీయ గ్రంథములుగా నుండదగిన రచనలు, అత్యల్పముగా వెలువడుచున్న యీ కాలమున, చారిత్రక ప్రసిద్ధిగల ప్రిన్సుపువేల్సు హిందుస్థాన సందర్శనము వంటి రచన కావ్యములను పునర్ముద్రణము చేయుదగియున్నది. విషయము పౌరాణికము గాక నూతన మగుటచే విద్యార్థుల నాకర్షించును.

1. దీనిని క్రీ. శ. 1935 లో విజయనగరమున, "కల్యాని" పత్రికలో నేను, నా మిత్రుడూ, కీర్తిశేషుడూ అయిన గంటి సూర్యనారాయణశాస్త్రి సంస్కరించి ప్రకటించాము, ఆ తరువాత నిది నా మిత్రుని "తమాషా" పంచాంగంలో కూడా సంకలితమైనది. ఈ రెండూ కూడా ఇప్పుడు లభ్యములు కావు.

ప్రస్తుతము పాఠకలోకానికి అందుబాటులో లేనందున ఈ పీఠికలో దాని నుదాహరిస్తున్నాను.

"ఓం జీససేస్వాహా, క్రైస్తవే స్వాహా, లార్డవే స్వాహా, మమఉపాత్త ధనవ్యయద్వారా, కాంటినెంటల్ టూర్ సంప్రాప్త్యర్థం, సమ్యగ శిక్షితాంగ్లేయ భాషా సంశయనివారణార్థం, పల్లిగ్రామేతా సంజనిత అనాగరికతా నివృత్తి సిద్ధ్యర్థం, టేబిలూపరిసోపాన కవచోష్ణీణాది భోజన మనోరధ సంపాదనార్థం-భూమేః పూర్వగోళార్ధే రష్యా. స్వీడన్, స్పెయిను, పోర్చుగల్ పశ్చిమ ప్రాంతే, చతుస్సముద్ర ముద్రిత గ్రేటు బ్రిటన్ నామక మహాద్వీపే, ఛవియట్ పర్వతస్య దక్షిణ, దిగ్భాగే - వేల్సుదేశస్యాగ్నేయభాగే

బ్రిస్టల్ కుల్యాయాః ప్రాగ్దేశే, మహానాగరక ప్రదేశే-సెంటు పౌలస్ కెథీడ్రల్, వెస్టుమినిస్టిరీత్యాది మహాదేవాలయ విరాజితే, ఆర్చి బిషప్ ఆఫ్ లండన్నామక మహాఋష్యాశ్రమస్థల పవిత్రితే హైడ్‌పార్క్, గ్రీనుపార్క్, రిచిమండ్‌పార్క్ నామక మహోద్యానత్రయ విభూషితే, భూమ్యంతర్గంగమ్యమాన ధూమశకట మహాద్భుత స్థలాలంకృతే-సేవాయి హోటలు ప్రాంతే హౌసు ఆఫ్ పార్లమెంటు తీర్థే సదాసన్నిహితాగ్నిహోత్రే, శ్రీమ ల్లండన్ నామక మహాక్షేత్రే - పురోహితీభూత, థామస్ కుక్ అండ్ కో సన్నామక సదా వలంబితే, ఉభయకుల కామన్ గోత్రస్య, మిస్టర్ అండ్ మిసెస్సు నామధేయస్య, చిరకాల చింతిత మనోరథసిద్ధ్యర్థం తత్తత్కాల సమ్మిళిత నానాదేశ సమాగతానేక ధూమనౌకా స్తంభ సంభారసంభృత భ్రాంతి మహాపథ్యాం-అనేకశ్వేతాంగనా మోహతరంగ తరంగిత నారీ సముచయసుపద్యాం - అఖండ థేమ్సుమహానద్యాం జ్ఞానస్నాన మహం కరిష్యే"

ఇంతటితో ఈ విషయాన్ని ఆపి, గ్రంథంలోకి వస్తాను ఈ లేఖలలో, కేవలము యాత్ర విశేషాలేకాక, సాంఘిక, చారిత్రక, వైజ్ఞానిక, సాంస్కృతిక విషయాలు చాలా ఉన్నవి పుటల వారీగా వానిలో కొన్ని ఉదాహరిస్తాను

పుట 13. ఆక్సుఫర్డులో ఉన్న ఒక కాలేజి హాల్లో రవీంద్రనాధ టాగూర్ నిన్న హిబ్బర్టు లెక్చరు ఇచ్చారు సి యఫ్ ఆండ్రూస్, సర్ రాధాకృష్ణన్ కూడా వచ్చారు పీరి దర్శనం చేసి తిరిగి వచ్చేశాం ఇక్కడ

'నిన్నను' అంటే తేది 19-5-1930 లో ఇది టాగోరు జీవితమంతా చదివితేగాని మనకు తెలియని విషయం

పుట 17 పేడింగ్టన్ స్టేషనులో రైలు ఎక్కి సాయంత్రం నాలుగు గంటలకి ఆ వూరు చేరుకున్నాం.

ఈ పేడింగ్టన్ ను గూర్చి ఇంగ్లీషువారి చరిత్రలో ఒక చమత్కార మున్నది

17 వ శతాబ్దిలో లండను పెద్ద పట్టణముగా నున్నప్పుడు పేడింగ్టన్ చిన్న పల్లెగా ఉండేది దానికి దీనికి పోలిక ఏమాత్రమూ లేదు ఒకప్పుడా కాలంలో థామస్ పిట్ అనే అతడు మహా ప్రసిద్ధుడు ప్రధానమంత్రి పదవికి పోటీ చేసేడు ఆ సమయంలోనే ఆడింగ్టన్ అనే ఒక సామాన్య వ్యక్తి ఆ పదవికి పోటీ చేశాడు ఇది విని వారి తారతమ్యాన్ని మహావ్యక్త బెరుక్ ఇట్లు చమత్కరించాడు.

Pitt is to Addington what
London is to Paddington.

పుట 21. 'రిచ్ మండ్'లో .....మన తెలుగువాళ్ళ కుటుంబం ఒకటి కాపురం చేస్తూ వుంది. ఆయన పేరు నరసింహంగారు ఒక బారిస్టర్...... భార్య పీటవేసి కూచోబెట్టి, ఆవకాయా అన్నంపెట్టి చేత్తో కలుపుకు తినమన్నారు......ప్రాణం లేచి వచ్చింది.''

లండనులో స్థిరపడిపోయిన తెలుగు వారిలో నరసింహంగా రొకరు వారి పూర్తిపేరు లక్ష్మీనరసింహం ఇంటిపేరు కన్నేపల్లివారు. నేటి శ్రీకాకుళం జిల్లా, ప్రియాగ్రహార వాస్తవ్యులు వారు పర్లాకిమిడి కీర్తిశేషులు గిడుగు రామమూర్తి పంతులుగారి శిష్యులు వారు మొదట బ్యారిస్టర్ పరీక్ష యిచ్చి మాతృదేశంవచ్చి గురువుగారి దర్శనం చేశారు వెంటనే ఆయనకు విందు రామమూర్తి పంతులుగా రేర్పాటు చేశారు సీమనుండి తిరిగి వచ్చిన వానికి విందు చేసినందులకు అక్కడివారు రామమూర్తి పంతులుగారిని వెలి వేశారట. కాని ఆయన దాన్ని లక్ష్యం చేయలేదు. కన్నేపల్లి వారికి ఉర్లాం జమీందారీ వారికి వచ్చిన వ్యాజ్యెంలో (మొదట ఉర్లాం సంస్థానం కన్నేపల్లి

వారిదే, అదో పెద్ద గాథ) తమ పక్షాన్ని వాదించడానికి లండను వెళ్లి అక్కడనే స్థిరపడినారు. లండనులో స్వంత యిల్లుగల తెలుగువారిలో వారొకరు. తెలుగు వారెవ్వరు వెళ్లినా వారి యింటికి వెళతారు వా రాదరిస్తారు. నరసింహం గారు బ్రిడ్జి ఆటలో బ్రిటిషువారిని మించినచేయి అని చెప్పుకుంటారు వారి గడన దాని మూలంగానే అని వినికిడి. వారికి సాక్షాత్తు సోదరుడగు కన్నెపల్లి సాంబశివ రఘురామస్వామిగారి కుమార్తె శ్రీమతి వారణాసి వరలక్ష్మి ఎమ్.ఏ గారు మదరాసు యతిరాజ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా ఉన్నారు.

పుట 26 "బ్రిటిష్ మ్యూజియం చూశాను. . . .అన్నింటికన్న చెప్పుకో దగ్గదీ బ్రహ్మాండమైనదీ ఇక్కడి పుస్తక భాండాగారం. ఏ విషయాన్ని గురించైనా సరే రిసర్చిచేసే వాళ్ళకి పూర్తివివరాలు లభించే లైబ్రరీ ఇంతకంటె గొప్పది ప్రపంచములో లేదట" ఈ మాటలు అక్షరాలా నిజం మన తెలుగులో పూర్వం ముద్రించిన పుస్తకాలు, మన దేశంలో ఎక్కడా దొరకనివి బ్రిటిషు మ్యూజియం గ్రంథ భాండాగారంలోనే లభిస్తాయి నాల్గేండ్ల క్రిందట పరవస్తు చిన్నయ సూరి రచించిన మరో వచన గ్రంథము (ఇదివరలో ఆంధ్రలోకానికి పరిచితము కానిది) హిందూధర్మశాస్త్ర సంగ్రహము ఫొటోగ్రాఫు కాపీలద్వారమున యీ గ్రంథ భాండాగారమునుండి తెప్పించి ముద్రించాను తెలుగులో అచ్చు ప్రారంభమైన నాటినుండి అనగా క్రీ శ 1747 నుండి 1947 వరకు ముద్రితములైన గ్రంథాలన్నీ చెక్కుచెదర కుండా అక్కడ భద్రపరుపబడి ఉన్నవి

పుట 32 ట్యూబ్‌రైల్వే అనగా భూమిక్రింద రైలుబళ్ళు లండనులో పై భాగంలో రైలు నడపడానికి పట్టీలు వెయ్యడానికి స్థలంలేదు కాబట్టి సొరంగాలు త్రవ్వి, రైళ్ళువేసి, స్టేషనులు కట్టారు. అవన్నీ భూమి మీద ఉన్నట్లే ఉంటాయి విశేషమేమంటే వానిని మనుషులు నడపరు అన్నీ యంత్రసహాయము వల్లనే రైలు ఆగడం, సిగ్నలు ఇవ్వడం, నిలిచినప్పుడు తలుపు తెరవడము, కదలినప్పుడు మూయడము, అన్నీ యంత్రాలే చేస్తాయి.

పుట 35. పార్లమెంటు భవనంలో, చక్రవర్తి, స్పీకరు, ప్రెసిడెంటు ఇతర మంత్రులు కూర్చునే స్థానాలూ అన్నీచూచి గ్రంథకర్త అక్కడి వారిని యిలా ప్రశ్నించారట "ఏమండి యీ సీట్లు చాలా పాతబడి మాసిపోయినట్లూ సావకాశంగా కూర్చోడానికి వీలులేనట్టూ ఉన్నాయే కొత్తవి తయారు చేయించరా" అక్కడ అధికారి వెంటనే మేము పూర్వ సంప్రదాయాలని పాటించేవాళ్ళమని తెలియదా ? యని జవాబిచ్చేడట దీనిని బట్టి ఎన్నో వందల యేళ్ళ క్రిందటి నుంచీ ఉన్న వస్తువులను వారెంతో జాగరూకతతో వాని యందలి గౌరవంతో వాడుకుంటున్నారని తెలుస్తుంది దీనిని బట్టి ప్రాచీనాచారాల మీద సంప్రదాయాల మీదా ఇంగ్లీషు వారికి గల్గ అభిమానము తేట పడుతుంది

పుట 40 రైట్ ఆనరబుల్ శ్రీనివాసశాస్త్రి, చెన్నపురిలో హిందూ హైస్కూలు ప్రధానోపాధ్యాయుడై క్రమక్రమంగా, తన వాఙ్మాధుర్యముచేత, చాతుర్యంచేత రాజకీయ నాయకుడైనాడు ఇతని ఆంగ్లవాగ్ధోరణికి ముగ్ధులై, భారతీయులకు సాధారణంగా లభ్యముకాని లండను పౌరవ గౌరవాన్ని (The Citizenship of London) బ్రిటిషువారు ప్రసాదించారు గ్రంథకర్తలు వారి చేవ్రాలును సంపాదించడం విశేషం

లండను పట్టణంలో జనసమర్దసంఘటనలు, పరిసరాలలో ప్రకృతి రామణీయకాలు, ప్రజా జీవితం, ప్రయాణ సౌకర్యాలు, ఒకటేమిటి సమస్తమైన విషయాలు, కన్నులకు కట్టినట్లుగాను, మనసులో మరవకుండా హత్తుకుపోయేటట్టుగాను గ్రంథకర్తలు వివరించారు ఇందులో రచనకూడా మనోహరంగా ఉంది

"అద్దంలాంటి రోడ్డుమీద పోతూ ప్రక్కని గడ్డీ, పువ్వులూ, వీటి సౌందర్యం చూస్తూ పోతుంటే ఎంత ఆనందమనీ!"

"నిజం చెప్పాల్సివస్తే ఇక్కడ ఉండడం ఒక ఇంద్రభోగం అనుభవించడం లాంటి దనుకో"

''ది రూమ్ ఆఫ్ ఇండియను రెలిజియన్ ఇది దర్శించిన ప్రతి మానవుడి హృదయంలోనూ ఒక క్షణంసేపైనా, ఆధ్యాత్మిక సంబంధమైన ఒక వెలుగురేక అయినా పొడచూపకపోదు''

"హైడ్‌పార్కు ఒకటి లండను కట్టుకొన్న పువ్వుల చీర''

''మొదటి రోజుల్లో ఎట్టికెట్లన్నీ సరిగా పాటిస్తున్నానో లేదో అనే భయం ఉండేది ముఖ్యంగా బారిష్టరు పార్వతీశం జ్ఞాపకం వచ్చేవాడు''

## స్కాట్లండు

ఎడింబరో స్కాట్లండుకు ముఖ్య పట్టణము ఇందులో ప్రిన్సెసుస్ట్రీటు 5 మైళ్ళ పొడవు ఈ వీధిలో రెండు విశేషాలు, ఒకటి పచ్చగడ్డి గడియారం అంతా గడ్డితోనే చేశారు మామూలు గడియారంలాగే తిరుగుతుంది రెండవది ప్రసిద్ధాంగ్ల రచయిత సర్‌వాల్టరుస్కాట్ శిలా విగ్రహం స్కాట్ ఎడింబరో వాస్తవ్యులు కాబట్టి అతని శిలా విగ్రహం అక్కడ ఉండడము సముచితమే మన వీరేశలింగంగారి శిలా విగ్రహం రాజమహేంద్రవరంలో ఉన్నట్లు ప్రకృతిని ఉపాసించిన ఆంగ్లమహాకవి 'వర్డ్సువర్తు' నివసించిన కుటీరం ఆయన విహార ప్రదేశాలు గల 'లేక్‌డిస్ట్రిక్టును' సందర్శించడం జీవితంలో భాగ్యవిశేషం. ఆ మహాకవి వాడిన వస్తువులు జాగ్రత్తగా అక్కడ నేటికీ ఉన్నవట మన తెలుగు వారిలో ఒక మహాకవి వస్తువులను గూర్చి ఎట్టి జాగరూకత మనము వహించలేదు.

## బ్రిస్టలు

ఇది ఇంగ్లండు పడమటి తీరాన్ని చివర ఉన్నది ఇచటనే నవభారత నిర్మాత, సంఘసంస్కర్త, బ్రహ్మమత ప్రవక్త, రాజారామమోహనరాయ్ పరమ పదించారు. అచ్చట వారి గోరి మీద వ్రాసిన ఆంగ్లభాష పంక్తులు ఈ గ్రంథం 51వ పేజీలో ఉన్నవి. రామమోహనుని జీవితంలో చేర్చదగ్గవి.

## అమెరికా — న్యూయార్కు

ప్రపంచంలోకల్లా ఆకాశాన్ని అంటుతూన్న ఎత్తైన సౌధాలు అమెరికాలో న్యూయార్కు నగరంలో ఉంటాయి అని మనము చదువుకున్నాము. అవి

తెలుసుకొని కూడా మన ప్రబంధాల్లో వర్ణించినవన్నీ అతిశయోక్తులుగ పరిగణించాము కాని వానిని కళ్లారాచూచిన గ్రంధకర్త వాక్యాలు మనకు కొంత కనువిప్పు కాగలదని వానిని ఉదాహరిస్తున్నాను

"మా యీ మెకాల్పిన్ హొటేల్ 24 అంతస్తుల మేడలో ఉంద కిటికీలోంచి రోడ్డుమీద నడుస్తున్న ప్రజలను చూస్తాను వాళ్ళు మనుష్యుల్లా చీమలో తెలియడంలేదు రోడ్డుమీద పోయే మోటార్లు పురుగుల్లా కనబడుతున్నాయి

మనం మన తెలుగు ప్రబంధాలలో చదువుకున్నాం పురవర్ణనలూ సౌధ వర్ణనలున్నూ, అతిశయోక్తులని తీసి పారేసేవాళ్ళం "మేడలమీద రాజ కుమార్తెలు నృత్యాలుచేస్తూ గవాక్షాలలోంచి తారా చంద్రులను అందుకుని ఆడుకునేవాళ్ళని అతిశయోక్తి కాదుగదా శుద్ధ అబద్ధం అనేవాళ్ళం ఇక్కడి ఈ సౌధాల్ని చూస్తూంటే, ఆ వర్ణనలన్నీ నిజమా అనిపిస్తోంది".

## షికాగో

న్యూయార్కు తరవాత షికాగో అమెరికాలో పెద్ద పట్టణం ఇచట స్త్రీ పురుషులు నగ్నంగా చేసే ఆతపస్నానాలు (Sun baths) వారికి నైసర్గిక మైనా, మనకు విడ్డూరంగా ఉంటవి షికాగో అమెరికాకు మాంసాగారం ప్రతిదినమూ లక్షలకొలది పశువులూ, గొఱ్ఱెలు, మేకలు అక్కడ బలి అవుతుంటవి

## లాస్ ఏంజల్సు - హాలివుడ్

అమెరికాలోనే కాక ప్రపంచంలో ప్రఖ్యాతిగన్న 'హాలివుడ్'లో ఒక స్టుడియో ప్రొప్రయిటరు మహారాజా వారికి స్నేహితుడు కావడం మూలంగా, హాలివుడ్‌ను ఆమూలాగ్రంగా చూచే అవకాశము గ్రంధకర్తకు లభించింది. లాన్‌చానీ అనే సుప్రసిద్ధ సినీమా నటకుడు మరణించి నప్పుడు శవపేటికకు చేసిన ఊరేగింపు ఏ మహారాజులకు, చక్రవర్తులకు కూడా జరుగదట శవాన్ని ఉంచిన బండి వెనుక ఆయన మీద కప్పిన పూల చక్రాలు మోయడానికి

పది లారీలు ఉన్నాయి. మూడు వరుసలలో మోటార్లు కొన్ని మైళ్ళు నడిచాయి. మూడు గంటలసేపు ఆలాగు కార్లు వెళ్ళుతున్నాయంటే, సినీమా నటకుడికి అక్కడ ఎంత గౌరవము అమెరికా వారిస్తారో విశదమవుతుంది

## జర్మనీ, స్వీడను, ఆస్ట్రియా

ఒకప్పుడు ప్రపంచ సంగ్రామానికి కారణమైన జర్మనీ నేడంత ప్రాభవంతో లేదు అక్కడ 'బీరు'ను మంచి నీటికి బదులుగా వాడతారట. మన భారతీయ విద్యార్థుల కొన్ని అసభ్య చేష్టలు గ్రంధకర్తను కించపరచాయి.

స్వీడనులో, నోబిలు బహుమతి ప్రదాత అయిన, నోబిలుగారి సంస్థ ఉన్నది ఆస్ట్రియాకు ముఖ్యపట్టణమైన వియన్నా చాలా చెడ్డ ఊరు సాయంకాలం కాగానే వీథిలోనికి వెళ్ళడానికి పురుషులకు భయం యువతులు పెనవేసుకుంటారు

## స్విడ్జరులాండు

స్విడ్జరులాండు మనకు కాశ్మీరమైనట్లుగా ఐరోపా ఖండానికి భూలోక స్వర్గం ఏ పేచీలులేవు, వాచీల కిది జన్మస్థానం ఇక్కడ పాడి ఏనుగు పాడి ఒక్కొక్క ఆవు అయిదు ఆరేసి కుంచాల పాలు ఇస్తుంది కాబట్టి అవి కామధేనువులే

## ఇటలి

చారిత్రక ప్రసిద్ధమైన మిలాన్ రోము నగరాల్ని, కాలువలే రోడ్లుగాఉండి జల మధ్యంలో విచిత్రంగా కట్టబడిన వెనిసునగరాన్ని, నేపిల్సు మరీ చూచి చచ్చిపో (See Naples and die) అనే సామెతకు ఆధారమైన నేపిల్సును, అగ్నిగోళాలను చిమ్మే వెసూవియస్ పర్వతాన్నీ గ్రంధకర్తలు చూచి, విశదంగా వర్ణించేరు రోమ్‌లో దేవాలయం, పోపు వాసస్థానం వేటికన్, కొలీషియమ్ వెనిస్‌లో గండోలాలో విహారం, నేపిల్సులో మంచి నీళ్ళకు బదులు వైను వాడుక, అన్నీ మనకు గోచరిస్తాయి.

## ఫ్రాన్సు - పారిసు

ఇంగ్లీషువారికన్న ముందు ఫ్రెంచివారే మన దేశాన్ని ఆక్రమించారు యూరపులో ఇతర రాజ్యాల ఒత్తిడి కలిగినా దాన్ని ప్రతిఘటిస్తూ, ఫాషన్‌లకు పారిసులని తమ రాజధానికి ప్రపంచఖ్యాతి సంపాదించేరు నెల్లాళ్ళు పారిసులో ఉండి అక్కడి విశేషాలను గ్రంథకర్తలు పొందుపరచారు ప్రతి క్షణమూ మారుతూండే పడతుల సౌందర్య విలాసాలు, ప్రభుత్వమే పోషించే వ్యభిచార కార్యకలాపాలు వనితా లోకమేకాక వైజ్ఞానికంగా లోకోత్తరమైన ఐఫెల్‌టవర్ విరివిగా వర్ణితములైనవి మన జవహర్‌లాల్ నెహ్రూతండ్రి మోతీలాల్ నెహ్రూ తన బట్టలనుప్రత్యేకంగా పారిసు నుండి ఇస్త్రీ చేయించి తెప్పించుకొనే వాడంటే యింకా పారిసు ఫాషనును గూర్చి వేరే చెప్ప నక్కరలేదు అక్కడ లేకపోయినా నేడు మనకు మిగిలింది ఫ్రెంచి కట్టింగు మీస మొక్కటే.

ఈ పారిసు నగరమునుండే తిరిగి మహారాజావారు తమ విదేశ యాత్ర ముగించి, పిఠాపురము వచ్చేశారు గ్రంథకర్తలీ ఏడు మాసములలో జరిగిన యావద్విశేషాలను నూట అరవై ఆరు పుటలలో మన కందించారు

ఇందలి రచన కేవలమూ లేఖా రచన అనే పరిగణించరాదు గ్రంథకర్త సృజనాత్మకమైన నయాగరాజలపాత వర్ణన ఒకటి చాలును చూడండి

## నయాగరాజలపాతం

''ఇంక ఈ నయాగరాఫాల్సు అనే ఊరువద్దాం చిన్నఊరు అందంగా ఉంది, శుభ్రంగా ఉంది, జనసమ్మర్దంలేదు స్కైస్క్రేపర్లు కూడా లేవు వచ్చీరావడంతోనే ఊరంతా తిరిగే మొక్కసారి

"జలపాతాల దర్శనం చేశాం. మా హోటేలు కిటికీల్లోంచి జలపాతాలు చక్కగా కనబడతాయి దగ్గరగా వెళ్లి ఎదురుగా నిలబడ్డాం నీటి తుంపరలతో నిండిపోయిన వాతావరణంలో బట్టలన్నీ తడిసి పోయినట్లు చెమ్మకున్నాయి మానవుని బుద్ధి కౌశలమూ, వైజ్ఞానిక పరిజ్ఞానమూ అంతంతటి పెద్దపెద్ద మేడలు నిర్మించగలిగాయి. బ్రహ్మాండమైన ఈ జలపాతం, అంత ఎత్తునుంచి హఠాత్తుగా అంతక్రిందికి అంత విశాలంగా పడుతూఉంటే, ఈ సృష్టివై

చిత్రాన్ని నిర్మించిన భగవంతుని సర్వశక్తిత్వానికి జేజేలు కొట్టాను ఆనందం ఉప్పొంగిపోతే వెర్రికేకలు పెట్టాను కాని అవి వినబడితేనా, హోరులో కలిసిపోయాయి

"బ్రహ్మాండమైన జలపాతం ఎదుట మానవులు ఎంతటివారు? పిపీలిక కంటె కనికిష్టంకదా? దాని వేగమూ హోరూ, శక్తీ ఎంతో భీతావహంగా ఉన్నా గాలి అంతా నీటి తుంపరలతో నిండిపోయి, సూర్యకిరణాలు, నీటి మేఘాల మీద పడుతుంటే పెద్దపెద్ద యింద్రధనస్సులు ఏర్పడి కన్నుల పండువు చేస్తుంది. శరీరమూ, హృదయమూ, చల్లగా, హాయిగా అయిపోయేయి ఆ నీటి హోరు శృతిగా చేసుకొని పాటపాడా లనిపించింది భగవంతుని కీర్తిస్తూ రాత్రి సోఫాలో కూర్చున్నాను

"చీకటిలో ఏమి చూడనూ అని అనుకుంటూంటే తళుక్కుమంది అటు చూస్తేనిగదా ఫాల్సంతా రంగురంగుల కాంతితో వెలిగిపోతూంది. నిముష నిముషానికి రంగులు మారిపోతున్నాయి

"జలపాతం క్రిందినుంచి పై వరకు రంగురంగుల దీపాలు ఫోకస్ చేశారు పసుపురంగు దీపం ఫోకస్ చేసినప్పుడు మాడాలోయ్ నిజంగా - కరగ బోసిన బంగారం క్రిందికి జారిపోతూన్నట్టుగానే ఉంది. ఎర్రటి దీపం వేసినప్పు డదంతా రక్తంలా కనబడుతుంది"

ఇట్టి లోకోత్తర ప్రకృతి దృశ్యాలు చూచినపుడు కలిగే మానసికా నందాన్ని, ఉదాత్తభావాన్ని గ్రంధకర్తలు చక్కగా పైన నిరూపించారు. ఇట్టివి గలుగజేయడానికే మన పూర్వులు తీర్థయాత్రలు చేయవలసినదిగా అనుశాసించారు

ఈ గ్రంధం చదువుతూ ఉంటే పాశ్చాత్య దేశాలలో వారి ఆర్థిక సంపద, వైజ్ఞానిక విశిష్టత, సాంఘిక వ్యవస్థ గూర్చి ఎన్నో వింతలు, విశేషాలు, విచిత్రాలు మనకు గగుర్పాటు కలిగిస్తాయి గ్రంధకర్తలు ఆ దేశాల మహోన్నత స్థితి గతులను వర్ణించి నప్పుడల్లా మాతృదేశాన్ని మననం చేయడం మన మఖి నందించ వలసిన విషయం వందేమాతరం అని గ్రంథం ముగించడమే వారి దేశభక్తికి తార్కాణం

ఇది దేశ స్వాతంత్ర్యానికి ముందు వ్రాసినది అయినా గ్రంధకర్త లా నాడే మనము విదేశాలతో సరిగా పురోగమించి, ఉన్నత స్థితికి రావాలని ఆకాంక్షించారు. ఇది ఎంతో ప్రశంస్యం

గ్రంధకర్తలు ఎంతో అదృష్టవంతులు. సాధారణంగా ఏ కొద్ది మందికో గాని వారి జీవితంలో ఇటువంటి అవకాశము కలుగదు అట్టి అవకాశము భాగ్యము కలుగజేసిన శ్రీ పిఠాపురం మహారాజా వారిని గూర్చి వ్రాసిన యీ వాక్యాలు గ్రంధకర్తకు వారియందు వాని కుటుంబమునందు ఉండే అనిర్వచనీయ భక్తి ప్రపత్తులను తెలుపుతున్నది

''ఇంతటి మహాదృష్టం కలిగించిన మా మహారాజావారినీ, నా తల్లి మహారాణీ వారినీ, యువరాజావారిని రాజకుమార్ గారిని ఎల్లప్పుడు తలుచుకుంటూ వారి యావత్కుటుంబానికి జీవితాంతం కృతజ్ఞుణ్ణయి ఉంటా''

సనామధేయుడనై పీఠికా రచయితనైన ఈ వెంకటరావు కూడా, ఆంధ్ర సాహిత్య ప్రపంచంలో తన గౌరవస్థానానికి హేతుభూతులైన శ్రీ పిఠాపురం మహారాజావారిని నిరంతరమూ కృతజ్ఞతతో సంస్మరిస్తూనే ఉంటున్నాడు

ఇలాంటి గ్రంథాలతో పాటు సాంస్కృతికంగా, వైజ్ఞానికంగా సర్వతో ముఖంగా వర్ధిల్లుతూన్న విదేశాలలోని విద్యా సంస్థల విశేషాలు అచ్చటి విద్యార్థి విద్వాంసుల జీవిత విధానం తెలిపే గ్రంధాలుకూడా తెలుగులోనికి రావాలని ఆశిస్తున్నాను.

2-2-1135/7, న్యూ నల్లకుంట
అంబరుపేట పోస్టు
హైదరాబాదు-13
17-7-1966.

ఎదవోలు వెంకటరావు

# గ్రంథపరిచయము

ఈ గ్రంథం చదివి పరమానందభరితుడ నైనాను అందుకు ముఖ్యమైన కారణమేమంటే, నేనున్ను 1933 లో లండను నగరము వెళ్లివచ్చిన వాడను యూరప్ ఖండములోని కొన్ని నగరములను చూచిన వాడను నేను చూచిన నగరాలగురించిన్ని ఇతర స్థలాల గురించిన్ని శ్రీ కురుమెళ్ళ వేంకటరావు వ్రాసినది చదువుతూ ఉంటే నా కనేక విషయాలు జ్ఞప్తికివచ్చి ఆనందపరవశుణ్ణి అగుతూ వచ్చాను ఈ గ్రంథ మంతా సుమారు ముప్పై లేఖల సంపుటము. ఒక్కొక్కలేఖ ఒక్కొక్క రత్నం వంటిది కనుక ఈ సంపుటమంతా ముప్పై రత్నాలుగల రత్నహార మనదగినది

శ్రీ కురుమెళ్ళ వెంకటరావుగారు చాలా అదృష్టవంతులు. ధనవంతులు కాకపోయినా లక్షాధికారులే కాని ఇతరులు వేయజాలని దూరదేశాలకు పోయి యూరప్ అమెరికా ఖండములందలి నగరములలో పర్యటనము గావించి చూడ దగిన దృశ్యములు చూచి ఆయా నగరము లందలి నవీన నాగరికతకు సంబంధించిన విషయములు ప్రత్యక్షముగా తెలిసికొని తమ నూతనానుభవాలతో తమ విజ్ఞానమును పెంపొందించుకో గలిగినారు ఈ అదృష్టము వీరికి తలవని తలంపుగా కలిగినది ఎట్లు కలిగినదో శ్రీ వెంకటరావు గారు తమ మొదటి లేఖలో తెలియజేసినారు శ్రీ పిఠాపురం మహారాజావారు కుటుంబ పరివార సమేతంగా 1930 సం॥ ఏప్రిల్ నెలలో యూరప్ అమెరికా ఖండములందలి దేశములకు వెళ్ళదలచి నప్పుడు మహారాణీగారు, యువరాజుగారు వీరిని కూడా తోడ్కొని వెళ్లమని సిఫారసు చేశారు శ్రీ మహారాజావారు అందు కంగీకరించారు

అంతేకాక ఇంకొక్క గొప్ప విషయమేమంటే, తక్కిన మరికొందరు రాజులు జమీందారువలె గాక ఈ మహారాజావారు వీరిని ఏదో ఒక నౌకరి వానిన్ని చూచినట్లుగాక తమ కుటుంబములోని వారివలెనే ఆదరించి, ప్రయాణ

మునకు, ఆయాదేశములందలి వాతావరణమునకు శీతోష్ణపరిస్థితులకు కావలసిన దుస్తులు కుట్టించి ప్రయాణ సౌకర్యములన్నీ యధోచితముగా సమకూర్చినారు

వీరంతా 1930 సం॥ మేనెల 3వ తేదీని బొంబాయి నగరము విడిచిపెట్టి దూరదేశముల పర్యటనము ముగించి 1930 నవంబరు 22వ తేదీని బొంబాయి నగరము తిరిగి చేరుకున్నారు అంటే వీరి పర్యటనమంతా ఆరు మాసాల ఇరవై దినాలు పట్టినదన్నమాట

శ్రీ కురుమెళ్ళ వెంకటరావుగారు ఈ గ్రంధమందలి 30 లేఖలున్ను పిఠాపురంలో నుండిన తమ మిత్రుడు శ్రీ పెమ్మరాజు వెంకటరావుగారికి వ్రాసినవే శ్రీ పెమ్మరాజు వెంకటరావుగారు ఈ లేఖలన్నీ చదివి ఆనంద భరితులై భద్రముగా ఉంచినారు ఆ లేఖలే ఇప్పు డీనాటికి గ్రంధరూపాన ముద్రితములయినవి ఈ లేఖలు చదివే అదృష్టం శ్రీ పెమ్మరాజు వారికే కాక ఇప్పుడీ ముద్రణంవల్ల తెలుగు చదివే వారికందరికినీ కలిగింది ఈ 30 లేఖలలో గల విషయము లిదివరకే తెలిసిన వారికి అవి జ్ఞప్తికివచ్చి ఒక విధమైన ఆనందము కలిగింప గలవు తెలియని వారికి వినోదము విజ్ఞానముతోపాటు మరియొక విధమయిన ఆనందము కలిగిస్తవి

శ్రీ మహారాజావారు కుటుంబపరివార సమేతంగా ప్రయాణము సాగిస్తూ ఎక్కడెక్కడ ఆగుతూఉండే వారో అక్కడి నుండి శ్రీ కురుమెళ్ళ వెంకటరావు గారు ఒక లేఖ తమ మిత్రులైన శ్రీ పెమ్మరాజుగారికి వ్రాస్తూఉండేవారు సగటున వారానికొక లేఖ చొప్పున వ్రాస్తూ గతించిన ఆ వారం దినములలోను తాము చూచిన దేశాలు, నగరాలు, ప్రకృతిదృశ్యాలు, భవనాలు, తాము తెలిసికొన్న నూతన విషయాలు, తమకు కలిగిన అనుభవాలు, సంఘటనలు, తమకు స్ఫురిస్తూవచ్చిన మనోభావాలు, ఆశయాలు మొదలయిన విషయము లెన్నో వివరిస్తూ లేఖలు వ్రాస్తూ ఉండేవారు శ్రీ పెమ్మరాజు తమ యోగ క్షేమం తెలియజేస్తూ వ్రాసిన లేఖలు అందుకొంటూ సంతోషించినట్టు వీరి లేఖల ద్వారా తెలుస్తూ ఉంటుంది

శ్రీ కురుమెళ్ళవారి రచన చాలా మనోహరమయినది తేలికయిన మాటలతో వర్ణనలు కడు మనోరంజకముగా చిత్రించినారు ప్రతి లేఖలోను

ఇట్టి వర్ణన ఎదో ఒకటి ఉన్నది  కొన్ని లేఖలు (మా పుటలు 46-49, 71-74, 106-113, 123-133 మొ॥) పూర్తిగా స్థలదృశ్య వర్ణనలతోను, అక్కడి జనుల వర్ణనలతోను నిండి ఉన్నవి. వచనములో రచన సాగించినా పెద్దకవులు పద్యములలో సాగించిన రచన కంటె ఎక్కువ కవితాకళతో వీరి వర్ణనలు రచితము లయినవి  వీరు వర్ణించిన దృశ్యములు మన కనుల యెదుట యథాతథముగా నిలిచినట్లుంటవి  ఇందుకు దృష్టాంతముగా గ్లెనిగిల్సు (స్కాట్‌లండ్ దేశమందలి ఉత్తరభాగాననున్న) మైదానము, పచ్చిక బయళ్లు అక్కడి 'జాట్ డోర్ గేమ్సు' మొదలయిన దృశ్యముల వర్ణన  ఇక్కడి దృశ్యములు శ్రీ వెంకటరావుగారికి ఎంతఆకర్షకములుగా ఉండెనో వారు వ్రాసినవాక్యాలుచదివితే తెలుస్తుంది "కాని దురదృష్టం ఏమిటంటే, ఇక్కడ ఒక్క రోజుకంటే ఎక్కువ ఉండడం జరుగలేదు  ఇంత బాగా ఉంటుందని ముందే తెలిస్తే ఇంకొక రెండు మూడు రోజులు ఉందుమే అన్నారు మా దివాణం కుక్కు వాళ్ళకి ఇచ్చిన ప్రోగ్రామ్‌ప్రకారం తు చ  తప్పకుండా టూర్ జరగవలసిందే గదా" అన్నారు

బ్రిస్టల్ చేరబోతూ ఐరిష్ సముద్రము దాటుతూ ఉన్నప్పుడు వడివడిగా వచ్చిన శీతలవాయు తరంగములకు సైపలేని బాధ వీరు వర్ణిస్తూ వ్రాసినది చదువుతూ ఉంటే బాధపడినందుకు జాలిన్ని వర్ణన చమత్కారమునకు మందహాసమున్ను మనకు కలుగుతవి. బ్రిస్టల్ నగరములోని రాజారామ మోహన్ రాయ్‌గారి వసతి, గోరి అక్కడ ఆంగ్లభాషలో వారిని గూర్చి తెలియజేసిన వాక్యములు వర్ణిస్తూ వెంకటరావుగారు వ్రాసినది చదివి నప్పుడు నేను కొన్ని నిముషముల పాటు తన్మయుడనై ఆయా సంఘటనలను గూర్చి నేను చదివిన విషయము లెన్నో జ్ఞప్తికి తెచ్చుకొన్నాను

న్యూయార్క్, నయాగరా జలపాతము వీరు చాలా చక్కగా వర్ణించినారు  వీటిని గూర్చి నేనిదివరకు ఎన్నో గ్రంథాలలోగల వర్ణనలు చదివిన వాడను గనుక సాహసించి చెప్పవలసిన దేమంటే, వెంకటరావుగారు వర్ణించిన తీరు పెద్ద రచయితలు వర్ణించిన తీరునకేమీ తగ్గిపోలేదు  అంతేకాదు ఇండియా దేశస్థులకు ఈ దృశ్యములు చూచినప్పుడు కలిగే మనోభావములు జోడించి వర్ణన సాగించినారు  అయినా వారు వ్రాసినది వారికే తృప్తికలిగించలేదు, అందుచేత వారేమన్నారో చూడండి పుట 67 - "న్యూయార్క్ గురించి వ్రాయ

వలసి వస్తే భారతం అంత గ్రంథం అవుతుంది. ఏమైనా న్యూయార్క్ ఒక తుపాను లాంటిది ఉరుముతుంది మెరుస్తుంది, హింసపెడుతుంది చూడడానికి కళ్ళు నొప్పి పెడతాయి అయినా చూడకుండా ఉండలేము అసాధ్యం ''

షికాగో నగరమందు తాము చూచిన దృశ్యాలు మన కనులకు స్పష్టంగా కనబడునట్లు వర్ణించారు నగరానికి ఉత్తర దిక్కుగా చాలా మైళ్ళు విస్తరించి ఉన్న మిషిగన్ సరోవరముతీరాన ఇసుక తిన్నెల మీద అక్కడి స్త్రీపురుషులు అర్ధనగ్న శరీరములతో గావించే విహారములు, సూర్యకిరణ స్నానాలు, జట్టు జట్టుగా బారులు కట్టి నడచే విలాసాలు, వెర్రి వేషాలు, వినోదాలు వర్ణించినారు అప్పుడు వీరికి కలిగిన జుగుప్స వీరి మాటలతోనే తెలియజేస్తాను. "వాళ్ళని గుడ్డలు లేకుండా నగ్నంగా చూడడం మనకి భారతీయులకు చాలా ఎబ్బెట్టుగా ఉంటుంది మర్మావయవాలు కూడా అచ్ఛాదన చేసుకోకుండా తిరిగే స్త్రీ పురుషుల సంఘాలు ఉన్నాయట ఈ దేశంలో అదంతా ఆరోగ్యంకోసం అయితే మనకి చాలా జుగుప్సను కలుగజేస్తాయి మేమున్న హొటేలు బీచ్ నే ఉన్నది. మా ముందే వేలకొలది జనం నగ్నశరీరాలతో దర్శనం ఇస్తుంటే ప్రత్యేకంగా తీరమంతా తిరిగి చూడడం అనవసర మనిపించింది. అలా అని మానలేదులే సరస్సు పది మైళ్ళ పొడవునా ఉన్న ఈ ఆనాగరిక జంతువుల పిచ్చి వేషాలన్నీ చూశాం. వాళ్ళ సిగ్గుమాలిన తనానికి జాలి పడాలో ఏమో తెలియలేదు ''

ఇక్కడి లేక్‌షోర్ అవెన్యూ, స్టేట్‌స్ట్రీటు, మూడు పార్కులు వీరు కడు చక్కగా వర్ణించినారు షికాగోనుండి శాన్‌ఫ్రాన్సిస్కోకు సాగిన మూడు దినాల రైలు ప్రయాణం వీరు చక్కగా వర్ణించారు. రైలు పెట్టెలలో ఉండే సదుపాయములు, నౌకర్ల సేవ మొదలయిన విషయములు తెలియ జేశారు. సముద్ర మధ్యమైనప్పుడు ప్రయాణికులు దిగనక్కరలేకుండా రైలుబండి యావత్తు ఒక పెద్ద స్టీమరు బల్లకట్టు మీదుగా పోయే ఏర్పాటు వీరు వర్ణిస్తూ ఉంటే వీరికేకాదు పాఠకులకుకూడా వింతగా తోస్తుంది.

శాన్‌ఫ్రాన్సిస్కో నగరం ఎత్తైన కొండలమీద ఉండడం వల్ల వీరికి నీలగిరి మీదనున్న ఊటీ, కూనూర్లు జ్ఞప్తికి వచ్చినవి. ఈ నగర వర్ణన అంతా మూడు పుటల గ్రంథము ఇక్కడ వీరికి ఓంకారస్వామి దర్శన భాగ్యం

కలిగినది  హాలీవుడ్ వర్ణనకూడా మనోహరంగా ఉన్నది  ఇక్కడ వీరు సినీమా భవనాలు, షూటింగులు చూచినారు  సినీమా తారలను, సినిమా రాజులను దర్శించినారు  ముఖ్యమైనవారి పరిచయం కలిగినది

మహారాజావారి సిబ్బంది అంతా మరల న్యూయార్క్ చేరుకుని అమెరికా దేశయాత్ర ముగించి అట్లాంటిక్ మహాసముద్రం దాటి ఎక్కడా ఆగకుండా జర్మనీ దేశమందలి బ్రిమెన్ రేవులో దిగినారు

బెర్లిన్, వియనా నగరములలో వీరికి కనబడిన వింతలు వీరు ఎక్కువగా వర్ణించినారు  వియనాలో, షికాగోలో కనబడిన వ్యభిచార దుర్నయం వీరికి కనబడినది  అంతేకాదు ఇక్కడి యువతులు సిగ్గువిడిచి దారివెంట బోతూ ఉన్న పురుషుల మీద పడి బలవంతముగా తమ గృహమునకు తోడ్కొని పోవుటకు చేసే ప్రయత్నాలు వివరించి వ్రాసినారు

స్విట్జర్ లండులోని ప్రకృతి వర్ణనము, పాడి సంపద వర్ణనము, ఫ్యాక్టరీ లలో తయారయ్యే వివిధ వాచీల వర్ణనము పాఠకులకు వినోదమే కాక విజ్ఞానము కూడా కలిగిస్తవి  ఇటలీలో వీరు చూచిన నగరములలో వెనిస్, రోమ్, నేపిల్స్, మిలాన్ నగరముల వర్ణన మనోజ్ఞముగా సాగినది  ఇటలీ దేశము విడిచి ఫ్రాన్సు దేశము చేరుకొని మహారాజావారి సిబ్బంది అంతా పారిస్ నగరములో చాలా దినములు నిలచినది  పారిస్ నగరమందు చూడదగిన దృశ్యము లన్నీ కనులారా చూచి ఆనందభరితులైనారు.

పారిస్ నగరములో కూడా వీరికి వ్యభిచార దుర్నయము గోచరించినది. ప్రపంచమందు ఈ వ్యభిచార దోషము ప్రతిదేశమందున్నూ అనాదిగా నేటి వరకున్నూ సాగుతూనే ఉన్నది  ప్రభుత్వమెంత తీవ్రముగా దీనిని తొలగించు టకు ప్రయత్నించినా ఇది కాస్త తగ్గినట్లు పైకి కనబడుతుందే కాని పూర్తిగా తొలగిపోదు  ఇది పరిశీలించిన పారిస్ మొదలయిన నగరము లందలి ప్రభుత్వ ముల వారు దీనిని కొన్ని ఆరోగ్య నియమములకు లోబడచేసి లైసెన్స్డ్ గృహములందు జరుపుటకు అనుజ్ఞ ఇచ్చినారు  మన దేశమందు పూర్వ కాలములో ప్రభుత్వముల వారు కొందరు వేశ్యలను కూడా పోషించి వారి ద్వారా శత్రువులను సంహరించుటకు ప్రయత్నించినట్లు చాణక్యుని నీతిశాస్త్ర గ్రంథ

ములలో కనబడుతున్నది వేశ్యలుండుటవలన సంసార స్త్రీల పాతివ్రత్యం సురక్షితము కాగలదన్న పిచ్చినమ్మకము కలవారు నేటికిని అక్కడక్కడ మన దేశమునందున్నారు వ్యభిచారములేని సంఘము ఆదివాసులలో ఉండేది ఇప్పుడు అదికూడా నవనాగరికుల సంపర్కం వలన అంతరించినది సవరల గురించి నేను పరిశీలనము కావిస్తూఉండిన దినములలో ఈ విషయం ఒక సవర వానితో ముచ్చటిస్తూ ఉన్నప్పుడు ఆ సవరవాడన్న మాటలు నేను మరచిపోజాలను క్షేత్రమందు పండే పంట నాది కానప్పుడు ఆ క్షేత్రం నా బీజములునాటి వృధా పుచ్చడ మెందు కన్నాడు ఆ మాటలు విన్నప్పుడు 'దారాన్ అపత్యాయ విత్తు భోగాయ' అనే మన ఆర్యుల నీతి జ్ఞప్తికి వచ్చినది

శ్రీ వేంకటరావుగారు ఆ లేఖలలో అక్కడక్కడ తమకుగల దేశభక్తి, స్వదేశ వస్తువులను మాత్రమే వాడవలెనన్న అనురక్తి, విదేశవస్తువులను బహిష్కరించవలెనన్న నీతి వ్యక్త పరచినారు. (చూ పుటలు 44,48) కడపటి లేఖలో కడపటి భాగాన వీరు వ్రాసినది వీరి ఆశయమును లెస్సగా తెలియజేస్తుంది ''గాంధీగారు నడిపిస్తున్న ఉద్యమంలో జయం పొంది మనమే సకల సంపదలతోనూ తులతూగుతాం" (చూ పు 166)

ఈ గ్రంధం పిఠాపురం మహారాజావారి ఉదారాత్మకు అంకితం చేయడం అన్ని విధములలో సమంజసమయినది మహారాజా వారిప్పుడు సజీవులయి ఉంటే, ఈ లేఖలన్నీ వ్యావహారిక భాషలో రచితములైనా ఈ గ్రంధమును సంతోషముతో అందుకొని శ్రీ వేంకటరావుగారిని ఆశీర్వదించి ఉందురని నా నమ్మకము ఈ నమ్మకమునకు తగిన కారణము లేకపోలేదు. భాషా విషయమై వీరికి లోగడ ఉండిన వీరగ్రాంథిక భాషాభిమానము కొంత తగ్గినది. వ్యావహారిక భాషా ప్రయోజనము యెడల అభిమానము కొంత కుదిరినది. ఇందుకు దృష్టాంత ముగా రెండు ముఖ్యమైన ముచ్చట్లు తెలియ జేస్తాను. అర్వాచీనకావ్యములం దున్ను, త్యాగరాజ కీర్తనలందున్ను, క్షేత్రయ గేయములందున్ను ప్రాచీన వ్యాకరణ సూత్రములకు విరుద్ధములయినా జీవకళతో కనబడుతూ ఉన్న ప్రయోగ ములు గ్రాహ్యములే అన్నవాదన వీరును నాతోపాటు శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రిగారితో చేసినారు శాస్త్రిగారు అందుకంగీకరించకపోతే "మీరు వట్టి ఛాందసులు'' అని కూడా పలికినారు యువరాజావారు రచించిన వరూధిసీ

త్రివరాఖ్యమనే నాటకము— అందులో యువరాజావారు స్వతంత్రించి వ్రాసిన పచన భాగమంతా పాత్రోచితమైన వ్యావహారిక భాషలో ఉన్నా యువరాజా వారు తమకు అంకితంగా సమర్పించినప్పుడు స్వీకరించినారు

ఈ గ్రంథమునకు పరిచయ వాక్యములు వ్రాయవలసినదిగా శ్రీ వేంకట రావుగారు కోరినప్పుడు సంతోషముతో సమ్మతించినాను వీరు నా చేత నీ పరిచయ వాక్యములు వ్రాయించి నన్ను గౌరవించినందుకు నేను వారికి కృతజ్ఞుడను ఈ గ్రంథము వేలకొలది పాఠకులు చదివి ఆనందింతురని నా నమ్మకము

ఇతి శమ్

హైదరాబాదు-4 గిడుగు సీతాపతి
23-7-1966 (కళాప్రపూర్ణ డా॥ గిడుగు వెంకట సీతాపతి)

M V Sastry,
Advocate,

'MATHURA'
Kakinada,
July, 3 1966

My dear Venkata Rao Pantulu,

Somehow it comes natural to address you like this A request from one who is dear, is a command When you ask me to write about your 'Letters', it comes easy to me to write to you a letter myself This gives me some latitude and a freedom, because I can open out my heart to you It shall be your choice if you publish it!

I am not learned or proficient in either language as you imagine, nor am I so much at home with English Idiom True, I have done some desultory reading and travel I was not drawn to travelogues much The only travelogues I read and loved reading, were Steinbeck's 'Travels with Charlie' and Henry Miller's 'Tropics', if you can call them travelogues I admit I am fearless - to the extent of being foolhardy sometimes, particularly when it is responding to a call from a good friend Else, I would not have ventured into this

I travelled round the world, not too late in life to miss the engrossment in the entertainment and enjoyment the civilized parts of it could offer But it was a matter of just a hundred days sixty of which I spent in Washington - green, with my daughter Kantam and her kids

It may be interesting to compare your travel with mine You travelled in the entourage of a Maharajah, I was on my own You were on the high seas, and I was in the skies - with the clouds and stars - all the time You left through the West to the West - back again the same way I started in the opposite

direction from Calcutta losing time all the way from Tokyo where I started on the 9th August to arrive at Honolulu (U S A) the previous day! Return Seattle-Tracoma, through Chicago, Washington D C, Philadelphia New York, London, Hamburg Paris Geneva, Rome, Cairo, back through the west at Bombay Taking off the sixty days I spent with my daughter and grandchildren, all this just took me exactly forty days! I was in a hectic whirl all the time, it continues to be a daze even at this distance of time I was wanting to write to Padmaraju from place to place and from moment to moment But I was living so much every minute of those hundred days that I could hardly find the time or collect my thoughts to write about anything I tried to write something after my return

"This is not really a diary I am only trying to recapture my impressions and experiences during a very small part of the life I am supposed to have lived so far of the life spent abroad travelling round the world–of a period of about a hundred days of the recent past Actually it is quite some time now after my return I have deliberately given myself this time, to settle down

I left the shores of the country when I was not too young nor too old to enjoy the good things of life - when I was just half way between 53 and 54 and now, back in my country, I am nearer 54

It was my first experience of jet travel I was heading for the North West of the U S A, through the Far East, taking off from Calcutta on a bright morning early in August"
and there it ended!

You might not have rounded as much of this planet in 1930 or rushed through as many cultures as I had done in 1963 When I read your 'Letters' I envy the time you had and your capacity to assimilate an experience and also give graphic expression to it for the delectation of others It was like taking a long walk with you in the country-side of England listening to the lilting story of some travel in wonderland I relived some of those hundred days, this time with some poise

and relaxation and realized all that I missed by just 'living' all the time You also can 'live' – dont I know! And you can remain un-engrossed That is where you score, and that is how perhaps literature like your 'Letters' is born

I can claim the privilege of intimate personal association with some of our foremost men of letters – Padmaraju Sri Sri, Tilak, Katury, Krishna Sastry, Abboori I confess however I was more interested in them as men an less in their writings I really dont bother very much about what you wrote either But I must say I do not appreciate you for what you have not written You were so near to patrons of letters and to men and women who knew to live You have lived in the aura of famous men of letters, and you have proved yourself to be a man of letters in your own right With your age, you are like vintage wine, and like Cleopatra - not for looks though - you neither wither nor stale I cherish the memory of an evening near my shack here Surely with your background an your continuing capacity to live, you would be less than honest to the writer's profession, if you dont bring out a second volume of letters about France and all those interesting countries you visited in the company of interesting people, recalling all the experiences which should be more interesting than what is now published I don't mind your addressing these to me! You don't need a Government subsidy for such an one!

Yours always,
**M V Sastry**

# ప్రస్తావన

సామాన్యంగా యువకులు ఉత్తరం చదివి చిత్తు కాగితాల బుట్టలో పడవేస్తారు. సహజమే. అందులో ఆహ్లాదం కొలిపే విశేషాలు కానీ, వ్యవహారానికి ఉపకరించే ఉచిత విషయాలు కానీ లేనప్పుడు బుట్టదాఖలు కాక మరి ఏమౌతుంది? కాని కొందరు కొంచరు నాలుగు మాటలు పలికినా నాలుగు మాటలు వ్రాసినా నాణెం అనిపిస్తుంది పత్రికా రచనకూడా ప్రశస్త విధానమే రచన రకరకాలుగా ఉండడం, రాణించడం చూస్తూనే ఉన్నాం లేఖారచన కూడా వివిధ సారస్వత ప్రక్రియలలో అన్యతమము మని అంగీకరించారు పాశ్చాత్య విమర్శకులు అందుకే ఆ దేశాలలో రచయితలు కాని, తదన్యులు గాని లిఖించిన ఉత్తరాలు ఉత్తమసాహిత్య శ్రేణిలో స్థానము అందుకొన్నవి

మన దేశంలో కూడా ప్రాచీన కాలం నుంచీ లేఖావాఙ్మయము ప్రశస్తి పొందుతూ ఉన్నది గీర్వాణవాణిలో పండితులు ప్రభువులు వ్రాసిన పత్రికలు కొన్నికొన్ని లభిస్తున్నవి ముసల్మానులు కూడా సంస్కృతము అభ్యసించి చక్కని రచనలు చేసినారు షాహేజహాన్ చక్రవర్తి కుమారుడు దారా నిజబ్రాహ్మణగురువులకు ప్రణామ పూర్వకముగా గీర్వాణవాణిలో వ్రాసిన లేఖలు కొన్ని అచ్చు పడినవి

ఉద్దిష్టమైన పనికి ఉపయుక్తమైన విషయాలు సక్రమంగా వ్రాయడం సహజమే కాని లేఖకు ఆకర్షణ ఉండవలె నంటే సారస్వత స్పర్శము తగిలి తీరవలె లేఖకుడు వివిధ విషయములు తెలిసినవాడు కావలె రచన రసస్ఫూర్తి కలిగి ఉండాలి ముఖ్యంగా చమత్కార సంభృతమైతే ముగ్ధులను చేస్తుంది చదివే వారిని. అన్నిటికన్న అవతల పత్రిక చదివే వారిని సంతోష పెట్టడమే ప్రధానాశయంగా పెట్టుకుంటే లేఖ ఉత్తమ మౌతుంది

కొందరు లేఖారూపంలో గ్రంథాలు వ్రాసినవా రున్నారు అవి లేఖ లని పించుకోక గ్రంథములే అనిపించుకొంటవి ఆధునికాంధ్ర రచయితలలో ఒకరు 'ప్రేమలేఖ' లనే పేర పుస్తకాలు ప్రకటించారు. అవి ఎవరినైనా ఉద్దేశించినవి కావచ్చును, కాకపోవచ్చును, అవి ఉద్దిష్టులైన వారికి రవాణా కావచ్చును కాకపోవచ్చును కొన్ని భాగములు హృదయంగమంగా ఉండవచ్చు కాని అటువంటివి కేవలము లేఖ లనడానికి వీలు లే దనిపిస్తుంది

ఒకానొక నట్టువకత్తె తన ప్రియుడైన 'విక్టర్ హ్యూగో' కవీంద్రునకు ఎన్నో లేఖలు వ్రాసి, ఆయనకు పంపించక పేటికలో భద్రము చేసుకుం దట. ఆమె పోయిన తరువాత వాటిని బయటకు తీసి ప్రకటించినారు వాటిని లేఖ లనవచ్చునా ?

ఎవరైనా ఎవరికైనా లేఖలు వ్రాసి తపాలా ద్వారా కాని మనిషి ద్వారా కాని పంపితే అవి అవతల వారు అందుకొని చదువుకొని భద్రపరిస్తే పత్రికలు అని స్పష్టముగా అంగీకరించవచ్చును.

## 2

ప్రకృత పత్రికా రచయిత కురుమెళ్ళ వేంకటరావుగారు ఆంగ్ల విద్యాభ్యాసం చేసి ఉపాధ్యాయ వృత్తిలో ఉన్నవారు ఈయన సాహిత్యములో కృషిచేసిన సహృదయుడు పీఠికాపుర ప్రభువులకడ ఉండి వారి ఆహ్వాన ప్రకారము అన్యదేశాలకు మహారాజా వారి వెంట ప్రయాణము చేసినవారు ప్రయాణానుభవాలను పెమ్మరాజు వెంకటరావుగారికి లేఖారూపంగా వ్రాస్తూ ఉండేవారు పెమ్మరాజు వారు లేఖారచయితకు చాలా ప్రియ మిత్రుడు ఒకరి మనసు ఒకరు బాగా గ్రహించినవారు కాబట్టి కురుమెళ్ల వారు వీరికి ఇన్ని లేఖలు వ్రాయడం సంభవించింది ప్రయాణ సందర్భంలో సంఘటనలు మొదలైనవే కాక ప్రియమిత్రునికి ప్రీతి కలిగిస్తవి అనుకున్న సంగతులు కూడ లేఖలలో కనబడుతవి తనకు వచ్చిన లేఖలు రచయితకు మిత్రుడు తిరిగి పంపడం, ఇవి ప్రకటన కావడం ప్రమోదావహము

వేంకటరావుగారు బొంబాయిలో స్టీమరెక్కి ముందు ఇంగ్లాండులో దిగినాడు అక్కడ కొన్ని వారాలు గడిపి అమెరికా వెళ్ళినాడు అక్కడ కొన్ని రోజులుండి వెనుకకు వచ్చి ఐరోపా ఖండములో వివిధ దేశాలు చూచి భరత భూమికి తిరిగి వచ్చి పిఠాపురం చేరుకున్నాడు ఈ ప్రయాణం అంతా రమారమి ఎనిమిది మాసాలు పట్టింది ఒక్కొక్క దేశములో చూడదగిన భవనాలు, పుస్తక భాండాగారాలు, కలాశాలలు, వస్తు ప్రదర్శనశాలలు, క్రీడా ప్రదేశాలు, నాటకశాలలు, ఆరామములు ప్రకృతి సుందర దృశ్యాలు చూడ గలిగినన్ని చూచినాడు పెద్దపెద్ద హోటళ్లలో ఏకాంచేసినాడు. ఎన్నో వస్తు విక్రయశాలలు, పుస్తక విక్రయశాలలు తిలకించినాడు రకరకాల మనుషులను కలుసుకోవడం సంభవించింది ఇవి అన్నీ ఆ ఆ సందర్భాన్ని బట్టి కళ్ళకు కట్టినట్టు వర్ణించాడు ఈయన అనాలోచితంగా ప్రయాణం చేయక జాగరూకతతో సమీక్షతో సంచరించినట్లు ఉత్తరాల వల్ల వ్యక్తమౌతుంది.

కొన్ని సందర్భాలలో చిత్రమైన వ్యక్తులను కూడా చూడడం, మాటాడడం సంభవించింది ఆ ఘట్టాలవల్ల ఈయన బాగా లోకజ్ఞానము కలవా డని స్ఫురిస్తుంది, ఏ దేశం వెళ్ళినా ఎటువంటివారిని చూచినా, ఎటువంటి స్థితిగతులలో ఉన్నా తాను భారతీయుడను, అనే మాట మరచి పోలేదు పారిస్ నగరంలో, వియన్నా నగరంలో మార్గసంచారిణులు తనను ఆహ్వానించి నప్పుడు ఇంద్రియవశవర్తికాక ధీరుడుగా ప్రవర్తించినాడు, ఈయన ఆ దేశాలలో సంచారం చేసేటప్పుడు భారత దేశానికి న్యూనత కలిగించే పలుకు ఆడలేదు, పని చేయలేదు

అన్యదేశాల జనులను ఈసడించడం మామూలు వారి ఆచారవ్యవహారాలకు మనవాటికి తేడా ఉండడంవల్ల అవతలివారు అట్టే యోగ్యులు కారని మనసులో తొందరపాటు చెందడం మామూలు అలా కాకుండా వెంకటరావుగారు విజ్ఞతతో వారిని గ్రహించి సానుభూతి చూపినాడు

ఉత్తమమైన ఉత్తరానికి ఉండవలసిన ప్రధాన లక్షణా లన్నీ ఈ పత్రికలో ఉన్నవి ఈ ముప్పది లేఖలూ ముద్దుగా గ్రంధరూపం దాల్చడం ముదావహం అన్యదేశాలకు వెళ్ళి అక్కడినుంచి ఆప్తులకు జాబులు వ్రాసినవారు కొంతమంది

మనలో ఉన్నారు  వాటివల్ల కొన్నికొన్ని అన్యదేశ విషయాలు ఆంధ్రులు గ్రహించవచ్చును

నేను చూచి నంతలో ఈ లేఖాసందోహం సారస్వత శ్రేణిలో చేరుతుంది అని నిస్సంశయముగా చెప్పగలను.

ఇతి శివమ్ ।

సాహితీ సమితి, ఒంగోలు.
జూన్ 25, 1966

శివ శంకర స్వామీ.
(కవిసార్వభౌమ, మహామహోపాధ్యాయ,
సాహిత్యాచార్య, విద్యావాచస్పతి.)

**M. Atchutaramayya**
Teacher, (Rtd)
R R Bh R High School,

PITHAPURAM,
5-4-1965

Dear Mr Venkata Rao,

I felt rejoiced to go through most of your letters written in your world tour If compiled and published they become a good exhibit in the art of letter writing and your place and popularity in the galaxy of good writers is assured

Your sweet style, mild humour and your just and unoffensive observations here and there make them quite an interesting reading and one cannot but pursue them with great avidity

Your comments now and then on Western civilisation indicate that you could not be swerved from your love and regard for our own country and culture despite your youthful admiration for the glamour and material advancement of other climes, a fact that deserves commendation

These contain information regarding men, manners and customs of different people in Europe and America and also vivid beautiful descriptions of nature (seas, mountains etc ,) and of ships and how tourists spend their time in them

The geography and topography of some important cities with their parks, palaces, busy streets and centres, as described by you, not only widen the reader's vision but also create an ambition for travel and excite our curiosity to know more of the world

In short they are very instructive and I greatly wish that these should be prescribed for text book in schools.

I take the liberty to exhort you to publish these letters soon and wish you success in the endeavour

Yours sincerely,
**M Atchutaramayya**

RAJAH OF PITHAPURAM, 35, Harrington Rd
Madras-30
18-6-1966

ప్రియమైన వేంకటరావు,

ప్రేమతో నిండిన సీలేఖ, దూరతీరా లనే నీ గ్రంధము చేరి నా హృదయాన్ని ఆనందంతో నింపేయి ధన్యవాదాలు

తావులు వెదజల్లుతూ, తలపులు రగుల్చుతూ, ఆనాటి మన వార్తలు ఈనాటి మన వారికి అందజేస్తున్నావు

కోపం వచ్చేవారి కళ్ళు ఎర్రపడనీ, ప్రేమ పొంగే వారి కన్నీళ్లు కారనీ నీ పని నీవు చక్కగా చేసికొన్నావు, మిత్రుడా

నీ,
రా. వేం మ. గం రామారావు
ఆఫ్ పిఠాపురం.

# వి జ్ఞా ప న

ఈ ఉత్తరాలన్నీ ముప్పయి అయిదేండ్ల క్రితం నా మిత్రుడు పెమ్మరాజు వెంకట్రావుకు ఆయా దేశాలనుంచి వ్రాశాను పిఠాపురం మహారాజా శ్రీ రాజారావు వెంకట కుమార మహీపతి సూర్యారావు బహదూర్‌వారు కుటుంబసమేతంగా 1930 సంవత్సరములో పశ్చిమ దేశయాత్ర చేశారు వారి పరివారంలో నన్నూ చేర్చుకున్నారు నావంటి సామాన్యుడికి లభ్యంకాని మహద్భాగ్యం నాకు చేకూరింది అంతా శ్రీవారి దయ దానికి తోడు మహారాణీ శ్రీ చిన్నమాంబాదేవిగారి వాత్సల్యం, యువరాజా, రాజ కుమారుల ప్రేమా నా యీ అదృష్టానికి కారణాలు వారికి యావజ్జీవం కృతజ్ఞుణ్ణి

నేను స్వదేశం తిరిగి రావడంతోనే నా మిత్రుడు పెమ్మరాజు వెంకటరావు ఈ ఉత్తరాలన్నీ పుస్తకరూపంలో అచ్చువేయిస్తే బాగాఉంటుందని నాకు తిరిగి ఇచ్చివేశాడు ఇప్పటికి ముప్పది ఆయిదు సంవత్సరాలయింది మూడేళ్ళ క్రితం చివికి శల్యాలైన ఆ ఉత్తరాలు చూచిన మిత్రులు శ్రీ కె చిరంజీవిగారు ఇప్పుడైనా తప్పక అచ్చువేయించమని ప్రోత్సహించారు ఇంకా నన్ను అమితంగా ప్రోత్సహించినది శ్రీ మహారాజావారి దౌహిత్రులు శ్రీ రాజా ప్రద్యుమ్న కుమార అప్పారావు బహదూర్ వారొకరు ఇంతలో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం సాంస్కృతిక శాఖవారు నాకు ముద్రణ నిమిత్తం సహాయంగా మూడువేల రూపాయీలు ప్రసాదించారు పుస్తకం అచ్చువేయించాను. ఇందులోని చిత్రాలూ ముఖచిత్రమూ శ్రీ శివరామ్ రచించారు అందరికీ నా కృతజ్ఞత తెలుపుకుంటున్నాను

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు నాకు గురువులు నాకేమైనా సాహిత్యంలో ప్రవేశం ఉందీ అంటే, నాకేమైనా సంస్కారం ఉందీ అంటే అంతా వారి వల్లనే వారికి నా హృదయపూర్వకమైన నమస్కారాలు.

నా లేఖలు అచ్చుపడడానికి, చిన్నప్పటి నుంచీ నామీద ప్రేమాభి మానములు చూపిస్తూ, నన్నాదరిస్తున్న మంత్రి వర్యులు శ్రీ రాజా మేకా రంగయ్యాప్పారావుబహదర్ గారి దయయే ముఖ్య కారణం వారికి నా హృదయ పూర్వక నమస్కారములు

నేను కోరినదే తడవుగా ఈ లేఖలు చదివి వారి అభిప్రాయాలు ఇచ్చిన పిఠాపురంరాజా శ్రీ రాజారావు వెంకటమహీపతి గంగాధర రామారావు బహదూర్ వారు, శ్రీ స్వామీ శివశంకరశాస్త్రిగారు, శ్రీ గిడుగు సీతాపతిగారు, శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు, శ్రీ ములుకుట్ల వెంకటశాస్త్రిగారు, శ్రీ మంత్రాల అచ్యుత రామయ్యగారున్ను వీ రందరికీ నా కృతజ్ఞతా పూర్వక వందనాలు

నాడు నేను తిరిగిన దేశాలలో, చూచిన చిత్రాలు నాటికీ నేటికీ కూడా మీకు ఆహ్లాదం కలగజేస్తాయని నమ్ముతున్నాను,

పిఠాపురం

4-8-1966

కురుమెళ్ళ వేంకట రావు



Bombay
26th April 1930

ప్రియమిత్రుడు పెమ్మరాజుకు,

ఈ ఉత్తరం నేను బొంబాయినుంచి వ్రాస్తున్నానని నువ్వు ఆశ్చర్య పడతావు. ఇంతకంటే నువ్వు ఆశ్చర్యపడేదీ, ముఖ్యంగా నువ్వు, చాలా సంతోషించేదీ ఇంకొక విషయం వ్రాస్తున్నాను నేను పిఠాపురంలో 17 వ తేదీని బయలుదేరి మర్నాడు మద్రాసు వచ్చాను. మహారాజావారు కుటుంబసమేతంగా ఇంగ్లాండు, అమెరికా మొదలైన దేశాలు వెళ్తున్నారని నీకు ఇదివరకే తెలుసుకదా నన్ను వారి, కూడా తీసుకువెళ్ళడానికి మహారాణీగారూ, యువరాజావారూ సిఫారసు చేశారు మహారాజావారు అంగీకరించారు. వెంటనే రమ్మని మద్రాసు నుంచి మా అయ్య నాకు ఉత్తరం వ్రాస్తే బయలుదేరి మద్రాసు వెళ్ళాను మద్రాసునుంచే నీకు ఉత్తరం వ్రాయడానికి తీరుబడి లేక వ్రాయలేదు నే నిలా వచ్చినట్టు మన స్నేహితులు చాలామందికి తెలియనే తెలియదు మద్రాసులో పాస్‌పోర్టులూ వీసాలూ తీసుకోవడం, ప్రయాణానికి బట్టలు కుట్టించుకోవడం, సామానులు కొనుక్కోవడం ఈ తొందరలో నీకు వ్రాయడం కుదిరింది కాదు.

ఇక్కడ ఈవేళ ఉదయం దిగాం మేము ప్రయాణంచేసే స్టీమరు పేరు ఎస్. ఎస్ వైస్‌రాయ్ ఆఫ్ ఇండియా మే 3 వ తేదీని బయలుదేరుతుంది. ఈ లోగా మేము 30 వ తేదీని బయలుదేరి నాసిక్ వెళ్ళి, గోదావరి జన్మస్థానం దర్శించి 2 వ తేదీ ఉదయానికి తిరిగి బొంబాయి వస్తాము నువ్వు నాకు బొంబాయికి ఉత్తరం వ్రాయవద్దు. స్టీమరులో కూర్చుని సావకాశంగా నేనే వ్రాస్తాను. నా అడ్రసూ అదీ ఇంకా ఏమీ తెలియదు. తర్వాత వ్రాస్తాను ప్రతి వారం వ్రాస్తాను అక్కడి విశేషాలు. నువ్వుకూడా వ్రాయాలి సుమా ప్రతీవారం తప్పకుండా.

వచ్చేటప్పుడు నిన్ను చూడకుండా, నీతో చెప్పకుండా వచ్చేశాను క్షమించు

నీ
వేంకటరావు.



S S The Viceroy of India
6th May 1930

ప్రియమిత్రుడు పెమ్మరాజుకు,

బొంబాయిలో 2వ తేది రాత్రికే కొందరు ప్రయాణీకులు మా స్టీమరులో ఎక్కారు మేముకూడా 2వ తేదీ రాత్రే ఎక్కాము మర్నాడు మధ్యాహ్నం 12 గంటలయేసరికి ప్రయాణీకులతోనూ, వారికి వీడ్కోలు ఇవ్వడానికి వచ్చిన బంధువులతోనూ స్నేహితులతోనూ బల్లార్డ్ పియర్ అంతా నిండిపోయింది ఒక వైపునుంచి ప్రయాణీకుల సామానులు, ఇంకో వైపునుంచి తపాలు, ఇతర సామానులు పడవలోనికి ఎక్కించడం, మహా గొడవ. ఇంక అరగంటకి పడవ బయలుదేరుతుందనగా ప్రయాణీకులను చూడడానికి వచ్చిన వాళ్ళతోనే తీరం అంతా క్రిక్కిరిసి పోయింది ఒకటేరొద, ఒకటే ఉత్సాహం పూల మాలలూ అభినందనలూ, కరస్పర్శలూ ఆలింగనాలున్నూ పడవ పెద్ద కూత కూసింది. అందరం పడవ ఎక్కేశాం, పడవ తాళ్లు విప్పారు. నావ కదలడం మొదలుపెట్టింది మెల్లగా తీరాన్నుంచి పడవ దూరం అయిపోతుంటే గట్టుమీద ఉన్నవాళ్ళని చూస్తూ పడవలోనివాళ్ళం అందరం బయటనిలబడ్డాం చేతులు ఊపేవాళ్ళూ, జేబురుమాళ్ళు విసిరేవాళ్లూ క్రమంగా అస్పష్టం అయిపోతూంటే ఎందరో బైనాక్యులర్స్ తీసి చూశారు బొంబాయి మా దృష్టిపథంలో నుంచి తొలగిపోయింది ఇంక చుట్టూ కెరటాలూ, నల్లని సముద్రమున్నూ.

నే నీ ఉత్తరం కొంచం అస్వస్థతగా ఉండీకూడా వ్రాస్తున్నాను ఎందుచేతనంటే బొంబాయిలో బయలుదేరాక రెండు రోజులు పడుకున్నవాణ్ణి మరి లేవలేదు కొంచం బాగా ఉన్నాక వ్రాస్తున్నాను. సీసిక్‌నెస్ వల్ల బాధపడ్డాను ఏమీ తోచదు కడుపులో జాలిగా ఉన్నట్టు ఉంటుంది. ఒక్కోసారి కడుపంతా చెయ్యిపెట్టి కలిపినట్టు ఉంటుంది వాంతి వచ్చినట్టు అనిపిస్తుంది. కాని రాదు. అంతా తిరుగుతున్నట్టు ఉంటుంది మంచంమీంచి పడిపోతామా అన్నట్టు ఉంటుంది. ఒక్కమాటలో చెప్పాలంటే మగవాళ్లు వేవిళ్ళుపడడం లాంటిది

ఇంక ఈ స్టీమరు సంగతి 'ది వైస్‌రాయ్ ఆఫ్ ఇండియా' పెనిన్సులర్ అండ్ ఓరియంటల్ కంపెనీవారి పెద్ద పడవలలో ఒకటి ఎన్నో కొత్త సౌకర్యాలతో కొత్తగా కట్టారు. ఇంగ్లాండు మొదలైన దేశాలకు పంపే టపాల్ని ఈ కంపెనీపడవల్లోనే పంపుతారు ఈ స్టీమరు 19 వేల టన్నుల బరువు—అంటే 19 వేల టన్నుల బరువు మోస్తుందన్నమాట. ఎనిమిది అంతస్తులున్నాయి దానిలో ఉండే సౌకర్యాలూ, శుభ్రత, అందం, వైభవం ఇంద్రుడి వైజయంతానికైనా ఉంటాయా అనిపిస్తుంది. నాలుగు తరగతులున్నాయి మొదటి రెండు తరగతులూ ఒకేమాదిరి సౌకర్యాలు కలిగి ఉంటాయి మూడవ క్లాసు ప్రయాణీకులకి గదులుండవు డెక్కుమీదే ఉండాలి డెక్కు అంటే వసారా అన్నమాట డెక్కు ప్రయాణీకులకు కూడా గదులుంటాయి కాని సౌకర్యాలేవీ ఉండవు డెక్కు ప్రయాణంకూడా సరదాగానే ఉంటుంది గాలీ, ఎండా, వానా అనుభవిస్తూ ఎప్పుడూ సముద్రాన్ని చూస్తూ ఉండొచ్చు. మేడలకి చుట్టూ వసారాలున్నట్లే పడవ పైఅంతస్తులకు విశాలమైన ఖాళీస్థలాలు ఉంటాయి వీటినే డెక్కులంటారు.

నేను ఫస్టుక్లాసు గదిలో ప్రయాణంచేస్తున్నా దానిని కేబిన్ అంటారు. ప్రతిగదిలోనూ స్ప్రింగు మంచాలు, మెత్తని పరుపులూ, తూలికలతో నింపిన తలదిండ్లూ, రగ్గులూ ఉన్నాయి బట్టలు పెట్టుకోడానికి ఒక చిన్న అరల బీరువా, చేతులు, ముఖమూ కడుక్కోడానికి ఒక వాష్‌బేసినూ, దీనికి వేడినీళ్ళు రావడానికి ఒక కొళాయీ, చన్నీళ్ళకొక కొళాయీ అమర్చి ఉంటాయి. దుప్పట్లూ తువాళ్ళూ, చేతిగుడ్డలూ స్టీమరువాళ్ళే సప్లయిచేస్తారు. పడవ అంతా ఎలెక్ట్రిక్ దీపాలతో వెలిగిపోతూ ఉంటుంది వైస్‌రాయ్ ఆఫ్ ఇండియాలో ఎలెక్ట్రిక్ ఫేన్సు లేవుగాని గొట్టాలద్వారా గాలి పంప్ చేస్తారు గదులలోకి. గాలివచ్చే మూతి ఎలా తిప్పుకుంటే అలా గాలికొడుతుంది

మొదటి తరగతి గదులకంటే పెద్దతరగతి ఇంకొకటి ఉంది. దాన్ని డీలక్స్ తరగతి అంటారు. ఈ గది చాలా పెద్దదిగా ఉంటుంది. పెద్దమంచం, రైటింగ్ టేబిలూ, రెండుమూడు టీపాయిలూ, డ్రెస్సింగు టేబిలూ అదనంగా ఉంటాయి. దొడ్డీ, స్నానం గదీ ఈ గదికి ప్రత్యేకం

కేబిన్సులోఉండే ప్రయాణీకులకి సహాయం చెయ్యడానికీ, చిన్నచిన్న పనులు చెయ్యడానికీ కొన్ని గదులకు కలిపి ఒక్క నౌకరు ఉంటాడు. ఇతన్ని

స్టీవార్డు అంటారు. స్టీవార్డులందరూ తెల్లవారే ఉదయాన్నే మనల్ని లేపి బెడ్ కాఫీ తెచ్చిపెడతాడు మనం కాలకృత్యాలు తీర్చుకుని బట్టలు వేసుకుని బ్రెక్‌ఫాస్టుకు వెళ్ళడంతోనే ఇతను మన గదిలో ప్రవేశించి పక్క బట్టలు సర్దుతాడు తెల్లని దుప్పట్లు పరుస్తాడు గదంతా శుభ్రంచేస్తాడు ఎక్కడ ఉండవలసిన సామానులు అక్కడ ఒక పద్ధతిలో ఉంచుతాడు మనం విడిచిన బట్టలు చక్కగా మడతలుపెట్టి జాగ్రత్త పెడతాడు జోళ్ళకి పోలిష్ కూడా చేస్తారు. ప్రయాణీకుల్లో ఆడవాళ్ళుంటే ఆడవాళ్ళనే స్టీవార్డెస్‌లుగా నియోగిస్తారు వీళ్లుకూడా తెల్లవాళ్లే. మా స్టీమరులో లస్కర్లుతప్ప తక్కిన వాళ్ళందరూ తెల్లవాళ్ళే. లస్కర్లు పడవ పనులు చెయ్యడం, తాళ్లు లాగడం, సామానులు మోయడం, డెక్కులన్నీ కడిగి శుభ్రపరచడం, ఇలాంటి పనులు చేస్తారు. వీళ్ళంతా మన నల్లవాళ్ళు.

బొంబాయిలో స్టీమరు ఎక్కుతున్నప్పుడు ఒకవైపున సంతోషం ఇంకో వైపున విచారం కలిగింది ఎంతో ధనవంతులికీ, అదృష్టవంతులికీ తప్ప నా బోటివాడికి ఈ అవకాశం కలుగుతుందా? పశ్చిమదేశాలన్నీ చూడబోతున్నాననీ, అక్కడి నాగరిక ప్రజల జీవితపద్ధతుల్ని స్వయంగా చూడగలుగుతున్నాననీ ఎంతో ఉత్సాహమూ ఆనందమూ నాలో లేకపోలేదు మీకూ, మాతృదేశానికీ దూరం అవుతున్నానే అన్న విచారమూ లేకపోలేదు

రెండు రోజులు సీ సిక్‌నెస్‌వల్ల బాధపడ్డానని వ్రాశాను కదా డాక్టరును తీసుకురానా అని స్టీవార్డు అడిగాడు అక్కరలేదని సీసిక్‌నెస్‌కు బొంబాయిలోనే కొనితెచ్చుకున్న మందు 'మదర్‌సీల్' మాత్రలు వేసుకొన్నాను నిమ్మకాయ రసం ఒకటి మంచిపని చేసింది మూడోరోజున పెద్దవాంతి అయింది ఒళ్ళంతా చెమటలు కమ్మాయి. దాంతో నాకు స్వస్థత కలిగింది స్నానం చేశాను మళ్ళీ మామూలు మనిషినయ్యాను మొత్తంమీద ఈ సీసిక్‌నెస్ యాత్రికుడి మనస్థితినిబట్టికూడా ఉంటుందేమో అనిపించింది

రేపు ఏడెన్ చేరుకుంటాం ఈ ఉత్తరం అక్కడినుంచి పోస్టుచేస్తాను. చాలావ్రాసి విసుగెత్తించానేమో ఇంకా ఎంతోఉంది వ్రాయడానికి ఈస్టీమరు మీద జీవితాన్ని గురించి తరవాత ఉత్తరంలో వ్రాస్తా

సీ

వేంకట



The Viceroy of India
Mediterranean Sea
14th May 1930

మిత్రుడు పెమ్మరాజుకు,

ఇప్పుడే మాల్టా ద్వీపాన్ని విడిచిపెట్టి ఒక గంటఅయింది. ఇవ్వాళ ఉదయం 11 గంటలకి మాస్టీమరు ఒక గేటుగుంటా మాల్టాహార్బరు చేరింది ఎక్కేవాళ్ళూ దిగేవాళ్ళున్నూ ఇక్కడా ఉన్నారు డెక్కుమీదికి వచ్చిచూస్తేని గదా కింద నీట్లో ఒక వందమంది యువకులు ఈదులాడడం ములగడం తేలడమున్నూ. ఎందుకంటే పడవమీది వాళ్ళుడబ్బులు నీటిలోకి విసురుతుంటే. చర్రున ఈది మునిగి నీట్లో కాయిన్ పట్టుకుని పైకిలేచి ఆ కాసును ఎత్తిచూపించి ఒక సలాం కొట్టి—ఈ విధంగా కొందరు డబ్బులు సంపాదించుకుంటున్నారు ఇంకా చిన్నచిన్న తెప్పల మీద ఒకడు ఫిడేలు వాయిస్తూఉంటే ఒక అమ్మాయి పాడుతూ స్టీమరు చుట్టూతిరిగి డబ్బులు దండుకుపోయింది. మాల్టాచుట్టూ బారులు బారులు తీర్చిఉన్న యుద్ధనౌక లెన్నింటినో దాటి ప్రయాణం సాగిస్తున్నాం

నీకు ఏడెన్‌నుంచి ఒక ఉత్తరం వ్రాశాను. 7వ తేదీ సాయంత్రం సరిగ్గా 5-30 కి ఏడెన్ హార్బరు చేరుకున్నాం ముందుగా చిన్నచిన్న కొండల్నీ లైటుహౌసునీ, వైర్‌లెస్ ట్రాన్సుమిటర్ స్తంభాల్నీ దాటి, రేవుకు దాదాపు మూడుఫర్లాంగుల దూరంలో లంగరు వేశారు తీరాన్నుంచి స్టీము లాంచీలమీద జనంవచ్చి మాస్టీమరు ఎక్కారు. దిగివెళ్ళేవాళ్ళు వాటిమీదే తిరిగి వెళ్లారు చీకటి పడుతూ పడుతూ ఉండడంవల్ల దూరంగా కొండలు నల్లగా పెద్దపెద్ద మేఘాల్లాగా కనపడ్డాయి అయితే ఆ కొండలమీద ఒక చిన్నచెట్టుగాని ఒక పచ్చగడ్డి పోచగాని ఉన్నట్టు కనపడలేదు వెలుతురు ఉండగా చూచినప్పుడా కొండలు కొంత పసుపు రంగుగానూ కొంత ఎరుపు రంగుగానూ ఉన్నట్టు ఆ నీరెండలో కనపడ్డాయి. ఆరిపోయిన అగ్నిపర్వతపు శాఖలేమో అవి! రాత్రికావడంచేత స్టీమరు దిగి మేము తీరానికి వెళ్ళలేదు రేవు ఎలెక్ట్రిక్ దీపాల కాంతిలో కలకలలాడుతూఉంది

రాత్రి 9-30 గంటలకి మళ్ళీ మా స్టీమరు ఇంజనులు తిరగడం ప్రారంభించాయి. నెమ్మది నెమ్మదిగా ఏడెన్ రేవుకి దూరమైపోయి బేబిల్ మాండబ్ జలసంధి గుండా ఎర్ర సముద్రంలో ప్రవేశించాం ఎదురుగా పెరిమ్ ద్వీపంమీద ఉన్న పెద్ద దీపస్తంభంమీదినుంచి ప్రసారమయ్యే వెలుతురు మామీద పడ్డది. ఈ లైట్ హవుస్ ఎర్రసముద్ర ద్వారంలో పహరా జవాను పనిచేస్తూ ఉందా లేక వచ్చేపడవలని ఆహ్వానిస్తూ నీరాజనమిస్తూ ఉందా అని పించింది ఎర్ర సముద్రంమీద ఉన్న మూడు రోజులూ రెండు వైపులా అప్పుడప్పుడు చిన్న రాతికొండలు కనపడుతూనే ఉండేవి అందుచేతే కాబోలు ఇక్కడి ప్రయాణం ఏదో మహా సముద్రంమీద ప్రయాణం చేస్తూన్నాం అన్నట్టుగా తోచలేదు

మా స్టీమరు పగలు గంటకి పద్దెనిమిదీ లేక ఇరవై మైళ్ళ వేగంతో పోతుంది. రాత్రివేళ వేగం హెచ్చిస్తారు 11 వ తేది ఉదయం ఆరు గంటలకల్లా సూయెజ్ రేవు చేరుకున్నాము తీరాన్ని పెద్దపెద్ద మేడలూ మంచి రోడ్లూ, చక్కని గడ్డిబయళ్ళున్నూ ఉన్నాయి ఒక గంటసేపు మాత్రమే అక్కడ ఆగి తరవాత సూయెజ్ కాలవలో చొరబడ్డాం కొంతవరకూ ఆఫ్రికాతీరంలో కొన్నికొన్ని మేడలు కనపడ్డాయి. తరవాత రెండు వైపులా పెద్దపెద్ద ఇసక ఎడారులు ఆఫ్రికా తీరం వొడ్డునే మంచి రోడ్డు కూడా ఉన్నట్టుంది అప్పు డప్పుడు మోటారుకార్లు వెడుతూ ఉండడం కనపడ్డది రోడ్డు పక్కని రెండు వైపులా సరుగుడు చెట్లు ఎడారి అంచునఉండి, తెల్లని వస్త్రానికి పచ్చని అంచు లాగా గోచరించింది కొంతదూరం పోయాక ఒక చర్చీ, గ్రేట్‌వార్‌లో చనిపోయిన వీరుల స్మారక చిహ్నంగా కట్టిన ఒక మోమోరియల్ కనపడ్డాయి. ఇటు ఈజిప్టు, అటు పేలస్టయిన్ రెండు వైపులా ఇసక తిప్పలు తప్ప వేరేమీ కనపడలేదు.

సూయెజ్ కాలవ పొడవు దాదాపు 100 మైళ్లు. వెడల్పు ఒకచోట బాగా ఎక్కువగానూ, ఒకచోట కొంచం తక్కువగానూ ఉన్నా దాదాపు రెండువందల అడుగుల వెడల్పు ఉంటుంది మన నిడదవోలు కాలవ అంత ఉంటుంది. ఈ కాలవ మూడు ఉప్పునీటి సరస్సుల్ని కలుపుతూ తవ్వారు. ఈ సరస్సుల్ని మంజాలా, టిమ్సా, బిట్టర్‌లేక్ అని పిలుస్తారు కాలవ వెడల్పు తక్కువ గనక పెద నౌకలు ఎదురువస్తే ఈ సరస్సులోనే క్రాస్‌చేసాయి. మేము

ఒక సరస్సు ప్రవేశించేసరికి అప్పటికప్పుడే ఎదురువచ్చే యుద్ధనౌక ఒకటి మాకు ఎదురయింది దాన్ని చూడడానికి గదుల్లోనుంచి అందరం బయటకు వచ్చాము యుద్ధనౌకలో సైనికులుకూడా బైటకువచ్చి నిలబడ్డారు మేమూ వాళ్ళూ టోపీలు పైకెత్తి ఊపి జేజేలు కొట్టి అభినందించుకున్నాం

చదువుకునే టప్పటి సూయెజ్ కాలవ పాఠం జ్ఞాపకం వచ్చింది అది తవ్వించిన ఫ్రెంచి ఇంజినీరు ఫెర్దినాడ్ డి లెసెప్సు ప్రపంచాని కెంత మహోప కారం చేశాడు ! ఇంగ్లాండునుంచి ఇండియా రావాలంటే ఈ కాలవవల్ల నాలుగు వేల మైళ్ళ దూరం కలిసివస్తుంది సూయెజ్ కాలవలో స్టీమర్లని గంటకి 8 లేక 9 మైళ్ళ కంటే ఎక్కువ వేగం పోనియ్యరు నీటి అలల తాకిడికి గట్లు కోసుకుపోతాయని

రాత్రి 7 గంటలకి పోర్టుసెడ్ చేరుకున్నాం సూయెజ్ కాలువకి ఒక కొనన్ని సూయెజున్నూ రెండోకొనని పోర్టుసెడ్న్నూ ఉన్నాయికదా దీపాల కాంతిలో హార్బరు వెలిగిపోయింది చూడడానికి కన్నుల పండువైంది హార్బరులో ఇంకా చాలా ఓడలు నిలబడి ఉన్నాయి అయితే మా నౌక తీరానికి ఒక ఫర్లాంగు దూరంలో నిలబడింది రాత్రి అయినందువల్ల ఎవరూ తీరానికి వెళ్ళలేదు గాని సూయెజ్‌లోనే స్టీమరు దిగి కైరో నగరానికి సమీపాన్నే ఉన్న చరిత్రాత్మకమూ, ప్రాచీనమూ అయిన పిరమిడ్సును చూడడానికి వెళ్లి, తిరిగి పోర్టుసెడ్ రేవులో స్టీమరుని అందుకునేవాళ్లు మాత్రం వచ్చి మళ్ళీ ఎక్కారు వాళ్ళకి సూయెజ్ కాలువగుండా ప్రయాణంచేసి ఆ సౌందర్యాన్ని చూచి ఆనందించే అవకాశం పోయిందిగాని ఈజిప్టు ముఖ్యపట్టణం కైరో నగరాన్నీ, జగద్విఖ్యాతమైన పిరమిడ్లనూ దర్శించే అదృష్టం లభించింది

ఇప్పుడు రాత్రి 12 గంటలైంది సమయం చిక్కినప్పుడల్లా నాలుగు ముక్కలు వ్రాస్తున్నా ఎల్లుండి మార్సేల్సు చేరుకుంటామట అంతవరకూ ఏదో వ్రాస్తూనేఉంటా ఇప్పుడే పై డెక్కుమీదికి వెళ్ళి గంటసేపు ఉండి వచ్చాను. పుచ్చపువ్వులాంటి వెన్నెల సముద్రం మీద పడుతోంది చిన్న కెరటాలు ఆడుతున్నప్పుడు వెన్నెల వాటిమీదపడి ఎంతో అందంగా ఉంది కనుచూపు మేరకూ చంద్రకిరణాలు పడినచోట నీటిలో ఒక వెలుతురుబాట తీర్చినట్టుంది అలలు మెరిసిపోయేవి. ఈ దృశ్యం ఎంత ఆనందం కలుగజేసిందనీ ! దాన్ని కూడా మానుకుని ఈ దృశ్యం చూడడానికి నౌక డెక్కులమీద నిలబడతారందరూ

ఓడలో ఇన్నిరోజులు ఎలా కాలక్షేపం అవుతుందని అనుకోకు ఇరవై నాలుగు గంటలూ ఎన్నిరోజులైనా తీరికలేకుండా కాలక్షేపం అవుతుంది ఎప్పుడూ ఏదో హడావిడి, పెళ్ళిలా ఉంటుంది భోజనాలకి దుస్తులు మార్చుకోడం, ఆటలకు వేరే దుస్తులు, నృత్యాలకి మరొకరకం దుస్తులు, ఈతకు వేరే రకం, ఇదొక అత్యవసరమైన సరదా పని ముందుగానే చెబితే స్టీవార్డు ఉదయాన్నే బెడ్‌కాఫీ తెచ్చి లేపుతాడు. కాలకృత్యాలు తీర్చుకుని ఏడున్నర ఎనిమిది గంటలలోపులో డైనింగు హాలులోకి వెళ్ళి ఉదయంభోజనం తీసుకుంటాం. తరువాత ఉదయమంతా డెక్కు మీద కాలక్షేపం. స్టీమరు చిట్టచివరి అంతస్తు మీద కెప్టెన్ ఉంటాడు అతడే సర్వాధికారి పడవమీద ఆ అంతస్తుమీదే చుక్కాని గది ఉంది ఇంగ్లాండునుంచి భారతదేశానికి ఓడ మార్గాలూ, రేవులూ కనబరచే పటాలూ, దిక్సూచికా యంత్రం, ఉష్ణమాపకమూ, ఇంకా ఇతర పరికరాలూ అన్నీ ఆ గదిలోనే ఉంటాయి ఆ అంతస్తుమీద కొంత భాగం ప్రయాణీకులు షికార్లు చెయ్యడానికి ఖాళీగా ఉంచుతారు. ఈ అంతస్తు చుట్టూ చిన్న చిన్న తెప్పలు–లైఫ్‌బోట్సు–వేళాడగట్టి ఉంచుతారు ఓడకి ఏదైనా ప్రమాదం సంభవిస్తే ఈ చిన్న తెప్పల్ని క్రిందకిదింపి జనం వాటిల్లో ప్రవేశించి ప్రాణాల్ని రక్షించుకుంటారు. పాత ఓడలలో ఇలాంటి నావలు స్వల్పంగా ఉండేవట. అందరికీ చోటు చాలదు గనక ముందుగా చిన్నపిల్లల్నీ, ఆడవాళ్ళనీ ఎక్కించి ఇంకా చోటు మిగిలితే గొప్పవాళ్ళని ఎక్కించి ప్రాణాలు కాపాడేవారట వైస్రాయ్ ఆఫ్ ఇండియాకే ప్రమాదం సంభవిస్తే యాత్రికులందర్నీ, పనిచేసే వాళ్ళనికూడా ఎక్కించుకోడానికి చాలినన్ని తెప్పల్ని ఏర్పాటుచేశారు

ఉదయాన్నేలేచి కొందరు ఈ పైఅంతస్తుమీద షికార్లు చేస్తారు ప్రభాత సమయంలోనూ, సాయం సంధ్యవేళా ఆ డెక్కు మీదికివెళ్ళి సూర్యోదయమూ, అస్తమయమూ చూచి ఆనందించడం నాకు విధాయక కృత్యమై పోయింది. నల్లటి నీటినుంచిలేచి తెల్లగా విరిగిపడే కెరటాలమీద సూర్యకిరణాలు పడితే బంగారం పొంగినట్లుండేది. చుట్టూ ఆకాశం వొంగిపోయి సముద్రంలో దూరంగా కలిసిపోవడం చూడడానికి ఎంతో ఆనందంగా ఉంటుంది. విశాలమైన సముద్రంమీద బ్రహ్మాండమైన ఒక వెండికప్పు బోర్లించినట్టు కనపడుతుంది. ఒక్కొక్కసారి నల్లటి ఆకాశం, నల్లటి సముద్రమున్నూ. పడవలో తప్పిస్తే చుట్టూ కనుచూపుమేరలో ఏ ప్రాణీ కనిపించదు. ఎగిరి

త్రుళ్ళిపడే చేపలూ, అప్పుడప్పుడెక్కడైనా నీటికొంగలూ తప్పిస్తే ఇంకేం వుంది? సముద్రాన్ని చీల్చుకొని స్టీమరు వేగంగా పోతూ నీటిని రెండు భాగాలు చేసి మధ్యలో తెల్లని రోడ్డు వేసినట్లు, చూచినంత దూరమూ, ఓడ వచ్చిన మార్గం చూస్తూ ఎంతసేపైనా నిలబడవచ్చు వెన్నెట్లో మరీ అందంగా ఉంటుంది ఆఆట అప్పుడప్పుడు ఏదైనా పడవ ఎదురు పడితే బైనాక్యులర్లు తీసి తోడి మానవుల్ని చూచి ఆనందిస్తారు యాత్రికులు.

దీనికి కింది అంతస్తుమీద విశాలమైన హాలు ఒకటి ఉంది. దీన్ని స్మోకింగ్ రూమ్ అంటారు అందమైన సోఫాలూ, కుర్చీలూ ఉన్నాయిక్కడ. ఈ గదిలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ సిగరెట్లు, చుట్టలూ కాల్చుకొనేవాళ్ళూ, పేక ఆడుకునేవాళ్లూ, ఓమూల కూర్చుని చదరంగం ఆడేవాళ్లూ ఇంకా ఎన్నో విధాల కాలం వెళ్లబుచ్చేవాళ్లూ ఈ గదినిండా ఎప్పుడూ ఉంటారు ఈ అంతస్తు మీదే రింగ్ టెన్నిస్ ఆడుకోడానికి నాలుగైదు కోర్టులున్నాయి. స్త్రీ పురుష లెడతెరిపి లేకుండా ఆడుతూ ఉంటారు ఇంకా అనేక రకాల ఆటలాడుకోడానికి తగిన సాధన సామగ్రి అంతా దీనిమీదే ఏర్పాటుచేసి ఉంది బ్రెక్‌ఫాస్టు అయినవద్దనుంచి మధ్యాహ్నభోజన సమయం వరకూ ఎడతెరిపి లేకుండా కాల క్షేపం అవుతుంది. ఈ ఆటలు నచ్చనివాళ్ళూ, ముసలివాళ్లూ డెక్కుమీద బారులు బారులుగా వేసిన పడక కుర్చీలలో విశ్రమించి సముద్రంవైపు చూస్తూనో చదువుకుంటూనో ఉంటారు పన్నెండు గంటలకి క్రింది అంతస్తుల్లోఉన్న తమతమ గదుల్లోకిపోయి ముఖాలూ చేతులూ కడుక్కుని టాయ్‌లెట్ చేసుకుని లంచికి మళ్ళీ భోజనశాల చేరుకుంటారు. భోజనాలు అయాక మళ్ళీ స్మోకింగు రూములో కాలక్షేపం 4 గంటలకి టీ. తరవాత ప్రొద్దుపోయేవరకూ ఆటలు ఏడున్నర గంటలదాకా ఇలాంటి వినోదాలలో మునిగిపోయి రాత్రి భోజనాలకి తయారుకావడానికి మళ్లీ గదుల్లో ప్రవేశిస్తారు. రాత్రి భోజనానికిమాత్రం డైనింగు హాల్లోకి మామూలుగా వేసుకునే లోంజి సూట్లతో మాత్రం వెళ్ళ కూడదు డిన్నర్ డ్రెస్ వేసుకోవలసిందే డిన్నర్ డ్రెస్ లేకపోతే డైనింగ్ హాలులోకే రానివ్వరు పట్టుపంచ కట్టుకోకపోతే వంటింట్లోకి మనవాళ్ళు రానివ్వరుకదూ! అనుకునేవ్! ఈ డిన్నరు డ్రెస్‌కొక పద్ధతి నమూనా ఒకేరకం బట్టా! ఒకేరంగూ-దానికి షర్టు వేసుకోడం, గొంతుక్కు టై కట్టుకోడం. అదంతా ఒక తంతులే! రాత్రి భోజనంవేళల్లోనయ్యా ఆడవాళ్ళ తయారవు

తారూ—రోజుకోరకం వాళ్ళకున్న మంచి అందమైన రంగురంగుల బట్టలన్నీ వేస్తారు. డిన్నరు అయిన తరువాత మళ్లీ పైకివెళ్ళి స్త్రీలూ పురుషులూ కలిసి రాత్రి ఒంటి గంటా రెండు గంటల వరకూ డాన్సు చేస్తారు ఒకవేళ పడుకుందా మని గదిలోకి వెళ్ళి పడుకున్నా పైన డాన్సుచేసే చప్పుడు—టక్కు టక్కు మని జోళ్ళ చప్పుళ్ళు—నిద్ర పట్టనివ్వవుగదా! ఇదీ మా దినచర్య ఇంక ఎలా ఉబుసుపోకుండా ఉంటుందోచెప్పు'

ప్రతి కేబిన్‌లోనూ అందులో ఎందరు ఉంటే అన్నిలైఫ్ బెల్టులు బీరువామీద అమర్చి ఉంటాయి ఆ ప్రక్కనే బెల్టులు ఎలాకట్టుకోవాలో తెలిపే బొమ్మలు వేసిన బోర్డులు తగిలించి ఉంటాయి వారానికి రెండుసార్లు బెల్టులు ఎలా కట్టుకోవాలో నేర్పడానికి డెక్కుమీద ట్రెయినింగు ఇస్తారు ఈ లైఫ్ బెల్టులు కట్టుకుని నీటిలోకి దుమికినా మనిషి మునిగిపోడు కొంచం ఈత వచ్చిన వాడికయితే మరీ తేలిక ఒకరోజంతా నీటిమీద తేలుతూ ఉండవచ్చు ఇవిగాక ప్రతి డెక్కుమీదా మోటారు టైర్లలాగు గుండ్రంగా రబ్బరు చక్రాలు అక్క డక్కడ తగిలించి ఉంటాయి ఇవికూడా మనిషిని నీటిమీద తేలుస్తాయి వీటిని లైఫ్‌బోయిన్ అంటారు ఒక అంతస్తులో ఇన్‌ఫర్మేషన్ బ్యూరో, పోస్టాఫీసూ ఉన్నాయి ఓడ రోజు రోజుకూ పశ్చిమానికి పోతుంది గనక గడియారాలలో టైము మార్చుకోవలసి వస్తుంది ఏ రోజున ఎంత మార్చుకో వాలో బోర్డుమీద నోటీసు పెడతారు ఓడ ఏ రేవుకి ఎన్నిగంటలకి చేరుకో బోతున్నదో అదికూడా నోటీసు బోర్డుమీద వ్రాస్తారు ఇంక మహా సముద్రంలో పడవమీద ఉన్నాంగదా అని ప్రపంచంతో సంబంధం లేదనుకోవద్దు. ప్రపంచంలో జరిగే సంఘటనల్లోని ముఖ్యవార్తలన్నీ వైర్‌లెస్ ద్వారా వస్తాయి టైపుచేసి బోర్డుకు తగిలిస్తారు బొంబాయిలోనూ, దేశంలోనూ జరిగే ఉప్పు సత్యాగ్రహం వార్తలు రోజూ చూస్తూనే ఉన్నాం.

మా స్టీమరులో చక్కని స్విమ్మింగ్‌పూల్ ఒకటి ఉంది స్నానపు దుస్తులు వేసుకుని స్త్రీ పురుషులు అందులో ఈదులాడుతారు. మంచి ఆనందంతో ఆ నీట్లోకి దుమికి, గంతులువేసి, మునుగుతూ తేలుతూ వాళ్ళు జలక్రీడలాడుతూ ఉంటే చూడడానికి చాలా సరదాగా ఉంటుంది నాకు ఈత రాదే అని ఎంతో విచా రించాను. పిల్లలు ఆడుకోడానికి ప్రత్యేకంగా గది ఉంది. రకరకాలైన ఆట వస్తువులతో ఆయాలు పిల్లల్ని ఆ హాలులో ఆడిస్తారు స్టోరు రూములూ,

బేగేజీ రూములూ, వంటసాలలూ అన్నీ పడవ కడుపులోని అంతస్తులలో ఉంటాయి క్రింది అంతస్తులోనుంచి పై అంతస్తుకి వెళ్ళడానికి ఎలెక్ట్రిక్ లిఫ్టు కూడా ఉంది కాని సాధారణంగా ఎవరూ లిఫ్టు ఉపయోగించరు భోజనశాలలూ, స్మోకింగ్ రూములూ, డెక్కులూ మొదటి తరగతి వాళ్ళకి వేరూ, రెండవ తరగతి వాళ్ళకి వేరున్నూ, డెక్కు ప్యాసింజరులకు ఇలాంటివేవీలేవు

పడవకడుపులో ఇంకొక పెద్దగదిఉంది స్టోర్ రూమ్ స్టీమరు మీద ఉన్న ప్రయాణీకులకు అందరికీ, పనివాళ్ళకీ పదీ పదిహేను రోజులకి సరిపడ్డ ఆహారపదార్థాలు నిలవచేసుకోవాలి కదా! కూరగాయలూ, పళ్ళూ, మాంసాలూ ఎన్నోరకాలవి స్టోరుచేస్తారు. గొఱ్ఱెలూ, మేకలూ, కోళ్ళూ, చర్మాలు ఒలిచి బారులు బారులుగా వేళ్ళాడగడతారు చూడడానికి కొంచం అసహ్యమూ, భయమూ వేసింది ఇవన్నీ ఆస్ట్రేలియానుంచి సప్లయి అవుతాయట

వినోదాలకీ కాలక్షేపాలకీ లోటులేదన్నాను కదా ప్రయాణీకులలో సంగీతంలో డాన్సుల్లో, ఆటల్లో కాంపిటిషన్లు జరుగుతున్నా యిప్పుడు. రేపు రాత్రి ఫాన్సీడ్రెస్సు ఉందట పడవ దిగిపోయే ముందురాత్రి ప్రైజు డిస్ట్రిబ్యూషన్ జరుగుతుంది ఇంకా వివరాలు వ్రాయాలంటే ఎన్నో ఉన్నాయి.

ఇప్పటికే చాలా వ్రాశాను చాలా రాత్రి అయింది ఎల్లుండి 16 వ తేదీ ఉదయానికి మార్సేల్సు చేరుకుంటామట అక్కడ దిగి ఫ్రాన్సు దేశానికి అడ్డంబడి రైల్లో ఇంగ్లాండు వెడతాము ఇంగ్లాండు చేరడంతోనే మళ్ళీ వ్రాసాను. ఇంక సెలవు.

నీ
మిత్రుడు
వేంకటరావు.



Savoy Hotel
London
20th May 1930

మిత్రుడు పెమ్మరాజుకు,

ఇక్కడికి చేరాం 17 వ తేదీ సాయంత్రానికి. సెవాయి హొటెల్లో ఉన్నాం ఈ హొటేల్ లండనులో చాలా గొప్పది చాలా ధనవంతులైతేనేగాని ఇక్కడ బసచెయ్యలేరు. మన దేశంనుంచి వచ్చే ఇండిపెండెంటు రాజ్యాల మహా రాజులు ఇక్కడ బసచేస్తూ ఉంటారు దీని విశేషం ఏమిటయ్యా అంటే ఇక్కడికి వచ్చేవాళ్ళంతా అరిస్టోక్రేట్స్, మంచి ఖరీదైన బట్టలు ధరించి చాలా మర్యాదస్తులైనవాళ్ళయి ఉంటారు ఇది పరిశుభ్రతకు పెట్టిన పేరు మేనేజర్లూ పనిచేసేవాళ్ళూ ఎంతో మర్యాదగా ప్రవర్తిస్తారు. సొగసుగా, మర్యాదగా తియ్యగా మాట్లాడే అందమయిన అమ్మాయిల్ని యిక్కడ పనిగత్తెలుగా నియమిస్తారు గదులూ, సామానులూ, ఎంతో అందంగా ఉంటాయి మేమిక్కడ 8 వ అంతస్తులో ఉన్నాం సాయంత్రం నాలుగు గంటలయేసరికల్లా వందల కొలది కార్లలో వస్తారు దొరలూ దొరసానులున్నూ కళ్ళు జిగేలుమనే బట్టలు వేసుకొంటారు ఆడవాళ్ళ అలంకారాలూ తయారీ చాలా చిత్రంగా ఉంది నాకు మనదేశంలో ఉండే దొరసానుల్లాగా కాదు ముఖాలన్నీ రంగులు పూసుకుని, కనుబొమ్మలకి రంగుపూసి, కనురెప్పలకీ కూడా కాటుకలాగ రంగువేసుకుని, బుగ్గలకి గులాబీ రంగూ, పెదవులకి ఎర్ర రంగూ బుగ్గమీదో, గడ్డంమీదో, మెడమీదో ఒక పుట్టుమచ్చా పెట్టుకుని మెరపుల్లాగా వస్తారు. ఎవరి కిష్టమయినట్టు వాళ్ళు తింటూ, తాగుతూ పాడుతూ ఆడుతూ డాన్సుచేస్తూ రాత్రి 7 గంటల వరకూ ఒళ్ళు తెలియని ఆనందంతో కాలం గడుపుతారు. రాత్రి భోజనాల తరువాత మళ్లీ డాన్సులు. రాత్రివేళ డాన్సు దుస్తులు మరీ వింతగా ఉంటాయి చేతులు లేనివీ, బుజాల కిందికి జారి పోయేవీ. వీపంతా కనపడేవీ, నేల జీరాడేవీ రకరకాలయిన గౌనులు వేసుకుంటారు. ఇంకా ఇక్కడ నాలుగు రోజులుంటాము నిజం చెప్పాల్సివస్తే ఇక్కడ ఉండడం ఒక ఇంద్రభోగం అనుభవించడం లాంటి దనుకో.

నీకు మార్సేల్సులో పోస్టుచేసిన ఉత్తరం అందిఉంటుంది 16వ తేదీ ఉదయం ఆరు గంటలకల్లా మా స్టీమరు మార్సేల్సు హార్బరు చేరింది డాక్సులో ఇంకా అనేకమైన స్టీమర్లు ఉన్నాయి మేము మధ్యాహ్నం 12 గంటలకి స్టీమరు దిగి పట్నం అంతా కార్లలో తిరిగాం ఊరంతా సారాయి దుకాణాలే ఆడాళ్ళు మొగాళ్లు హమేషా తాగుతారు. నోట్లో సిగరెట్‌లేని ఆడదాన్నిగాని మొగాణ్ణిగాని చూడలేం ఈ వూళ్లో బొటానికల్ గార్డెన్సులో ఒక భాగంలో ప్రత్యేకంగా గులాబీతోట ఉంది అది చూడడానికి వెళ్ళాం తెగపూచి ఉన్నాయి మొక్కలన్నీ అందులోనూ చాలా చాలా పెద్ద పెద్ద పువ్వులు రంగురంగులవి. మన ఇంట్లో పెద్ద సూర్యకాంతం పువ్వులుండేవే అంతంత పెద్ద గులాబీలు చూచి ఆశ్చర్యపోయాను. సాయంత్రం 4 గంటలకి పి అండ్ ఓ స్పెషల్ ట్రెయిన్ ఎక్కాము అది మా వైస్‌రాయ్ ఆఫ్ ఇండియాలోంచి దిగిన ప్రయాణీకులనే ఎక్కించుకుని సరాసరి ఇంకెక్కడా ఆగకుండా పారిస్ గుండా బ్రిటిష్‌ఛానల్ దగ్గరకి తీసుకుపోతుంది అందరమూ ఫస్టుక్లాసు ప్యాసెంజర్లమే రెండో తరగతి వాళ్ళకి వేరే ఇంకో ట్రెయిన్ ఉందట మర్నాడు ఉదయం 11 గంటలకి ఫ్రెంచి తీరాన్నున్న కెలే చేరాము రైల్లోంచి దిగి ఒక చిన్న స్టీమరులో కాలుపెట్టాం బ్రిటిష్ ఛానల్ దాటి అవతలి తీరాన్ని ఇంగ్లాండులో సిద్ధంగా ఉన్న రైలుఎక్కి లండన్ విక్టోరియా స్టేషనులో సాయంత్రం 4-30 గంటలకి దిగాం దిగీదిగడంతోనే తిన్నగా హోటేల్‌కి వెళ్లకుండానే మోటార్లల్లో లండనంతా ఒక్కసారి ప్రదక్షిణంచేసి రాజభవనం-బక్కింగ్‌హామ్‌పేలస్, పార్లమెంటు బిల్డింగూ, ట్రఫాల్గర్ స్క్వేర్ మొదలైనవి చూచుకుంటూ ఆరున్నరకి ఈ హోటేల్ చేరుకున్నాం. నా గది కిటికీలోంచి చూస్తే చక్కగా థేమ్సునదీ, దాంట్లో పడవలూ కనపడుతున్నాయి మొన్న సాయంత్రం హైడ్‌పార్కు చూశాను అందులో విహరించే జోడీలకు లెక్కాపత్రం ఉండదు

నిన్నను మధ్యాహ్నం కార్లో బయలుదేరి శ్రీ మహారాజావారూ, శ్రీ యువరాజావారూ నేనూ ఆక్సుఫర్డు వెళ్ళాము. లండనుకు దాదాపు 55 మైళ్లు ఉంది. అద్దంలాంటి రోడ్డుమీద పోతూ ప్రక్కని గడ్డీ, పువ్వులూ వీటి సౌందర్యం చూస్తూ పోతుంటే ఎంత ఆనందమనీ! ఆక్సుఫర్డులో ఉన్న ఒక కాలేజీ హాల్లో రవీంద్రనాథ్ టాగూర్ నిన్న హిబ్బర్టు లెక్చరు ఇచ్చారు.

సి. ఎఫ్ ఆండ్రూస్. సర్ రాధాకృష్ణన్ కూడా వచ్చారు వీరి దర్శనంచేసి తిరిగి వచ్చేశాం రీడింగ్ బిస్కట్ల ఫ్యాక్టరీ పక్కనుంచే వచ్చాం. దారి కడకూ ఉన్న పచ్చని పొలాలూ పూలవనాలూ చూసుకుంటూ వచ్చాం చూస్తున్నాను ఆనందిస్తున్నాను కాని నీలాంటి మనసుకలిసిన మిత్రుడు కూడా ఉంటే ఇంతకు పదిరెట్లు ఆనందించేవాళ్ళం అనుకుంటూ చూస్తే కలిగిన ఆనందాన్నీ అనుభూతినీ మనసులో అట్టేపెట్టుకోడం కూడా ఒకబాధే మనసుకలిసిన మిత్రునితో కలిసి చూసి, ఆనందించి ఆ అనుభవాలు ఒకళ్ళ కొకళ్ళు అప్పుడే చెప్పుకుని ఆనందించడం ఒకఆనందం.

మళ్ళీవారం వ్రాస్తాను నాకు ఉత్తరాలు C/o Thomas Cook & Sons, Berkeley Street, Piccadilly, London, అడ్రెస్‌కు వ్రాయాలి మేము ఎక్కడ తిరుగుతున్నా వాళ్ళు అక్కడికి జాగ్రత్తగా పంపుతారు ఈవేళ ఇంకా చాలా చోట్లకు వెళ్ళాను వివరాలు మళ్ళీ ఉత్తరంలో.

నీ
వేంకటరావు.



Morden Park
Morden, Surrey
London
2nd June 1930

ప్రియమిత్రుడు పెమ్మరాజుకు,

మేము చెల్టెన్‌హేమ్ వెళ్ళి అయిదారు రోజులు ఆ ప్రాంతమంతా చూసి వచ్చాము ఇప్పుడు మోర్డెన్ అనే ఊళ్ళో ప్రత్యేకంగా ఒక బంగాళా అద్దెకు తీసుకుని ఉంటున్నాము ఇది లండనుకు 15 మైళ్ళ దూరంలోఉంది ఈ పదిహేను మైళ్ళూకూడా ఊరుఉంది ఇక్కడికి అండర్‌గ్రౌండు ట్రెయిన్ కూడా ఉంది అండర్‌గ్రౌండ్ రైలు స్టేషను మా బంగాళాకి రెండు ఫర్లాంగుల దూరం ఉంటుంది మేం ఉన్న బంగాళా చిన్నదే అయినప్పటికీ చాలా సౌకర్యంగాఉంది చుట్టూ విశాలమైన లానులూ, చెట్లూ, పూలమొక్కలూ ఉన్నాయి బంగాళా వెనక భాగంలో చాలా అందమైన గులాబీతోటకూడా ఉంది రోజూ లండను ఊళ్ళోకి కార్లమీద వెడతాము లండన్‌కి మోర్డెన్ దక్షిణంగా ఉన్న ఒక సుబర్బ్ లండన్‌లో గొడవా గోలగా ఉంటుంది ఇక్కడ ప్రశాంతంగాఉంది ఇళ్ళూ, బంగళాలూ అందంగా ఉన్నాయి. రోడ్లమీద జనసమ్మర్దం తక్కువ. ఎంతచిన్న ఇంటికైనా చుట్టూ చిన్నచిన్న పూల మొక్కలున్నూ, ప్రహరీ నిమిత్తం గోడ కట్టకుండా మంచిమొక్కల ఫెన్సింగులున్నూ ఉన్నాయి ఒకవేళ గోడలు ఉన్నా గజం ఎత్తుకంటే ఎక్కువ ఉండకుండా కట్టి పక్కనే ఎత్తుగా ఏ మొక్కలో వేస్తారు. లండను పట్టణమంతా

షాపులూ, షోరూములున్నూ. జనసమ్మర్దం హడావిడిన్నీ. దరీ దాపూలేని పెద్దమేడల సముద్రం మేడలూ, గోడలూ పాతబడి పోయినట్లూ, పొగబట్టినట్లూ ఉంటాయి ప్రతిపనీ తొందరగా జరుగుతున్నట్టుంటుంది రోడ్ పేవ్‌మెంట్ల మీద నడిచేవాళ్ళూ వాళ్ళూ సావకాశంగా నెమ్మదిగా పదిలంగా నడవరు అవతల ఏదో మించిపోతున్నట్లు పరుగూ నడకా కాకుండా నడుస్తారు. ఆడాళ్లూ మొగాళ్ళూకూడా రోడ్లు క్రాస్ చేసేటప్పుడూ, బస్సు అందుకోడానికీ చెప్ప నక్కరనేలేదు ప్రశాంతంగాఉన్న మా యీ బంగళాలోనుంచి రోజూ ఊళ్ళో తీర్థపు ప్రజల్లోపడి తిరుగుతున్నాం ఒక్కటిమాత్రంఉంది. హోటేళ్ళల్లో నైతేనేమి, షాపుల్లో అయితే నేమి, బయట ఇంకెక్కడయినాసరే ఎవరైనా మాట్లాడితే ఎంతో సొగసుగా మర్యాదగా ఆదరంగా మాట్లాడతారు అందరూ

రోజూ ఏదోచూడ్డానికి వెడుతున్నాం ఊరికి మధ్యలోఉన్న ట్రఫాల్గర్ స్క్వేర్ గుండా ఎన్నోసార్లు వెళ్లాము. ఎత్తయినమెట్లూ సింహపు బొమ్మలూ మధ్యలో ఎత్తయిన నెల్సనుకాలమ్ రోజూ చూస్తాము ఒకప్రక్క బ్రిటిష్ మ్యూజియం బిల్డింగు కనపడుతూనే ఉంటుంది ట్రఫాల్గర్ స్క్వేర్‌కి దగ్గరగానే నేషనల్ గేలరీ, నేషనల్ పోర్ట్రెయిట్‌గేలరీ ఉన్నాయి సెవాయ్ హోటేల్లో ఉండేటప్పుడు ఇవన్నీ దగ్గరగా ఉండేవి. థేమ్సునదిమీద కట్టిన బ్రిడ్జి-టవర్‌బ్రిడ్జి ఆఫ్ లండన్-కి ఒక ప్రత్యేకతఉంది. నదికి ఈనీటి ఒడ్డునా ఆనీటి ఒడ్డునా పెద్దపెద్ద టవర్సు ఉన్నాయి ఈ టవర్సు రెండూ కలిపి పైన మనుష్యులు నడవడానికి బ్రిడ్జికట్టారు అదివొక రోడ్డులాగా ఉంది అయితే క్రింద ఒక బ్రిడ్జి ఈ బ్రిడ్జిమీదనుంచి కార్లూ బస్సూ నడుస్తాయి మా కారు దానిమీదినుంచే పోనిచ్చాం అయితే పెద్దపెద్ద ఓడలు ఆ బ్రిడ్జి కిందనుంచి పోలేవు. అప్పుడు ఈ బ్రిడ్జిని మధ్యలో విడగొట్టి ఆ కొసలు పైకి లేవనెత్తుతారు స్టీమర్లు పోతాయి, మళ్ళీ బ్రిడ్జి క్రిందికి దింపుతారు కార్లూ అవీ నడుస్తాయి ఇది పైకి లేవనెత్తినప్పుడు పైన ఇంకొక బ్రిడ్జిలాంటిది ఎత్తున ఉన్నదన్నానే దానిమీద జనం నడుస్తారు ఇదొక వింతగాఉంది ఈ పద్ధతి బ్రిడి ఎప్పుడు కట్టారో ఏమిటో!

మదామ్ టుసాడ్స్ ఎగ్జిబిషన్ అని ఒకటుంది. అది చూశాం. అందులో అన్నీ మైనంతో చేసిన బొమ్మలుంటాయి మదామ్ టుసాడ్స్ అనే ఆమె ఆ బొమ్మల్ని తయారుచేసిందట ఒక చిత్రం జరిగింది. మేము

లోపలికి వెళ్ళడానికి మెట్లు ఎక్కుతున్నాం. ఒక మెట్టుమీద ఒక నీగ్రో మనిషి నిలబడి మమ్మల్ని ఆహ్వానిస్తున్నట్టు కనబడ్డాడు సరే ఆ మెట్టుదగ్గర దాకా వచ్చాం అక్కడికి వచ్చే సరికి ఆ నీగ్రో మనిషి చెయ్యిచాపి ఒక కాగితం చేతికి అందిచ్చాడు కాగితం తీసుకుంటూ అతని ముఖంవైపు చూచాను ఏమని చెప్పను ? అతను మనిషి కాడు ఒక బొమ్మ సరిగ్గా అక్కడికి ఎవరైనా వచ్చే సరికి ఏ మీటో పనిచేస్తుంది కాబోలు తలవంచి, చెయ్యిచాపి కరపత్రం అందిస్తాడు. నిజం మనిషే కాబోలు నన్నంత చక్కగా తయారు చేశారు ఆ బొమ్మను దీనికే ఆశ్చర్యపోతూ లోపలికి వెళ్లాంగదా, లోపల ఉన్న బొమ్మలన్నిటికీ ప్రాణాలు పోశారా అన్నంత జీవకళ ఉట్టిపడేలాగు వేక్సుతో తయారుచేసి సహజమైన రంగులు వేసి, తగిన దుస్తులు తొడిగి ఉంచారు, అందులో ముఖ్యంగా గమనించ తగ్గవి రాజ కుటుంబం బొమ్మలు అంటే జార్జి చక్రవర్తి, మేరీరాణీ, పిల్లలూ సరిగ్గా మనుషుల సైజు బొమ్మలు చేసి నిలబెట్టారు కొందరు పార్ల మెంటు సభ్యులూ, కవులూ, గొప్ప దేశనాయకులూ వీళ్ళందరి బొమ్మలు పెట్టారు నెల్సన్ చచ్చిపోయే సీనూ, విక్టోరియాను మహారాణిగా సింహాసనం ఎక్కించడం మొదలైన టేబ్లోలు చాలా బాగాఉన్నాయి. కాని నా మనస్సు కలచివేసింది ఇంకొకటి-ప్రిన్సెస్ ఇన్ ది డార్క్ చేంబర్. మనం థర్డ్ ఫారమ్‌లో హైరోడ్సు ఆఫ్ హిస్టరీ పుస్తకంలో చదువుకొన్నాం ఈ కథ జ్ఞాపకం ఉందా? ఆ పిల్లల ముఖాల్లో అమాయకత్వమూ, దైన్యమూ, నిస్సహాయత్వమూ అన్నీ స్ఫుటంగా కనబడేలాగ తయారు చేసిం దా మేడామ్‌టుస్సాడ్

ఇంక ఒక రోజున ఒక పువ్వుల షో చూశాం. అది చెల్సీ అనే చోట జరిగింది అదికూడా లండనుతో కలిసి ఉన్నదే. అన్ని పువ్వులు, అన్ని రక రకాల పువ్వులు, అంత పెద్దపెద్దపువ్వులు, అన్నిరంగురంగుల పువ్వులు, కుండీలతో తెచ్చినవీ, కత్తిరించినవీ కోటాను కోట్లు వచ్చాయి. నా కళ్ళు ఎంత అదృష్టం చేసుకున్నాయి! అటువంటి దృశ్యం ఎక్కడైనా, ఈ జన్మలో, కలలోనైనా చూడగలనా అనిపించింది.

గడచిన శనివారం అంటే 24వ తేదీ మధ్యాహ్నం చెల్టెన్‌హేమ్‌కు ప్రయాణం. పేడింగ్టన్ స్టేషన్‌లో రైలుఎక్కి సాయంత్రం నాలుగు గంటలకి ఆ వూరు చేరుకున్నాం. క్వీన్స్‌హొటేల్‌లో బసచేశాం. చెల్టెన్‌హేమ్ ఒక

చక్కని చిన్న పట్టణం లండనుకి ఉత్తరంగా ఉన్న గ్లస్టరుషైరులో ఉంది ఊ రెంతో శుభ్రంగా అందంగాఉంది. రోడ్ల పక్కని నాటిన వృక్షాలు పేవ్‌మెంటు మీద పోయేవాళ్ళకి నీడ ఇవ్వడమే గాక వరసగా, ఒకే ఎత్తుగా, ఒకే గుబు రుగా ఒక దానికిం కొకటి ప్రతా అన్నట్టు ఒకే బారుగా ఉంటూ సువాసనలు కూడా వెదజల్లే చిన్న పువ్వుల్తో ఉంటాయి రాలిన ఆకు కనపడదు అంత శుభ్రంగా ఉంచురారు ఇక్కడి అవెన్యూలు దూరంగా చూస్తే చుట్టూ కొండలు, పచ్చని గడ్డిమీద పసుపువీ తెల్లనివీ పువ్వులు మేము ఈ పట్నం రావడానికి ఒక ప్రత్యేకమైన కారణం ఉంది. మా మహారాజావారికి స్మూత్ ఫాక్స్‌టెరియర్స్ అనే జాతి కుక్కలంటే చాలా ఇష్టమనీ వారు ఆ జాతికుక్కల్నే ఎక్కువగా పెంచుతారనీ నీకు తెలుసుకదా ఆ జాతిలో ప్రపంచంలోకల్లా బెస్ట్‌డాగ్‌ని నిర్ణ యించడానికి ఈ చెల్టన్‌హేమ్‌లోని వింటర్ గార్డెన్సులో ఒక షో జరిగింది అందులో మా మహారాజావారి కుక్క 'డోనా ఆఫ్ నాట్స్' అనే పేరుగలదానికి ప్రపంచ ప్రథమ బహుమానం లభించింది బంగారు కప్పు గెలుచుకుంది డోనాని ఇండియా తీసుకు వస్తాంగా అప్పుడు చూదువుగానిలే

చెల్టెన్‌హేమ్‌లో పూలు కొనడానికి ఒక షాపులోకి వెళ్ళాం అక్కడ ఏదో కొని ఇవతలికి వచ్చాంగదా, షాప్‌కి ఎదురుగా వందకిపైగా జనం మూగి ఉన్నారు మొదట ఎందుకో అనుకున్నా కాని తెలిసింది, మమ్మల్ని చూడడాని కని మన చీరలూ ముసుగులూ వాళ్ళని ఆకర్షించాయి ఇది మనకి కొంచం బిడియంగా ఉంటుంది గాని పాపం వాళ్ళ క్యూరియాసిటీ వాళ్ళని అలా చేసింది అలా రోడ్డుమీద ఆగిపోయి, ట్రాఫిక్ బంద్‌చేసి, ఇదేదో వినోదం చూచినట్టు జనం మూగితే వాళ్ళని అనాగరికు లనుకోవాలో ఏవిటో తెలియదు అప్పుడు నాకొక కధ జ్ఞాపకం వచ్చింది మన హెడ్మాస్టారు శ్రీ కూచి నరసింహంగారు చెప్పారు ఒక్కసారి చాలాకాలం క్రిందట లండన్ పట్టణంలో ఇద్దరు ఇండియన్లు రోడ్డుమీద నడిచి వెళుతుంటే ఇలాగే జనం మూగి వింతగా చూడడం మొదలు పెట్టారట మనవా ఇదేమిటి ఇంత అజ్ఞానం వీళ్ళకి అని ఒకరితో ఒకరు చెప్పుకంటూంటే జనంలో ఒక ఆమె భర్త చెయ్యి పట్టుకులాగి Look! look! It speaks, it speaks! అందట ఇదీ కధ. దీన్నిబట్టి వాళ్ళకి మనం మానవులమనే జ్ఞానం లేదనీ, ఏదో జంతువుల మనుకుంటున్నారనీ స్పష్టం అయితే చెల్టెన్‌హేమ్ ఒక చిన్న ఊరుగనుకా, చీరెలూ, మనీ

బట్టలూ వేసుకున్న వాళ్ళని అదివరకు చూడడానికి అవకాశం తక్కువ గనకా అలా మూగిఉంటారే కాని లండన్‌లోని ఆమెలాంటి మూర్ఖులు కారేమో అని పించింది

చెల్టెన్‌హేమ్‌లో ఉన్న నాలుగురోజుల్లోనూ దానికి ఒక ఎంద మైళ్ళ చుట్టూ ఉన్న దేశం అంతా కార్లమీద తిరిగి చూశాం ఇక్కడ ముఖ్యంగా చెప్పుకో దగ్గది మాల్వెర్న్ హిల్సు ఇక్కడి ప్రకృతి సౌందర్యాన్ని ఎంతని మెచ్చుకోను ! ఎక్కడ చూచినా పచ్చగాను, పువ్వులతోనూ నిండిపోయి ఉం టుంది ఈ ప్రాంతంలో ఉన్నన్నాళ్ళూ చాలా ఆనందంగా గడిపాము మాల్వెర్న్ చాలా అందమైన ఒక చిన్న గ్రామం కొండమీద ఉంది లోయలూ సెల యేళ్ళున్నూ కొండమీద నుంచి దిగువకు చూస్తే, ఆ దృశ్యం ఎంతో మనోహ రంగా ఉంది. కొండ సగం ఎత్తు వరకూ దట్టమైన అడవిలా ఉంది పైకి వెళ్ళిన కొద్దీ పలచబడి చిట్టడివిలా ఉంది. కొండ ఏడెనిమిది మైళ్ళ పొడవు ఉంటుంది. చదువుకునే వాళ్ళు ఎక్కువ మంది ఇక్కడకు వస్తూ ఉంటారట ఇక్కడి పల్లె టూరి జీవితం స్వర్గంలా ఉంటుందని తలుస్తాను ఇక్కడి సృష్టి చిత్రానికే ముగ్ధులై ఇంగ్లీషు కవులు ప్రకృతిమీద చిన్న చిన్న లిరిక్స్ వ్రాశారు. ఈ కంట్రీలో ఉండే సౌందర్యమే, ఇక్కడి సృష్టి వైచిత్ర్యమే ఉద్రేకం కలిగించిం దనుకుంటాను నాకు పద్యాలు వ్రాయడం రాదుగాని. మనలో మనమాట, వచ్చి ఉంటే నేనూ ఎన్నో పద్యాలు వ్రాసి ఉందును ఇక్కడి క్లైమేట్ వల్ల వచ్చిం దనుకుంటాను ఈ పల్లెటూళ్ళకీ అందం కాలవలు ఎంత అందంగా ఉన్నాయను కున్నావ్? గట్లమీద రెండు వైపులా చెట్లూ, గట్ల పక్కని రంగురంగుల గడ్డి పువ్వులూ— ఎంత దూరం అయినా పోనీ ఆ కాలవ, అంత దూరమూ అలాగే కాలవ పొడుగున చిన్నచిన్న బంగాళాలు మనకీ కోనసీమలో కాలవ గట్టున అక్క డక్కడ ఇళ్లు కట్టారు. కానీ ఈ అందం దానికెక్కడ వస్తుంది ? అదీగాక మన వైపు కాలవగట్లూ, ఒడ్లూ కూడా పశువులూ మనుషులూ కూడా పాడుచేస్తారు కదా ! ఒక సెలయేటి ఒడ్డున ఒక చిన్న బంగాళాలో కాపరం ఎంత అదృష్ట వంతులకి !

అక్కణ్ణుంచి గ్లస్టరుమీదుగా వోర్స్టరు వెళ్ళాం అక్కడ రాయల్ వోర్సి స్టైన్ వర్క్సు అనే పింగాణీ ఫ్యాక్టరీ చూచాం. వాళ్ళు మమ్మల్ని ఎంతో గౌర

వంగా లోపలికి తీసుకువెళ్ళి ప్రతి శాఖా చూపించారు. మంటి ముద్దలు చక్కని బొమ్మలతో ఉన్న పాత్రలుగా తయారయేవరకూ జరిగే ప్రోసెస్ అంతా చూపించారు అంత చేతిపనే సామానుతయారయాక వాటికి రంగులూ పైని బొమ్మలూ చిత్రించడం చాలా చిత్రంగా ఉంది ఇక్కడి ఈ ఫ్యాక్టరీ ప్రపంచంలోని ఫ్యాక్టరీలలో అతినాజూకూ, అతి సున్నితమూ అయిన పనికి చాలా పేరు పొందిందట

పాశ్చాత్యదేశాలలో చేతిపనులకి ఆస్కారం తక్కువ అంటారు అన్నీ మెషీన్సుమీద తయారవుతాయనీ, ఒక నమూనాతో వేలాదివస్తువులు నిమిషాల మీద తయారవుతాయనిన్నీ కదా ప్రతీతి కాని ఈ ఫాక్టరీలో మెషీనుపనిగాక చేతిపని ఎక్కువగా ఉన్నట్టు కనపడుతోంది ముఖ్యంగా ప్రతివస్తువుమీదా రంగురంగులచిత్రాలు చేతికుంచెతో చిత్రకారిణులూ, చిత్రకారులూ ఎంతోమంది పెయింటింగ్ చేస్తున్నారు

ఈ ట్రిప్పు మాత్రం నాకు అమితమైన ఆనందాన్ని కలగజేసింది ఇప్పటికే చాలా వ్రాశాను చాలా రాత్రి అయింది కూడా ఇవ్వాళే ఇక్కడ కింగ్స్ లెవీ జరిగింది చక్రవర్తిగారు కొందరు అతిథుల్ని పిలిచి వాళ్ళకి దర్శనం ఇచ్చాడు మహారాజావారికీ యువరాజావారికీ ఆహ్వానాలు వచ్చాయి వారు వెళ్లారు నేనూ వెళ్ళాను గేటుదాకా నిన్నా మొన్నా నేషనల్ గేలరీ అవీ చూచాను వచ్చే ఉత్తరంలో వ్రాస్తాను వాటిని గురించి ఇప్పటికి సెలవు

సీ
వేంకటరావు



Morden Park
Morden, Surrey
8th June 1930

మిత్రుడు వెంకటరావ్‌కు,

రిచ్‌మండ్ అని లండన్‌తో కలిసే ఒక ఊరు — థేమ్సునది పక్కనే ఉంది. దానిలో క్యూ అనేది ఒక భాగం ఇక్కడ మన తెలుగువాళ్ళ కుటుంబం ఒకటి కాపరం చేస్తూవుంది ఆయనపేరు నరసింహంగారు ఒకబారిష్టర్ భార్యా పిల్లలతో అక్కడే కాపరంపెట్టి చాలాకాలంనుంచీ ఇక్కడే ఉండిపోయారు ఈవేళ వాళ్ళ యింటికి వెళ్ళాను వాళ్ళు మామూలుగా దొరలలాగే ఆచార వ్యవహారాలు సాగిస్తున్నా, ఆమె నాకు పీటవేసి కూచోబెట్టి ఆవకాయా అన్నం పెట్టి చేత్తో కలుపుకు తినమన్నారు మరంవేసుకు కూర్చుని చేత్తో కలుపుకుని అన్నం తిని చాలా రోజులైందిగదా! గూస్‌బెర్రీస్‌తో చేశారట ఆవకాయ ప్రాణం లేచివచ్చింది అన్నం అంటే జ్ఞాపకం వచ్చింది మరి మేం ఇప్పుడు ఏమి తింటున్నామనుకుంటున్నావో? కందిపప్పూ, నేయి వేసి అన్నం మెదాయించి ఆవకాయ నంజుకుతింటున్నామని అనుకుంటున్నావా? లేదు బాబా లేదు మేమూ దొరలు ఏమితింటున్నారో, ఎన్నిసార్లు తింటున్నారో అన్నిసార్లున్నూ, ఎలాతింటున్నారో అలాగేతింటున్నాము. పొద్దున్నే బెడ్‌కాఫీ తాగుతాం దాంతో ఒకబనానా తింటాము ఇది మనదేశంలో అరటిపండులాగ ఉండదు చాలా పెద్ద సైజులో ఉంటుంది ఇక్కడికి ఆస్ట్రేలియానుంచి వస్తాయట, ఎనిమిది గంటలకు బ్రెక్‌ఫాస్టు దాంట్లో రెండు కోడిగ్రుడ్లూ, రొట్టె వెన్నా, జామున్నూ, తాగగలిగినన్ని కప్పుల కాఫీన్నీ.

మధ్యాహ్నం భోజనం – లంచ్ – మాత్రం దిట్టంగా ఉంటుంది మొట్ట మొదటి కోర్సు సూప్, తరవాత చేపలు, మూడో కోర్సు కొంచంబరువైనది.

బంగాళా దుంపలు ఉడకబెట్టో, చిప్సులాగ వేయించో అవీ, ఆకుకూరలూ గ్రుడ్లూ, మాంసం వీటితో తినడానికి రొట్టెముక్కలూను తరవాత ఏదైనా తీపిది పుడ్డింగ్‌గాని, ఫ్రూట్‌సాలెడ్‌గాని అదీ. ఆఖరుని కాఫీయో, టీయో రాత్రిడిన్నర్‌లో కూడా దాదాపు ఇలానే ఉంటుంది మనకిలాగ పోపులుపెట్టి, మసాలాలు తగిలించి కూరలు వండుతా రనుకోకు ఏదిచేసినా ఉడకబెట్టో లేక వేయించో పెడతారు ఉప్పూకారం మనకి ఎంతకావాలో అంతా వాటిమీద జల్లుకుని తినాలి కారం అంటే గొల్లప్రోలు మిరపకాయల కారమో గుంటూరు ఎర్రకారమో అని అను కోకు కారం అంటే మిరియాలగుండ. ఆవాలతో పేస్ట్‌లాగ చేస్తారు – మస్టర్డ్, ఇదీ కొంచం నాలుకకి రాసుకుంటారు కావలసినంత వెన్న ధారాళంగా వాడ తారు ఇన్ని ఉన్నమీదట ఇంక వరి అన్నం ఎందుకు ? మజ్జిగ ఎందుకు ? అది గాక ఇక్కడి శీతోష్ణస్థితికి అన్నం తింటే అయిదునిమిషాల్లో ఎగిరిపోతుంది అందుకు బరువైనపదార్థమే వెయ్యాలి ఇక్కడ విస్తారంగా ఆకలివేస్తుందికూడా

నాలుగు గంటలవేళ టీ, దాంతో రెండుబిస్కట్లో, కేకుముక్కలోతింటారు రాత్రి పరుండబోయేటప్పుడు సప్పరు కూడా తింటారు మాకు అవసరం లేదు దొరలూ దొరసానులూ అయితే డాన్సులూ అవీ చేసి అలిసిపోయి తరువాత సప్పరని బిస్కట్లో, కేకులో తిని పాలువెయ్యని కాఫీ డికాక్షన్ తాగుతారు. మొదటి రోజులలో కత్తులూ, ఫోర్కులతో భోజనం చెయ్యడం కొంచం కష్టం అనిపించింది ఏ పదార్థానికి ఏ రకంకత్తి ఫోర్కూ ఉపయోగించాలో, ఏ చంచా ఎప్పుడు ఎలా ఉపయోగించాలో ఇవన్నీ స్టీమరులోనే అలవాటు అయిపోయాయి యిప్పుడు పరవాలేదు ఎవరైనా చూస్తే నవ్వుతారేమో అనే భయం లేకుండానే తింటున్నాం భోజనం టేబిలు దగ్గర పద్ధతులూ, మేనర్సూ అవన్నీ వాటంతటవే తెలిసిపోయాయి

నేషనల్ ఆర్టు గేలరీ చూశానన్నాను కదా. ఈ గేలరీ వంద సంవత్స రాలక్రితం స్థాపించారట. పాల్‌మాల్‌లో ఉంది చాలా రకరకాల పెంటింగ్సు ఉన్నాయి ఒక్కొక్క చిత్రానికి ఎదురుగా కూర్చుండి ఎంతసేపైనా చూడా లని పిస్తుంది. గదులన్నీ పరిశుభ్రంగా ఉంచుతారు బొమ్మలూ మొదలైనవన్నీ బూజూ ధూళీలేకుండా అప్పుడే సరికొత్తగాతెచ్చిపెట్టినట్టు ఉంచుతారు. చూడడానికి వచ్చిన వాళ్ళుకూడా నిశ్శబ్దంగా చూచి వెడతారు నాకు కొన్ని బొమ్మలు

నచ్చాయి అక్కడ క్వింటన్‌మాసే చిత్రించిన పోర్ట్రెయిట్ ఆఫ్ ఎ మెన్ ఇన్ ప్రేయర్ ఒకటి క్రైస్ట్ బిఫోర్ పైలేట్ అనేది ఒక చిత్రం క్రైస్ట్ ఎట్ ది కాలమ్ అనే మరొక చిత్రంకూడా చాలా బాగా ఉంది విజన్ ఆఫ్ సెంట్ బ్రిడ్జెట్ అనేది మరొకటుంది అది Vulazquez అనే స్పెయిన్ దేశపు ఆర్టిస్టు వ్రాశాట్ట ఇంగ్లీషు స్కూల్ ఆఫ్ ఆర్టుకు చెందిన బొమ్మలు లేడీ జార్జియానా ఫేన్ అనేది సర్‌థామస్‌లారెన్సు చిత్రించాట్ట అదొకటి, ఇంకొకటి జార్జి ఫ్రెడరిక్‌వాట్సు చిత్రించింది – "లవ్ అండ్ డెత్ " జన్నీసీ వాపొకడు వ్రాసిన "డెత్ ఆఫ్ క్రైస్ట్" అనేదీ నన్నెంతో ఆకర్షించాయి నాకు టైము చాలదు కాని ఉంటే ఒక్కొక్క బొమ్మదగరా కూర్చుని దాని పుటుపూర్వోత్తరాలన్నీ తెలుసుకుని వ్రాసి ఉందును.

కింగ్స్‌లెవీ అయినరోజునే వైట్‌హాల్ అంతా తెగతిరిగాను. వైట్‌హాల్ అంటే నీకు తెలుసుగా: గవర్నమెంటు బిల్డింగులన్నీ ఉంటాయి వాటన్లాపేస్ సెంట్‌జేమ్స్‌పార్క్, వెస్ట్‌మినిస్టర్ ఆబే, పార్లమెంటుహౌస్, ఇండియా ఆఫీస్ ఫారెన్ ఆఫీస్, హార్స్‌గార్డ్స్, ఏర్‌గార్డ్స్ మొదలైనవన్నీ చూశాను, 'వెస్ట్ మినిస్టర్ ఆబే' లోనికి వెళ్లి అంతా చూచాను ఇందులో ఒక చర్చి ఉంది బ్రిటిషు చక్రవర్తుల పట్టాభిషేకాలు ఇక్కడే జరుగుతాయి ఇక్కడే అనేకమైన గోరీలు ఉన్నాయి, బ్రిటిషు చక్రవర్తులూ, రాజబంధువులూ, ప్రసిద్ధ రాజకీయవేత్తలూ, కవులూ, గొప్ప గొప్ప వ్యక్తులూ వీళ్ళ గోరీలు ఎన్నో ఉన్నాయి వాటన్నిటినీ ఎంతో బాగా జాగ్రత్తపెడతారు మన దేశంలో శ్మశానాల్లో కట్టిన దుంశికోటల్లాగా కాదు ఈ మెమోరియల్స్‌ను చూస్తూ ఉంటే బ్రిటిషు ప్రజలు వాళ్ళదేశంలో గొప్పవాళ్ళని ఎంతగా గౌరవిస్తారో, భక్తిప్రపత్తులతో ఉంటారో, పూజిస్తారో వ్యక్తంఅవుతుంది అందులో అజ్ఞాతవీరునికి ఒక మెమోరియల్ ఉంది వచ్చినవాళ్లందరూ పూలచక్రాలువేసి పోతుంటారు దానిమీద ఆ మెమోరియల్సు అన్నింటినీ చూస్తుంటే నాకు ఒక మోస్తరు పవిత్రభావం నా మనస్సులోకి వచ్చింది అంతంత గొప్ప గొప్ప ఆత్మలు నివసించిన శరీరాలు అక్కడ మంటిలో ఉన్నాయి మన దేశంలో బ్రిటిష్‌వాళ్ళ రాజ్యం స్థాపించుకోడానికి అనేక యుద్ధాలుచేసిన జనరల్స్, గవర్నరులు, కానింగ్, పాక్సు, లారెన్సు, సర్ ఐర్‌కూట్‌వాట్సు మొదలైన వాళ్ళవీ సిపాయిమ్యూటినీ యుద్ధం చేసినవాళ్ళవీ స్టేట్యూస్ ఎన్నో ఉన్నాయి వాటికింద వీళ్లు వాళ్ళ దేశవ్యాప్తికీ, మాతృదేశ గౌరవం నిలబెట్టడానికీ ఎలాంటి పనులు

వేశారో వ్రాశారు ఆ మెమోరియల్సు ఏయే ప్రజలు నిలబెట్టారో అదీవ్రాసి ఉంది ప్రశాంతమైన హృదయంతో ఇవతలికి వచ్చాను.

హైడ్‌పార్కు ఒకటే లండన్ కట్టుకున్న పువ్వులచీర లండనులో చాలా పార్కులు ఉన్నా, దీని ప్రత్యేకత వేరు. దీని అందం, దీని తీరూ వేరు మరి ఊళ్ళో ఏముంది? షాపులూ, వ్యాపారం, బళ్ళూ, రద్దీ తప్పిస్తే ఇది ఒక నందన వనం అనుకో దీనిలో విశాలమైన రోడ్లు ఉన్నాయి ఎక్కడచూచినా విశాల మైన పచ్చికబయళ్ళు, పెద్దపెద్ద వృక్షాలూ, చిన్నచిన్న చెట్లూ, పువ్వుల మొక్కలున్నూ. ఇందులోకి ధనవంతులూ వొస్తారు, పేదవాళ్లూ వస్తారు చక్ర వర్తిగారి మనమరాళ్ళు ఇందులో గుఱ్ఱపు స్వారీచేస్తారు. గుర్రపు స్వారీకి కూడా వేరే పుంతల్లాంటి బాటలు ఉన్నాయి చిన్నచిన్న పిల్లలు పోనీలమీదగాక పెద్ద ఎత్తైన గుర్రాలమీద స్వారీచెయ్యడం చూశా నిక్కడ. హైడ్‌పార్కు ఊరికి మధ్యగా ఉంది ఎందరో జనం వస్తారు ఎన్నో కార్లు లెక్కలేనన్ని వస్తాయి ఆయాలు గడ్డిబయళ్ళమీద పిల్లల్ని ఆడిస్తారు బాటలకి రెండువైపులా రకరకాల పూలమొక్కలు రంగురంగులవి ఒకవైపు సరస్సు కూడా ఉంది. అందులో ఈదులాడతారు ఎల్లప్పుడూ దొరలూ దొరసానులూ, పిల్లలతోనూ నిండి ఉంటుంది పార్కంతా ఆదివారాలూ, సెలవురోజులూ అయితే చెప్పనక్కరలేదు ఊళ్లో జనం అంతా ఇళ్ళు వదలి ఇక్కడికి తరలివచ్చారా అన్నట్టుంటుంది ఆ గడ్డిలో ఆడుకుంటూ, గంతులేస్తూ, తెచ్చుకున్న పదార్థాలు తింటూ, ఎవరి ఇష్టం వచ్చినట్లు వాళ్లు తిరుగుతూ హాయిగా, స్వేచ్ఛగా, ఇతర బాదర బందీలు పెట్టుకోకుండా ఆనందంగా గడుపుతారు.

గడ్డిపరుపులమీద యువతీ యువకులు ఒకళ్ళ కొకళ్ళు ఆనుకుని ఒకళ్ళ మొహాలు ఇంకొకళ్లు చూచుకుంటూ. ఒకళ్ళ చూపులు ఇంకొకళ్ల గుచ్చుకుంటూ, నవ్వుకుంటూ, అంతంలేని కబుర్లు చెప్పుకుంటూ ఖులాసాగా కూర్చుంటారు ఇందులోనే "లవర్స్" కార్నర్ అని ఒక భాగం ఉంది. అక్కడ ఆ పచ్చిగడ్డి మీద కొన్నివందల యువతీ యువకుల జంటలు స్వేచ్ఛగా నిర్భయంగా, బాహాటంగా ఒకరి ఒళ్లో ఒకరు బుర్ర ఉంచుకొని, ఒకరి చేతిలో ఇంకొకరు చెయ్యి ఉంచుకుని, ఒకరి భుజాన్ని ఇంకొకరు ఆనుకొని, ఒకరి కొకరు ఆలింగనంచేసుకొని, చుంబనాలు చేసుకొని ఇతర ప్రపంచంమాటే మరచి పోయి ఉండిపోతారు. ఎక్కడో గాటుగా మాటుగా ఉంటారనుకునేవ్ ၊ బహి

రంగంగా సుమీ! ఎవరైనా చూస్తారేమో అనే భయంగాని, సిగ్గుగాని ఉండేకదూ!

3 వ తేదీ చక్రవర్తి జన్మదినం ఊరంతా మంచి సందడిగా ఉంది కార్ల ట్రాఫిక్‌వల్ల రోడ్లన్నీ నిండిపోయాయి రోడ్డు దాటడం శక్యంగాకుండా పోయింది హార్స్‌గార్డ్స్ చూశాను. అదొక పెద్ద బిల్డింగు, గుర్రాలమీద ఎక్కిన రౌతులు అక్కడి ఆర్చిముందు కాపలా ఉంటారు వాళ్ళ యూనిఫారమ్ చిత్రంగా ఉంటుంది ఇంకొక విషయం–చక్రవర్తి భవనం పేరు బకింగ్‌హామ్ పేలస్ అని నీకు తెలుసుగదా. అక్కడ గేటువద్ద గార్డ్సు ఉంటారు. వాళ్ళ బట్టలూ, వేషం గాడిదబరువంత ఉంటుంది పాపం వాళ్లు ఎలా మోస్తున్నారో, వాళ్లు పహరామారడం ఒక పెద్ద తంతు. గార్డ్సు చేంజి అయేటప్పుడు వాళ్లు మారడం చూడడానికి రోడ్డుమీద వెయ్యిమంది జనం పోగవుతూ ఉంటారు. రోజూ జరిగేదే కదా. అయినా రోజూ ఆ సమయానికి వెయ్యికి పైగా జనం మూగుతారు ఆ తంతుచూడడం ఒక గొప్పవిషయమట. మేమూ చూచాము.

హైడ్‌పార్కే గాక ఇంకా మంచి మంచి పార్కులు నగరంఅంతా ఉన్నాయి లండన్ ఒక పెద్ద మహా సముద్రంలాంటిదిగదా. ఒక పార్కుతో సరా! "రిజెంట్ పార్క్" అని ఒకటుంది సరే ఆకులూ, పువ్వులూ, గడ్డీ మామూలే ఇక్కడ విశేషం ఈ పార్కులో ఎక్కువగా కాలువలుఉన్నాయి. వాటిల్లో అందమైన బాతులూ, హంసలూ, రకరకాల నీటిపక్షులూ ఈదులాడుతూ ఉంటాయి.

రోజూ హైడ్ పార్కుచుట్టూ ఒకరౌండు తిరిగి ఊరుతిరిగి మా మోర్డెన్ వచ్చేటప్పుడు "రిచ్‌మండ్ పార్క్" గుండా తిరిగివస్తాం. అదొక పెద్దపార్కు. ఇదీ చాలా అందంగా ఉంటుంది ఇక్కడి విశేషం ఇందులో వేలకొలది లేళ్లలాంటి లేడీలేగాక నిజంలేళ్ళుకూడా దూకుతూ గంతులేస్తూ ఉంటాయి పప్పులుకూడా చంగుచంగున దూకుతూ, జనంతో పచ్చి ఆడుకుంటాయి ఇదికూడా ప్రేమపిపాసువులకు ఆశ్రయస్థానమే.

లండన్ జూ దర్శించడంకూడా అయిపోయింది. ఇంక దీంట్లో చూచిన జంతువులూ, పక్షులూ, జలచరాలు వీటినిగురించి విపులంగారాస్తే పెద్ద గ్రంథం అవుతుంది. ప్రపంచంఅంతలోనూ ఏ దేశంలో ఎలాంటి జంతువులు ఉంటాయో,

ఆ ప్రపంచం అంతా ఇక్కడికి తీసుకవచ్చి ఆ వాతావరణంలో, వాటి వాటి పరిసరాలు కల్పించి, ఇదొక చిన్నప్రపంచం చేశారు మనం మద్రాసులో "అక్వేరియమ్"చూశాం, బీచ్ని రంగురంగుల చేపలతో ఇక్కడి"అక్వేరియమ్" చాలా పెద్దది ఎన్నిరకాల చేపలనిచెప్పను? గాజుతొట్లల్లో తిరుగుతూఉంటే చూడడానికి చాలా ఆశ్చర్యం కలగచేశాయి పక్షులు సరేసరి ముఖ్యంగా నన్ను ఆకర్షించినవి చిలుకలు మన మామూలు ఆకుపచ్చగాఉండే రామచిలుకలు కావుసుమీ! ఎంతెంత పెద్దవని, ఎన్నెన్ని రంగులవని? పంచవన్నెల రామ చిలుక అని అంటుంటే వినడమేగాని ఇప్పుడు దర్శించడం అయింది తెల్లని నెమళ్లు పురివిప్పి ఆడుతూంటే తెల్లగా ఏకినదూదిపింజలు-గాలిలోఎగురుతున్నట్లు అనిపించింది ఇంక ఖడ్గమృగాలంటే హిపోపొటమస్‌లు-అంటే పెద్దమృగాల జాతులు ఎన్నోఉన్నాయి మొత్తంమీద త్వరత్వరగా నడుస్తూచూస్తే ఒక రోజంతాపట్టింది

అటుమొన్న గురువారంనాడు బ్రిటిష్‌మ్యూజియమ్ చూశాను ఇందు లోకి ప్రవేశించడంతోనే నా కంటబడినవి మన గుంటూరుజిల్లాలోని అమరావతి నుంచి ఇక్కడికితెచ్చిన పాలరాతి అమరావతీశిల్పాలు అవి 1880వ సంవత్స రంలో ఇక్కడికి తెచ్చారని అక్కడ వ్రాసిఉంది ఎంత గొప్ప శిల్పఖండాలు కాకపోతే బ్రిటిషప్రభువులు అక్కడినుంచి వీటిని ఇంతదూరం తెచ్చుకుని ప్రపంచంలోకల్లా గొప్పదని అనిపించుకుంటున్న ఈ బ్రిటిష్ మ్యూజియమ్‌లో పెట్టుకుంటారు? కొంచం గర్వపడ్డాను కాని అమూల్యమైన వీనిని మనదేశం ఎప్పటికైనా తిరిగి రప్పించుకుంటుందా? ఇందులో అనేకమైన శిల్పాలు ఉన్నాయి పూర్వకాలపు వస్తువులూ, పుస్తకాలూ, చిత్రువులూ దేశదేశాలవి అనేక కాలాలవి నాణేలూ, పతకాలూ లెక్కలేనన్ని ఉన్నాయి అన్నిటికంటె చెప్పుకోతగ్గదీ బ్రహ్మాండమైనదీ ఇక్కడి పుస్తక భాండాగారం. ఏ విషయాన్ని గురించైనాసరే రిసెర్చిచేసేవాళ్ళకి పూర్తివివరాలు లభించే లైబ్రరీ ఇంతకంటె గొప్పది ప్రపంచంలో లేదట ఇక్కడి లైబ్రరీలోకి వందలకొలది విద్యార్థులూ రిసెర్చిచేసేవాళ్లూ వచ్చికూర్చుని పుస్తకాలు చదువుకుంటూ ఉంటారు అందరూ లోపలికి వెళ్ళవచ్చుకాని ప్రవేశానికి ముందుగా డైరెక్టరు దగ్గరనుంచి పర్మిషన్ తెచ్చుకోవాలి ఈ రీడింగ్‌రూమ్‌లో ఉన్న మేగజైనులు లెక్కలేనన్ని ఎంత నిశ్శబ్దంగా ఉందనుకున్నావు. లోపల "పిన్‌డ్రాప్ సైలెన్స్." చదువుకునేవాళ్ళకి

"డిస్టర్బెన్స్" కలగకుండా అందులో నడిచేవాళ్ళ మడమలు కింద అన్పకుండా నిశ్శబ్దంగా నడుస్తారు

మ్యూజియమ్‌లోని పురాతనవస్తువులు ఎంతో జాగ్రత్తగా ప్రదర్శించారు. "ఏథెన్సు దేశపు వాజులు" చాలా చక్కగా ఉన్నాయ్. నల్లని పాత్రలమీద ఎర్రని చిత్రాలు, "గ్రీకు, ఇటాలియన్ దేశపు కంచువిగ్రహాలు", "రూమ్ ఆఫ్ టెర్రకొట్టాస్" గ్రీకు-రోమన్ దేశాలకు చెందిన పురాతనవస్తువులూ, ఉబ్బెత్తు బొమ్మలు, అనేక అలంకారాలతో జపానుబొమ్మలూ, ఎంతో బాగాఉన్నాయి 'ఏషియాటిక్ సెలూన్" అని ఒకభాగం. ఇందులో మనదేశంనుంచీ, చైనా జపాను బర్మా దేశాలనుంచీ తెచ్చిన బౌద్ధవిగ్రహాలూ, ఆ మతానికి చెందిన శిల్పాలూ, రకరకాలైనవి జాగ్రత్తపెట్టారు. ఇది చూస్తుంటే నాకు తూర్పున వెలిగిన ఆ తేజాన్ని పశ్చిమానికి తెచ్చుకుని ఇక్కడ వెలిగించుకుంటున్నారా అనిపించింది. దీనినిమించినది "ది రూమ్ ఆఫ్ ఇండియన్ రెలిజియన్". ఇది దర్శించిన ప్రతిమానవుడి హృదయంలోనూ ఒక్క క్షణంసేపైనా ఆధ్యాత్మిక సంబంధమైన ఒక వెలుగురేకఅయినా పొడచూపకపోదు. ఈ బ్రిటిష్ మ్యూజియమ్‌కే ఇంకొక శాఖఉంది అది కెన్సింగ్‌టన్ అనేచోట ఉంది. వాన్ని "నేచురల్ హిస్టరీ సెక్షన్" అంటారు. దీన్నీచూచాం. ఒక్కమాటలో చెప్తాను. సృష్ట్యాదినుంచి ఇప్పటివరకు పిపీలికం లగాయతు బ్రహ్మపర్యంతం ఉన్న యావత్తు ప్రాణికోటీ యుగయుగాలుగా ఏవిధంగా పరిణామంపొందిందో తెలుస్తుంది ఇక్కడి జీవరాసుల్నీ, వాటిశల్యాల్నీచూస్తే. ఇదంతాచూడాలంటే, ఒకరోజుపడుతుంది. వీటిని రకరకాలుగా భద్రపరిచారు. "స్టఫ్" చేసీ, అసలు వాటినే ద్రావకాల్లోఉంచీ, శల్యాలుగానూ ప్రదర్శించారు. మన మద్రాసు మ్యూజియంలో పూర్వకాలపు ఏనుగుశల్యాలు చూశాంగదా వానికి పదీ, ఇరవై రెట్లు పెద్దవైన "మేమల్స్" శల్యాలుచూస్తే భయం, ఆశ్చర్యంకూడా కలిగింది.

నిన్ననే చూచివచ్చాను ఇంగ్లాండులోని సృష్టిసౌందర్యాన్ని ప్రదర్శించే కొన్నిప్రదేశాలు. లండనుకి సరాసరి దక్షిణం ౧౮ మైళ్ళ దూరంలోఉన్న "హర్స్‌ట్‌మాన్‌సేక్సు" అనే ఊరువెళ్లా. ఆ ప్రదేశంఅంతా మైళ్ళకొద్దీ పచ్చికబీళ్లున్నూ, గొఱ్ఱెలున్నూ "కేటర్‌హేమ్ వేలీ" గుండా వెళ్లాము. "రెడ్‌హిల్" అనే ఊరు ఆప్రాంతంలోనే కొండలమీదఉంది. ఈ కొండలమీద

నుంచి క్రిందికి మాస్తూఉంటే ఎంతో చక్కనిదృశ్యాలు. తరువాత "ఏష్‌డౌన్ ఫారెస్టు''లో నుంచి కారుపట్టించారు ఏష్ వృక్షాలు ఆకాశాన్నంటుతూ ఉంటాయి మనదేశం అడవుల్లోవలె సింహాలూ, పెద్దపులులూ ఉండి మనుష్యులు వెళ్ళడానికి వీలుకానిదికాదిది చక్కని రోడ్లు వేశారు వినోదంగా కాలక్షేపం చేయడానికి వీలైన దట్టమైన చెట్లూ, చేమలూ గల ఒక పెద్ద సహజమైన ఉద్యానవనం క్రాయ్‌డన్ ఏరోడ్రోము మా మోర్డెన్‌కు దగ్గరఅయినా రోజూ మా తలమీద విమానాలు ఎగురుతున్నా నిన్నవస్తూ క్రాయ్‌డన్ ఏరోడ్రోమ్ మీదుగా వచ్చాం పల్లెటూళ్ళూ, అందులో ప్రజలూ, పొలాలూ, గొఱ్ఱెలమందలూ, కాపరులూ వీళ్ళందర్నీ చూచాం. "జానపద జీవితాన్ని'' గురించి మళ్ళీ ఉత్తరంలో వ్రాస్తాను చాలా ఆలస్యంఅయింది ఏపిటింతంత ఉత్తరాలని మూలపారేస్తూన్నావా లేక చదువుతున్నావా ? నీ ఉత్తరం అందింది మనవాళ్ళందర్నిగురించి పెద్దఉత్తరా లెందుకు వ్రాయవునువ్వు ?

సీ

మిత్రుడు వేం



Morden Park
Morden, Surrey
17th June 1930

ప్రియమిత్రుడు పెమ్మరాజుకు,

నీ ఉత్తరం అందింది మీ అందరి క్షేమం విని చాలా సంతోషించాను నేనూ ఖులాసాగానే ఉన్నాను రోజూ ఊరంతా తిరగడంతోనే సరిపోతూ ఉంది గడచిన 9వ తేదీ బ్యాంకు హాలీడే అట ఇక్కడ రిజెంటు పార్కులో కొన్ని వందల గుర్రాలని చక్కగా అలంకరించి పార్కంతా తిప్పారు. చెమ్కీ పనిచేసిన ముఖమల్ బట్టలూ, జరీవీ అనేక రంగుల్లో, అనేకమైన డిజైన్సుతో గుర్రాలను అలంకరించారు అన్ని గుర్రాలు అలా ఊరేగుతూ ఉంటే పార్కు చుట్టూ చూడడానికి సరదాగానే ఉంది అయితే మన మహారాజావారి ఖాస్ గుర్రాన్ని ఎరుగుదువు కదూ తెల్లనిదీ, అంత అందమైన గుర్రం ఒక్కటీ కనపడలేదు ఆవేళే కెన్సింగ్టన్‌లోని ప్రిన్స్ ఆల్బర్ట్ అండ్ క్వీన్ విక్టోరియా మ్యూజియమ్‌కి వెళ్ళాను ఇందులో వర్ణచిత్రాలెన్నో ఉన్నాయి అసలు చిత్రలేఖనం ఎలా పుట్టిందో, ఏలా ప్రారంభంఅయిందో, ఏయే కాలాల్లో ఎలా పరిణామం పొందిందో తెలుసుకోడానికి వీలుగా అమర్చారు ఇక్కడి చిత్రాల నన్నింటినీ ఆర్నమెంటల్ ఆర్ట్ పెయింటింగ్స్ అంటారు ఇక్కడ ఉన్న చాలా చిత్రాలని ఇవిగాక శిల్పాలూ, పింగాణీ వస్తువులూ, కుందనప్పని చేసిన లోహపాత్రలూ, కర్రమీద చెక్కడపు పనులూ ఎన్నో ఉన్నాయి కళని గురించిన ఒకపెద్ద లైబ్రరీ కూడా ఉంది ఇందులో లక్షయాభై వేల పుస్తకాలున్నాయట లెక్కలేనన్ని ఫోటోగ్రాపులు కూడా ఉన్నాయి ఆ ఫోటోలు ఒక్కక్కటే పరిశీలించి చూడడానికి జీవితం చాలదేమోననిపించింది

ఇంక లండను మ్యూజియము లన్నింటిలోనూ చాలా ప్రఖ్యాతిగాంచిన టేట్ గేలరీ కూడా చూశాను ఇందులో ''ప్రోడిగల్‌సన్'' అనే మార్బుల్ స్టేట్యూ ఒకటి నాకు చాలా బాగా నచ్చింది ''కేలండర్ మార్షల్'' అనే వాడు దీన్ని తయారు చేశాట్ట ఇంక ''డాన్'' అనేది ఒక స్టేట్యూ ఈవ్ అనేది

ఇంకొకటి ఈ స్టేట్యూలు ఎంత బాగా ఉన్నాయో, ఎంత జీవకళ ఉట్టిపడేట్టు ఉన్నాయో చెప్పలేను టర్నర్స్ కలెక్షన్'' అని ఒక భాగం ఉంది ఇందులోని చిత్రాలేమిటి, ప్రతిమలేమిటి అన్నీ బ్రిటిష్ సంప్రదాయానికి చెందినవట. ఈ గేలరీ సర్ హెన్రీ టేట్ అనే వాడు లక్ష రూపాయల విలువైన బొమ్మలతో స్థాపించాడట తరువాత బ్రహ్మాండంగా పెరిగిపోయింది అతని పేరుమీదనే టేట్ గేలరీ అనే పేరు వచ్చింది కళ అంటే ఏమిటో తెలియని నా బోటివాడికే మతిపోతూ ఉంటే, ఏ మాత్రం ప్రవేశం ఉన్నవాడైనా ఇలాంటివి చూశాడంటే ఇక్కడినించి కదలనంటాడు

''టవర్ ఆఫ్ లండన్''చూశాను అక్కడికి చూడడానికి వెడుతున్నామన డంతోనే మనసులో ఒక విధమైన దుడుకు కలిగింది మనం హిస్టరీలో చదువు కున్నాం కదా ఆ కోటలో ఎందరినో చంపేశారని. అయిదవ ఎడ్వర్డునీ అతని సోదరుణ్ణి చంపిన గది చూచాను కొన్ని ప్రదేశాలు చూస్తే హృదయంలో జాలి పుడుతుంది ఎందరో రాజులూ, ఎందరెందరో నోబుల్సూ చంపబడ్డ ఆ మృత్యు గహ్వరంలో అమూల్యమైన వస్తువులు ప్రదర్శన నిమిత్తం ఉంచారు బ్రిటిష్ చక్రవర్తులూ, రాణులూ ధరించే విలువైన ఆభరణాలన్నీ అక్కడ ప్రదర్శిం చారు. ఢిల్లీ పట్టాభిషేకానికి చక్రవర్తి ధరించిన కిరీటం చూచాను పెద్ద పెద్ద రత్నాలూ, వజ్రాలూ, కిరీటాలూ, ఆభరణాలూ, అన్నీ షోకేసుల్లో ఉంచారు ప్రపంచంలో పెద్ద వజ్రం కోహినూరు యొక్క నమూనాను కూడా చూచాను రోజూ వేలకొలది జనం వచ్చి చూచిపోతూ ఉంటారు ఇందులో ఆయుధాగారం ఉంది ఏ కాలంలో ఎలాంటి కవచాలు ధరించేవారో, ఎలాంటి కత్తులూ డాళ్ళూ ఉపయోగించే వారో, అన్ని శతాబ్దాలకీ సంబంధించిన యుద్ధ సామగ్రి అంతా ప్రదర్శించారు ముఖ్యంగా చూడదగినవి పూర్వ కాలపు ఆయుధాలూ, కవచా లున్నూ ఇక్కడ కాపలా మనుష్యులు ఒక తమాషా అయిన దుస్తులు ధరించి ఉన్నారు వాళ్ళని చూస్తే పూర్వకాలపు బొమ్మల్లో ఉండే డ్రెస్సు జ్ఞాపకం వచ్చింది ఏమైనా, ఆ పాడు గోడలూ. పాత ఇటుకలూ, చీకటి గదులూ ఇవన్నీ చూస్తే దిగులు వేసింది

ఆవేళ ఒక తమాషా జరిగింది అందరం కలిసే చూస్తున్నాం అన్నింటినీ జనం రద్దీవల్లా, ఒక్కొక్క చోట ఎక్కువ సేపు ఆగి చూడడం వల్లా ఎలా గైతేనేం నేను మా మహారాజావారి పార్టీనుంచి తప్పిపోయాను వారు నా కోసం

చూచి చూచి రాలేకపోతాడా అనుకుని కార్లో ఇంటికి వెళ్ళిపోయారు నేనూ వెదికాను వారు కనిపించకపోతే చివరికి గేటువద్దకి వెళ్ళి వాకబు చేస్తే వాట వెళ్ళిపోయారని తెలిసింది ఇంక నేను ఇంటికి–మోర్డెన్–వెళ్ళడం ఎలాగాఅని ఆలోచించాను సరే జేబు తడుముకున్నా డబ్బులు అంటే ఇంగ్లీషు మనీ చాలా గానే ఉంది బయటికి వచ్చి ఏవో దారిబట్టాను కొంత దూరం నడిచి వచ్చే సరికి ఒక పోలీస్ కాన్‌స్టేబుల్ ఎదురయ్యాడు అతన్ని అడిగాను నేను మోర్డెన్ వెళ్లాలి అని వాడు మన పోలీసువాళ్ళలాగా కాదులే, పోలీసులు ఎంతోమర్యాదగా మాట్లాడడమే గాకుండా చాలా సహాయకారులుగా ఉంటారు – తన కూడారమ్మని వెనక్కి తిరిగి సందు చివరిదాకా వచ్చి దారి చూపించి 'ఒక వంపగజాల దూరం వెళ్ళావంటే ఒక అండర్ గ్రౌండ్ స్టేషన్ కనపడుతుంది అక్కడి నుంచి వెళ్ళిపో' అని చూపించి మళ్ళీ వాడి దారిని వాడు వెళ్ళిపోయాడు నేనూ ఆ ప్రదేశం చేరుకున్నాను ''అండర్ గ్రౌండ్ ట్రెయిన్ అంటే వినడమే గాని నాకు ఏమీ తెలియదు నెమ్మదిగా అక్కడి బోర్డులూ ''బాణం మార్కులూ'' అన్నీ చదివి కొన్నిమెట్లు దిగి క్రిందికి వచ్చి చూచానుగదా ఆశ్చర్యం భూమిలో ఒక పెద్ద రైల్వే స్టేషను ఎలెక్ట్రిక్ దీపాలు పట్టపగలు చేయడం కాదు–కలకల లాడుతూ ఎంత అందంగా ఉందో చెప్పలేను జనం హడావుడి వచ్చేవాళ్ళూ పోయేవాళ్ళును రెండు మూడు ప్లాటుఫారాలు కిటకిటలాడుతూ దొరలూ దొర సానులతో ఎంతో వేడుకగాఉంది టిక్కెట్టుకొన్నాను మోర్డెన్‌కి మళ్ళీ దారిలో ఇంకో స్టేషనులో మారాలన్నారు ఆ టిక్కెట్టు మీద నేను వెళ్ళే రైలూ, అది ఏ నెంబరు ప్లాటుఫారమ్ మీదికి వస్తుందో, మళ్ళీ మధ్య స్టేషనులో ఎక్కడ మారాలో, ఏ ప్లాటుఫారమ్ మీద ఇంకోరైలు ఎక్కాలో అన్నీ ఉన్నాయి తక్షణం నేను రైలు ఎక్కలేదు స్టేషను అంతా తిరిగి చిత్రం అంతా చూస్తూ కొంతసేపు ఉండి తరువాత ఎక్కాను ప్రతి అయిదు నిమిషాలకీ ఒక రైలు వస్తుంటే జయ్యిమని! నేను రైలు మారిన స్టేషను మరీ పెద్దది మరీ శృంగారంగా ఉంది చాలా ప్లాటుఫారాలు ఉన్నాయి మహదానందంతో ఇంటికి తిరిగి వచ్చాను

ఈ అండర్ గ్రౌండ్ రైల్వేలనే ట్యూబ్ రైల్వేలు అంటారు. భూమిలో చాలా లడుగున రైళ్లు పోడానికి వీలుగా ఉన్నంత గుహల్లాంటి సొరంగాలు

గుండ్రంగా తవ్వి, దళసరి రేకులు తాపడంచేసి దానిగుండానే బద్దీలు అమర్చి రైళ్ళు నడుపుతారు వాటిలోకి నీరు ఊరదు సరే సరికదా కావలసినంత గాలి రావడానికి ఏర్పాట్లు చేశారు రైలు కమ్మీలకే కరెంటు ఉంటుందట రైళ్లు మామూలు భూమిమీద వాటికంటె చాలా వేగంగా పోతాయి ట్యూబులో దీపాలు ఉండవు కానీ రైలుపెట్టెలలో మాత్రం దీపాలుఉంటాయి ఇంకో విశేషం-రైలు కదులుతూ ఉందంటే పెట్టెల తలుపులు వాటంతట అవే మూసుకుంటాయి రైలు ఆగితే వాటంతట అవే తెరుచుకుంటాయి. ఇది నాకు చాలా ఆశ్చర్య కరమైన అనుభవం ఊరంతా భూమిలో వలలాగ ఈట్యూబులతో అల్లుకు పోయిందట ఇంక తెలిసిపోయింది గనక ఊరంతా తిరుగుతా పెద్ద పెద్ద స్టేషనులు ఉన్నాయట అవన్నీ చూస్తా. కొందరికి ఏకాంతంగా, ప్రశాంతంగా ఉండాలని ఉంటుంది. మరి నాకు అలా ఉండాలనిపించడం లేదుసుమా ! జనంలో ఉండాలి జనంలోనే జీవం ఉంది బజార్లన్నీ తిరుగుతా రకరకాలైన మనుష్యులు కనబడతారు కదా !

11 వ తేదీని ''విండ్సర్'' వెళ్ళాను. అది లండనుకు పడమరగా ఇరవై మైళ్ళదూరంలో ఉంది ''విండ్సర్''లో ఒక పెద్దకోట ఉంది. దానిలో చాలా అందమైన ''కెథీడ్రల్'' ఒకటి ఉంది దానిపేరు ''సెంట్‌జార్జి కెథీడ్రల్'' అంటారు. ఇక్కడ కూడా ఒక ఆర్మరీ ఉంది. ఆయుధాలూ అవేగాక గుర్రపు సామగ్రికూడాఉంది అంటే స్వారీచేసే గుర్రాలకీ, యుద్ధంలో పనిచేసే గుర్రాలకీ ఎలాంటి జీనూ ఎలాంటి కవచం ఏయే కాలాల్లో ఎలాంటివి వేసేవారో అవన్నీ పూర్వకాలంనుంచీ ఉన్నవన్నీ ఆ మ్యూజియమ్ లాంటిదానిలో ఉంచారు. చక్రవర్తుల గోరీలు ఒక భాగంలో ఉన్నాయి చక్రవర్తి ప్రతి సంవత్సరం కొన్నిరోజులు ఇక్కడ ఉంటూ ఉంటాడట. ముఖ్యంగా మేం ఇక్కడికి వచ్చింది ఇంకొకందుకు ఇక్కడ ''విండ్సర్‌పార్క్''లో ఒక బ్రహ్మాండమైన ''డాగ్‌షో'' జరిగింది దానిని చూడడానికి వచ్చాం ఈ షోలో ఏదో ఒకే జాతి కుక్కలు కాక ప్రపంచంలో ఎన్నిజాతుల కుక్కలు ఉన్నాయో, అన్నిటినీ ప్రదర్శించారు. ఎన్నిరకాలని చెప్పను. ఎన్ననిచెప్పను? జేబులో పెట్టుకునేటంత చిన్న చిన్నవి పెద్దగాడిద లంతంతపెద్దవీ కుక్కలు వేలకొలదీ వచ్చాయిక్కడికి. అవి

గుర్రుపెట్టడం, భౌ భౌ మని అరవడం చెవులుగళ్లె త్తిపోయాయి ఒక జాతికుక్క "పూడిల్" అట, దానికి ఒక గొర్రెలాగ పెద్ద పొడవైన గుబురైన బొచ్చు. ఆ బొచ్చు నడుందగ్గరనుంచి కిందకి కత్తిరిస్తారు మెడచుట్టూనూ, వీపుమీదా అదొక తమాషాగా కత్తిరిస్తారు వీటి బొచ్చు కత్తిరించి దానికి క్రాప్‌చెయ్యడానికి ఒక్కొక్కదానికి దాదాపు 150 రూపాయలు కూడా పుచ్చుకుంటారట షోకి వచ్చిన కుక్కల్లో ఆల్సేషియన్ జాతికుక్కలే చాలా ఎక్కువగానూ వచ్చాయి, పెద్దపెద్దవీ వచ్చాయి పిఠాపురం మా కోటలో "స్మూత్‌ఫాక్సు టెరియర్స్" కాక పెద్ద చెవులు వ్రేళ్ళాడేసుకుంటూ మెరిసిపోయే బొచ్చుతో నల్లటి కుక్కలు ఉన్నాయి చూశావా వాటిని "కాకర్ స్పేనియల్" అంటారూ, అవిమాత్రం చాలా అందమైనవి బ్లాక్ వెగాక గోల్డెన్ కలర్‌తోనూ, చుక్కలుచుక్కలతోనూ ఎన్నో వచ్చాయి, ఎంతో అందమైనవి వచ్చాయి వీటిని షో చెయ్యడానికి ఆ కుక్కల యజమానులు—సాధారణంగా దొరసానులే—వచ్చి స్వయంగా కుక్కలని పట్టుకు నిలబడితే కుక్కలనే చూడనా ? దొరసానులే చూడనా ?

మొత్తం మీద వీళ్ళని చూస్తూంటే మానవ ప్రవృత్తిమీదకంటే జంతు ప్రవృత్తిమీదే ఎక్కువ మక్కువ ఉన్నట్టు కనిపిస్తుంది వీళ్ళకి ఎంత నాగరికులం అని అనిపించుకుంటున్నా వీళ్ళ తయారీలో ఎలుగుగొడ్డు బొచ్చుతోనో, పెద్దపులి చారల చర్మంతోనో సింహం జూలుతోనో చేసిన చొక్కాలో జాకెట్లో తొడుగుకోవడం అంటే సరదా పిల్లులవీ, నక్కలవీ చర్మాలు సిల్కులాగ టేన్ చేయించి మెడచుట్టూ చుట్టబెట్టుకుంటారు ఇంక టోపీలకు పువ్వులు గుచ్చుకుంటే బాగానే ఉందికాని ఎక్కువమంది ఆడవాళ్లు పక్షి ఈకలూ, అవీ తగిలించుకుంటారు మొసలిచర్మాలూ, పాముచర్మాలూ వీటితోచేసిన చేతిసంచులు చేతుల్లో హమేషాగా ఉంటాయి. ఇంక "ఫాక్సు" అనీ, "ఉల్ఫ్" అనీ, "జాకాల్" అనీ మగవాళ్ళకి ఉండనే ఉన్నాయికదా పేర్లు

ఇప్పుడు ఈ కాలానికి "స్ప్రింగ్" అంటున్నారు మన వసంతకాలం అన్నమాట అందుచేత ప్రకృతి ఎంత శోభాయమానంగా ఉంటుందో ఆలోచించుకో ఎండ నెత్తిమీదికి రావడం అనేది ఉండనే ఉండదు సూర్యుడు ఒక

ప్రక్కని ఉదయించి ప్రక్కగానే అస్తమిస్తాడు అందుచేత ఎండకాస్తున్నా సూర్యకిరణాలు ఏటవాలుగా పడతాయి వేడి అనిపించదు ఉదయం 4-30 కే తెల్లారుతుంది రాత్రి తొమ్మిది గంటలకి చీకటిపడుతుంది రాత్రికాలం చాలా తక్కువ ఉదయం నాలుగున్నరకే వెలుగు వచ్చినా ఎనిమిది గంటలదాకా ఎవరూ పక్కలమీదనుంచి లేవరు రాత్రి మా డిన్నర్ అయేసరికి ఇంకా వెలుతురు ఉంటుంది మనం చీకటిపడితేనేగాని రాత్రి భోజనం చెయ్యలేం అయితే వీళ్ళు రాత్రి పరుండబోయేముందు సప్పర్ అని ఏదో కొరుకుతారుకదా। ఒకనిముషం ఎండ, అప్పుడే వానచినుకులు, లేకపోతే 'మబ్బు, పొగమంచున్నూ ఇట్టే పొగమంచు కమ్మేస్తుంది ఇట్టే క్లియర్ అయిపోతుంది పొగ కమ్మి నప్పుడు ఏమీ కనపడదు ప్రమాదాలు జరుగుతూంట్బాయి కార్లూ, కార్లూ ఢీకొట్టుంటూంటాయి మనుష్యులుకూడా

ఏ నిమిషాన్ని వానపడుతుందో, ఏ నిమిషాన్ని ఎండకాస్తుందో తెలియదు గనక రెయిన్‌కోటో, గొడుగో లేకుండా ఎవరూ బయటికి వెళ్ళరు

చాలా రాత్రయింది ఇంక ఉంటాను మళ్ళీవారం వ్రాస్తాను

నీ
వేంకటరావు



Morden Park
Morden, Surrey
24th June 1930

మిత్రుడు వెంకటరావ్,

మీ రంతా క్షేమం అని తలుస్తాను. మేము ఇక్కడ కులాసాగానే ఉన్నాము లండన్ పట్టణానికి పాతకాపులం అయిపోయామా అన్నట్టుగా ఊరంతా తెలిసిపోయింది ఏదీ విడిచిపెట్టకుండా చూస్తున్నాం. పార్లమెంటు బిల్డింగ్సు పైనుంచి చాలాసార్లు చూచినా, లోపలికి వెళ్ళిచూచే అవకాశం ఇప్పుడు కలిగింది ''మార్డీజోన్స్'' అనే ఒక పార్లమెంటు మెంబరుతో మా మహారాజా వారికి పరిచయం కలిగింది ఆయన తరుచూ మా బంగళాకు వస్తూపోతూ ఉన్నారు మొన్నను ఒకరోజు ఆయనకి ఏదో కబురు చెప్పవలసిన అవసరం వచ్చి నన్ను పంపారు మహారాజావారు ఇప్పుడు పార్లమెంటు సభలు జరగడం లేదు ఉంటే తప్పకుండా జోన్సు ద్వారా హాజరయ్యేవాణ్ణే ఆయనే బిల్డింగంతా చూపించారు పాపం ''హౌస్ ఆఫ్ కామన్స్‌నూ, హౌస్ ఆఫ్ లార్డ్స్‌నూ'' చూచా అంటే మనుషుల్లేని ఖాళీ హాలున్నూ, కుర్చీలూ బెంచీలున్నూ. హాలులో మెంబర్లు కూర్చునే కుర్చీల కుషన్సు ఆకుపచ్చరంగుతో ఉన్నాయి లార్డ్సుహాలు లోనివి ఎర్రరంగువి చక్రవర్తి సభ ప్రారంభించడానికి వచ్చినప్పుడు కూర్చునే స్థానం, స్పీకరూ ప్రెసిడెంటూ, ఇతర మంత్రులూ కూర్చునే స్థానాలూ అన్నీ చూచాను 'ఏమండీ ఈ సీట్లు చాలా పాతబడి మాసిపోయినట్లూ, సావకాశంగా కూర్చోడానికి వీలు లేనట్లూ ఉన్నాయే ! కొత్తవి తయారుచేయించరా'' అని అడిగాను చిన్నచిన్న రిపేర్లు చేయించవచ్చుగాని మేము పూర్వ సంప్రదాయాలను పాటించేవాళ్ళమని తెలియదా అని అన్నాడాయన మనదేశంలో కొత్తగా మతం పుచ్చుకున్నవాళ్ళూ, మత ప్రచారకులూ మనల్ని గుడ్డినమ్మకం కల వాళ్ళం అనీ, మూఢాచారపరులమనీ వెక్కిరిస్తుంటారు వాళ్ళ కేం తెలుసు ఇక్కడి వాళ్ళకున్నంత పట్టుదల, సంప్రదాయసిద్ధంగా వస్తున్న ఆచారాల మీద ; వీళ్లూ మనకి దగ్గరవాళ్ళే అనుకున్నా మెంబర్ల ప్రయివేటు గదులూ, లాబీలూ అన్నీ చూచాను వ్రాయదగిన విశేషం ఏమిటంటే ఒక ప్రవేశద్వారం దగ్గర గోడమీద ఒక పెద్ద చిత్రం ఒకటి ఉంది. అది మనదేశంలో బ్రిటిష్

సామ్రాజ్యాన్ని శంకుస్థాపన చేసిన సర్ థామస్ రో అనే వానికి మొగలాయీ దర్బారులో వ్యాపారం చేసుకోడానికి అనుమతి పత్రం ఇస్తున్నట్టు చిత్రించిన తైలవర్ణ చిత్రం బొమ్మా అదీ బాగానే ఉన్నాయి కాని నా మనసులో ప్రస్తుతం మనదేశంలో స్వరాజ్యం కోసం జరుగుతున్న పోరాటం జ్ఞాపకం వచ్చింది.

మెంబర్లు కూర్చునేదానికంటె ''విజిటర్స్'' గేలరీలూ; ప్రెస్ కరెస్పాండెంట్లు కూర్చునే గేలరీలూ అవే బాగా ఉన్నాయా అనిపించింది కామన్సు సభలో ఆరు వందలకి పైగా మెంబర్లు ఉన్నారట లార్డ్సు సభలో దాదాపు ఎనిమిదివందల మందిదాకా ఉంటారట వీటితో కలిసే ''వెస్ట్ మినిస్టర్ హాల్'' అని ఒక పెద్ద హాలు ఉంది ఇక్కడ పూర్వం చక్రవర్తులు విందులు చేసేవారట దీన్నే కోర్టుగాకూడా ఉపయోగించేవారట వారన్ హేస్టింగ్సు విచారణ ఇక్కడే జరిగిందట

ఈ పార్లమెంటు భవనానికే ఒకచోట ఒక పెద్ద గుమ్మిలాంటి టవర్ ఉంది దానికే నాలుగువైపులూ కన్పడేలాంటి డయల్స్‌తో ఒక పెద్దగడియారం. దీన్నే "బిగ్‌బెన్" అంటారు దీనిగంటలు చాలాదూరం వినిపిస్తూఉంటాయి ఈ భవనాలు థేమ్సునది ప్రక్కనే ఉన్నాయన్నానుకదా అక్కడనే ఒక బ్రిడ్జి ఉంది దీన్ని వెస్ట్‌మినిస్టర్ బ్రిడ్జి అంటారు ఈ బ్రిడ్జి దాటి అవతలకి వెళ్ళగానే "లండన్ కౌంటీ కౌన్సిల్" బిల్డింగుఉంది మ్యునిసిపల్ కార్పొరేషన్ పనులన్నీ ఈ బిల్డింగులో జరుగుతాయి

అక్కడినుంచి ''వెస్ట్‌మినిస్టర్ కెదిడ్రల్''కి వెళ్ళాను ఈ చర్చీకూడా చూడతగ్గది రోమన్‌కేథలిక్కుల చర్చిలలోపల అలంకారాలూ, స్టేట్యూలూ కొవ్వొవత్తుల స్టాండులూ రకరకాలైనవి ఉంటాయి గోడలకి అమర్చిన గాజు తలుపులు. కిటికీఅద్దాలూ మొదలైనవాటిమీద అనేకరంగులతో నగిషీలబొమ్మలూ ఉంటాయి లోపలికి వెళ్ళినవాళ్ళంతా నిశ్శబ్దంగా లోపలతిరిగిచూచి కొంచం సేపు ఒకసీటులో కూర్చుని మౌనంగా ప్రార్థనచేసుకుని వెళ్ళిపోతారు నేనూ అలానే కొంచం సేపు కూర్చుని ఇవతలికివచ్చాను దీని డోమ్ చాలా ఎత్తుగా ఉండడమే కాకుండా చాలా అందంగా ఉంటుంది చుట్టూ చాలాదూరంవరకూ కనపడుతుంది కేథిడ్రల్ చుట్టూ విశాలంగా ఉంటుంది వచ్చినవాళ్ళంతా ఒక ప్రదక్షిణంకూడ చేస్తారు

ఈ వారం అంతా "షాపింగ్" పని ఎక్కువయింది సిటీకి మధ్యలో బర్లింగ్‌టన్ అనేది ఒకభాగం ఈ బర్లింగ్‌టన్‌లోనే రాయల్ అకాడమీ ఉంది అది చూడడానికి ఇంకా టైమురాలేదు ఇక్కడే ఒక చిన్న షాపింగ్ సెంటర్ ఉంది దాన్ని బర్లింగ్‌టన్ ఆర్కేడ్ అంటారు ఇక్కడికి సామాన్యులెవరూ రారు. మహరాజులూ, మిలియనేర్లూ మొదలైనవాళ్ళు వస్తూంటారు మనకి మద్రాసులో స్పెన్సర్ లేదూ హైక్లాస్‌వాళ్ళకి. అలాగే ఇదిన్నీ కొంచం హెచ్చు తగ్గుగా రోజూ ఈ బర్లింగ్‌టన్ ఆర్కేడ్‌కి వచ్చి ఏదో కొనవలసివస్తూంది

షాపింగ్ చెయడంకూడా ఒక గొప్ప అనుభవం షాపుల్లో సాధారణంగా అమ్మేవాళ్ళందరూ అందమైన ఆడపిల్లలు చక్కగా మర్యాదగా మాట్లాడతారు మనం షాపులోకి వెళ్ళేసరికి మనకోసమే ఎదురుచూస్తున్నట్టు మనమీద చూపులు నిగిడ్చి చిరునవ్వులు విసురుతూ, నమస్కరించినట్టుగా తల కొంచం వొంచి "హౌ కెన్ ఐ హెల్ప్ యూ" అని అడుగుతారు మనకి కావలసిన వస్తువేదో చెప్పిన తక్షణం ఆ సామాను కౌంటర్‌మీద ఉంటుంది చక్కగా పేక్‌చేసి ఇస్తారు

లోపలివస్తువుకంటె పేకింగుమీదే మనకి వ్యామోహం కలుగుతుందా అన్నట్టుచేస్తారు షోరూముల్లో, వస్తువులని ప్రదర్శించడం ఒక పెద్ద కళ ఇంకా చాలా పెద్దపెద్దషాపుల్లోఅయితే పెద్దపెద్ద వింగులు వింగులన్నీ ఒక్కొక్క డిపార్టుమెంటుకి ప్రత్యేకించి బోర్డులుపెడతారు అందులో ఏ వస్తువు ఏ డిపార్టు మెంటులో దొరుకుతుందో తీసుకెళ్ళి చూపించడానికికూడా అమ్మాయిలు వెంట వస్తారు. ఇంక ఇక్కడ మనదేశంలోలాగ బేరాలు ఉండవనిన్నీ అంతా "ఫిక్సెడ్ రేట్" అనిన్నీ అనుకోడం పొరపాటు బేరంలేని వ్యాపారంఉందా ఎక్కడైనా ? అయితే అది ఇంకోపేరుతో ఉంటుంది దాన్నే ఇక్కడ "డిస్కవుంట్" అంటారు ఇక్కడ ''డిస్కవుంట్'' లేని వ్యాపారమేలేదు. కొన్నవాడికి లేకపోతే, వాడి కూడా వచ్చినవాడికో, బేరం తెచ్చినవాడికో సెక్రటరీకో, పి ఏ కో, నౌకరుకో ఎవరికో తప్పకుండా ''డిస్కవుంట్'' దొరుకుతుంది అది ముందుగా మాట్లాడుకోడంలో వుడా ఉంటుంది అసలు షాపు దగ్గరగాని హోటేలుదగ్గరగాని కారు ఆగడంతోనే గేటుదగ్గర వాడు మంచి ''యూనిఫారమ్'' లో గబగబావచ్చి సలాంకొట్టి కారు తలుపుతీస్తాడు. మనల్ని దింపించి లోపలికి ప్రవేశపెడతాడు. కారు అక్కడ నిలవకూడదుగనుక ''పార్కింగ్'' కి ఏర్పాటుచేసిన స్థలంలోకి వెళ్ళిపోతుంది మనం తిరిగి

వచ్చేస్తుంటే మన కారునంబరు వాడికిగుర్తే గనుక కారుకూడా రప్పించేసి తలుపులుతెరచి ఉంచుతాడు లోపలికి ఎక్కించడానికి సహాయంచేసి తలుపు మూసి సలాంకొడతాడు. ఎందుకయ్యాఅంటే "టిప్" కోసం "టిప్" అంటే సంభావన ఇంగ్లండులో ఎక్కడికివెళ్ళినా ఈ "టిప్"లు ఇవ్వడం ఒక గొప్ప ఆచారం హోటేళ్ళల్లో పనిచేసేవాళ్ళకీ, షాపుల్లోనూ, పతీచోటా టిప్పులు వాళ్ళ వాళ్ళ తరహానుబట్టి, ఇచ్చేవారి హోదానుబట్టి, వాళ్ళు ఎక్కివచ్చిన కారు ఖరీదునుబట్టి ఎక్కువగానూ తక్కువగానూ అందరికీ ముట్టుతూంటాయి ఈ దేశాలకి వచ్చేవాళ్ళు ముందుగా బడ్జెట్టువేసుకుంటే టిప్పులకుకూడా కొంత సొమ్ము కేటాయించాలి ఇక్కడివాళ్ళకి ఆదరణ చాలా ఎక్కువ వాళ్ళ ఆదరణకి ప్రతిఫలంగా ఇచ్చేదే ఈ టిప్

లండన్ నగరం మధ్యలో ఉన్న ''పిక్కడిల్లీ'' అంతా షాపులమయం అందులోనూ ధనవంతులకి, విలాసవతులకి తగిన సరుకులన్నీ పిక్కడిల్లీ ప్రాంతాన్ని ఉన్నషాపుల్లో దొరుకుతాయి ఈ ప్రాంతం చాలా రద్దీగాఉంటుంది మంచిమంచి కార్లు తిరుగుతూఉంటాయి హైక్లాస్ ఫేషనబుల్ లేడీస్‌ను చూడాలంటే పిక్కడిల్లీ సర్కస్‌లో ఒక్క పదినిమిషాలు నిల్చుంటేచాలు ఇలాంటి షాపులుకాక సామాన్యప్రజలకోసం చౌకవస్తువులకు ''ఊల్‌వర్త్స్'' అని కొన్నిషాపులు ఉన్నాయి ఈ షాపులు చాలా దగ్గరదగ్గరగా ఊరంతాఉన్నాయి రెండేసి ఫర్లాంగులదూరంలో ఒక్కొక్క ''ఊల్‌వర్త్‌షాప్'' ఉందా అన్నట్టు ఉన్నాయి ఇక్కడ దొరికే ఏ వస్తువన్నా ఆరుపెన్నీలు అంటే దాదాపు ఆరుఅణాలన్నమాట. మామూలు సంసారానికి పనికివచ్చే సామానులన్నీ దొరుకుతా యిక్కడ అలానే "లయన్స్ రెస్టోరాంట్స్" అని సామాన్యప్రజలకి అందుబాటులో ఉన్న కాఫీహొటేళ్ళలాంటివికూడా ఊరంతా ఎన్నోఉన్నాయి. దీనిలోకి వెళ్ళాను ఒకసారి మరి ఖరీదైన పెద్దపెద్దహొటేళ్ళు హైక్లాసు రెస్టారెంట్లులాగ పరిశుభ్రంగానూ, దర్జాగానూ ఉండకపోయినా చౌకలో పదార్థాలు రుచిగానే ఉన్నాయి

సాధారణజనం అంటే జ్ఞాపకంవచ్చింది. మొన్నఒకరోజు మా మోటారు డ్రైవరు ఇంటికివెళ్ళాను అతనికి వారానికి రెండున్నర పౌనులజీతం. అంటే మనదేశంలో మధ్యతరగతివాళ్ళకంటె తక్కువవాళ్ళు అన్నమాట. మా మోర్డెన్

సుబర్బ్‌కి చివరగా ఉంది ఒక చిన్న కుటీరంలాంటి ఇల్లు ప్రత్యేకంగానే ఉంది ఇల్లు స్వంతమేనట టేబిల్సూ, సోఫాలూ, మంచాలూ ఉన్నాయికాని ఏవీ శుభ్రంగాలేవు నలుగురైదుగురు పిల్లలున్నారు మేం వెళ్ళేసరికి భార్య ఏదో కుట్టుకుంటూ ఉంది పిల్లలు ఏమీ శుభ్రంగాలేరు వాళ్ళ బట్టలుకూడా ఏనాడూ చాకిరేవుకి వెళ్ళినట్టులేవు రోజూ ఏమితింటారని అడిగాను చెప్పాడు ఎందుకు వ్రాస్తున్నానంటే మనడబ్బులో నెలకి నూటయాభై రూపాయలు తెచ్చుకునేవాడు కూడా దారిద్ర్యం అనుభవిస్తున్నాడని చెప్పడానికి పిల్లలవల్ల ఇప్పుడు ఏమీ పని చెయ్యడంలేదుకాని ఆమెకూడా ఏదోపనిచేసి సంపాదించి, ఇటుండానికి సహాయకారిగా ఉండేదట

ఇక్కడకూడా ప్రజలంతా సుఖంగా ఉన్నారంటే నమ్మలేకపోతున్నాను ఇక్కడా బీదరికం, దారిద్ర్యం, చాలీచాలకపోవడం ఉంది అన్నిటినీమించి, పరిశుభ్రత తక్కువ సామాన్యప్రజలలో పెద్దపెద్ద హోటేళ్లూ ధనవంతుల భవనాలూ తప్పిస్తే వీళ్ల ఇళ్లూ, వాళ్లూకూడా కంపే.

ఇప్పటికి సెలవు మళ్ళీవారం వ్రాస్తాను నువ్వుకూడా తప్పకుండా అక్కడి విశేషాలన్నీ వ్రాస్తూఉండు

నీ
మిత్రుడు
వెంకటరావు



Kensington Palace mansions
Kensington
London
3rd July 1930

డియర్ వెంకటరావు,

నీ ఉత్తరం అందింది. చాలా సంతోషించాను మేము మొన్న 1 వ తేదీని మోర్డెన్ విడిచిపెట్టి లండన్ సిటీలో ఒక భాగం కెన్సింగ్టన్ వచ్చాము ఇక్కడ కెన్సింగ్టన్ పేలస్ మేన్షన్సు అనే ఒక హోటేల్లో ఉంటున్నాము ఇది సెవాయ్ అంత గొప్పదికాదు. సామాన్యం అయిన హోటేల్ మనదేశం నుంచి వచ్చే వ్యాపారస్థులూ మొదలైనవాళ్లు ఇక్కడ బసచేస్తుంటారు ఈ హోటేల్లోనే పెద్ద లాంగ్ కోటూ తెల్లటి పెద్ద తలపాగా చుట్టుకున్న ఒక విగ్రహాన్ని చూచి ఎవరా అని వెంటబడ్డాను. "రైట్ ఆనరబుల్ శ్రీనివాసశాస్త్రి" నమస్కారం చేసి నన్ను నేను పరిచయం చేసుకున్నాను నా "ఆటోగ్రాఫ్" పుస్తకం మీద సంతకం చేసి ఇచ్చారు. "It is a great pleasure to meet one's own man in a distant place" అని వ్రాసి సంతకం పెట్టారు ఆయన కూడా ఇక్కడే బసచేస్తున్నారు. ఈ మా హోటేల్‌కి ఎదురుగా "కెన్సింగ్టన్ గార్డెన్సు" ఉన్నాయి ఈ పార్కు కూడా హైడ్‌పార్కుతో కలిసే ఉంది దానిలో ఒక భాగమే కెన్సింగ్టన్‌తో కలిసి ఉందిగనక "కెన్సింగ్టన్ గార్డెన్సు అన్నారు అంటే మేము హైడ్‌పార్కులోనే కాపురం చేస్తున్నా మన్నమాట

ఈ వారమంతా షాపింగ్‌తోనే సరిపోయింది బ్రహ్మాండమైన బట్టల షాపులు "ఏండర్‌సన్ అండ్ షెపరు"అనీ, "డేవీస్"అనీ ఉన్నాయి చక్రవర్తి

గారికి బట్టలు కుట్టి వీళ్ళే సప్లయి చేస్తారు మా మహారాజావారూ పిల్లలూ అందరూ ఇక్కడ సూట్లు వగైరాలు కుట్టించుకున్నారు "మేన్ ఫీల్డ్స్" అని జోళ్ల కంపెనీ ఇక్కడ జోళ్లు తయారు చేయించుకుంటున్నారు. నా జోడు కొంచం కిర్రుపెడుతూంటే నే నొక జోడు కొనుక్కున్నాను ఇక్కడ జోళ్లు నడుస్తుంటే టక్ టక్ మనాలిగాని కిర్రు పెట్టగూడదు చౌకగా ఇస్తానన్నాడు నాకు రెండు పౌనులు అంటే ముప్ఫయి రూపాయ లన్నమాట

2 వ తేదీని లండన్ నగరమంతా కలకలలాడుతూ ఉంది చక్రవర్తి గారు ఊళ్లో ఊరేగుతూ వెళ్ళి "సిటీ స్వోర్డు'' అందుకుంటారు జనం రోడ్డుకి రెండువైపులా ఇసక వేస్తే రాలకుండా నిలబడ్డారు మేడల మీదా, కిటికీల్లోంచీ ఎందరో! ఊరేగింపు చక్కగా ఉంది ఆరు తెల్లని గుర్రాలు కట్టారు గుర్రపు బండికి ముందు సైనికులు ''బ్యాండ్'' వాయిస్తూ నడుస్తూ ఉంటే, బండి నెమ్మదిగా నడుస్తూంటే జనం జయజయధ్వానాలు చేశారు రాజుగారూ, రాణీగారూ, ఇద్దరు కొడుకులూ కూర్చున్నారు రోడ్డు మీద జనుల రాకపోకలు ఆపివేశారు. చూడడానికి వచ్చిన వాళ్ళం మా కార్లు ప్రక్క సందుల్లో నిలబెట్టుకున్నాం బండి వస్తూవుంటే ప్రతీవాడు తలమీద టోపీలు తీసేశారు రాజుకి నమస్కరించడం అలా అన్నమాట అదొక అలవాటు ఇక్కడ మన దేశంలో చెయ్యి ఎత్తి సలాం కొడతాం ఇక్కడ అది చాలా తప్పు. నమస్కరించడం అంటే నెత్తి మీద టోపీ కొంచం పైకి ఎత్తడం అన్నమాట ఆడవాళ్లు ఎదురైతే వాళ్ళ యెడల గౌరవం చూపించడానికికూడా టోపీ కొంచం ఎత్తుతారు. వాళ్ళని తెలిసే ఉండనక్కరలేదు ఈ మర్యాదలన్నీ చాలావరకు అలవాటైపోయాయి మాకుకూడా

మొదటి రోజుల్లో ఎటికెట్లన్నీ సరిగా పాటిస్తున్నానో లేదో అనే భయం ఉండేది ముఖ్యంగా "బారిష్టరు" పార్వతీశం జ్ఞాపకం వచ్చేవాడు మోర్డెన్‌లో ఉండేటప్పుడు అక్కడి పనివాళ్ళంతా దొరసానులేకదూ! డాన్సు చేస్తావా అని అడిగారు నన్ను చేత కాదన్నాను నా అసమర్ధతకు నవ్వుకున్నారు మీ దేశంలో డాన్సు చేయరా అని అడిగింది ఒకామె మా దేశంలో పరస్త్రీని ముట్టనేముట్టకూడదన్నాను. అయితే ఇక్కడ డాన్సు నేర్పుతాం నేర్చుకోమన్నారు మహారాజావారు నన్ను ఒక "ప్యూరిటన్''గా భావిస్తున్నారు. ఈ సంగతి తెలిస్తే

తిరుగు టపాలో ఇండియా ప్రయాణం చేయవలసి వస్తుంది అందుచేత నేర్చు కోవాలని సరదా పుట్టినా, వాళ్ళకి చాలా దూరంగా ఉన్నాను.

బర్లింగ్టన్‌లో "రాయల్ అకాడమీ'' ఉందని చెప్పాను కదూ మొన్న వెళ్ళాను ఇది మూడవజార్జి కాలంలోనే, అంటే దాదాపు రెండు వందల ఏండ్ల క్రితమే స్థాపించబడ్డదట ఈ బిల్డింగ్సులోకి వచ్చి యాభై ఏళ్ళయిందట ఇందులో మెంబరు కావడం చాలా కష్టం ఎంతో గొప్ప కళాకారుడు అయితేనే గాని సభ్యత్వం లభించదు మెంబర్లు - ఆర్ ఏస్ - యాభై మందీ, అసోసియేట్లు ముప్ఫయిమందీ ఉంటారు ఇక్కడ కూడా స్టేట్యూలూ పెయింటింగులూ, రక రకాలైన చిత్రాలూ ఉన్నాయి. ఇవన్నీ ఇందులోని మెంబర్లు చిత్రించినవే ప్రతీ సంవత్సరం ఒక ప్రదర్శనం నడుపుతారు ఇందులో మెంబర్లు కాని వాళ్ళ చిత్రాలు కూడా పెడతారు కాని మంచివని తోస్తేనే

ఇంతకాలమూ ఇక్కడ "స్ప్రింగ్'' వసంతకాలం ఇప్పుడే వేసవి ప్రారంభమవుతూ ఉంది ఒక్కొక్కళ్లూ నెమ్మదిగా ఫ్లానెల్ జాకెట్లూ, ఓవర్‌కోట్లూ తీసేస్తున్నారు. కొందరు సగం చేతులవీ, కొందరు చేతులు లేనివీ జాకెట్లు వేస్తున్నారు బొత్తిగా అన్యాయం అయిన బాడీల లాంటివి కూడా వేసుకుని బయట తిరిగే సొగసుకత్తెలు అక్కడక్కడ కనపడుతున్నారు వేసవిలో ఎక్కువగా సిల్కు వాడతారు ఏవైనా కొత్త మార్పులూ, కొత్త డిజైనులూ, కొత్త నమూనాలూ కనిపెట్టి ప్రయోగించడం ఈ కాలంలోనే నట డిన్నరు తరవాత డాన్సుకి వచ్చే వాళ్ళని చూస్తుంటాను మన దేశంలోలాగ రవికెలు తొడుగుకునేవాళ్ళూ. మన అజంతా బొమ్మల్లోలాగ ఉత్త గుడ్డలే కట్టు కుని వెనకాల ముడివేసుకునే వాళ్ళూ కూడా ఉన్నారు ''వేనిటీ'' ఎక్కువ కదా ఇక్కడి ఆడవాళ్ళకి మన ఆడవాళ్ళు ఎవరైనా చూస్తారేమోనని వినయంగా మర్యాదగా అణకువగా ఉంటారు ఇక్కడో? ఎంతమంది తనని తేరిపారజూస్తే తనకంతగొప్ప అందుకేగదా ఈ వికారపు అలంకారంఅంతా. వస్తువులు అంతగా అక్కరలేదు ఖరీదైనవీ, అందమైనవీ బట్టలు కావాలి సౌందర్యంకోసం పడి చస్తారు ముసలివాళ్ళకి కూడా చెప్పడానికి అలవికాని షోకు అందుకే ఎన్నో లేని అందాలు తెచ్చిపెట్టుకుంటారు. ముసలిముండలు కూడా పెదవులకీ, బుగ్గలకీ

కనుబొమలకీ రంగులు పూసుకుని రాము కూడా ఇతరులచేత ఆకర్షింపబడాలని చూస్తుంటే, ఇంక కుర్రాళ్ళ సంగతి చెప్పాలా ? సౌందర్యం వెర్రితలలెత్తదూ ?

ఇంతవరకూ ఇంగ్లండు ముఖ్యపట్టణం లండన్ నగరమూ, నగరంలోనీ విశేషాలూ, మ్యూజియములూ, పార్కులూ, రాజభవనాలూ వీటిని గురించి వ్రాశాను పరిసర ప్రాంతాలూ, పల్లె ప్రాంతాలూ, వాళ్ల జీవితాలూ వీటిని గురించి కూడా వ్రాశాను బ్రిటిషు దీవిలోని ఇతర భాగాలు స్కాట్లండ్, ఐర్లండ్ మొదలైనవి కూడా దర్శించబోతున్నాం వచ్చేసారి ఉత్తరం నీకు లండన్ నుంచి వ్రాయను 'లీడ్సు' నుంచి వ్రాస్తాను 9 వ తేదీని బయలుదేరి ముందు లీడ్సు వెళతాం తరవాత స్కాట్లండు, ఐర్లండు, ఇంగ్లాండుల్లోని కొన్ని పట్టణాలు పదిరోజులపాటు తిరిగి వస్తాము అక్కడక్కడి నుంచే వ్రాస్తాను రాత్రిళ్లు చాలా చిన్నవి అంచేత పెద్ద ఉత్తరాలు వ్రాయలేకపోతున్నా. ఏమీ అనుకోకు

నీ
వేంకటరావు

---



Queen's Hotel
Leeds
9th July 1930

డియర్ వెంకటరావ్,

ఇవ్వాళ ఉదయాన్నే లండన్‌లోని "సెంట్‌పేన్క్రాస్" స్టేషన్‌లో రైలుఎక్కి ఈ పట్నం లీడ్స్ వచ్చాం. లండన్‌కి దాదాపు 200 మైళ్లు యార్క్‌షైర్‌లో ఉంది పారిశ్రామికప్రదేశం ఉన్నిబట్టలూ, చర్మాలూ, మందులూ తయారుచేసే ఫేక్టరీలు ఎన్నోఉన్నాయి ఊరంతా నల్లగా పొగబట్టి నట్లుంది మేడలైతే ఎత్తుగానే ఉన్నాయి ఎక్కడచూచినా ఫ్లానల్, ట్వీడ్ బట్టలషాపులే. ఇక్కడికి వస్తుంటే అనేకమైన పారిశ్రామికప్రదేశాలూ, బొగ్గు గనులూ, ఇనుముఫాక్టరీలూ దాటివచ్చింది మా రైలు పచ్చగా కళకళలాడుతూ పువ్వులతోఉన్న ప్రదేశాల్లోంచి,బొగ్గులూ,ఇనపముక్కలూఉన్న ప్రదేశానికివచ్చాం. లాంకషైరూ, మాంచెస్టరూ వెళ్ళడంలేదులే ఇక్కడ తయారయే బట్టలకేకదా మనదేశంలోని డబ్బంతా దోపిడీ అవుతూందనీ, ఇండియా రాట్నం పనిచేస్తే ఇక్కడి మిల్లులు మూతపడతాయనీ గాంధీగారు అంటున్నారు

ఇక్కడ ఉన్న నీ "పెన్‌ఫ్రెండ్"ని చూడమన్నావుకదూ! కష్టంమీద టెలిఫోన్‌లో పట్టుకున్నా నామెని నేను ఇండియానుంచి వచ్చాననీ, నీకు స్నేహితుడననీ చెప్పాను నువ్వు ఆమెకి ఉత్తరం వ్రాశావటకదా నేనువస్తానని ఎంతో సంతోషించింది నన్నురమ్మనీ తనతో టీ తాగమనీ పిలిచింది. నేను ఆమెనే రమ్మన్నాను పాపం మా హోటేలుకి సాయంత్రంవచ్చింది ఇద్దరం టీ తాగాం నిన్నుగురించి యాభై ప్రశ్నలువేసింది చెప్పాను అరగంటకంటె ఎక్కువసేపు ఉండడానికి టైము లేకపోయింది ఏంచెయ్యను ? మళ్ళీ ఈరాత్రే ఇక్కణ్ణుంచి "గ్లెనిగిల్స్"కి ప్రయాణం. ఇది స్కాట్లండుకి ఉత్తరాన్నిఉంది

ఒక్క విషయం ఎన్నోసార్లు వ్రాయాలనుకున్నాను మా ట్రావెల్ ఏజెంట్లనుగురించి ఈ పద్ధతి ఎవరు ప్రవేశపెట్టారోగాని వాళ్ళకి నమస్కరించాలి బొంబాయిలో బయలుదేరింది మొదలు మా ప్రయాణంలో "థామస్ కుక్ అండ్ సన్స్" వాళ్లుచేసే సహాయం అపారం వాళ్లు లేకపోతే ఈ ప్రయాణాల్లో ఎంత కష్టపడేవాళ్ళమో, ఎంత అయోమయంగా ఉండేదో । మార్సేల్సులో స్టీమరుదిగేటప్పటికి ఎదురుగా సిద్ధం కుక్సు వాళ్ళ ఏజెంటు మళ్ళీ రైలెక్కే వరకూ మనకి కావలసిన సదుపాయాలన్నీ చేస్తూ, మన సామానులూ, లగేజీ వగైరాలు అన్నీ జాగ్రత్తగా చూచుకుంటూ మనకూడానే ఉంటాడు మళ్ళీ లండనులో రైలుదిగేసరికి కుక్సు ఏజెంటు కోటుకి బేడ్జితో ఎదురుగాప్రత్యక్షం మనల్నీ మనసామానుల్నీ హోటేలులో చేర్చేవరకూ వాడే ఎంతో పాటుపడతాడు. మా ప్రోగ్రాం మొదట వాళ్ళకిచెప్తాంగనక ఏవూరువెళ్ళినా మనం ఇల్లుకదిలేసరికి సిద్ధంఅవుతాడు ఏవిధమైన భోగట్టాఅయినా చెపుతాడు ఏ పనైనా చేసిపెడతాడు ఇవ్వాళ ఉదయం ఒకడు లండన్‌లో రైలెక్కించాడు. మధ్యాహ్నం ఇక్కడ లీడ్సులో ఒకడు రైలుదింపించి హోటేల్లో ప్రవేశపెట్టి మా సదుపాయాలన్నీ చూశాడు రాత్రికి మళ్ళీ రైలుఎక్కించి ఒక సలాంకొడతాడు

పెద్ద పట్టణాల్లో యువతులు, హోటేళ్ళల్లోనూ, షాపుల్లోనూ పనిచెయ్యడం సాధారణమైన విషయం పారిశ్రామిక ప్రదేశాల్లో ఆడవాళ్లు మోటపనులు కూడా చేస్తారు ఇవ్వాళ, ఈ లీడ్సులో స్టేషను నుంచి హోటేల్‌కి తీసుకువచ్చిన టేక్సీని ఒక ఆడ అమ్మాయి డ్రైవ్ చేసింది ఆడవాళ్లు కారు డ్రైవర్లుగా కూడా పని చేస్తున్నారన్నమాట

టైములేదు ఇప్పుడే బయలుదేరుతున్నాం మళ్ళీఉత్తరంలో ఎంతో !

నీ
వేంకటరావు



The Keswick Hotel
Keswick
14th July 1930

మిత్రుడు వెంకటరావ్,

తొమ్మిదో తేదీరాత్రి పది గంటలకి లీడ్సులో బయలుదేరిన మా రైలు మర్నాడు పది గంటలకి "గ్లెనిగిల్స్" చేరింది, ఇది "స్కాట్లండు"లో చాలా ఉత్తరాన్ని ఉంది రైలు దిగి హోటేల్‌కి వచ్చాం దారిలో ఎక్కడా ఇళ్ళూ ఊరూ ఉన్నట్టు కనపడలేదు ఇది ఒక పెద్ద హోటేల్ దీని చుట్టూ కొన్ని మైళ్ళవరకూ పచ్చని గడ్డి ఎడారులు ఇందులో "గాల్ఫ" ఆడతారు ఎన్నో "టెన్నిస్ కోర్టులు" ఉన్నాయి దూరంగా చుట్టూ కొండలు అనేకమైన ఆటలు ఆడుకోడానికి ఏర్పాట్లున్నాయి ఫుట్‌బాలేమిటి, క్రికెట్ ఏమిటి, టెన్నిస్ ఏమిటి గాల్ఫేమిటి, ఎన్నిరకాల "ఔట్‌డోర్ గేమ్సు" అయితే ఉన్నాయో అన్నీ కొన్ని వేలమంది ఆడుకోడానికి వీలైన బ్రహ్మాండమైన ఆటస్థలం అన్నమాట•ఈ "గ్లెనిగిల్స్" అంటే వేసవిలో ఏ నెలరోజులో ఇలాంటి సరదా ఉన్నవాళ్ళంతా ఇక్కడికి వచ్చి, ఈ హోటేల్లో మకాం చేసి ఏ ఆటలమీద మక్కువ అయితే ఆ ఆటలు ఆడుకుంటారు కొత్తగా పెళ్ళయిన పడుచుదంపతులు "హనీమూన్"కి వచ్చి ఉంటారు వయసు మళ్ళినవాళ్ళు మైళ్ళకొలది విస్తరించిన గడ్డిబయళ్ళల్లో గాల్ఫ బంతులు కొడుతూ బంతి వెళ్ళినంత దూరమూ– భార్యాభర్తలైతే చక్కగా కబుర్లు చెప్పుకొంటూ– ఆడుకుంటారు తక్కిన ఆటలు సరేసరి

చక్కని "స్విమ్మింగ్ పూల్" ఒకటి ఉంది పూలతోటలు లేనిది ఎక్కడ? పట్టణాల్లో ఉద్యోగాలలోనో, వ్యాపారాలలోనో వట్టి మరజీవితాలు గడుపుతున్న మానవులు గోలా, హడావుడీ ప్రపంచంలోంచి ఊడిపడి ఇక్కడ ప్రశాంతంగా నిర్మలంగా, సుందరంగా ఉన్న ఈ ప్రదేశంలో కొద్ది రోజులపాటు ఉండి హాయిగా ఆడుకుని, ఆనందించిపోతారు ఇది ఒక గొప్ప విశ్రాంతి స్థలం తిరగనూ అక్కరలేదు ఆడనూ అక్కరలేదు పడక కుర్చీలో వరండా మీద కూచుని ఆడుకునే వాళ్ళనీ, పూలచెట్లనీ, దూరంగా ఉన్న కొండలనీ చూస్తూ ఆ ప్రకృతి సౌందర్యాన్ని ఆనందిస్తూ కూర్చుంటే చాలు అలాంటివాళ్ళు కూడా

ఎందరో ఉన్నారు పిల్లలతో వచ్చినవాళ్లు చెట్ల క్రింద పిల్లలని ఆడిస్తూ వాళ్లూ ఆడుకుంటారు "హనీమూన్''కి వచ్చినవాళ్లు సరస్సులఒడ్డునో, పిల్లకాలవగట్లనో కూర్చుని అంతంలేని కబుర్లు చెప్పుకుంటూ ప్రథమ ప్రణయ జీవితాలను నెమరు వేసుకుంటూ గడుపుతున్నారు గుర్రపుస్వారీ చెయ్యడానికి కొన్నివందలగుర్రాలు కూడా ఉన్నాయి ప్రొద్దుటిపూటా సాయంత్రమూ అనీ లేదిక్కడ తెల్లారింది మొదలు సాయంత్రం వరకూ ఇలా ఆడుకుంటూ కొత్త స్నేహాలు కలుపు కుంటూ ఎంతో ఆనందం అనుభవిస్తున్నారు ఇక్కడ రాత్రి కావడంతోనే ఇంక డాన్సు సరేసరి మరి వాళ్ళు నిద్రపోడానికి టైములేదు ఇదే విశ్రాంతి రైళ్ళూ, బస్సులూ, మోటార్లూ వీటి గొడవ నుంచి తప్పించుకుని ఈ నిర్జన ప్రదేశంలో స్వర్గసుఖం అనుభవించడానికి వచ్చే వీళ్ళ జీవితాలు ఆనందమయం ఒకప్పుడు మనం చర్చించుకున్నాం జీవిత పరమావధి ఏమిటయ్యా అని నువ్వు అన్నావు జ్ఞాపకం ఉందా ఆనందం అని. ఆ ఆనందం వీళ్లు అనుభవిస్తున్నారా అన్నట్టు ఉంది నాకు

కాని దురదృష్టం ఏమిటంటే ఇక్కడ ఒక్క రోజుకంటె ఎక్కువ ఉండడం జరగలేదు ఇంత బాగా ఉంటుందని ముందే తెలిస్తే ఇంకొక రెండు మూడు రోజులు ఉందుమే అన్నారు మా దివాణం కుక్క వాళ్ళకి ఇచ్చిన ప్రోగ్రాం ప్రకారం తు చ తప్పకుండా టూర్ జరగవలసిందే కదా!

మర్నాడే బయలుదేరి మళ్ళీ తిరిగివస్తూ "ఎడింబరో" వచ్చాం ఇది "స్కాట్లండ్''కి ముఖ్య పట్టణం కావడమే కాక చాల చరిత్రాత్మకమైన పట్టణం అని నీకు తెలుసు. ఈ ఊళ్ళో ఒక్కటే ఒక్క జగద్విఖ్యాతిమైన వీధి ఉంది ఈ "ప్రిన్సెస్ స్ట్రీట్" ప్రపంచంలోని వీధు లన్నింటిలోకి అందమైనదని ప్రసిద్ధి కెక్కింది వంకర టింకరలూ మలుపులూ లేని తిన్నని పొడవైన వీధి ఇది దీని పొడవు దాదాపు అయిదు మైళ్ళు ఈ వీధికి ఒకవైపు అన్నీ షాపులు, రెండోవైపు పూల చమనులూ, లానులూ పార్కులున్నూ ఈ చివరనుంచి ఆ చివరవరకూ నడిచే వెళ్లాను వీధి వారనే ఉన్న ఒక చమనులో గడ్డితో ఒక తమాషా చేశారు పచ్చగడ్డితోనే ఒక గడియారం డయల్ తయారుచేశారు. గంటలు తెలిపే అంకెలు ఒక రకం గడ్డి, తక్కిన డయల్ అంతా ఒక రకం గడ్డి పెంచి కత్తిరిస్తే డయల్‌లాగా ఉంది ముళ్లమీద వేరే రంగు గడ్డి పెంచారు ఆ ముళ్లు ఈ గడ్డి అంకెలమీద తిరుగుతూంటాయి భూమిలో గడ్డి

యారం అమర్చి ఉంటారు ఆ పార్కుకి అదొక ఆకర్షణ బారిష్టర్ పార్వతీశం వ్రాసిన మన శాస్త్రిగారూ మసి ఊళ్ళో పప్పు అయినా ఇక్కడే కదా చదువు కున్నారు వాళ్లు జ్ఞాపకం వచ్చారు ఇక్కడి యూనివర్సిటీకి కూడా గొప్ప పేరు ఉంది యూనివర్సిటీ "కేంపస్"లో ఒక ప్రదక్షిణం చేసి వచ్చా "ప్రిన్సెస్ స్ట్రీట్"గానే "సర్ వాల్టర్ స్కాట్" యొక్క శిలావిగ్రహం ఉంది మనం చదువుకున్నాం కదూ అతను రచించిన నవలలు "క్వెంటిన్ డర్వర్డ్" న్నూ "కెనిల్ వర్త్"న్నూ స్కూల్ ఫైనల్లో అతనిపేరునిబట్టే సర్ వాల్టర్ స్కాట్లండు దేశీయుడని తెలిసిపోతుంది మరి స్కాట్లండు ముఖ్యపట్టణంలో ఆయన స్టేట్యూ ఉండడం చాలా సమంజసం స్టేట్యూకి దగ్గరగా వెళ్ళి ఆ పాలరాతి మీద చెయ్యివేసి ఒకసారి నిమిరిందాకా అక్కడినుంచి వెళ్ళిపోవా లనిపించలేదు సర్ వాల్టర్ స్కాట్ ఇంగ్లీషు నావలిస్టుల్లో చాలా ప్రముఖుడు కదా ప్రిన్సెస్ స్ట్రీటు వెంట తిరుగుతున్నంత సేపూ ఎదురుగా కొండమీద "ఎడింబరో కేసిల్" కనబడుతూనే ఉంది కొండ ఎక్కడానికీ, లోపల చూడడానికీ టైము లేదు ఆ కోటలో ప్రదర్శించే కత్తులూ, కరార్లూ పాత కవచాలూ చూడడంకంటె ప్రిన్సెస్ స్ట్రీట్ లో పేవ్ మెంటుమీద తిరిగే జనసమూహం యొక్క ఫేషన్సుచూస్తే సరిపోదా అని అక్కడికి వెళ్ళలేదు ఈ చివరనుంచి ఆ చివరివరకూ ఉన్న షాపుల షో రూమ్సు అలంకరణలూ అద్దాలలో అమర్చిన వస్తువులూ, దీపాలూ ఇవే ప్రిన్సెస్ స్ట్రీట్ కీ శోభ కీర్తి గడించాయి ఎడింబ్రాలో కూడా ఒక్కరోజే ఉన్నాము ఇక్కడ ముఖ్యంగా దర్శించవలసినది ఫర్త్ బ్రిడ్జి అతినవీనమైనది ఎంజినీరింగు నైపుణ్యాన్నంతనీ దీనిలో ఉపయోగించారట ఇది "ఫర్త్ ఆఫ్ ఫోర్తు" మీద కట్టారు గ్లాస్గో పట్టణం ఎడింబ్రాకి దగ్గరే మా మహారాజావారు కారులో వెళ్ళి వచ్చేశారు గ్లాస్గోలో తయారయే బట్టలని బహిష్కరించమని గాంధీగారు చెపుతున్నప్పుడు ఆ వూరు మనం వెళ్ళడం భావ్యం కాదని మానేశాను

ఈ వూరు "కెస్విక్" మొన్ననువచ్చాం ఈ ప్రదేశాన్ని వర్ణించాలంటే మళ్ళీ పెద్ద కవిని కావలసివస్తుంది గొప్ప ఇంగ్లీషు కవి ఇక్కడే ఉండేవాడు కనుక ఇది ఉన్న ప్రదేశాన్ని "లేక్ డిస్ట్రిక్టు" అంటారు కొన్ని వందల సరస్సులు ఈ కొండల్లో ఉన్నాయి పెద్ద పెద్దవీ, చిన్నవీ కూడా కొండలు ఉంచే గడ్డీ, పువ్వులూ సౌందర్యం మామూలే ఈ సరస్సులకి చుట్టూ కొండల

మీద దొరలు బంగళాలు కట్టుకున్నారు. చిన్నచిన్న తెప్పల మీద ఈ సరస్సుల్లో పడి తిరుగుతారు. తీరాల స్నానాలూ ఈదులాటలున్నూ. "కెస్విక్" అంటే "లేక్ డిస్ట్రిక్టు" అనే కాక "వర్డ్సువర్త్ స్థానం" అనే నామాంతరం కూడా ఉందట "వర్డ్స వర్తు"ని మహా కవిగా చేసినవి ఈ కొండలూ, సరస్సులూ, ఈ ప్రకృతి సౌందర్యమూను వర్డ్సువర్త్ నివసించిన కుటీరాన్ని గవర్నమెంటు జాగ్రత్త పెట్టారు. వందలకొలది యాత్రికులు ఆ ప్రదేశాన్నీ, ఆ కాటేజీనీ దర్శించి పోతూంటారు రోజూ కాటేజీ, దాని లోపలి గదులూ ఆయన కూర్చున్న కుర్చీలూ అన్నీ చూశాము. ఈ రెండు రోజులూ ఎడతెరిపిలేకుండా తిరిగాం ఎక్కే కొండా దిగే కొండాను, సరోవర ప్రదక్షిణాలున్నూ ఎంత కార్ల మీద తిరిగినా, కిందకి దిగి కొంత నడిచి, ఆ గడ్డిలో దొర్లీ, రాళ్ళమీదనుంచి దుమికీ, చేత్తో ఆ స్ఫటికంలాంటి నీళ్ళని గిలకొట్టీ, నాలుగు గడ్డి పువ్వులు కోసుకునీ, ఆడుకుంటేగాని సరదా ఏం ఉంటుంది ? రెండు రోజులూ ఇదే పని తిరగడంవల్ల కాళ్ళు నొప్పులు పడుతున్నాయి.

ఈ సాయంత్రమే మళ్ళీ ప్రయాణం ఐర్లండులోని డబ్లిన్, బెల్‌ఫాస్టు నగరాలు చూస్తాం మళ్లీ అక్కణ్ణుంచి బ్రిస్టల్ నగరం వస్తాం తిరిగి తిరిగి 20 వ తేదీకి లండను వస్తాం ఈ లోగా నీకు వ్రాయడానికి వీలు ఉండదేమో ? వీటిని గురించి సావకాశంగా తిరిగివచ్చి వ్రాస్తాను

మీ రందరూ క్షేమం అని నమ్ముతాను

నీ
వేంకటరావు.



Kensington Palace Mansions
Kensington, London
23rd July 1930

బాబా!

నువ్వు 30-6-1930 వ తేదీని వ్రాసిన ఉత్తరం మొన్నను ఇక్కడికి రావడంతోనే చూచుకున్నాను ఎంత సంతోషం, ఏమి ఆనందం పొందానో ఈ పర్యటనవల్ల కలిగిన సంతోషంకంటె నీ ఉత్తరమే నాకు ఎక్కువ ఆనందాన్ని కలగజేసింది ఇంగ్లాండు, స్కాట్లండ్, ఐర్లాండుల పర్యటన మొన్నటితో ముగిసింది "కెస్విక్" నుంచి నీకు ఉత్తరం వ్రాశాను, 14 వ తేదీ సాయంత్రం కెస్విక్‌లో రైలుమీద బయలుదేరి ఇంగ్లాండుకు పశ్చిమతీరాన్ని ఉన్న "హేషేమ్" అనే రేవు పట్నంలో దిగాం అక్కడ ఐర్లాండుకు వెళ్లే స్టీమరు సిద్ధంగా ఉంది అది ఎక్కి రాత్రంతా ఐరిష్ సముద్రం మీద ప్రయాణం సాగించి ఉదయం 6 గంటలకి "బెల్‌ఫాస్టు" నగరం చేరుకున్నాం "స్టేషన్ హోటేల్" లో బసచేశాం ఐర్లండు ఇంగ్లండు ప్రభుత్వంలోంచి విడిపోయి "ఫ్రీస్టేట్" గా ఏర్పడినప్పటికీ "బెల్‌ఫాస్టు" నగరం మాత్రం బ్రిటిష్ పరిపాలన క్రిందే ఉంది ప్రత్యేకంగా చూడవలసింది ఏమీ లేకపోయినప్పటికీ ఊరంతా తిరిగాం కార్లమీద. ఇంగ్లండులో ఉన్న అన్ని పెద్ద పట్టణాల్లాగానే ఉంది ఇది కూడా. మర్నాడు అక్కడ బయలుదేరి మధ్యాహ్నానికి డబ్లిన్ నగరం వచ్చాం షెల్‌బోర్న్ హోటేల్‌లో బసచేశాం డబ్లిన్ ఐర్లండ్ ఫ్రీస్టేటుకి ముఖ్య పట్టణం పెద్ద ఊరు. పెద్దపెద్ద భవనాలు ఉన్నాయి బయటినుంచే ప్రభుత్వ భవనాలన్నీ చూచాం. ఇక్కడ ఒక విశాలమైనదిన్నీ, అతిసుందరమైనదిన్నీ ఒక పెద్ద పార్కు ఉంది. దానిలోనూ, చుట్టూనూ తిరిగాం. 17 వ తేదీ సాయంత్రం

8 గంటలకి డబ్లిన్ విడిచిపెట్టాం దీనికి దగ్గరగా "కింగ్‌స్టన్" అనే రేవు పట్టణం ఏడుమైళ్ళ దూరంలో ఉంది అక్కడికి రైలుమీద వచ్చాం అక్కడ ఒక "ఫెర్రీబోట్" ఎక్కి ఇంగ్లాండులో దానికి సరాసరి ఎదురుగా ఉన్న "వేల్సులోని హోలీహెడ్" అనే రేవులో దిగాం రాత్రి పన్నెండు గంటలకి. ఇక్కడ ఒక చిన్న అనుభవం బోటు తీరం చేరుతుందనగా 'కోల్డువేవ్" అంటారే ఆ చల్లని గాలి వీచి మనుషుల్ని గడగడ లాడించింది నాకు దిట్టమైన ఓవర్‌కోటు ఉందిపైన తలమీద ఫెల్ట్‌హేట్ ఉంది ఓవర్‌కోటు టర్నింగ్‌కాలర్ పైకెత్తి చెవులు మూసినా, టోపీ చెవులకిందకి లాగినా చలీ వొణుకూ తగ్గలేదు ముఖం చెవులూ చల్లబడిపోయాయి ఒక్క క్షణంలో సూదుల్లాగ గుచ్చింది చలి చెవులకి ముక్కుకి చలనం ఉడిగిపోయింది, ఇదంతా ఒక్క క్షణ మాత్రమే గాలి తిరిగిపోయింది మామూలైపోయింది. బోటు దిగగానే రేవు ఒడ్డునే పీర్ మీద సిద్ధంగా ఉన్న రైలు ఎక్కాం మర్నాడు ఉదయం పది గంటలకి "బ్రిస్టల్" చేరుకున్నాం, "గ్రాండ్ హోటేల్"లో బస బ్రిస్టల్ ఇంగ్లాండు పడమటితీరాన్ని ఉంది ఏవన్ నది ఒడ్డునే పట్నం ఉంది పెద్దపెద్ద కెతీడ్రల్సు ఉన్నాయి

బ్రిస్టల్ నగరం మాకు, ముఖ్యంగా మాకు, అంటే బ్రహ్మసమాజ అనుయాయులకు-యాత్రా స్థలం నవభారత నిర్మాత, సంఘ సంస్కర్త, బ్రాహ్మ మత ప్రవక్త అయిన శ్రీ రాజారామమోహనరాయ్ ఇక్కడే పరమపదించారు వారు నివసించిన గృహం, బీచ్ హౌస్, ప్రార్థనలూ ప్రసంగాలూ చేసిన లెవిన్స్ మీడ్ చేపెల్ అంత్యక్రియలు జరిగిన స్మశానవాటిక అన్నీ ఇక్కడ ఉన్న వారి అనుయాయులు ఇప్పటికీ జాగ్రత్తగా భద్రపరచి ఉంచారు "ఆర్నోస్‌వేల్ సిమెట్రీ" లో ఉంది వారి గోరీ చుటూ ప్రదక్షిణం చేసి అయిదు నిముషాలసేపు ప్రార్థనచేశాం ఆ గోరీ మీద పాలరాతి పలకమీద ఇలా వ్రాసి ఉంది

Beneath this stone rest the remains of Rajah Rammohun Roy Bahadur A conscientious and steadfast believer in the unity of God head, he consecrated his life with entire devotion to the worship of the Divine spirit alone To great natura talents he united thorough mastery of many languages and early distinguished himself as one of the greatest scholars of his day His unwearied labours to promote the social, moral and

physical conditions of the people of India, his earnest endeavours to suppress idolatry and the rite of suttee and his constant zealous advocasy to advance the glory of God and the welfare of man live in the grateful memory of his country men This tablet records the sorrow and the pride with which his memory is cherished

ఆర్నోస్‌వేల్ సిమెట్రీనుంచి వచ్చి "యూనిటేరియన్ చర్చి" దర్శించాము ఇక్కడనే రాయలవారు ప్రార్థనలు జరిపి మతోపన్యాసాలు ఇచ్చారు తరువాత వారు నివసించిన గృహానికి వెళ్లాము వారు ఉన్న గదీ, చనిపోయిన మంచమూ అవన్నీ దర్శించాము ఆయన భౌతిక శరీరం మట్టిలో కలిసిన ప్రదేశం చుట్టూ భక్తితో ప్రదక్షిణం చేశాము ప్రస్తుతం ఆ ఇంట్లో ఒక స్కూలు నడపబడుతూ ఉంది ఇవన్నీ బ్రిస్టల్‌లోని "యూనిటేరియన్ క్రిస్టియన్ చర్చి" ఆధ్వర్యాన నడపబడుతున్నాయి. మన దేశం నుంచీ ఇతర దేశాలనుంచీ, వచ్చే బ్రాహ్మ సమాజికులూ, యూనిటేరియనులూ, మానసికారాధకులూ, బ్రిస్టలు వచ్చి ఈ మహనీయుని స్మారకచిహ్నాల్ని దర్శించి పోతూ ఉంటారు ఇలాంటి అవకాశం నాకు కలిగినందుకు పరమేశ్వరునికి కృతజ్ఞతా పూర్వకవందనాలు సమర్పించాను

బ్రిస్టలు ఇంగ్లండులోని పెద్ద నగరాలలో ఒకటి పట్నంనిండా పెద్ద పెద్ద చర్చీలూ, కెథీడ్రల్సూ, ఎత్తైన భవనాలూ, టవర్సూ ఉన్నాయి ఊరు "ఏవన్" నది మీద ఉంది. ఆ నదిలో చిన్నచిన్న పడవలమీద ఎక్కి తిరుగుతూంటారు మేము ఊరంతా ఒకసారి తిరిగి సాయంత్రం బయలుదేరి ఇంగ్లాండు దక్షిణతీరాన్ని ఉన్న "ఫాల్‌మత్" అనే ఊరికి వచ్చాం రాత్రి పది గంటలకి ఇది ఇంగ్లాండుకి నైరుతికొనని ఉంది

ఇదొక తమాషా అయిన ఊరు చుట్టూ సముద్రం ఉంది ఆ పైన కొండలు ఆవరించి ఉన్నాయి ఈ కొండలమీద బంగాళాలూ ఇళ్లూ కట్టుకుని హమేషా సముద్రపు గాలి పీలుస్తూ, సముద్రాన్ని చూస్తూ జీవితాలు హాయిగా గడుపుతారు నీళ్లూ, కొండలూ చిత్రమైన సీనరీలున్నూ చిన్నచిన్న పార్కులూ ఎన్నో ఉన్నాయి విశాలమైన గొల్ఫులింక్సు ఉన్నాయి మాతో సి. ఇ రోబిన్ అనే ఆయన ఉంటున్నారు. ఆయనకి ఒక వ్యామోహం ఉంది. ఎక్కడైనా

పురాతనమైన కెతీడ్రల్ ఉందంటే అక్కడికి పోతాడు చూడడానికి పదమూడో శతాబ్దంలో కట్టిన కెతీడ్రల్ ఒకటి అక్కడికి రెండు మైళ్ళదూరంలో ఉందని తెలుసుకుని నన్ను తీసుకుపోయాడు ఇప్పుడు అందులో పూజా పునస్కారాలు లేవుగాని బ్రహ్మాండమైన కట్టడం అది మనదేశంలోనూ ఉన్నాయిగదా శిథిలమైపోతూన్న దేవాలయాలు

మేము ఉండగా ఆవేళ పందొమ్మిదవ తేదీని ఫాల్‌మత్‌లో ఒక బోట్‌రేస్ జరిగింది ఊళ్లో ప్రజ అంతా బీచ్‌లోనే ఉన్నారు. వందలకొలది చిన్న చిన్న బోట్లు సముద్రంలో నల్లని నీటి మీద తెల్లని తెరచాపలు ఎత్తుకుని రివ్వున పోతుంటే, సముద్రం అంతా తెల్ల రెక్కల సీతాకోకచిలకలు వాలాయా అన్నట్టు కనబడింది. ప్రేక్షక జనంలో ఎంత ఉత్సాహమూ ఎంత సంబరము! బైనాక్యులర్సుతో చూడడం, పక్కవాళ్ళకి చూపించడం, తమరే గెలిచినట్టు గంతులేయడమున్న

దీనితో మా బ్రిటిష్ పర్యటన ముగిసింది మొన్నను తిరిగి లండన్ వచ్చేశాము మళ్లీ ఊరు తిరగడం, షాపింగున్నూ. 30 వ తేదీని అమెరికాకు బయలుదేరుతున్నాం ఈ లోగా ఇంకో ఉత్తరం వ్రాస్తానులే.

సీ
వేంకటరావు



Kensington Palace Mansions
Kensington, London
29th July 1930

డియర్ వెంకటరావ్,

తెల్లారితే అమెరికాకు ప్రయాణం ఈ వారం అంతా ప్రయాణసన్నాహాలతో అయిపోయింది అయినా ఏమాత్రం కొంచం ,సమయంచిక్కినా దగ్గరగా ఉన్న వేమైనా చూడవలసినవి ఉంటే విడిచిపెట్టలేదు. ఈ కెన్సింగ్టన్ లోనే మాకు చాలాదగ్గరగాఉన్న "అల్బర్టుహాల్, రాయల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మ్యూజిక్, రాయల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సు అండ్ టెక్నాలజీ" మొగలైనవి చూచాను మొన్న 26, 27 వ తేదీలల్లో మంచి షో ఒకటి చూశాను

లండన్‌లోనే "క్రిస్టల్ పేలస్" అని ఒక బ్రహ్మాండమైన భవనంఉంది అద్దాలమేడ అన్నమాట అంటే చూచుకునే అద్దాలు అమర్చిందనుకునేవ్ కాదు గోడలూ, పై కప్పూ, క్రింద ఫ్లోరింగూ అంతా గాజుతోనే తయారుచేసికట్టారు చాలా విశాలంగా, పెద్దపెద్ద హాల్సుతో ఎన్నోగదులు ఉన్నాయి, లండను వచ్చే వాళ్ళు మామూలుగా దీన్ని చూడడానికి వస్తుంటారు ప్రాక్పశ్చిమ కళాఖండాలు ఎన్నోఉన్నాయి దీన్లో అయితే మా అదృష్టం ఇప్పుడు ఆ "పేలస్" లో "అంతర్జాతీయ పౌల్ట్రి కాంగ్రెస్"అని ఒక బ్రహ్మాండమైన కోళ్ల షో జరుగుతూ ఉంది ప్రపంచంలో ఉన్న అన్ని బ్రీడ్సు తాలూకు కోళ్లూ వచ్చాయి ప్రపంచం లోని అన్ని ఖండాలనుంచీ, అన్ని దేశాలనుంచీ, అన్ని జాతుల పక్షులూ ఈ ప్రపంచ ప్రదర్శనంలో పాల్గొన్నాయి ఎన్నని ? లక్షలకొలది ఉన్నాయి కోళ్లూ, పావురాలూ, నెమళ్లూ, చిలకలూ ఇంకా ఎన్నోరకాల పిట్టలున్నూ, దేశాలవారీగా ప్రదర్శించారు మన ఇండియానుంచికూడా ఎన్నోరకాల కోళ్ల వచ్చాయి. మన పందెపుకోళ్ళు అస్లీలంటారే వాటిలో ఎన్నోరంగులవి, ఎన్నో జాతులవి ప్రభుత్వం పంపింది అలాగే ప్రపంచంలోని దేశాల ప్రభుత్వాలు ఆయాదేశాల్లో ప్రఖ్యాతిగాంచిన ప్రత్యేక జాతుల పక్షుల్ని పంపాయి. తొందర తొందరగా నడుస్తూ మేము కొన్నిభాగాలు రెండురోజులుమాత్రం చూశాము. ఇంకా ఎన్నోశాఖలు మిగిలిపోయాయి. షో అంతా పూర్తిగా చూడాలంటే

వారంరోజులైనా పడుతుంది "ఫెజంట్సు" అని ఒకరకం కొండజాతికోళ్ళని మహారాజావారు కొన్నారు ఇండియా పంపిస్తున్నాం వీటితోకలు బారెడు పొడుగు ఉంటాయి అనేక రంగులతో మనదేశంనుంచి వచ్చినవాటిలో గోల్కొండ పీలాలూ, దురాండా రేజాలూ, సేతువాలూ, మైలాలూ ఎన్నో పోట్లాడే డింకీకోళ్లు వచ్చాయి. ఇతర దేశాలనుంచి సీమకోళ్ల జాతులకి లెక్క లేనేలేదు . ఈ షోలో మంచికోళ్లకి బహుమతులు నిర్ధారణచేయడానికి ప్రపంచం నలుమూలలనుంచీ "జడ్జీలు" వచ్చారు మన దేశంనుంచి కూడా బెంగుళూరునుంచి ఒకాయన వచ్చాడు ఆయన ఇండియాలో ఈ కోళ్ళశాస్త్రంలో ఘనుడట

పక్షులే కాక కోళ్ళ పెంపకానికి ఆధునికమైన యంత్రసామగ్రికూడా ప్రదర్శించారు తక్కువ స్థలంలో ఒక గూట్లోనేపెట్టిన కోడి ఎన్నోసార్లు దానిలోనే తిరగడానికి వీలుగా తయారుచేసిన గూళ్లూ, తల్లిలేకుండా గుడ్లని పొదిగించే వివిధాలైన "ఇన్‌క్యుబేటర్లూ", పుష్టికరమైన ఆహారపదార్థాలూ, ఇంకా కోళ్ళ పెంపకానికి అవసరమైన సాధనసామగ్రులూ, ఔషధాలూ ఎన్నో ప్రదర్శించారు

మరి ఇంక ఇంగ్లాండూ, లండనూ విడిచిపెట్టేస్తున్నాం రేపు అమెరికాకు స్టీమరు ఎక్కుతాం యునైటెడ్ స్టేట్స్ అట్లాంటిక్ తీరాన్నుంచి పసిఫిక్ తీరంవరకూ పర్యటిస్తాం ముఖ్యమైన పట్టణాలూ అవీ సందర్శించుకుంటూ, నయాగరాజలపాతం, గ్రాండ్ కేన్యన్ లోయా చూస్తాం, ముఖ్యంగా హాలీవుడ్‌లో వారంరోజులు ఉంటాం కొంచెమే వ్రాశానని కోపగించకండి ! కొత్తప్రపంచం విశేషాలు మళ్ళీఉత్తరాల్లో వ్రాస్తా ఇప్పటికి సెలవు. ఇప్పటికే ఇన్నిసముద్రాలు దాటివచ్చాంకదా ఇంక అట్లాంటిక్ సముద్రం అంటే భయంలేదులే

నీ
వేంకటరావు

---



Hotel Mc Alpin
New york
6th August 1930

ప్రియమైన వెంకటరావ్‌కు,

క్రొత్తప్రపంచం అమెరికా చేరుకున్నాం నిన్న ఇంతవరకూ దాటిన సముద్రాలు అరేబియాసముద్రం, ఎర్రసముద్రం, మధ్యధరాసముద్రం వంటిది కాదుకదా ఈ అట్లాంటిక్ మహాసముద్రం ఎక్కడా భూమిఅనేదాన్ని చూడకండా మహాసముద్రాన్ని మూడువేల మైళ్లు దాటి వచ్చాం ఏడురోజులపాటు నీరూ, కెరటాలు తప్ప ఇంకేం కనపడలేదు ఇది ఒక పెద్ద నీటిఎడారి అనుకో!

జూలై 30 వ తేదీ ఉదయాన్నే మేము ఉన్న కెన్సింగ్టన్ పేలస్ మేన్షన్స్ విడిచిపెట్టి లండనులోనేఉన్న వాటర్లూ స్టేషనులో రైలెక్కి ఇంగ్లాండు దక్షిణాన ఉన్న రేవుపట్నం "సౌథేమ్టన్" వచ్చాం మమ్మల్ని తరింపచేసే స్టీమరుపేరు "ఎస్ ఎస్ మెజస్టిక్" సరిగ్గా మధ్యాహ్నం పన్నెండుగంటలకి బయలుదేరింది ఇది చాలా పెద్దస్టీమరు "వైస్‌రాయ్ ఆఫ్ ఇండియా" కంటెకూడా చాలాపెద్దది యాభై ఆరువేల టన్నులకు పైగా ఉంది ప్రపంచంలో ఇంతకంటె పెద్దస్టీమరు లేదట. ఇది అసలు జర్మనీవారిదట గ్రేట్‌వార్‌లో ఇంగ్లీషువారికి చిక్కిందట. దాన్ని ఇప్పుడు ప్రయాణనౌకగా తయారుచేసి తిప్పుతున్నారు. సౌతేమ్టన్‌లో బయలుదేరి మానౌక ఇంగ్లీషు చానలుదాటి ఫ్రాన్స్ తీరాన్నిఉన్న "షెర్‌బోర్గు" దగ్గర ఒక గంటసేపు ఆగింది ఫ్రాన్స్‌నుంచీ, యూరప్ ఇతరప్రాంతాలనుంచీ అమెరికా వెళ్ళేవారు ఇక్కడకూడా ఎక్కుతారు స్టీమరు పాతదైనా కావలసిన సౌకర్యాలన్నీ సమకూర్చారు, గదులూ, డెక్కులూ, లోపల హాల్సూ చాలా విశాలంగా ఉన్నాయి విశేషం ఏమిటంటే ఈ స్టీమరులో ప్రయాణం చేస్తుంటే నీటిమీద ఒక నౌకలో ఉన్నామనే అభిప్రాయం కలగదు ఒక పెద్ద హొటేల్‌లో ఉన్నామన్నట్లు ఉంటుంది అయితే అట్లాంటిక్ సముద్రం మీద అలల అలజడి ఎక్కువ గంటకి ముప్పయిమైళ్ళ వేగంతో తుపాను గాలిలో కెరటాల దెబ్బకి ఇటూ అటూ ఊగుతూ సముద్రాన్ని చీల్చుకుంటూ పోతుంటేనే మనం నౌకలో ఉన్నట్లు భావిస్తాం. తుపానుగాలి వీచినప్పుడు పడవ గడగడ వొణికిపోతుంది కుర్చీలూ. బల్లలూ కదిలిపోతాయి. తువాళ్ళూ, పేపర్లూ మొదలైన వస్తువులు

ఎగిరిపడుతూంటాయి గాలీ, కెరటాలే కాక గదుల్లోని వస్తువులు కూడా హోరు పెడ్తున్నట్టు గోలపెడతాయి. ఆ సమయాల్లో మనసులో కొంచం భీతి కలిగినా మంచి అనుభవం మా యీ ఆరు రోజుల ప్రయాణంలోనూ తుపానుగాలికి మూడు నాలుగుసార్లు సముద్రమధ్యంలో నావకు లంగరువేసి కొంత కొంతసేపు నౌక ఆపుచేయడం కూడా సంభవించింది ఇంక జనం ఆడవాళ్ళు కూడా, తాడి ఎత్తున కెరటరి వచ్చి నావను ధన్‌మని కొడుతుంటే, ఇవతలికి వచ్చి ఆ దృశ్యం చూస్తారే గాని గదిలోకి పోరే!

స్టీమరులో జీవితం అన్నింటిలోనూ ఒకలాగే ఉంటుంది, కొద్దిపాటి మార్పులతో ఆవేళ సాయంకాలమే ప్రతి గదిలోనూ ఒక అచ్చువేసిన లిస్టు ఉంచారు ఆ స్టీమరులో ఎవరెవరు ప్రయాణం చేస్తున్నారో వాళ్ళపేర్లూ, కొద్దిగా వివరాలూ ఉన్నాయందులో ఒక్క పేరు నన్నాకర్షించింది – "హెన్రీఫోర్డు." స్వశక్తివల్లా, నిరంతర కృషివల్లా ప్రపంచంలో మహా ధనికుల్లో రెండవవాడై అశేషజనానికి చౌకగా వాహనాలు సమకూర్చిన మహావ్యక్తి మర్నాడే ఆయన దర్శనభాగ్యం కలిగింది సన్నంగా పొడవుగా ఉంటాడు ముఖంలో తీక్ష్ణతా పట్టుదలా కనపడ్డాయి పడవలో అందరితోనూ సోషల్‌గానే తిరిగాడు ఈ లిస్టుని బట్టే ఒకరికొకరు పరిచయం చేసుకుని జట్టుజట్లుగా ఏర్పడి ఆ నాలుగు రోజులూ కాలక్షేపం చేస్తారు

న్యూయార్కు చేరడానికి ముందురోజున స్టీమరులోనె ఒక పరీక్ష జరిగింది. పాస్‌పోర్టు, వీసా మొదలైన డాక్యుమెంట్లు అన్నీ సరిగా ఉన్నదీ లేనిదీ చూచారు స్వల్పంగా డాక్టరు పరీక్ష కూడా జరిగింది. అంటే మర్నాడు మమ్మల్ని క్వారన్‌టైన్‌లో ఆపుచేయవలసిన అవసరం లేకండాపోయిందన్న మాట ఆ రాత్రి పెద్ద ఉత్సవం కూడా జరిగింది స్టీమరు అన్ని దెక్కుల మీదా కౌగిలింతలూ డాన్సులే గాక విచిత్ర వేషధారణలూ సంగీతాలూ నాటకాలున్నూ. ఆ రాత్రంతా తెల్లవార్లూ అందరికీ జాగరణమే

న్యూయార్కు చేరుతున్నామని మనకు తెలియజేసింది సముద్రం నీరు జిడ్డుదేరి రంగు మార్తడం దూరానికే మొదట కనిపించింది నీటిలో చిన్న తెప్ప లాగ "లిబర్టీ స్టేట్యూ." దగ్గరగా చేరుతున్నకొద్దీ అదీ పెరగడం మొదలు పెట్టింది. స్టీమరు పొగలోనూ, దూరంగా అలముకున్న పొగలోనూ ఒక్క

క్కటీ సీటిలోంచి పుట్టి పైకి ఆకాశంలోకి పెరిగిపోతున్నాయా అన్నట్టు "స్కై స్క్రేపర్సు" కనపడుతున్నాయి దూరానికి ఫేక్టరీ పొగగొట్టాలా అన్నట్టు కనపడినా దగ్గరబడినకొద్దీ ఆకాశాన్నంటే విశాల భవనాలే అవి అలవాటు లేని మనకి విశాలంగా ఉన్న నాలుగిళ్ళ భవంతులు బాగా ఉంటాయిగాని గొట్టాల్లాగ ఎనభై య్యేసీ, నూరేసీ అంతస్తులు ఆకాశంలోకి కట్టుకుపోవడం ఈ దేశపు వాళ్ళ వెర్రి సరదా అనుకుంటా

హార్బరుకు దూరంగా ఉన్న క్వారన్‌టయిన్ స్టేషనువద్ద స్టీమరు కొంతసేపు ఆగింది అంటురోగాలవాళ్ళనీ, టీకాలూ మొదలైన సర్టిఫికెట్లు లేనివాళ్ళనీ, పాస్‌పోర్టులూ వీసాలలో తకరారు ఉన్నవాళ్ళనీ అక్కడ దించేస్తారు. మాకు అలాంటి పేచీలు ఉండవు కదా ! మా స్టీమరు ఎంత గొప్పదైనా హార్బరులోకి తన ఇష్టం వచ్చినట్టూ వెళ్ళడానికి దానికి అధికారం లేదు ఒక చిన్న స్టీమరు మాకు స్వాగతం ఇవ్వడానికి ఎదురుగా వచ్చి మా స్టీమరు ముక్కుకు తాడు పోసి ఇంత స్టీమరునీ లాగుకొనిపోయి ఒడ్డు చేర్చింది

కొత్త ప్రపంచం_ స్వేచ్ఛ, సమానత్వం, భ్రాతృభావం ఈ మూడు సూత్రాలూ పునాదులుగా చేసుకుని ప్రపంచరాజ్యాలలో మహోత్కృష్టమైనదిగా రూపందిన అమెరికా ఎదురుగా కళ్ళకి కనపడుతూంటే ఎంత ఆనందమని చెప్పను ? అమెరికా ! దీనికీ పేరెలా వచ్చిందీ ! కొలంబస్‌కదా ఈ భూభాగాన్ని కనిపెట్టాడు ! కొలంబస్ కనిపెట్టింది పెద్ద భూభాగం కాదు అక్కడి దీవులు అతని దృష్టి అంతా ఇండియాకోసం మనస్సంతా ఇండియామీదే అందుకే భూమి కనబడ్డంతోనే ఇండియా అన్నాడు వెనక్కి తిరిగి వచ్చేశాడు అతన్ని గురించి ఎవరో అన్నారుట "అతను ఎక్కడికి వెడుతున్నాడో అతనికే తెలియదు. చేరుకున్న భూభాగం ఏమిటో అదీ తెలియదు. తిరిగి వచ్చేశాక అతను ఎక్కడికి వెళ్ళేదో అదీ కూడా తెలియదు" అని. కొలంబస్‌కి ముందే ఎరిక్‌సన్ అనేవాడు గ్రీన్‌లాండు, ఐస్‌లాండు మొదలైన ఉత్తర ప్రదేశం అంతా కనిపెట్టాడట. కొలంబస్ తరువాత అమెరికస్ వెస్పూసియస్ అనేవాడు ఇప్పుడు అమెరికా అని పిలవబడే భూభాగాన్నంతా కనిపెట్టి సంచరించాడట. అతనిపేరనే ఆ భూమికి అమెరిగే అనీ అమెరికా అనీ పేరు వచ్చిందట అమెరికా అంటే అమెరికస్ యొక్క భూమి అని అర్థం. క్రీస్తుశకం 1507 వ సంవత్సరంవరకూ

ప్రపంచం అంతా యూరప్, ఏషియా, ఆఫ్రికా అనే మూడు భాగాలుగా ఉండేదనీ ఆ తరవాత అమెరికా అసె ఈ నాలుగో భాగం చేర్చబడిందనీ అంటున్నారు ఏమయితేనేం అనాగరికమైన ఈ మహారణ్యాన్ని రత్నగర్భగానూ, మహదైశ్వర్యవంతంగానూ, ప్రపంచ రాజ్యాలకు మకుటాయమానంగానూ చేయగలిగిన ఇక్కడి ప్రజలు మానవులా దేవతలా ? మన ప్రభువులు ఇంగ్లీషువారు కావడం వల్ల మనకి బ్రిటిషుహిస్టరీ ఎక్కువగా చెప్పేవారు కాని స్కూల్లో అమెరికాను గురించి మనకి ఏమి చెప్పేవారు? చిన్న క్లాసుల్లో జార్జి వాషింగ్టన్ పాఠం తప్పిస్తే మనకి ఇంకేమీ తెలియదుగదా ఆయన పట్టుదల అయిన మనిషి అని చెప్పడానికి ఆయన చెట్టుకొట్టడం కథ చదువుకున్నాం గాని, అమెరికన్ వార్ ఆఫ్ ఇండిపెండెన్సును గురించీ, బ్రతుకుతెరువుకోసం స్వదేశం విడిచిపెట్టి, సముద్రాలు దాటి వలసవచ్చి అపరిచితం అయిన దేశంలో భయంకరం అయిన అడవుల్లో అష్టకష్టాలూపడి నివాసం ఏర్పరచుకొని వాళ్ళ వాళ్ళ జీవితాలు గడుపు కుంటున్నవాళ్ళని వాళ్ళ మాతృదేశాలు ఎలా కష్టపెట్టినదీ, వాళ్లు ఎలా తిరగబడి స్వేచ్ఛను సంపాదించిందీ మనకి ఎక్కువగా తెలియదు స్టీమరులోనూ, ఇక్కడా ఈ దేశ దరిత్రను గురించి బాగా తెలుసుకుంటున్నాను

అమెరికన్ స్వాతంత్ర్య సమరం మొట్టమొదట లెగ్జింగ్టన్ అనే చోట 1775 వ సంవత్సరంలో బ్రిటిషు చక్రవర్తి పంపిన సైన్యాలకిన్నీ వలస వచ్చిన అమెరికన్‌లకిన్నీ జరిగిందట బ్రిటిష్‌వారు పరాజయం పొందారు తరవాత సంవత్సరంలోనే డిక్లరేషన్ ఆఫ్ ఇండిపెండెన్సు జరిగిందట ఫిలడెల్ఫియాలో 1776 వ సంవత్సరం జులై 4 వ తేదీని స్వాతంత్ర్యం ప్రకటించడం జరిగింది థామస్ జాఫర్సన్ అనేవాడు ఈ ప్రకటన తయారుచేశాడు 1787 నాటి రాజ్యాంగ ప్రణాళిక తయారుకావడం, 48 స్టేట్సుతో అమెరికా సంయుక్త రాష్ట్రాలు ఏర్పడి, దానికి మొదటి ప్రెసిడెంటుగా జార్జివాషింగ్టన్ ఎన్నిక కావడం జరిగింది తరవాత ఎందరో మహానుభావులు, అబ్రహాం లింకన్ వంటివాళ్లు దేశ ఔన్నత్యానికీ తమ మూలసూత్రాలు స్వేచ్ఛ, సమానత్వం సోదరభావం వీటి నిమిత్తం ఎంతో కృషిచేసి దేశానికి ఈ ఔన్నత్యం తీసుకువచ్చారు.

మనం ఫిఫ్తుఫారమ్‌లో "సెట్లర్స్ ఇన్ కెనడా" అనే పుస్తక నాన్‌డిటెయిల్డ్ చదువుకున్నాంగాని అప్పుడు తెలియనివి ఇప్పుడు ఎనో

విషయాలు అందులోనివి జ్ఞాపకం వస్తున్నాయి ఈ "రెడ్ ఇండియన్స్" అనే వాళ్లు ఎవరో ఏమిటో తెలుసుకోవాలంటే ఎవరూ సరిగా చెప్పడం లేదు ఆసియాఖండంనుంచే వచ్చేరట మొత్తంమీద వాళ్లి ఆదిమ నివాసులు యూరపియనులు వలస వెళ్ళేనాటికి అమెరికా యావత్తు భూభాగాన్నీ అడవులలో ఉంటూ అనుభవిస్తున్నారు మొదట్లో వలసవచ్చిన యూరపియనులు వాళ్ళని ఎన్నో బాధలు పెట్టినా ఇప్పుడు వాళ్ళు అమెరికా పౌరుల క్రింద పరిగణింపబడుతూన్నారు ఇంక ఇంకొక తెగవుంది ఇక్కడ నీగ్రోలు తెల్లవాళ్ళు చాకిరీ చేయించుకోటానికి వీళ్ళని ఆఫ్రికాదేశంనుంచి మనం పశువుల్నికొని తెచ్చుకున్నట్లు కొని తెచ్చుకున్నారు పాపం అబ్రహాం లింకన్ మహాశయుని కృషివల్ల వాళ్ళ దాస్య శృంఖలాలు విడిపోయి స్వేచ్ఛ అనుభవిస్తున్నారు వీళ్ళని గురించి ప్రత్యేకంగా వ్రాస్తాను ఇంకో ఉత్తరంలో చాలా చరిత్ర వ్రాశాను

అమెరికా యూరపు రాజ్యాల బంధాలనుంచి విముక్తి పొందిందంచే సంతోషించిన రాజ్యం ఫ్రాన్సు అసలు ఈ లిబర్టీ, ఈక్వాలిటీ ఫ్రేటర్నిటీ సూత్రాలు ఫ్రెంచివాళ్లవే కదా. వాళ్ళ సంతోషానికి చిహ్నంగా ఫ్రెంచి ప్రజానీకం అమెరికాకు బహుమతి ఇచ్చిందే న్యూయార్కు హార్బరులోని లిబర్టీ స్టేట్యూ అది అమెరికాయొక్క స్వేచ్ఛా చిహ్నం అనడంకంటె ఫ్రాన్సుయొక్క స్వేచ్ఛాప్రియత్వాన్ని తెలిపే చిహ్నం అనడం బాగాఉంటుందని నా అభిప్రాయం ఈ స్టేట్యూ మనదేశంలో ఇంగ్లీషువాళ్ళు నిలబెట్టిన స్టేట్యూలలాంటి దనుకునేవు ఇది ఒక కొండంత కంచు విగ్రహం ఆకుపచ్చరంగులో ఉంది. సముద్రంలో ఒక చిన్న ద్వీపంమీద నిలబెట్టారు ఆ ద్వీపానికి బెడ్‌లోస్ ఐలాండ్ అంటారు, ఈ విగ్రహాన్ని తయారుచేయడానికి 12 సంవత్సరాలు పట్టిందట ఫ్రాన్సు ప్రజానీకం అమెరికా ప్రజలకు బహూకృతి కావించిన ఈ విగ్రహం అమెరికా బెడ్‌లో ద్వీపంమీద 1886 వ సంవత్సరం అక్టోబరు 28 వ తేదీని అంకితం చేయబడి ప్రతిష్ఠింపబడింది విగ్రహం చేతిలో ఒక పెద్ద టార్చి పైకెత్తిపెట్టి ఉంటుంది సముద్రమట్టం నుంచి టార్చి చివరికి 300 అడుగుల ఎత్తు ఉంది కుడిచెయ్యి పొడవు 40 అడుగులు చూపుడువేలు పొడవు 8 అడుగులు విగ్రహం తలమీద అమర్చిన కిరీటం మీద 40 మంది మనుష్యులు సుఖంగా నిలబడవచ్చు టార్చిమీదే 12 గురు నిలబడవచ్చు దీని ప్రతిష్ఠాపనకి ఆరులక్షలడాలర్లు ఖర్చు అయాయిట. డాలరు అంటే ఇప్పుడు దాదాపు మూడు రూపాయిలన్నమాట

మా స్టీమరు ఆ స్టేట్యూకి ఎంత దగ్గరగా వెళ్ళిందంటే స్టేట్యూ మీద లిఖించబడ్డ ఇంగ్లీషుపద్యం "The new Colossus" ను చదవగలిగినంత ఆ పద్యం "ఎమ్మాలాజరస్" అనే ఆమె వ్రాసిందట

మేము భూమిని చేరేసరికి దూరానికి పావురం గూళ్ళలాగ కనపడిన మేడలన్నీ ఆకాశానికి అంటుతున్నాయా అన్నంత ఎత్తయిన మేడలై పోయాయి భూమ్మీద కాలు మోపామోలేదో థామస్ కుక్ అండ్ సన్సువారి ఏజెంటు ఎదురుగా సిద్ధం అయాడు మా సామానులూ మొదలైనవి వాటంతట అవే హొటేల్‌కి వచ్చేస్తాయి, కార్లు ఎక్కండన్నాడు, మా యీ "మెకాల్పిన్ హొటేల్" 24 అంతస్తుల మేడలో ఉంది కిటికీలోంచి రోడ్డుమీద నడుస్తున్న ప్రజలను చూస్తాను వాళ్ళు మనుష్యులో చీమలో తెలియడంలేదు రోడ్డు మీద పోయే మోటార్లు పురుగుల్లా కనపడుతున్నాయి మనం మన తెలుగు ప్రబంధాలలో చదువుకున్నాం పురవర్ణనలూ, సౌధవర్ణనలున్నూ అతిశయోక్తులని తీసిపారేసేవాళ్ళం మేడలమీద రాజకుమార్తెలు నృత్యాలు చేస్తూ గవాక్షాలలోంచి తారాచంద్రులను అందుకుని ఆడుకునేవాళ్ళని అతిశయోక్తి కాదుగదా శుద్ధ అబద్ధం అనేవాళ్ళం ఇక్కడి ఈ సౌధాలని చూస్తూంటే ఆ వర్ణనలన్నీ నిజమా అనిపిస్తూంది

న్యూయార్కు లాంగ్ ఐలాండు అనే ఒక ద్వీపంమీద ఉంది దీన్ని మొట్టమొదట హాలెండునుంచి వచ్చిన వలసవారు నిర్మించి న్యూ ఏమ్స్టర్‌డామ్ అని పేరుపెట్టారు. తరవాత ఇంగ్లీషువారి ప్రాబల్యంవల్ల న్యూయార్కుగా మారిందట మంచి రేవుస్థలమూ, గొప్ప పారిశ్రామిక ప్రదేశమూ, ముఖ్యమైన వర్తక స్థానమూ అనే మాటలు అలా ఉంచుదాం, నగర నిర్మాణం చిత్రంగా ఉంది న్యూయార్కు కొంత భాగం మన్‌హటన్ ద్వీపం మీద కూడా ఉంది బ్రోడ్వే అని ఒక విశాలమైన పొడవైన వీధి ఉంది దాదాపు ఇరవై మైళ్ల పొడవు ఉంటుంది దీనికి పేరలల్‌గా అంత పొడవునా రోడ్లు వేశారు వాటిని అవెన్యూస్ అంటారు వాటికి వేరువేరు పేర్లు లేవు మొదటి అవెన్యూ, రెండో అవెన్యూ, మూడో అవెన్యూ అలాగ చాలా అవెన్యూలు బ్రాడ్వేకి ఇరువైపులా వేశారు ఇంకవాటికి అడ్డంగా క్రాస్ రోడ్లు వేశారు. ఈ క్రాస్ రోడ్లు వందకి పైగా ఉంటాయి ఫస్టుస్ట్రీట్ అనీ, సెకండ్ స్ట్రీట్ అనీ అలాగే ఎన్నో ఫిప్తు అవెన్యూన్నూ, 42వ రోడ్డున్నూ క్రాస్ అయే భాగం చాలా అందమైనదీ, ధన

వంతులు ఉండేదీ, చాలా పెద్దపెద్ద భవనాలు ఉన్నదిన్నీ 102 అంతస్తులు ఉన్న ఎంపైర్ స్టేట్ బిల్డింగ్ ఈ ఫిఫ్తు అవెన్యూలోనే ఉంది

నిన్ననే గదా వచ్చాం ఇంకా ఊరంతా చూడలేదు ఒకటిమాత్రం చెపుతాను ఈ నగరంలో అనేక బ్రిడ్జీలూ, పార్కులూ వందలకొలదీ మైళ్ల పొడవు ఉన్నరోడ్లూ, ఆకాశానికి అంటుతున్న సౌధాలూ ఉండి దాదాపు డెబ్బయి లక్షల జనాభా కలిగి ఇసకవేస్తె రాలకండా జనమూ కార్లూ తిరుగుతున్నా నాకు ఒక మహారణ్యంలాగు కనిపించింది ఎమీతెలియదు అంతా అయోమయం ఇంక రాత్రిళ్లు ఎన్ని దీపాలని ! ఎడిసన్ మహాశయుడు ప్రసాదించిన ఎలక్ట్రిసిటీని ఎన్ని విధాలుగా ఉపయోగించుకోవాలో పూర్తిగా వినియోగించుకుంటూన్నారు క్రిందకి దిగి పేవ్‌మెంటుమీదకి వెళ్లానూ చెవులు బద్దలయేగోల మోటారుకార్లు, ట్రాము కార్లు, డబుల్‌డెక్కర్ బస్సులు, రైళ్లు రైళ్లంటే భూమి మీదవేకాదు_ఇంగ్లండులోలాగ భూమిలోనూ ఇక్కడ ఉన్నాయి ''సబ్‌వేస్'' అంటారు వాటిని ఒక రైలు పోవడానికి కాదు నాలుగు రైళ్ళుపోవడానికి రోడ్లు పేవ్‌మెంటు మీద వాటి పొగపోవడానికి అక్కడక్కడ కన్నాలు పైన ఏదో కప్పుతారనుకో వీటన్నిటినీమించి రోడ్లుమీదే స్తంభాలమీద బ్రిడ్జిలలాగు కట్టి ఊరు పొడవునా రైలురోడ్లు హమేషా వాటిమీద కూడా రైళ్ళు తిరుగుతూనే ఉంటాయి బధిరత్వం వస్తుందా అన్నంత గోలగా ఉంటుంది రైళ్లుపోతుంటే ఇంక ట్రాఫిక్ సంగతి చెప్పనక్కరలేదు క్రాస్‌రోడ్డు దగ్గర ఒక అరసెకండు పోలీసువాడు చెయ్యి ఆడ్డు పెట్టాడనుకో మూడు నాలుగు వరసల్లో వేలాదికార్లు ఆగిపోతాయి కారు ఆగిందంటే మళ్లీ కదిలేసరికి పదినిముషాలైనా పడుతుంది. జనం కూడా పేవ్‌మెంట్లమీద పరుగులుతీస్తారుగాని సావకాశంగా ఎవరూ నడవరు

ఇంకా నాలుగు రోజులు ఉంటాం ఇక్కడ తక్కిన విషయాలు మళ్లీ ఉత్తరంలో వ్రాస్తాను ఇక్కడినుంచి నయాగరా వెళతాం అక్కణ్ణుంచే వ్రాయడం పడుతుందనుకుంటా. రోజురోజుకీ నీకు దూరం అయిపోతున్నా దూరం అయినకొద్దీ మనసులో దగ్గరగా వస్తున్నా మనిపిస్తుంది ఇంక ఉంటాను

నీ
వేంకటరావు



Hotel Niagara
Niagara Falls
(U S A.)
12th August 1930

డియర్ వెంకటరావ్,

మొన్న ఆదివారంనాడు న్యూయార్కులో బయలుదేరి నిన్న ఉదయం పదిగంటలకి నయాగరా ఫాల్సు అనే ఈ వూరు చేరుకున్నాం బఫెలో అనే స్టేషన్‌లో నిన్నఉదయమే రైలుదిగి వేరే రైలుఎక్కి ఇక్కడపడ్డాం, ఇక్కడికీ టూరిస్టులు రోజూ వందలకొలదీ వచ్చినా ప్రశాంతంగా ఉంది న్యూయార్కు గొడవలోంచి విడివడ్డాం మనస్సుకి కొంచం స్వస్థతకలిగింది అక్కడ ఏమి తొందర అనిచెప్పను ప్రతివిషయంలోనూ! న్యూయార్కులో బ్రాడ్‌వే అంతా షాపులమయం అక్కడ వ్యాపారంతప్ప మరేంలేదు కనక షాపు విండోస్ అలంకరణలూ, నోటీసులూ, బోర్డులూ, బొమ్మలూ చిత్ర చిత్రంగా అలంకరించి అడ్వర్టయిజుమెంటు ఒక గొప్ప కళగా చేసేశారు. బ్రాడ్వేనిండా ముఖ్యంగా పుస్తకాలషాపులు ఎన్నోఉన్నాయి వాటినిమించి సినిమాథియేటర్లు ప్రపంచంలో కల్లా గొప్పపనీ, అందమైనవనీ ప్రఖ్యాతికాంచిన "పేరమౌంట్" థియేటరున్నూ, "రాక్సీ" థియేటరున్నూ కూడా చూచాను సినిమా చూపించడానికి ముందో, మధ్యలోనో "రెవ్యూ" అని ఒక ప్రదర్శనంకూడా చూపిస్తారు వెరైటీకోసం ఈ రెండు థియేటర్లలోనూకూడా "రెవ్యూ"లు చూశాను స్టేజిమీద పావుగంటా లేక అరగంటసేపు ఏదో నాటకమో, నవ్వుపుట్టించే డైలాగులతో ఫార్సో, ప్రహసనమో, లేక డాన్సో ప్రదర్శిస్తారు రాక్సీ థియేటర్‌లోకాబోసు ఎంటర్ అయే హాలులోనూ మెట్లగదివద్దా వ్రేళ్లాడగట్టిన గాజు దీపాల కొమ్మలు - చాండ్లియర్స్ చాలు ఎంతైనా అందంగా ఉన్నాయి రాక్సీలోనే స్టేజికిముందు వందమందైనా ఉంటారు నల్లని టైల్‌సూట్లువేసుకుని, ఆర్కెస్ట్రా సంగీతం మనకి అందిస్తూంటే హఠాత్తుగా తెరలేవడం, అయిదారు వందలమంది అమ్మాయిలు ఒకేవిధమైన దుస్తులు ధరించి డాన్స్‌చేస్తూ స్టేజీ అంతా దున్నేస్తూంటే రంగురంగుల లైట్లు ఫోకస్‌చేస్తారు కళ్ళు జిగేలుమంటాయి పేరమౌంట్ రెవ్యూలో ఇద్దరు అమ్మాయిలూ, ఒక మగవాడూ "టేప్" డాన్సుచేస్తూ "ఆక్రా బాటిక్సు" చేశారు వాడు ఆ అమ్మాయిలిద్దర్నీ బంతుల్నో, నిమ్మకాయల్నో ఎగరవేసినట్లు ఎగరవేసి చేతిలోకి చక్కగా తీసుకుని రకరకాలైన

షోజుల్లో సర్కస్‌ఫీట్లు చేయిస్తూంటే ప్రేక్షకులూ, మేమూ మతిపోయి చూచాం పిక్చర్సుమాటకేంగాని ఈ రెవ్యూలు మాత్రం అద్భుతంగా ఉన్నాయి బ్రాడ్వే రాత్రివేళ చూడాలోయ్ ఎడ్వర్టయిజుమెంటుకోసం ఆ దీపాలుచేసే చిత్రచర్య అప్పుడే ఆరిపోతాయి, అప్పుడే వెలుగుతాయి దీపం మళ్లీ ఈ చివరినుంచి ఆ చివరివరకూ పరిగెత్తుకు పారిపోతుంది అక్షరాలు అన్నీ వ్రాస్తున్నట్టు వెలుగుతాయి పరుగెడుతూ రంగురంగులతో – ఆకుపచ్చరంగు, ఎర్రరంగు, పసుపురంగు, ఎన్ననివ్రాయను ! అన్నిరంగుల్లోనూ దీపాలు వెలుగుతాయి నియోన్‌సైన్స్ అట ఇవి పెద్దపెద్ద భవనాలకు వాటిమీద దీపాలుండవు. ఎక్కణ్ణుంచో ఇన్ని అంతస్థుల మేడకీ ''ఫ్లడ్‌లైట్లు'' ఫోకస్‌చేస్తారు మనకి ఆ దీపాలు కనపడవుకాని, భవనాలు వెలిగిపోతూఉంటాయ్ ఇన్నిదీపాలు, ఇంత వెలుతురు కళ్లు మిరుమిట్లుకొల్పుతూఉంటే ఒకసారి జి కె చెస్టర్‌టన్ అన్నాట్ట "దీపాలూ, వెలుతురూ, మెరుపులూ నాకు చాలా ఇష్టం ఆడవాళ్లరీచే కూడా నాకు చాలా ఇష్టం ఎందుచేతంటే మెరిసే ఆభరణాలు ధరిస్తారుగనక" అని అన్నాట్ట బాగానేఉంది కాని ఇదంతా కృత్రిమమైన కాంతికదా ! ఇక్కడి ప్రజలకి వెన్నెలకాని, నక్షత్రాలూ, మెరుపులూగాని, చూచి ఆనందించే యోగ్యత లేదుగదా ! చంద్రుడు నెత్తిమీదికి వస్తేగదా కనపడడం స్కైస్క్రేపర్సు అడ్డేస్తాయికదా ! ఇంక ఈ ఎలెక్ట్రిక్‌దీపాల వెలుతురులో తారాచంద్రుల కాంతి కూడా మాసిపోతుందే. అయితే ఈ దీపాలూ వీటి చిత్రమైన పరుగులూ, కాంతీ చూచి ఆనందించడానికి నాకళ్లు ఎంతో పుణ్యం చేసుకున్నాయని అనుకుంటాను

బ్రహ్మాండమైన పుస్తకాలషాపులు రెండు మూడింటిని చూచాం మా మహారాజావారు చాలా చక్కని పుస్తకాలు చాలా కొన్నారు హోటేళ్లల్లోనూ, షాపుల్లోనూ ఎలెక్ట్రిక్ లిఫ్టులు ఉన్నాయికనక ఎన్నిఅంతస్తులైనా ఇట్టే చేరుకుంటాం. పెద్దపెద్ద షాపుల్లో ''ఎస్కలేటర్సు'' అని ఉన్నాయి మొదటిమెట్టు ఎక్కి నిలబడు క్షణంలో పైమెట్టుమీద ఉంటావు మధ్యలో ఈ అన్నిమెట్లూ ఎక్కనక్కరలేకుండానే మెట్లే ఎల్లప్పుడూ తిరుగుతూ మనుషుల్ని తీసుకుపోతాయి. కేఫిటేరియాలలోనూ, పెద్దపెద్ద రెస్టారెంటులలోనూ ఫలహారాల ప్లేట్లు కౌంటర్లమీద వాటంతట అవేవచ్చి మనవద్ద నిలబడతాయి ఆశ్చర్యం, అంతా మెకానికల్‌గా జరుగుతూఉంటుంది. వాళ జీవితాలే అలాంటివి. ఎలెక్ట్రిక్

పవర్‌మీద బతుకుతున్నారు  అంత ఎందుకు ? వాళ్లు భోజనం చెయ్యడంకూడా మెకానికల్‌గానే  కడుపునిండాలి అంతే  రుచులు అనుభవిస్తూ, చక్కగా నములుతూ, ఖబుర్లు చెప్పుకుంటూ తినడంలేదిక్కడ ఇంగ్లాండులోలాగ ఇంజనులో బొగ్గు వెయ్యమూ ? అలాగే ఈ మనిషి అనే యంత్రంలోకూడా ఏదో ఏడాలి అది పనిచేయడానికి  అంతే, వీళ్ల జీవితాలల్లో స్పీడుతప్ప స్థిమితత్వం లేదు. పాపం జాలివేస్తుంది

అమెరికా వెళ్ళి నువ్వు ఏం చూశావు అని అడిగితే ఒక్కటే ఒక్క జవాబు. అడ్వర్టయిజుమెంట్లు  ఎక్కడ చూచినా అవే కళ్ళు తెరిస్తే అవే. ప్రొద్దున్నే లేచి పేపరు చూస్తే అవితప్ప ఇంకేమీ కనపడవు. ప్రతి న్యూస్ పేపర్లోనూ మూడు వంతులకు పైగా అడ్వర్టయిజుమెంట్లే  మనం నివసించే గదిలో అన్ని వస్తువులమీదా అవే. బయటికిరా క్రింద, పైన, నాలుగు వైపులూ గోడలమీద, రోడ్లమీద, స్తంభాలమీద, ట్రాములమీద, బస్సులమీద, రైళ్ళల్లో సబ్‌వేస్‌లో–ఇంతఎందుకు అడ్వర్టయిజుమెంటు లేనిస్థలం ఒక్క అంగుళంకూడా ఉండదు  ఆకాశంమీద విమానాలు పొగతో అక్షరాలు విడిచిపెడతాయి ఆకాశం అంతా అలుముకు పోయేటట్టు రాత్రిళ్లు తెల్లవార్లూ దీపాలు వెలుగుతాయి, లంకా పురిలాగ పగలు రంగురంగుల అడ్వర్టయిజుమెంట్లు కళ్ళకి గుచ్చుకుంటాయి అడ్వర్టయిజుమెంట్లు తీసేశారనుకో  ఇంక చూడు అమెరికా! స్మశానం అన్న మాట బోడివిధవఅనుకో. ఎలెక్ట్రిసిటీ ఆగిపోయిందనుకో జనం అంతా అమాంతంగా చచ్చిపోయారన్నమాట ఏముంది ? వాళ్ళ జీవితమంతా యంత్రాలమీదే నడుస్తుందికదా ! ఇది నడవకపోతే ఆటకట్టే !

ఇంక ఆడవాళ్ళని చూస్తున్నానుకదా ! నడకలో, బట్టలు వేసుకోడంలో అలంకరించుకోడంలో, మాట తీరులో ఒకళ్ళని మించి ఒకళ్లు ఆకర్షించబడాలనే సంచరిస్తున్నట్టు కనపడుతుంది  ప్రతి ఆడదీ మగవానికి తళుక్‌మని కనపడాలన్నట్టు ఉంటుంది  వట్టి ప్రదర్శన బొమ్మలనుకో. ఆ మాటకు వస్తే అదీ నిజమే షాపు విండోలలో నిలబెట్టే బొమ్మలకి రకరకాల దుస్తులువేసి అడ్వర్టయిజుమెంటు నిమిత్తం నిలబెట్టరూ? పెద్దపెద్ద కంపెనీల వాళ్లు ఒక అమ్మాయికి ఒక చిత్రమైన దుస్తో, వస్తువో ఇస్తారు. ఆ అమ్మాయి హొటేలులోనో, డాన్సులోనో ఎక్కడో వేసుకు తిరుగుతుంది నలుగురి కళ్లూ ఆ దుస్తుమీద పడతాయి,

ఎక్కడిదో తెలుసుకుంటారు ఆ కంపెనీవారికి మర్నాడు లెక్కలేనన్ని ఆర్డర్లు. ఇదొక రకం అడ్వర్టయిజుమెంటు

మగవాళ్ళ ఆశయం డబ్బు సంపాదించడం ఒక్కటే నన్నట్టు కనపడుతుంది విశ్రాంతి, విరామంలేదు డబ్బు డబ్బు డబ్బు! అందుకు ఉత్పత్తి కావాలి. అందుకు యంత్రాలు కావాలి, యంత్రాలు త్వరగా పనిచేస్తాయి ఎక్కువగా తయారుచేస్తాయి. ఈ మగవాళ్లు— ఆడవాళ్లుకూడా – ఆ యంత్రాలలో ఒక భాగమైపోయి ఎడతెగకుండా తిరుగుతారు. వీళ్ళ జీవితాలు ఇలాగ ఉన్నాయి కష్టపడుతున్నారు. ధనం సంపాదిస్తున్నారు. ఊరికే ఆకాశంలోకి పెరిగిపోతున్నారు కాని మానసికంగా శాంతి. సౌఖ్యం ఉన్నాయా అనేదే సందేహం

ఇప్పుడిక్కడ వేసవికాలం ట్వీడ్సూట్లు పనిచెయ్యవు, లినెన్ సూట్లు వేసుకుంటారు అందరూ లినెన్ అంటే అదో విధమైన నార ఫెల్టు హాట్‌లు తీసేసి గడ్డితోనూ, ఆకులతోనూ తయారైన హేట్సు పెట్టుకుంటున్నాం హొటేళ్ళల్లో పంకాలు తిరుగుతున్నాయి ఎల్లప్పుడూ, కొన్ని షాపుల్లోకీ, సినిమా థియేటర్లలోకీ వెళితే ప్రాణం చల్లగా హాయిగా ఉంటుంది ఆ హాళ్ళన్నీ చల్లగా ఉండేటట్టు చేసేస్తున్నారు. వట్టివేళ్ళ తడకలుకట్టి, నీళ్ళుజల్లడం కాదు నాయనా! ఎలెక్ట్రిసిటీ సహాయంతో వాతావరణం అంతా చల్లగా ఉండేటట్లు చేస్తున్నారు ఏర్‌కండిషనింగ్ అట ఉత్తర ప్రదేశాలల్లో చలికాలంలో రాత్రిళ్లు గదుల్లో వెచ్చగా ఉండడానికి కుంపట్లు పెట్టరూ మరి! ఇంగ్లండులో ప్రతీ గదికీ గోడలో ఒక కుంపటీ అమరుస్తారు అవి నెమ్మదిగా పోయి ఎలెక్ట్రిక్ హీటర్సు వచ్చాయి దానివల్ల వాతావరణం వేడిగా ఉన్నట్లే వేసవిలో చల్లగా ఉండడానికి ఈ ఏర్ కండిషనింగ్ బలేగా ఉంటుందిలే! బయట ఎండా వేడిలోంచి ఒక్కమారుగా చల్లగా హిమంలోకి వెళ్ళినట్టు "వీళ్ళ తస్సాదియ్యా! వీళ్ళు ఉడ్డో లుళ్ళోయ్" అన్నాడుకదూ! వాతావరణం, ఋతువులూ ప్రకృతే మార్చేస్తున్నారోయ్

కార్నిజీ, రాక్‌ఫెల్లర్, ఫోర్డులాంటి కుబేరులున్నా దేశంలో మధ్య తరగతి వాళ్ళూ,బీదవాళ్ళూ లేకపోలేదు ధనవంతులకి సరిపోయ్యే వాల్డార్ఫ్ ఎస్టోరియా లాంటి హొటేళ్ళూ ఉన్నాయి, హైయర్ మిడిల్ క్లాసుకి సరిపోయే మెకాల్పిన్ లాంటి హొటేళ్ళూ ఉన్నాయి బీదవాళ్ళకి సరిపడేవీ ఉన్నాయి. లండన్‌లోలాగే

ఇక్కడా లక్షలకొలది రెస్టోరాంటులు ఉన్నాయి అయితే వీటిని ఇక్కడ డ్రగ్ స్టోర్సు అంటారు ఇవికాక ఎన్నో ఆటోమేట్లు ఉన్నాయి మన మద్రాసు స్టేష నులో ఒక అణాకాసు పడేస్తే ఒక ప్లాట్‌ఫారం టికెట్టు దానంతట అదే వస్తుందే అలాంటి ఓషనులన్న మాట. ఒక అయిదు సెంట్ల నాణెం పడేస్తే చాకొలేటో, రొట్టో, కేకో ఏది కావలిస్తే అది దానంతట ఒదే వస్తుంది అక్కడి వూల్‌వర్తు లాంటి చౌకషాపులు ఇక్కడకూడా ఉన్నాయి

న్యూయార్కుని గురించి వ్రాయవలసి వస్తే భారతం అంత గ్రంథం అవుతుంది ఏమైనా న్యూయార్కు ఒక తుఫానులాంటిది ఉరుముతుంది. మెరు స్తుంది హింస పెడుతుంది. చూడడానికి కళ్లునొప్పి పెడతాయి అయినా చూడ కుండా ఉండలేం అసాధ్యం

ఇంక ఈ నయాగరా ఫాల్సు అనే ఊరు వద్దాం. చిన్న ఊరు అందంగా ఉంది. శుభ్రంగా ఉంది. జనసమ్మర్దం లేదు. స్కైస్క్రేపర్లు కూడా లేవు వచ్చీ రావడంతోనే ఊరంతా తిరిగాం ఒక్కసారి జలపాతాల దర్శనం చేశాం మా హోటేలు కిటికీల్లోంచి జలపాతాలు చక్కగా కనపడతాయి దగ్గరగా వెళ్ళి ఎదు రుగా నిలబడ్డాం నీటి తుంపరలతో నిండిపోయిన వాతావరణంలో బట్టలన్నీ తడిసిపోయినట్టు చెమ్మకున్నాయి మానవునిబుద్ధికౌశలమూ, వైజ్ఞానిక పరిజ్ఞానమూ అంతంతటి పెద్దపెద్ద మేడలు నిర్మించగలిగాయి బ్రహ్మాండమైన ఈ జల పాతం, అంత ఎత్తునుంచి హఠాత్తుగా అంత క్రిందికి అంత విశాలంగా పడుతూ ఉంటే ఈ సృష్టి వైచిత్ర్యాన్ని నిర్మించిన భగవంతుని సర్వశక్తిత్వానికి జేజేలు కొట్టాను ఆనందం ఉప్పొంగిపోతే వెర్రి కేకలు పెట్టాను కాని అవి ఎవరి కైనా వినబడితేనా ? హోరులో కలిసిపోయాయి

బ్రహ్మాండమైన జలపాతం ఎదట మానవులు ఎంతటివారు ? పిపీలికం కంటె కనికష్టంకదా ! దాని వేగమూ, శక్తీ, హోరూ ఎంతో భీతావహంగా ఉన్నా గాలిఅంతా నీటి తుంపరలతో నిండిపోయి సూర్య కిరణాలు నీటి మేఘాల మీద పడుతుంటే పెద్దపెద్ద ఇంద్రధనుస్సులు ఏర్పడి కన్నుల పండువు చేస్తుంది. శరీరమూ, హృదయమూ చల్లగాహాయిగా అయిపోయాయి ఆ నీటిహోరుశృతిగా చేసుకుని పాట పాడాలనిపించింది భగవంతుని గొప్పతనాన్ని కీర్తిస్తూ. బ్రహ్మాం డమైన ఈ జలపాతాలు ఒకటి కెనడా సరిహద్దులోనూ, ఒకటి అమెరికాభోన్నూ

ఉన్నాయి. వీటిని కెనేడియన్ ఫాల్సు అనిన్నీ, అమెరికన్ ఫాల్సు అనిన్నీ అం టారు కెనేడియన్ ఫాల్సుని హార్స్ షూ ఫాల్సు అనికూడా పిలుస్తారు గుర్రపు డెక్కలాగు అర్ధచంద్రాకారం కలిగి ఉంటుంది

ఈరీ సరోవరంలోనుంచి నీరు నదిగా ప్రవహించి ఒంటేరియో సర స్సులో కలుస్తుంది ఈ నదినే నయాగరా అంటారు దీని పొడవు 20 మైళ్ళు, ఎత్తుగాఉన్న ఈరీలోనుంచి పల్లంలో ఉన్న ఒంటేరియోలోకి ప్రవహిస్తూ అయిదారు మైళ్ళ దూరం ముందునుంచీ మెట్లు మెట్లుగా దిగి జారుతూ హఠా త్తుగా నూటఅరవై యేడు అడుగుల పల్లంలో పడి జలపాతంగా ఏర్పడింది జల పాతానికి ముందు మెట్లు మెట్లుగా జారే ప్రవాహానికి రేపిడ్సు అని అంటారు ఈ ప్రవాహాన్ని చూడడానికి యాత్రికులందరూ వెళతారు నది ప్రక్కనే ఒక చిన్న రైలు మార్గంకూడా వేశారు ఈ ప్రవాహం పతనం అవడంలో రెండు పాయలుగా చీలి ఒకటి అమెరికన్ ఫాల్సుగాను, రెండోది కెనేడియన్ ఫాల్సు గాను ఏర్పడ్డాయి

అమెరికన్ జలపాతం ఎత్తు 167 అడుగులు. వెడల్పు 1060 అడుగులు. కెనడా సరిహద్దులో పడే గుర్రపుడెక్క జలపాతం ఎత్తు 158 అడ్డుగుల ఎత్తు అయినా వెడల్పు 2600 అడుగులు ఉంటుంది అశేషమైన జలం దీనిగుండా పతనం అవుతుంది పతనం అయిన నీటి వేగానికి బ్రహ్మాండమైన సుడిగుండం ఏర్పడింది. జలపాతానికి వెనకగా ఉన్న రాతి ప్రదేశంలో నీటి ఒరపిడికి సహ జంగా ఏర్పడిన గుహ ఒకటి ఉంది దీన్ని విండ్ కేవ్ అంటారు. రెండు జల పాతాలలోని నీటి ప్రవాహంమీద సస్పెన్షన్ బ్రిడ్జి ఒకటి ఉంది. ఇదే అమెరి కానూ, కెనడాను కలుపుతుంది ఇక్కడ బ్రహ్మాండమైన హైడ్రో ఎలెక్ట్రిక్ పవర్ హవుస్ ఒకటుంది. లోపలికి వెళ్ళి చూడలేదు దీపాలు చూస్తున్నాం కదా ! పవర్ కంటికి కనపడుతుందా ఏమన్నానా ?

రాత్రి డిన్నర్ తీసుకుని గదిలోకి వచ్చేసరికి కిటికీ బార్లా తెరచిఉంది. దాని దగ్గరగానే సోఫా జరిపిఉంది ఏమిటాఅని చూస్తుంటే నా గదిలో పక్కలూ అవీ సర్ది పనిచేసే హవుస్‌మెయిడ్ వచ్చి ఫాల్సు దగ్గరికి వెడితే సరేసరి లేక పోతే ఆ సోఫాలో కూర్చుంటేనే కనపడుతుందని చెప్పింది చీకటిలో ఏమిటి చూడనూ అని అనుకుంటూంటే తళుక్కుమంది. అటు చూస్తినికదా, ఫాల్సంతా

రంగురంగుల కాంతితో వెలిగిపోతూంది నిముష నిముషానికీ రంగులు మారి పోతున్నాయి. జలపాతం క్రిందనుంచి పైవరకూ రంగురంగుల దీపాలు ఫోకస్ చేశారు పసుపురంగు దీపం ఫోకస్ చేసినప్పుడు చూడాలోయ్ నిజంగా కరగ బోసిన బంగారం క్రిందికి జారిపోతున్నట్టుగానే ఉంటుంది ఎర్రటిదీపం వేసి నప్పుడు అదంతా రక్తంలా కనపడుతుంది

ఈవేళంతా జలపాతాల వెంట తిరిగడం అయింది చూడడానికి వచ్చే టూరిస్టుల వినోదం కోసం ఎన్నో ఏర్పాట్లు చేశారు జలపాతంపైనే ఇనుంతో ఒకమంచెలాగ కట్టారు దానిమీద నిలబడితే నీరు మన కాళ్ళకిందనుంచి పోతుం దన్నమాట ఆడవాళ్ళుకూడా భయంలేకుండా ఆ అరుపెక్కి నిలబడతారు ఇంత కంటె చిత్రం రబ్బరు బురకాలు తొడుగుకుని ఫాల్సుకిందికి వెళ్ళి నెత్తిమీద ధారపడుతుంటే నీటిలో గంతులేస్తారు. నీళ్ళు క్రింద పడ్డప్పుడు సుడిగుండా లేర్పడి మహావేగంతో నీరు ప్రవహిస్తుంటే ఆ సుడిగుండం వద్దకి చిన్న చిన్న మోటారు బోట్లు వేసుకుని ప్రవాహానికి ఎదురు వెడతారు

ఫాలపాతం ఎర్పడడానికి ముందు నదిలో నీరు మహా ప్రవాహంలాగ ఉరకలుపెట్టుకుని రావడంకూడా చూశాం రేపిడ్సు అన్నానే అవిఅన్నమాట ఆ ప్రవాహానికి నడుమ మూడు చిన్న ద్వీపాలు ఉన్నాయి వాటిని త్రీసిస్టర్ ఐలాండ్స్ అంటారు వానిమీద సుందరోద్యానవనాలు ఎంతో చక్కగా ఏర్పాటు చేశారు జలపాతం నీరు అమెరికాకీ, కెనడాకీ మధ్యగా ప్రవహిస్తుంది దానిమీద ఒక బ్రిడ్జి ఉంది ఆ బ్రిడ్జిలో సగం అమెరికాది సగం కెనడాదిన్నీ. కెనడా కూడా వెళ్ళాం అనిపించుకోవాలని సరిహద్దుదాటి అక్కడ కాలుమోపి మరీ వచ్చాను కెనేడియన్ ఫాల్సువద్దకు కూడా వెళ్ళి దాని శిరస్సు అధిరోహించాం పాదాలు ముట్టుకున్నాం కెనడా భూభాగంలోనే ఉన్న విక్టోరియా పార్కులో షికారు చేశాం ఇక్కడి దృశ్యాల సౌందర్యం ఎంతని వ్రాయను? రేపు సాయం కాలం ఈ ముగురక్కల దీవులమీద ఒక పిక్నిక్ చేసుకుని రేపు రాత్రి షికా గోకి ప్రయాణం ఇంకా కొన్ని రోజులపాటు ఇక్కడ ఉండాలని ఉంది కాని ఏంచెయ్యగలం? మళ్ళీ వ్రాస్తాను. సెలవు

సీ

వేంకటరావు

---



The Drake Hotel
Lake shore drive
Upper michigan Ave
Chicago
15th August 1930

ప్రియమైన పెమ్మరాజు,

నీ ఉత్తరమూ, మా ఇంటివద్దనుంచి వచ్చిన ఉత్తరమూ మా కోసం ఇక్కడ ఎదురుచూస్తూ ఉన్నాయి అవి చూసుకుని ఎంతో సంతోషించాను నీ ఉత్తరం చదువుతూ ఉంటే మన ఊళ్ళో నీతో ఉన్నట్టుగానే ఉంది నా ఉత్తరాలు నీకు ఎంతో ఆనందాన్ని కలగజేస్తున్నాయని నీవు వ్రాసినా అనవసరమైన సంగతులతో నీకు విసుగు పుట్టిస్తున్నానని భయపడుతున్నా కాని నా అనుభవాలు ఎవరితోనో వెళ్ళబోసుకోవాలి గదా! లోపల అణుచుకోలేనే! అక్కడ మీ అందరి క్షేమం తెలియడంవల్ల నాకూ ఎంతో ఉత్సాహంగా ఉంది ఇక్కడ

నయాగరా ఫాల్సునుంచి నిన్న ఉదయం ఇక్కడ చేరాం షికాగో! న్యూయార్కుని తప్పిస్తే అమెరికాలో ఇంతకంటె పెద్దపట్టణంవేరేలేదు ఇక్కడ దిగడంతోనే మామూలుగాఊరంతా ఒక్కసారిప్రదక్షిణంచేశాం ముప్పయిమూడు లక్షలకి పైగా జనాభా ఉందట ప్రపంచంలోని దేశాలవాళ్ళు ప్రత్యేకంగా నివాస స్థానాలేర్పరచుకున్నారు. వాటికి చైనా టౌను అని, పెర్షియన్ సెటిల్‌మెం టనీ ఇటాలియన్ సెటిల్‌మెంటనీ ఇలాగే ఉన్నాయి పేర్లు. ఇవన్నీచూశాం చెప్పుకో తగినది నీగ్రో సెటిల్‌మెంటు.

నీగ్రోలు బానిసలుగా వచ్చినా అబ్రహాం లింకన్‌లాంటి మహానుభావుల కృషివల్ల వాళ్ళ దాస్య శృంఖలాలు తెగిపోవడమే కాకుండా వాళ్ళకి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లభించాయి. చదువులూ ఉద్యోగాలూ దొరికాయి ఇప్పుడు ఈ షికాగోలో నీగ్రోల వీధిలోఉన్నవాళ్ళంతా చాలా ఐశ్వర్యవంతులు. చక్కని భవ నాలలో నివసిస్తున్నారు. గొప్ప లాయర్లూ, వాణిజ్యవేత్తలూ, పారిశ్రామికులూ ఉపాధ్యాయులూ ఉన్నారు నీగ్రోలు చూడడానికి నల్లగా, బుద్ద పెదవులూ, చిరు వెంట్రుకలూ, లోతుగా చిన్న కళ్లూ, కలిగి అందవికారంగ్గా ఉన్నా, చక్కగా తియ్యగా మాట్లాడతారు. మర్యాదగా ప్రవర్తిస్తారు– ఆడవాళ్లు ముఖ్యంగా. న్యూయార్కులోనూ ఇక్కడాకూడా లిఫ్టుగరల్స్‌గా వీళ్ళే పనిచేస్తున్నారు.

హోటేళ్ళల్లో అనేక పనులు చేస్తుంటారు వంట పనులు బాగా చేస్తారు ఇళ్లూ గదులూ శుభ్రంగా ఉంచుతూ, ఇంటి బాధ్యతలు నిర్వహించే హౌస్ మెయిడ్స్‌గా నీగ్రో వనితలు చాలా ప్రశంసింపబడుతున్నారు సంగీతం అంటే వాళ్ళకి ప్రాణం అంటే వినడంకాదు పాడడం నయాగరాఫాల్సులో ఒకఅమ్మాయిచేత పాడించి విన్నాము ఎంత అద్భుతంగా పాడిందనీ!

మేము ఇక్కడ బసచేసిన హోటలు పేరు డ్రేక్ హోటేల్ ఈ నగరం లోని హోటేళ్ళల్లో గొప్పది ఇక్కడ చాలా ధనవంతులైతేగాని బసచెయ్యలేరు చాలా అందంగానూ పరిశుభ్రంగానూ ఉంటూ మహారాజులు అనుభవించ దగ్గ భోగాలు సమకూరుస్తూ ఉంది ఇన్ని సౌకర్యాలతోనూ వేలాది అతిధులు బస చెయ్యడానికి తగినన్ని గదులూ, రెస్టోరాంటులూ, కేఫిటేరియాలూ, కాన్పర్టు హాలులూ,బాల్‌రూములూ,విశాలమైనడాన్సుహాలులూఉన్న 16అంతస్తుల బ్రహ్మాండ మైన భవనం. మిషిగాన్ సరస్సు తీరాన్ని ఉంది అసలు ఈ షికాగో పట్టణం ఎక్కడ ఉందో తెలుసుగదా మీకు; మిషిగాన్ సరస్సు దక్షిణ తీరాన నిర్మించా రీ పట్టణం ఇది సరస్సే కాని సముద్రంలాగ పెద్ద కెరటాలు కొడుతూ ఉం టుంది నీటి ఒడ్డుకీ తీరాన్ని మైళ్ళ పొడవునా ఉన్న రోడ్డుకీ మధ్య విశాలమైన ఇసుక తిన్నెలు ఈ సైకతాలమీద, ఇప్పుడు వేసవికాలమేమో, పగలంతా రహస్య అవయవాలు మాత్రమే సగం సగం కప్పుకుని సూర్యకిరణ స్నానాలు వేలకొలది దొరలూ దొరసానులూ చేస్తారు ఇసకవేస్తే రాలనంత జనసమర్దం రంగురంగుల పెద్దపెద్ద గొడుగులు ఇసుకలో గుచ్చి కొందరా నీడలో కూర్చుంటారు నల్ల కళ్ళజోళ్ళు పెట్టుకుని ఇసకలో వెల్లకిలా పడుకుని సూర్య కిరణాల వేడికి శరీరంఅంతా నల్లగా మాడిపోయేలాగ వొళ్ళు కాల్చుకోడం ఇక్కడిప్రజల వెర్రిసరదా. అయితే వాళ్ళని గుడ్డలులేకుండా నగ్నంగా చూడడం మనకి, భారతీయులకి చాలా ఎబ్బెట్టుగా ఉంటుంది మర్మావయవాలు కూడా అచ్ఛాదన చేసుకోకుండా తిరిగే స్త్రీ పురుషుల సంఘాలుకూడా ఉన్నాయట ఈ దేశంలో ఇదంతా ఆరోగ్యం కోసం అయితే మనకి చాలా జుగుప్సను కలగ జేస్తాయి

మేము ఉన్న హోటలు బీచ్‌నే ఉంది మా ముందే వేలకొలది జనం నగ్న శరీరాలతో దర్శనం ఇస్తుంటే ప్రత్యేకంగా తీరం అంతా తిరిగి చూడడం

అనవసర మనిపించింది అలా అని మానలేదులే సరస్సు పదిమైళ్ళ పొడవునా ఉన్న ఈ అనాగరిక జంతువుల పిచ్చివేషాలన్నీ చూశాం. వాళ్ళ సిగ్గుమాలిన తనానికి జాలిపడాలో ఏమో తెలియలేదు సరస్సు తీరాన్నే ఉన్న లేక్ షోర్ అవెన్యూలోనే మా హొటేల్ ఉంది షికాగో పట్నం అంతకీ మంచి అందమైన వీధి ఇదే ప్రపంచంలోనే ఇంత అందమైన అవెన్యూ మరొకటి లేదంటారు షికాగోకూడా న్యూయార్కులాగే ఆకాశంలోకి పెరిగిపోయింది తీరం పొడవునా స్కై స్క్రేపర్సు తప్ప చిన్న మేడలు లేనేలేవు నక్షత్రాలకీ ఈ భవనాలమీద వెలిగే దీపాలకీ తేడా తెలియదు. ఈ భవనాల కిటికీలలోంచి వచ్చే వెలుతుర్లు ఎదురుగా ఉన్న సరోవరం నీటిమీద ప్రతిఫలిస్తూ ఉంటే అల్లల్లాడే నీటి తరగల మీద రంగు రంగుల దీపకాంతులు నృత్యాలు చెయ్యడం ఎంతసేపైనా చూడాలని పిస్తుంది పగలు సూర్యకిరణ స్నానాలు. రాత్రిళ్ళు జలక్రీడలు

సముద్రంలాంటి సరస్సుకి పైన గట్టుమీద ఇంకొక సముద్రం కార్ల సముద్రం అవీ కెరటాలకిమల్లే కదులుతు ఉంటాయి మోటారుకార్ల లైట్లు అద్దంలాంటి రోడ్డుమీద ప్రతిఫలించి ఆకాశంలోకి ఈ కాంతుల్ని ప్రసారం చేస్తాయి. న్యూయార్కు కాదు, షికాగో చూడాలి రాత్రిళ్లు అన్నారు గడచిన రాత్రంతా తిరిగాం దీపాలూ వెలుతురూ అడ్వర్టయిజుమెంట్లూ చూస్తూ, నియోన్ సైన్ దీపాల చిత్రచర్య ఏమని చెప్పను! ఇట్టే మన ఎదటినుంచి పరుగెత్తి పారి పోయి వెంటనే తిరిగివచ్చి మన ఎదట నిలబడతాయి సర్కస్ జంతువుల్ని ఆడించేసినట్లు ఈ ఎలెక్ట్రిక్ దీపాల్ని ఆడించేస్తున్నారు రకరకాల ఫీట్లు చేయి స్తున్నారు వీటిచేత. షికాగో శోభ రాత్రిళ్ళు చూడవలసిందే! అంతటి మహో న్నత భవనాలనీ విద్యుద్దీప కాంతులచేత జలకం ఆడిస్తారు భూమ్మీదనుంచి నభోంతరాళం వరకూ వెలుగుబాటలే పగలు ఏముంది వట్టి వ్యాపారం ఎవరో అన్నారుట "ఇంగ్లాండూ వ్యాపారం చేస్తుంది, ఎందుకంటే జీవనోపాధికోసం అమెరికాకూడా వ్యాపారం చేస్తూంది, ఎందుకంటే వ్యాపారం కోసమే" అన్నాట్ట. అలాగే ఉంది ఇక్కడి ఫేక్టరీలూ, పనివాళ్ళూ ఒక్కటే. మానవులుకూడా యంత్రాల్లాగే పనిచేస్తారు. ఫేక్టరీలోనేకాదు నిత్య జీవితంలోని పనుల్లో కూడా.

ఇక్కడి తిండి వేరుగా ఉంది. పళ్ళరసాలూ, పందిమాంసమూ ఎక్కు వగా చెలామణీ అవుతూంది. ఉదయాన్నే బ్రెక్‌ఫాస్టులో మొట్టమొదట పెద్ద

గ్లాసుడు పళ్ళరసమో, టొమేటో రసమో తాగుతారు తరవాత గ్రేప్ ఫ్రూట్ అని అదొక పంపరపనసకాయలాగ ఉంటుంది అది మధ్యగా కోసి తొనలు పెళ్ళగించి దానిలో కొంచం పంచదార చల్లుకుని తింటారు తియ్యతియ్యగా పుల్ల పుల్లగా చేదు చేదుగా ఉంటుంది కోడిగుడ్లతో బేకన్, హేమ్ కలిపి తింటారు ఇవి పందిమాంసంలోనుంచి వచ్చినవే నీరుల్లిపాయలూ ఉప్పుచేపలూ కలిపి తింటారు మంచినీళ్లు ఎక్కువగా తాగుతారు ఏమైనా పళ్ళకూ, పళ్ళరసాలకు ఇక్కడ మక్కువ ఎక్కువ. అమెరికా దేశానికంతటికీ సరిపోయే ఆహార పదార్థాలు ముఖ్యంగా గొడ్డుమాంసమూ, గొఱ్ఱెమాంసమూ ఈ షికాగోనుంచే ఎగుమతి అవుతుందట రోజూ కొన్ని లక్షల గొఱ్ఱెల్నీ కొన్ని లక్షల పశువుల్నీ ఇక్కడ యంత్ర సహాయంవల్ల చంపుతారట

లేక్ షోర్ అవెన్యూ తరవాత ఈ నగరంలో చూడవలసినది "స్టేట్ స్ట్రీట్ " రెండువైపులూ బ్రహ్మాండమైన భవనాలూ, షాపులూ, షో రూములూ అడ్వర్టయిజుమెంట్లున్నూ న్యూస్ పేపర్లు అమ్మేవాళ్ళ రణగోల. మనకి ఏమీ తోచదు. అంటే స్తిమితం ఉంచరన్నమాట రిటైల్ వ్యాపారం అంతా ఇక్కడే జరుగుతుంది గొప్ప గొప్ప షాపులన్నీ ఈ స్టేట్ స్ట్రీటులోనే ఉన్నాయి ప్రపంచంలో అతి విశాలమైన భవనమని పేరుబడ్డ "కమ్మర్షియల్ బిల్డింగ్" కూడా ఇక్కడే ఉంది ప్రపంచంలోకెల్లా పెద్ద షాపు అని పేరుబడ్డ "మార్షల్ ఫీల్డు అండ్ కో" ఈ వీధిలోనే ఉంది అన్ని డిపార్టుమెంటులూ చూడాలంటే చాలా రోజులు పడుతుంది మేము కొంత కొంత చూచి ఏవో సామానులు కొన్నాము ఈ నగరం వచ్చే యాత్రికులందరూ రాత్రివేళ ఈ వీధిలో నాలుగైదు సార్లన్నా తిరిగి దీపాల ప్రభావాన్ని తిలకించక మానరు. గడచిన రాత్రి మేమూ తిరిగాం కార్లలో

ఇక్కడ మూడు పార్కులు చూశాం అవి మిషిగాన్ సరోవర తీరాన్ని ఉన్నాయి గ్రాంటు పార్కు-అనే ఈ జాతీయ ఉద్యానవనాన్ని నగర ప్రాంగణం అంటారు మూడువందల ఎకరాల విస్తీర్ణం ఉంటుందట ఇక్కడ విశేషం ఏమిటంటే ఇందులో ఒకఫౌన్‌టెన్ కట్టారు అది ఎంతఎత్తుఉంటుందంటే దాని చివర గొట్టాంలోనుంచీ, చుట్టూ ఉన్న చిమ్మన గ్రోవుల్లోంచీ పడేనీరు పట్టటానికి కట్టిన పళ్ళెం 280 అడుగుల వెడల్పు ఉందట. ఈ ఫౌన్‌టెన్‌లోనుంచి

నీరు చిమ్ముతూ ఉంటే రంగురంగుల దీపాలు ఫోకస్ చెయ్యడం ఇక్కడా ఉంది సాయంకాలపువేళ దీనిచుట్టూ ప్రేక్షకుల వినోదంకోసం బ్యాండు వాద్యాలూ, ఆటలూ పాటలూ జరుగుతాయి లింకన్ పార్కు అనేది దీనికంటె కూడా చాలా పెద్దది ఇందులోనే జంతు ప్రదర్శనశాల కూడా ఉంది పదకొండు వందల ఎకరాల విస్తీర్ణం ఉంటుందట ఈ పార్కునిండా వృక్షాలూ, లతాకుంజాలూ, మండపాలూ, పూల పందిళ్ళేగాక విశాలమైన లానులూ, కేళీస్థలాలూ, సాలభంజికలూ, స్మారక చిహ్నాలూ లెక్కలేనన్ని ఉన్నాయి ఎక్కడ చూచినా స్టేట్యూలే ఎక్కడ చూచినా మేమోరియల్సే అన్నిటినీ మించినది ఇక్కడ ఉన్న లింకన్ మెమోరియల్ స్టేట్యూ.

ఇంకొకటి జాక్సన్ పార్కు ఎన్ని అని చూడం ' ఇదీ అన్నిపార్కుల లాగే ఉంటుంది ఇది ఊరికి మధ్యగాఉండడంవల్ల ఊరు తిరిగే వాళ్ళకి ఎక్కడో ఒకచోట అడ్డం తగులుతుంది ప్రత్యేకంగా వెళ్లి చూడనక్కర లేదు

అనవసరమైన గాథ అంతా వ్రాస్తున్నాను ఈవేళ ఇంకకొంత సేపట్లో ఈ వూరునుంచి అమెరికా పశ్చిమ తీరాన్ని ఉన్న సాన్‌ఫ్రాన్సిస్కో అనే నగరానికి ప్రయాణం అవుతున్నాం మీకు ఇంకాదూరం అవుతున్నాం అన్న మాట మూడురోజులపాటు రైలుమీదే ఉండాలట అక్కడినుంచి సినీమాలు తీసే హాలీవుడ్ కూడా వెడతాం ఈ తిరగటంలో ప్రతివారమూ నేను వ్రాయలేకపోయినా ఏమీ అనుకోకు అయినా నేను చూచినదేదో నీకు వ్రాయకుండా ఉండగలనా ?

షికాగో అమెరికా దేశస్థు లందరికీ సరిపడ్డ ఆహారపదార్థాలు సప్లయి చేస్తుందని అన్నానే-ముఖ్యంగా మాంసం ఇక్కడ చాలా వధ్యశాలలు ఉన్నాయట ఈ పట్నం అందుకు ప్రసిద్ధికెక్కింది మనవూళ్ళో స్లాటర్‌హవుస్‌లో మూడింటినో, నాల్గింటినో సపాచేస్తారు రోజూ. ఇక్కడ ఒక్క నిముషంలో కొన్నివేలజంతువుల ప్రాణాలు అనాయాసంగా తీసి, చర్మాలు ఒలిచి ఎగుమతి చేయడానికి సిద్ధంచేసే యంత్రాలు ఎన్నో ఉన్నాయట ప్రతిరోజూ లక్షలకొలది పశువులూ, గొఱెలూ, మేకలూ ప్రాణాలు కోల్పోతూ ఉంటాయన్న మాట.

ఈ షి కా గో విడిచిపెట్టడానికిముందు ఒక్క విషయం వ్రాయాలను కుంటున్నా ఈ వూరు ఎంతోగొప్పది. చాలా ఐశ్వర్యవంతమైనది. ఎన్నో వేల ఫ్యాక్టరీలు, మిల్లులూ ఉన్నాయి లెక్కలేకుండా వాణిజ్యం జరుగుతుంది. యూని వర్సిటీ ఉంది దేశానికి కావలసిన ఆహారానికి నిల్వకొట్టు అందంగా ఉంటుంది నానాజాతులవాళ్ళకీ నివాసస్థానం అయితే దీనికి ఒక చెడ్డ పేరు ఉంది. ఇదంటే భయపడడముకూడా కద్దు తస్కరులకూ, జూదరులకూ, లంచగొండులకూ, రౌడీలకూ, దోపిడీమురాగాళ్లకు ఇది నివాస స్థానమనీ, ధనహానీ, మానభంగమూ ఇట్టేజరుగుతాయనీ వీళ్లనీ అదుపులో పెట్టడానికి ప్రభుత్వంకూడా విఫలమయిం దనీ ఇక్కడివాళ్లుచెప్తున్నారు హోటేలువాళ్లు మాకు హెచ్చరికకూడాచేశారు, అయితే దైవకృపవల్ల ఇప్పటికి మాకేప్రమాదమూ సంభవించలేదు ధనవంతుల్ని పిస్తోలుచూపించి జడిపించి ధనం లాగుతారు, ధనవంతుల పిల్లల్ని ఎత్తుకపోయి దాచి ధనం గుంజుతారు ఆడపిల్లల్ని వశపర్చుకొని వ్యభిచారగృహాలు నడుపు తారు ఎన్ని వెధవపనులన్నాచేసే 'రేకెటీర్సు' ఈ వూరునిండా ఉన్నారట. మమ్మల్ని జాగ్రత్తగా ఉండమని హెచ్చరిస్తూ ఈ సంగతులన్నీ మాహొటేల్‌లో మా సదుపాయాలుచూచే గుమాస్తా చెప్పింది

మళ్ళీ సాన్‌ఫ్రాన్సిస్కోనుంచి వ్రాస్తాను. ఇప్పటికి సెలవు

నీ
వేంకటరావు





Mark Hopkins Hotel
San Francisco
21st August 1930

డియర్ వెంకటరావ్

గడచిన శుక్రవారం, 15 వ తేదీ రాత్రి 10 గంటలకి షికాగోలో రైలు ఎక్కాం సాన్‌ఫ్రాన్సిస్కోకి థామస్‌కుక్ ఏజెంటు రైలెక్కించాడు ఒక బలమైన నీగ్రో యువకుడు రైలుపెట్టెలో మమ్మల్ని ఆహ్వానించి మా సీట్లు చూపించాడు పెట్టెలో బెంచీలుగాని, సోఫాలుగాని ఏమీకనపడలేదు తెరతొలగించి చూచేసరికి చక్కని పరుపుమీద తెల్లని దుప్పటిపరచి పక్క సిద్ధంగా వేసివుంది తెరలో రెండు బెర్తులు ఉన్నాయి ఒక బెర్తుమీద నేనూ, రెండోదానిమీద మా పాలో ఇంకొకరూ ఆక్రమించుకుని హాయిగా పడుకున్నాం వేసవికాలంగదా పంకా మూల అమర్చారో కనపడడంలేదుగాని హాయిగా గాలికొడుతూంది. రైలుపెటి అంతా మధ్యనడవడానికి దారి విడిచిపెట్టి తెరలు వేసేసే ఉన్నాయి నీగ్రో అబ్బాయి మాపెట్టెలో ఉన్న ప్రయాణీకుల సామాన్లు ఎవరివివారివి ఎక్కడ ఉంచాలో ఉంచాడు, మాకు ఏంకావాలో అడిగాడు యాత్రికుల సదుపాయాలు మాడడానికి రైల్వే అధికారులు పెట్టెకొక్కణ్ణి ఏర్పాటుచేశారు ఇతణ్ణి స్టివార్డు అంటారు

సరే పడుకున్నాం కాని ఒకఆలోచన మనస్సును వేధించింది మూడు రోజులపాటు ఈ రైల్లో ప్రయాణం చెయ్యాలిగదా, ఈ మూడురోజులూ ఇలా ఈ బురఖాలోనే పడుకోవాలా అని ఈ రైల్లో రెండే క్లాసులు అంతా ఫస్టుక్లాసే రెండోది డీలక్స్ క్లాసు డీలక్స్ ప్రయాణీకులకిమాత్రం ప్రత్యేకంగా గదులు ఉన్నాయి, నిద్రపోయాను ఉదయాన్నేలేచి బాత్‌రూంలోకివెళ్ళి కాలకృత్యాలు తీర్చుకుని తిరిగివచ్చిచూస్తే మా పరదాగాని, మా పక్కగాని, పరుపులుగాని లేవు అక్కడ అన్నీ మాయం అయిపోయాయి అక్కడమాత్రం మంచి మెత్తని సోఫాలు ఉన్నాయి వెర్రిమొహంవేసి చూస్తుంటే ఆ సోఫామీద నాపుస్తకమూ నాచిన్నచేతిసంచీ కనపడ్డాయి. స్టివార్డువచ్చి నీసీటు అదే అన్నాడు పెట్టె అంతలోనూ పరదాలు ఎత్తేసి పక్కలు మడిచేసి సోఫాలుగా తయారుచేసేశాడు స్టివార్డు. పగలంతా ఖాళీగా సోఫాలమీద కూర్చుని ప్రయాణంచేశాం అది

వెస్టిబ్యూల్ ట్రెయిన్ ఏ పెట్టెలోవాళ్ళు ఆ పెట్టెలోనే ఉండిపోనక్కరలేదు రైలుబండి మొదటి పెట్టెలోంచి చివరిపెట్టెవరకూ రైలు నడుస్తుంటేనే వెళ్ళ వచ్చు రాత్రి డైనింగు కేరేజ్‌లోంచి తిరిగివచ్చేసరికి సోఫాలన్నీ బెడ్సుమాదిరిగా మారిపోయాయి ఇదీ తమాషా స్టీమర్లల్లో కొన్నేసి రోజులు ప్రయాణంచేశాం రైల్లోకూడా దూరప్రయాణంచేస్తున్నాం ఇక్కడకూడా కాలక్షేపానికి ఎంత మాత్రమూ లోటులేదు రైలుబండిలో ఆఖరుపెట్టె డైనింగ్ కార్ అన్నమాట ప్రొద్దున్నే అందరమూ అందులోకి కారిడార్లగుండా- రైలు గంటకి అరవై డెబ్బయిమైళ్ళ వేగంతో పోతున్నాసరే—వెళ్ళి బ్రెక్‌ఫాస్టు తీసుకుని తిరిగివచ్చి ఎవరిస్థానాల్లో వాళ్ళుకూర్చొని కిటికీల్లోంచి దేశాన్ని చూడడమో, చదువు కోవడమో చేస్తారు ఆడవాళ్ళయితే కుట్టుకుంటూనో అల్లుకుంటూనో కూర్చుంటారు

ప్రతిపెట్టెలోనూ ఒకప్రక్కని ఒకగదిఏర్పాటుగాఉంది దాన్ని స్మోకింగ్ రూమ్ అంటారు చుట్టలూ, సిగరెట్లూ ఆ గదిలోకి వెళ్ళే కాల్చుకోవాలి స్నేహితులు ఉంటే ఆ గదిలోనే పేకాటో, చదరంగమో ఇంకేవైనా తమాషా ఆటలో ఆడుకుంటారు మధ్యాహ్నం పన్నెండు అయేసరికి డైనింగ్ కార్‌లో నుంచి ఒక కుర్రాడో, కుర్రదో గంటవాయిస్తూ పెట్లన్నీ తిరుగుతారు లంచికి రమ్మని గంట అన్నమాట. కుర్రాడిచేతిలోనుంచి గంటలాక్కొని యాత్రికుల్లో ఉత్సాహవంతురాలైన ఏ చక్కని అమ్మాయో ప్రతిపెట్టెలోకి వెళ్ళి గంట మోగిస్తుంది ఇదొక కాలక్షేపం ఈ గంట మోగించడానికి తాముతామని పంతాలువేసుకుని వస్తుంటారు రకరకాలైన అమ్మాయిలు. కాలక్షేపంకాక చస్తుం దామరి? మర్నాడంతా రైల్లో ఉన్నాం బ్రెక్‌ఫాస్టులూ, లంచీలూ, టీలు, డిన్నర్లూ చేస్తూ రాత్రిళ్ళు మళ్లీ పరదాలలోకి చేరుకోవాలి తమ సీటునంబర్లు బురఖాల మీద పెద్దవిగానే వేసి ఉంచినా పొరపాటున కొందరు వేరేసీటు బురఖాతొలగించి ప్రవేశించడం, అందులోఉన్న ఏ అమ్మాయో కీచుపెట్టడం, కంగారుపడి వాడు ఇవతలపడడం, ఇలాంటి ప్రమాదాలుకూడా జరుగుతూఉంటాయి

షికాగో నుంచి అమెరికాకు అడ్డంగా పశ్చిమతీరానికి పోతున్నామన్న మాట ఈ రైలే న్యూయార్కునుంచి సాన్‌ఫ్రాన్సిస్కో చేరడానికి నాలుగ

పగళ్లూ, నాలుగు రాత్రిళ్లూ ఏకటాకీని ప్రయాణంచెయ్యాలి. షికాగోనుంచి మూడురాత్రిళ్లూ రెండు పగళ్లూ పట్టింది. రైలు మహావేగంతో పోతుంటే, శనివారం అంతా, ఆదివారం అంతా రైల్లోనే ఉన్నాం అనేకమైన కొండల గుండా, అడవులూ ఎడారులగుండా, నదులూ సారవంతమైన వ్యవసాయ క్షేత్రాలగుండా రైలు ప్రయాణం సాగించింది రెండోరోజు సాయంత్రం గ్రేట్‌సాల్ట్‌లేక్ గుండా రైలువచ్చింది వందలకొలది మైళ్లదూరం ఈ సముద్రం లాంటి సరస్సుమీద ప్రయాణం సాగించింది. రాత్రి డిన్నర్‌లో ఈ ఉప్పునీటి సరస్సులోనుంచి పట్టితెచ్చిన తాజాచేపలకూర తిన్నాం ఈ ఉప్పునీటి సరస్సు లోని చేపలు చాలా రుచివంతంగా ఉంటాయని ప్రతీతిఉంది. విశేషం సరస్సుల్లో నీళ్లు తియ్యగా ఉంటాయి సాధారణంగా. ఈ సరస్సులో నీళ్లు ఉప్పగా ఉంటాయట. అందుకే ఆ పేరొచ్చింది

సోమవారం ఉదయం సాన్‌ఫ్రాన్సిస్‌కో చేరాం అయితే ఉదయాన్నే ఒక చిత్రం జరిగింది. ఉదయాన్నే మామూలుగా లేచి పళ్లుతోముకుంటూ కిటికీలోంచి బయటికి చూశాను సముద్రంమీద ప్రయాణంచేస్తున్నట్టు చుట్టూ నీరు కనపడింది రైలు దిగినట్టుగాని స్టీమరు ఎక్కినట్టుగాని జ్ఞాపకంలేదే సరే నేను ఉన్నది రైలుపెట్టే. సముద్రంమీద రైలురోడ్డు వేశారా అని చూస్తే రైలు కదులుతున్నట్టు లేదు విషయం ఏమిటంటే అక్కడ పసిఫిక్‌మహా సముద్రం కొంచెం భూమిలోకి చొరుచుకువచ్చి గల్ఫ్‌గా ఏర్పడింది ఆ గల్ఫ్‌కి ఉత్తరంవైపు ఓక్‌లాండ్ అనే ఊరూ, దక్షిణంవైపు సాన్‌ఫ్రాన్సిస్కో ఉన్నాయి. మా రైలుమార్గం ఓక్‌లాండుతో అంతంఅయింది. మరి సాన్ ఫ్రాన్సిస్కో చేరడం ఎలాగ? ఏదైనా ఫెర్రీబోటుమీద గల్ఫ్‌కి అడ్డంగా సముద్రం దాటాలి ప్రయాణీకులు తెల్లవారుజామున నిద్రలేచి రైలుదిగి ఫెర్రీ బోటు ఎక్కాలి. నిద్రాభంగమున్నూ, సామాను మొదలైనవి చేర్చడమున్నూ కష్టం. అందుకు ఏంచేశారంటే, మేంప్రయాణంచేస్తున్న రైలు రైలుపళంగా ఒక స్టీమరుమీదికి ఎక్కించేశారు అవతలిగట్టుకు స్టీమరుచేరింది రైలుబండి స్టీమరు మీదినుంచి చక్కగా భూమిమీద రైలుపట్టాలమీదికి ఇట్టే ఎక్కింది ఎంతపని చేశారు? తెల్లవాడి మాయల్లో ఇదొకటీ అనుకున్నాం. రోడ్డుమీద కార్లో వెళ్తుంటుంటే ఒక బ్రహ్మాండమైన సస్పెన్షన్ బ్రిడ్జీమీద వెళ్ళవచ్చుట.

ఈ ఉత్తరం నీకు సాన్‌ఫ్రాన్సిస్కో నగరంలో మార్క్ హాప్కిన్స్ అనే ఒక హొటేల్‌నుంచి వ్రాస్తున్నానని పై అడ్రసుబట్టే తెలుసుకుంటావు న్యూయార్కు, షికాగో పట్టణాలకీ ఈ సాన్‌ఫ్రాన్సిస్కోకీ హస్తిమశకాంతరం ఉంది దాదాపు ఆరులక్షల జనాభా అక్కడక్కడ కొంచం పెద్దభవనాలు కనపడుతున్నా స్కైస్క్రేపర్లుగాని వెర్రిజనంగాని లేరు ఈ వూరుచూస్తుంటే మనదేశంలో నీలగిరిమీద ఉన్న ఊటీ, కూనూరులు జ్ఞాపకం వస్తున్నాయి కొండలమీద కట్టారీవూరు రోడ్లు ఎత్తుకీ పల్లానికే కాక మెలికెలుతిరిగి ఉంటాయి ఎదురుగా దగ్గరగా ఉన్నచోటుకు వెళ్లాలంటే ఒక లోతు దిగి, ఒక మెలిక తిరిగి ఒకఎత్తు ఎక్కాలన్నమాట ఒక కొండమీదనుంచి ఇంకొక కొండ మీదికి ఎక్కడమో, దిగడమో చెయ్యాలి అయితే రోడ్లుమాత్రం విశాలంగా పరిశుభ్రంగా ఉన్నాయి మొత్తంమీద ఇంగ్లాండు, అమెరికాలలోని ఇతర పట్టణాల్లాగ మాత్రం కనపడడంలేదు తూర్పుదేశాలవాళ్ళకి దగ్గరగా ఉంది కనక జపానువాళ్ళు, చైనావాళ్లు ఎక్కువగా కనపడతారు. షాపులూ ఇళ్ళూ మొదలైనవి వాళ్లవాళ్ల పద్ధతిని ఉన్నాయి ఆమాటకివస్తే ఇందులో చాలా భాగాన్ని చైనా టౌను అని అంటారు అయితే తూర్పుదేశాల్లోనూ, పడమటి దేశాల్లోనూ ఉన్న అన్నిజాతుల ప్రజలూ ఇక్కడ కనబడుతున్నారు ఇది ఒక పెద్ద రేవుస్థలం మంచి హార్బరుఉంది చైనా, జపాను, హొనోలులూ మొదలైన తూర్పుదేశాలనుంచి పసిఫిక్ సముద్రంమీద వచ్చే పెద్దపెద్దస్టీమర్లన్నీ ఈ ఫ్రాన్సిస్కో అఖాతంలో ప్రవేశించి హార్బరు చేరుకుంటాయి గల్ఫ్ ఏర్పడ డానికి ఉత్తరంనుంచి ఒక రాతిప్రదేశమూ, దక్షిణంనుంచి ఇంకొకటీ నీటిలోకి చొరుచుకువస్తాయి ఈ రెంటిమధ్యనుంచే స్టీమర్లు హార్బరు ప్రవేశిస్తాయి. ఈ ద్వారాన్ని గోల్డెన్‌గేట్ అంటారు అఖాతంలోమాత్రం పెద్దపెద్ద స్టీమర్లు పసిఫిక్‌సముద్రం దాటేవి అనేక దేశాలవి ఎల్లప్పుడూ ఉంటాయి

పట్టణంఅంతా ఎగుడుదిగుడుగానే ఉంటుందనుకోకూడదు మధ్యలోఎత్తైన చదును భూమి ఉంది అక్కడ మంచి మంచి బజార్లూ ఆవీ ఉన్నాయి ఈ వూరు మొయిన్ స్ట్రీట్‌ని మార్కెట్ స్ట్రీట్ అంటారు. ఒక భాగాన్ని టెలిగ్రాఫ్ హిల్ అంటారు, అక్కణ్ణుంచి చూస్తే సముద్రం అంతా కనపడుతుంది.

ఊరంతాకూడా కనపడుతుంది ఇక్కడ ఎత్తయినగోపురం ఒకటి కట్టారు అది ఎక్కి చూస్తే చుట్టూఉన్న చిన్నచిన్న కొండలూ, వాటిమీద బంగాళాలూ, తోటలూ, వనాలూ చక్కగా కనపడతాయి. ఈ పట్నం నాకు నచ్చింది అందులో ఇప్పుడు ఫ్లీట్ డే ఉత్సవాలని వారంరోజుల పాటు చేస్తున్నారు ఊరంతా జెండాలతోనూ తెరచాపలంతటి పతాకాలతోనూ అలంకరించారు కలకల లాడుతూ ఉంది ఫ్లీట్ మెమోరియలున్నూ పార్కున్నూ కూడా చూచాం మేము ఉన్న హోటలులో నిలబడితే ఊరు యావత్తూ కనపడుతుంది. ఇప్పుడే ఒక గొప్ప ఉత్సవం చూచి వచ్చాను ఫ్లీట్‌డే సందర్భంగా బ్రహ్మాండమైన మిలిటరీ ఊరేగింపు జరిగింది అందులో నేవీ వాళ్ళేగాక ఇతర శాఖలు కాల్బలమూ. అశ్వదళమూ, ఫిరంగీ వాహనాలూ రకరకాల మిలిటరీ బ్యాండు జట్టులూ, చివరికి ఆకాశంమీద విమానదళాలూ అన్నీ నాలుగుమైళ్ళ పొడవు ఉన్న ఊరేగింపులో పాల్గొన్నాయి జనంలో ఉత్సాహానికి మితిలేదు మేడలన్నీ కిటకిటలాడుతూ జనంతో నిండిపోయాయి పేవ్‌మెంట్సు చెప్పనక్కరనే లేదు ఇసకవేస్తే రాలకుండా నిలబడ్డారు అమెరికా జాతీయ జెండా కనపడిందంటే అందరూ టోపీలు తీసి అతిగౌరవంగా నిలబడతారు, ఇదొకటి చెప్పుకోతగ్గది అమెరికనులేకాదు పశ్చిమ దేశాల వాళ్ళందరికీ తమతమ జాతీయ పతాకాలమీద ఉన్నభక్తి గౌరవాలు ఉగ్గుపాలతో జీర్ణించిపోయినవా అనిపిస్తుంది మనకీ ఒక జాతీయ పతాకం ఉంటేనా అనిపించింది మనసులో మహాత్ముడి కాంగ్రెసు జెండా మన జాతీయ జెండాగా ఎప్పటికైనా మారుతుందా అనుకున్నాను

రేపు ఇక్కణ్ణుంచి లాస్ ఏంజిలిస్‌కి ప్రయాణం హాలీవుడ్ ఇక్కడే ఉంది తప్పకుండా ఏవైనా స్టూడియోలు చూస్తాను వివరాలు తప్పకుండా వ్రాస్తాను అయితే ఒక్క విషయం తలుచుకుంటే మీకింత దూరాన్ని ఉన్నానా అని భయమూ, ఆశ్చర్యమూ కూడా కలుగుతోంది. అమెరికా పశ్చిమ తీరాన్ని గదా ఉన్నాం ఇప్పుడు. ఈ వూరునుంచి వచ్చిన దారినే తిరిగి తూర్పుగా వెళ్ళినా పసిఫిక్ మీదుగా పడమరగా వెళ్ళినా మీకు దగ్గర అవుతానన్నమాట ఇక్కణ్ణుంచి సరాసరి వచ్చిన దారినే రైళ్ళమీదా స్టీమర్లమీదా ఆగకుండా ప్రయాణం సాగిస్తూ తిరిగి మీ అందరి మధ్యా ఉండాలంటే సరిగా 30 రోజులు పడుతుంది వెంటనే రావాలంటే వీలులేదన్నమాట. అందుకే భయం ఆశ్చర్యం ఎందుకంటే'

ఇంతదూరం ఎలావచ్చానా అని ! ఇంకో సంగతి ఆలోచిస్తూ ఉంటాను ఇప్పుడు గడియారం చూస్తున్నా రాత్రి 11½ గంటలయింది ఇదే సమయంలో మీకు ఎంత అవుతుందో అని లెక్కవేస్తున్నాను మాకంటె మీరు పదిమూడున్నర గంటలు ముందు ఉంటారు అంటే ఇప్పుడు మీకు ఉదయం 10½ గంట లయిందన్న మాట మీకు ఉదయించిన సూర్యుడు మాకు ఇక్కడ ఉదయించ డానికి 13½ గంటలు పడుతుంది పాతాళలోకంలో కదా ఉన్నాం ఇప్పుడు మేము ! ఇప్పుడు మాకు రాత్రి, మీకు పగలున్నూ మా తిరుగుప్రయాణంలో గడియారాలు తిప్పి టైము సరిచేసుకుంటూ పోవాలన్నమాట

సెంట్ లూయీ స్టేషన్ స్టాల్‌లో ఎంతో చక్కని అమ్మాయి సేల్స్ చేస్తూంటే వెళ్ళి చూడా లనిపించింది ఏదో కొనాలనిపించిందికూడా ఇదికాదు అది అనీ, అదికాదు ఇది అనీ ఎంతో తికమక పెట్టినతరువాత ఒక చిన్న ఫొటో ఫ్రేమ్ కొన్నాను అయితే అది ఇండియా పంపాలి ఎట్లా అన్నాను అడ్రసుఇస్తే తనే పంపిస్తా నన్నది లండన్‌లో ఉండగా ఫొటోమేటన్‌లో తీయించుకున్న నా ఫొటో ఒకటి ఆ ఫ్రేమ్‌లో పెట్టి ఇచ్చాను నీకు బహుశా ఈ ఉత్తరంతోపాటే అందుతుంది ఎందుకు చెప్తున్నానంటే పార్సిలుకట్టడం, పోస్టుచెయ్యడం ఇలాంటి పనులు వాళ్లు ఊరికినే చేసిపెడతారు. మనం డబ్బు ఇచ్చేశాం సరుకు వాళ్లదగ్గరే ఉంచేశాం, తీరా మనంవెళ్లాక, వాళ్లు పంపుతారా లేదా అని శంకించ నక్కరలేదు ఇలాంటి విషయాల్లో వాళ్లమీద చాలా నమ్మకంగా విడిచిపెట్టెయ్యవచ్చు ఫొటోమేటన్ అంటే ఏమిటో అనుకునేవ్ ! కెమెరా ఎదట నిలబడితే అయిదు పోజులతో ఫోటోలుతీసి అయిదునిమిషాలల్లో కాపీలు ఇస్తారు ఇలాంటి ఫొటోమేటనులు ఈ దేశాలన్నింటిలోనూ ప్రతీచోటా చాలా ఎక్కువగా ఉన్నాయి

ఇంక ఉంటాను మీరందరూ క్షేమం అనే ఆశిస్తాను.

సీ

వేంకటరావు.

---



Los Angeles Biltmore
Los Angeles
California
29th August 1930

ప్రియమిత్రుడు వెంకట్రావ్కి

నువ్వు ఎంతో ప్రేమతో రాసిన ఉత్తరం ఇక్కడ అందింది ఆ ఉత్తరం చదువుతూంటే ఇంత దూరాన్నా ఉన్నా మీ అందరి మధ్య ఉన్నట్టనిపించింది మీ రందరూ క్షేమంగా ఉన్నందుకు సంతోషించాను నేనూ ఖులాసాగా ఉన్నాను సాన్ ఫ్రాన్సిస్కోలో 22 వ తేదీని బయలుదేరి 23 వ తేదీ ఉదయం తొమ్మిది గంటలకి ఈ వూరు వచ్చాం రైలుస్టేషనులో దిగి యథాప్రకారం ఊరంతా ప్రదక్షిణం చేసి బిల్ట్ మోర్ అనే ఈ హోటేల్లో బస చేశాం ఇది ఈ వూళ్ళో చాలా పెద్దదైన క్లాస్ హోటేల్ మేము ఏ వూరు వెళ్ళినా చాలా ఖరీదైన హోటేళ్ళల్లోనే బసచేస్తున్నామని ఇదివరకే వ్రాశానేమో ! దీనికి 14 అంతస్తులు ఉన్నాయి ఇక్కడ కూడా కొందరు సినీమాతారలు బసచేస్తూంటారు కొందరు డాన్సులకీ వాటికీ వస్తూంటారు ఊరు చాలా పెద్దదిగానే ఉంది అమెరికాలో పెద్ద పట్టణాలన్నీ ఎలా ఉంటాయో అలాగే ఉంది హోటేల్ ఊరికి మధ్యలోనే ఉంది ఎదురుగా చక్కని పార్కు ఒకటి ఉంది దాదాపు 16 లక్షల జనాభా ఉంటుందన్నారు హాలీవుడ్ దీనికి శివారు పట్నం అయితే అంతా కలిసే ఉంది

మేము ఇక్కడ ఉండగా రెండు సంఘటనలు జరిగాయి నార్మాషీరర్ ప్రసవించడం ఒకటి "Lon Channey of one thousand and one faces" మరణించడం రెండు వార్తా పత్రికలలో ఇంకొక్క విషయంలేదు అతన్నిగురించి తప్ప అందులోనూ ఈ మధ్యనే "హంచ్ బ్యాక్ ఆఫ్ నాటర్ డామ్" చిత్రంలో నటించాడు శవాన్నిపాతిపెట్టడానికి శవపేటికను మా హోటేల్ ముందునుంచే తీసుకువెళ్ళారు అంతటి ఊరేగింపు నేను ఎన్నడూ చూడలేదు సరేసరికదా ఎన్నడూ ఊహించనూలేదు ఊహకు అందనంత పెద్ద ఊరేగింపు శవాన్ని ఉంచిన బండివెనక ఆయనమీద కప్పిన పూలచక్రాలు మోయడానికి పదిలారీలు ఉన్నాయి మూడు వరసలలో మోటారుకార్ల బారులు కొన్ని మైళ్ళ పొడవున నడిచాయి ఇంక ఊళ్ళో మోటారుకార్లు ఉన్నాయా అనిపించింది

లాస్ ఏంజిలిస్‌లోనూ, హాలీవుడ్‌లోనూ, చుట్టుపక్కలనూ ఉన్న కాట్లా జనాభా ఈ ఊరేగింపులోకి వచ్చారు మూడు గంటలసేపు నిలబడ్డారు ఇంక కార్లు వెనకాల ఉన్నాయి ఊళ్ళో ట్రాఫిక్ అంతా బంద్ అనే సంగతి వేరే చెప్పాలా? ఏ మహారాజుకీ, ఏ చక్రవర్తికీ ఇలాంటి గౌరవం జరగదు సినిమా స్టార్లకి ఇంత గౌరవం ఇస్తారు ఇక్కడ

ఈ దేశంలో న్యూస్ పేపర్లు అమ్మే కుర్రవాళ్ళు చెవులు బద్దలయ్యేలాగు కేకలు పెడుతూ హెడ్‌లైన్సు గొంతు చించుకుని అరుస్తారు ఊరులో అతి సంతోషమైన వార్త అయితే ఆకాశం కూడా దద్దరిల్లిపోతుంది మూడు రోజుల క్రితం జరిగిన ఇంకో సంఘటన "నార్మాషియరర్‌కు మగపిల్లవాడు జన్మించాడు 9 పౌనుల బరువు ఉన్నాడు తల్లీ పిల్లాడూ సుఖంగా ఉన్నారు ప్రసవం అయిన తరవాత ఆమె కళ్ళుతెరిచి చూచి మగపిల్లవాడని తెలుసుకున్న తరవాత ఆమె దరహాసం చేసింది ఇలాంటివే ఎన్నో పేపర్లన్నింటిలోనూ ఇంక ఆమెను అభినందించడానికై లేనేలే, పిల్లవాణ్ణి చూడడానికై లేనేలే జన ప్రవాహం ఆ నర్సింగ్‌హోమ్‌వైపు మళ్ళింది లక్షలకొలది జనం అలా ఎగబడు తూంటే వాళ్ళకి విశ్రాంతి ఉండవద్దూ? ఆసుపత్రి సిబ్బంది వాళ్ళని వారించ గలదా పోలీసుల్ని, మిలిటరీని పిల్పించి తల్లి బిడ్డలను రక్షించవలసివచ్చింది నువ్వు ఇక్కడే ఉంటే నువ్వూ ఎగబడేవాడివని అనుకుంటున్నాను నార్మా షియరర్ అంటే నీకు ఎంతో ఇష్టం అని నాకు తెలుసుగదా! ప్రపంచంలో అంత కంటె అందమైన మనిషి లేదని చెప్పేవాడివి ఆమె బొమ్మ ఉన్న చాకొలేట్ పెట్టె నువ్వు నా కిచ్చావు అది పిరాపురంలో భద్రంగా ఉందిలే అన్నట్టు మరచి పోయాను ఆమె నటించిన "Divorcee "అనే చిత్రం నిన్ననే చూశా నిక్కడ ఎంత గొప్పగానో నటించింది చూస్తావుగా మనవైపుకి వచ్చేటప్పటికి ఒక సంవత్సరమైనా పడుతుందిలే

నువ్వు చాలా సంతోషిస్తావు, నేను ఇద్దరు మహావ్యక్తుల దర్శనం చేశాను అనుకోకుండా లభించింది క్రిష్టీ అని ఒక మిలియనేర్ ఉన్నాడీవూళ్లో. ఆయనకీ మన కుక్కలు స్మూత్‌ఫాక్సుటెరియర్స్ అంటే ఇష్టమే గాక ఆయనగారు ఇంటర్నేషనల్ స్మూత్‌ఫాక్సుటెర్రియర్ అసోసియేషన్‌లో మెంబరుకూడాను ఆయనను కలుసు కోడానికి మన మహారాజావారు వెడితే కూడా నేనూ ఉన్నాను. ఆ క్రిష్టీగారు

ఎక్కడికి వెళ్తున్నారో తెలుసా మమ్మల్ని? ఆయనకి ఒక సినిమా స్టూడియో ఉంది దాన్ని క్రిస్టీ స్టూడియో అంటారు అక్కడ జరిగింది మా సమావేశం తర్వాత మమ్మల్ని స్టూడియో అంతా త్రిప్పి చూపించారు సినిమాలు పెద్ద పెద్ద షెడ్లల్లో తీస్తారు ఆ షెడ్లల్లోనే ఇళ్ళూ, వాకిళ్లూ, వీధులూ, గుళ్ళూ గోపురాలూ అన్నీ అట్టలతో కట్టి తయారుచేస్తారు ఆ షెడ్లనే ఫ్లోర్స్ అంటారు ఒక 'ఫ్లోరు' లోకి వెళ్ళేసరికి హాస్యపుడిగా ఒక దొంగ సెట్టింగుల్లో తిరుగుతూ ఉన్నాడు లిప్పుగా అతనిదగ్గరికి తీసుకెళ్ళి మా మహారాజావారిని పరిచయం చేశారు ఎవరో తెలుసా అతను? 'హెరాల్డ్ లాయిడ్'' అయితే అతను మేకప్‌లో లేడు కాని సినిమాలోని ఫీచర్సు ఇట్టే కనిపెట్టేశాను వెళ్ళబోయే ముందు వెనకాల నిలబడి ఆశ్చర్యంగా చూస్తున్న నా దగ్గరకు వచ్చి చెయ్యి చాపాడు మహారాజావారూ క్రిష్టీగారూ వెనక్కి తిరిగి వెళ్ళిపోతున్నారు నాకు సమయందొరికింది మాట్లాడటానికి నేనూ చెయ్యి చాపి అందుకుని కరచాలనం చేస్తుంటే అతనే అడిగాడు ఇండియాలో తన పిక్చర్సు ఏమైనా చూశావా అని! మనం ఇద్దరం కలిసిచూశాం కదా! తక్షణం చెప్పేశాను "Grandma's Boy" చూశాననీ నాకు చాలా ఇష్టమనీన్నీ చాలా సంతోషించి చెయ్యి గట్టిగా నొక్కి షేక్‌హేండ్ చేశాడు క్రిష్టీగారు చెప్పారు మధ్యాహ్నమైతే చార్లీ చాప్లిన్‌ను చూడవచ్చునని మొన్న మా బృందం అంతా బయలుదేరాం ఏదో పిక్చరు తీస్తున్నాడు చార్లీచాప్లిన్ మేకప్‌లోనే ఉన్నాడు మమ్మల్నందర్నీ చూచి చాలా సంతోషించాడు మహారాజావారితో మాట్లాడి చాలా జోక్సు విసిరేడు విరగబడి నవ్వేరాయన మా చిన్నా నాయన మహారాజావారినీ చార్లీచాప్లిన్‌నీ దగ్గరగా నిలబెట్టి ఒక ఫోటో కూడా తీశారు నేను పిఠాపురం వచ్చాక చూపిస్తానులే

ఇక్కడ ఉన్నన్నిరోజులూ ఏదో ఒకపూట క్రిష్టీ స్టూడియోకి రాకతప్పడం లేదు ఎందుచేతనంటే మహారాజావారికి ఆయన గొప్ప స్నేహితుడైపోయాడు మేము ఈ స్టూడియోస్‌లోనే ఇంకా గ్లోరియా స్వేన్‌సన్‌నీ, బీబ్ డేనియల్స్‌నీ చూశాను నువ్వు మారీ పిక్‌ఫర్డ్‌నీ, లారెటాయంగ్‌నీ కాదూ చూడమన్నావు? వీలు కలగజేసుకుంటాను ఇక్కడ ఎంతమాత్రమూ తీరుబడి ఉండడంలేదు ఇందులో ఇంకొక విశేషం ఏమిటంటే మన తోటపల్లి శాంతి ఆశ్రమం ఓంకార స్వాములవారు ఈ వూళ్ళో ఉన్నారు ఆయనా ఆయన శిష్యులూ మమ్మల్ని విడిచిపెట్టడంలేదు. మేము ఈ వూరొచ్చిన మర్నాడే నా గదిలోకి టెలిఫోను

వచ్చింది అవతల స్త్రీ కంఠం తాను "మిస్సెస్ హోగాన్'ననీ, స్వామీ ఓంకార్ శిష్యురాలననీ, ఓంకార్ తమఇంట్లో ఉన్నాడనీ, మా రాక న్యూస్ పేపర్లో చూచి మహారాజావారి గొప్పతనాన్నిగురించి ఓంకార్ తమకు చెప్పారనీ వారి దర్శనం ఏర్పాటుచేయమనీ కోరిందామె మేమే వస్తున్నామని మహారాజావారు చెప్పమన్నారు సాయంకాలమే హోగాను ఇంటికి వెళ్లాం వారి ఇల్లు హాలీవుడ్‌లో బివర్లీహిల్స్ దగ్గరగా ఉంది. బివర్లీహిల్సునుగురించి తరువాత వ్రాస్తాను హోగాను ఇల్లు ఇల్లుకాదది మహారాజుల పేలస్‌లావుంది చాలా ధనవంతురాలై వుండాలి స్వామీజీ హాల్లో సోఫా మీద ఎఱ్ఱ దిండుల మీద కూర్చుని వున్నారు హాల్లో జనం ఊపిరిపట్టి వెలుగుతున్నారు ఆయన్ని వాళ్ళంతా ఒక దేవుణ్ణి చూసినట్లు చూస్తున్నారు ఒక రోజు రాత్రి వాళ్ళ ఇంటికి డిన్నర్‌కి ఆహ్వానిస్తే మహారాజావారి కుటుంబం అంతా మేమూ వెళ్లాం రాజాధిరాజులు చేసే విందులా వుంది వారింట్లో పనిచేసే ఒక నీగ్రో అమ్మాయి చేత స్వామీజీ "హరే రామ హరే రామ రామ రామ హరే హరే, హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే అని పలికించారు కృష్ణ అని అనడానికి ఆ అమ్మాయి ఎంత సతమతమయిపోయిందో పాపం! తెలుగు పాట కూడా ఒకటి పాడించారు నేను మాత్రం ఇంగ్లీషు పాటే పాడించుకున్నాను ఎంత శ్రావ్యమైన కంఠమో! నీగ్రోలందరివీ చాలా శ్రావ్యమైన కంఠాలట

బివర్లీహిల్సుకి వెళ్ళాం ఈ ఎత్తైన ప్రదేశం మీద తెగ డబ్బు గడించిన సినీతారలు — ఆడవాళ్ళూ మొగవాళ్ళూ కూడా — తమ భోగాలు అనుభవించడానికి చిత్రమైన భవనాలు కట్టుకున్నారు ఈ బివర్లీహిల్స్ మీద చక్కని రోడ్లు వేశారు రోడ్లకి రెండువైపులా రంగు రంగుల పూలచెట్లు వేశారు భవనాలే కాక ఇతర పరిసరాలన్నీ ఎంతో శుభ్రంగా, శృంగారంగా ఉంచారు ఇక్కడికి వచ్చే యాత్రికులందరూ ఈ బివర్లీహిల్స్ చూడడానికి వస్తారు రోడ్లన్నీ సముద్రానికి దారితీస్తాయి యాత్రికులకి తారల గృహాలు చూపించడానికి గైడ్లు కూడా తిరుగుతూ వుంటారు ఏమిటి ఇక్కడ చూచేదేమిటి అనుకోకు నువ్వే ఈ వూరొస్తే ఈ వూళ్లో గొప్ప భవనమో మంచి పార్కో చూడడానికి ముందుగా నీకు ఇష్టమైన నీ అభిమానతార మేరీ పిక్‌ఫర్డు ఇల్లు ఎలాంటిదో, ఆమె ఎంత చక్కని గృహంలో నివసిస్తోందో, ఆమె ఇంట్లో ఎటువంటి కుర్చీలూ, సోఫాలూ

వున్నాయో, ఇంటియిందు గార్డెన్‌లో ఎలాంటి పువ్వుల మొక్కలు పెంచుతుందో, ఇవన్నీ చూస్తుంటావు

అలాగే ఇక్కడికి వచ్చే సినిమా పిచ్చివాళ్ళందరూ చాలా పేరు కెక్కిన తారల ధనమైనా మావి ముక్తి పొందుదాం అనే ఆశతో వుంటారు వాళ్ళు లోపలగా అంతఃపురాలలో నివసిస్తూ ముందు భాగం చూడడానికి వచ్చే అభిమానుల్ని పిడిపెడతారు మ్యూజియములో, పార్కులో చూడడానికి పోయి సెట్టు ప్రజలు ఎగబడి చూస్తారు అయితే కొందరు తమ ఇళ్ళల్లో ఏదో ఒక ప్రత్యేకత కల్పిస్తారు ఇంతెందుకు ? నేనూ ఒక ఇల్లు చూచాను, హెరాల్డ్ లాయిడ్ దట ఇతని కాంపౌండులో వున్న ఈతకొలను అతి నవీనంగా వుంది స్ఫటికంలాంటి నీరు తళ తళా మెరుస్తూంది చుట్టూ కట్టిన అంచు గ్లాస్‌తో కట్టారో, మార్బుల్‌తో కట్టారో ? దాని చుట్టూ అందమైన గడ్డి తివాసీలు వాటి మీద చంద్రకాంత శిలావేదికలు వానికి చుట్టూ సువాసనలు వెదజల్లే గులాబీలూ, మల్లెలున్నూ, అక్కడక్కడ పూ పొదరిళ్లు ప్రబంధాల్లో చదవడం లేదూ రాజ ప్రాసాదాలలోని ఉపవనాలవర్ణనలు ? అవన్నీ ఇక్కడ నిజంచేశారు వేసవికాలం కదా ఇప్పుడు రాత్రివేళ ఆ యజమానీ, ఆయనకు ప్రియమైన అతిథులూ వచ్చి జలక్రీడలాడుకుని, వేదికల మీద దొర్లి, పొద రిండ్లల్లో దూరి, సువాసనలు ఆఘ్రాణించి కాలం ఆనందమయంగా గడుపుతారు

డబ్బు ఉన్న వాళ్ళందరూ ఇలా భోగం అనుభవించగలరా ? అదృష్టం అను లేకపోతే పూర్వజన్మ సుకృతం అను. కారు దిగకుండానే చాలా భవనాలు చూశాం డగ్లస్ ఫెయిర్ బేంక్సు ఇల్లూ చూశాను ఇది కూడా చూడతగినదే మేరీ పిక్‌ఫర్డు కనపడలేదంటే, అంత దూరం వెళ్ళి నువ్వుచేసిన పని ఇదా అంటావు. నిజం చెప్పవలసివస్తే ఈ పేరు కెక్కిన తార లెవ్వరూ ఇళ్ళవద్ద కనపడరు మనలాంటి పిచ్చివాళ్ళనుంచి తప్పించుకోడానికి ఏమూలో దాక్కుని ఉంటారట అలాగే గ్లోరియా స్వేన్సన్ ఇల్లూ, గ్రిటా గార్బో ఇల్లూ ఇంకా మనకి పేరు అంతగా తెలియనివాళ్ళ ఇళ్లూ అన్నీ పైనుంచీ, కాంపౌండులో ఒక రౌండు తిరిగి చూశాను కొందరి ఇళ్ళల్లోకి సముద్రపుగాలి తొంగిచూస్తుంది, కొందరి ఇళ్ళల్లోకి సరుగున చొరబడుతుంది.

శాంతామోనికా అని ఇంకొకభాగం. సరాసరి పసిఫిక్ మహా సముద్రాన్ని అంటిపెట్టుకునే ఉంది చల్లగాలికోసం అక్కడికి కారులు ప్రవాహంలాగ వెళుతూ ఉంటాయి రోడ్లమీద తెల్లని దుస్తులు వేసుకుని చక్కని అమ్మాయిలు వందలకొలది తిరుగుతూ ఉంటారు ఎందుకంటె ఇక్కడ సినిమా వ్యాపారానికి చక్కని వయసులోఉన్న అమ్మాయిలకే గొప్ప గిరాకీ। అనేక జాతులవాళ్లు, అనేక దేశాలవాళ్ళు డబ్బు సంపాదించాలనీ, కీర్తిగడించాలనీ ఎగేసు గుర్రాల్లాగ పరుగెడుతూంటారు, పేవ్‌మెంటు ప్రక్క నాటిన పామ్‌చెట్లు సిటీల్లో హాలీవుడ్ తీర్చికట్టిన గ్రామం గ్రామం అనే అంటాను ఎందుచేతంటే షికాగో న్యూయార్క్ నగరాలకి దీనికీ పోలికె లేదు గనుక రోడ్లల్లో పేవ్‌మెంట్లు మెరుస్తూ ఉంటాయి ఒకే రకం వృక్షాలతో సృష్టి [illegible] పచ్చగా చల్లగా నీడ నిస్తూంటాయి వీటినే బౌలివార్డు లంటారు ఆ వీధుల్లోబడి జీవనోపాధి కోసం వందల వేల జనం అందరిదీ ఒకటే వృత్తి 'షూటింగ్' అంటే తుపాకీ పేల్చడం అనుకునేవు చిత్రం తియ్యడాన్ని షూటింగ్ అంటారు కదా

ప్రతిరోజూ లాస్ ఏంజిలిస్‌నుంచి రెండు పూటలూ హాలీవుడ్ రావడం తప్పడం లేదు క్రిస్టీన్ స్టూడియో తప్పదు హోగాటలూ డ్రైవింగ్ తప్పడం లేదు అయితే ఈ సందులోనే ఎలాగో ఏర్పాటు చేసుకొని ఇంకొక గొప్ప స్టూడియో దర్శించాను యూనివర్సల్ స్టూడియోస్ ఊరికి చాలా దూరంలో ఉంది మా హోటేల్‌కి దాదాపు 16 మైళ్ళ దూరంలో ఉంది దాన్ని యూనివర్సల్ సిటీ అంటారు, నిజంగా ఆ స్టూడియోస్‌ని సిటీ అంటే తప్పులేదు. కొన్ని వందల చదరపు మైళ్ళ విస్తీర్ణంలో ఈ-సిటీ-స్టూడియో నిర్మించారు అమెరికన్ సిటీలలోని భవనాలాంటివే ఇక్కడా కట్టారు మెరిసిపోయే రోడ్లు మైళ్ళతరబడి ఉన్నాయి సరస్సులు ఉన్నాయి కొండలు ఉన్నాయి ఎడారులూ, అడవులూ ఉన్నాయి ఈ స్టూడియో ప్రత్యేకం ఒక ప్రపంచం లేదంటే ఒక యూనివర్స్ అన్నా తప్పులేదు ఒక స్నేహితుని పలుకుబడిమీద స్టూడియో చూడడానికి అనుమతి సంపాదించాం చెప్పిన టైముకి మేము గేటువద్ద సిద్ధంగా ఉన్నాం కారులో మాకు ఒక కారు ఎదురుగావచ్చి స్వాగతం ఇచ్చింది ఇద్దరు అమ్మాయిలు మమ్మల్ని ఆ కారులో ఎక్కించుకుని తిన్నగా ఒక భవనంలోకి తీసుకువెళ్ళారు ఒక ఆమె ఒకడైరెక్టరుకి ప్రైవేట్ సెక్రటరీ రెండో ఆమె మాకు స్టూడియో చూపించడానికి నియోగించబడిన గైడ్ డైరెక్టర్ రూములో

పరిచయాలు అయాక మాకు టీ ఇచ్చారు మాతో ఈ అమ్మాయిలేగాక, ఇండియన్ ప్రిన్సెస్ ఎలా ఉంటారో అని మమ్మల్నీ మా డ్రెస్సుల్నీ చూడడానికి వచ్చిన కొందరు తారలూ, తారాపథాన్ని అందుకోబోతున్న చిన్న తారలూ కొందరు మాతో టీ తాగారు మాతో మాట్లాడాలని వాళ్ళకెంతో సరదా పాపం కానీ మాకు టైము లేదే మూడు గంటలలో స్టూడియో అంతా చూడాలి

గైడ్ మమ్మల్ని తీసుకొని ఆ ప్రపంచం అంతా చూపించింది అట్టలతోనూ, ప్లయివుడ్‌తోనూ, కొయ్యలతోనూ కట్టిన పెద్దపెద్ద భవనాలు చూచాం హంచ్ బాక్ ఆఫ్ నోటర్ డామ్ చిత్రం ఈ స్టూడియోలోనే తీశారు వీళ్ళు తస్సాదియ్యా నాటర్‌డామ్ చర్చీ సరిగ్గా అలాగే కట్టేశారోయ్ ఇక్కడ ఉత్త పై ఆకారం మాత్రమే కాకుండా లోపలి హాల్సూ, స్తంభాలూ సరీగ్గా అదే నమూనాలో కట్టారు మాస్తానుగా పేరిస్ వెళ్ళినప్పుడు అసలు నాటర్‌డేమ్‌ని మేమూ వెళ్ళేటప్పటికి ఒకచోట ఒక ఔట్‌డోర్ షూటింగ్ జరుగుతూంది మా గైడ్ మమ్మల్ని ఒకచోట నిలబెట్టి షూటింగ్ జరుగుతున్నప్పుడు మాట్లాడకూడదు, శబ్దం చేయకూడదని హెచ్చరించింది అది ఒక స్ట్రీటు సీను రెడీ అన్నారు షూట్ అన్నారు. ఒక్కసందులో నుంచి ఫైర్ ఇంజిన్ వస్తున్నట్టు చప్పుడు వినవచ్చింది. మహావేగంతో ఎదురుగా ఒక కారు వచ్చింది దాన్ని తప్పించడానికి ఆ మహావేగంతో ఎదురుగా ఉన్న ఒక ఇంటిని ఈ ఫైర్ ఇంజన్ ఢీకుకోడం, ఇల్లు అంతస్థులతో సహా కూలిపోవడం, ధూళీ దుమ్మూ రేగిపోవడం ఇదంతా ఒక అరసెకనులో జరిగింది సరే బాగానే ఉంది విషయం ఏమిటంటే ఆ పడిపోయిన ఇంటి మేడమీద ఒకమనిషి ఉన్నాడు ఇల్లు కూలడంతోనే వాడూ కిందపడ్డాడు కాని వాడికి ఇంత చిన్నదెబ్బగాని, బట్టలు నలగడంగాని ఏమీ జరగలేదు చల్లగా ఇవతలికి నడిచి చక్కావచ్చేశాడు నవ్వుతూ ఆ సీను తియ్యడానికి ఎంతడబ్బు ఖర్చు అయి ఉంటుం దనుకుంటున్నావు? ఒకవీధి వీథీ కట్టారు పక్కవీధి కట్టారు అందులోనుంచే కదా వచ్చిం దీ ఫైర్ ఎంజిన్! ఇల్లు కూలింది ఎంజిన్ తగలబడ్డది దీన్నిబట్టి అంచనావెయ్యి ఈ షాట్ తియ్యడానికి రిహార్సల్సుకూడా వేసిఉంటే ఎంతడబ్బు తగలేసిఉంటారో ఆలోచించు తరవాత వేరే షెడ్‌లో ఒక ఇన్‌డోర్ షూటింగ్ చూపించిందామె పైనుంచి దీపాలు వెలిగించడం, క్రింద కెమెరా ఉన్న బండి ఇటు తొయ్యడం, అటుతొయ్యడం ఏక్టర్లచేత రిహార్సల్సు చేయించడం ఇదంతా

చాలా టైము పట్టింది తొందరగా వెళ్ళవలసిన వాళ్లు షూటింగుకు రాకూడ దని పించింది విసుగు అయితే మాకు అలాంటిది జరిగలేదు

ఒక సన్నటి పొడవుపాటి అందమైన అమ్మాయి వచ్చి మాకు తనని పరిచయం చెయ్యమని మా గైడ్‌ని అడిగింది ఆమె పరిచయం చేసింది మిస్ సాలీబ్లేన్‌ని నన్ను చూపిస్తూ మహారాజా ఆఫ్ అని నన్ను పూర్తిచెయ్యమంది నేను మహారాజుని కాను పరివారంలో వాణ్ణి అని చెప్పాను తరువాత ఉన్న గంటసేపూ ఆమెకూడా మాతో తిరిగింది. చాలా కొంది ప్రశ్నలు వేస్తూ నేనూ వేశాను తాను తారాపథాన్ని అందుకోబోతున్న స్టార్ లెట్ నని చెప్పింది తను నటించిన చిత్రాలపేర్లు చెప్పింది అయితే ఇండియా వారికి వచ్చి ఉండవు అది గాక మనకి అంతగా జ్ఞాపకం ఉండేటట్టు తనునేసింది ఏమి ఉండదు ఇండియా చూడాలని ఉంది అన్నది "నువ్వు ఇంకొంచెం ధనం బాగా సంపాదించి ఇండియా తప్పకుండా రా నేను నిన్ను ఏనుగుఎక్కించి అంబారీలో ఊరేగిస్తాను మహ రాణీలాగ" అన్నాను కాని, పాపం తనకి బ్రహ్మాండమైన నిరుత్సాహం కలిగిం చాను మీ మహారాజాని నేను చూడవచ్చునా అని ఆమె అడిగింది నువ్వు ఇండియా వచ్చినప్పుడు తప్పక చూదువుగాని, ఇక్కడ అసంభవం అన్నాను మమ్మల్ని స్టూడియోవాళ్ళు ఫోటోలు తీసుకున్నారు, ప్రైవేటుగా ఎన్నో తీసు కున్నారు ఇక్కడే ఒకళ్లిద్దరు మన ఇండియన్స్ కనిపిస్తారోయ్ ఒకడు సినో రియో రైటర్ని అన్నాడు ఇంకోడు ఏదో టెక్నీషియన్ని అన్నాడు. మొత్తం ఇక్కడ మన ఇండియన్‌లు చాలామంది ఉన్నారట హాలీవుడ్‌లో సినీమా రంగంలోనే ఏదో పనిచేస్తూ

ఇక్కడ ఒక చిత్రం తియ్యాలంటే షూటింగ్ ఒక నెలరోజుల్లో పూర్తి చేస్తారట ఎంత పెద్ద పిక్చరైనా సరే ముందుగా వ్రాతలన్నీ, రిహార్సల్సూ, సామానులు సేకరించడం సెట్లు కట్టి సిద్ధంగా ఉంచుకోవడం ఈ పనులన్నీ పూర్తిగా చేసుకొని ఇంక దేనికీ తడుంకోకుండా షూటింగ్ ప్రారంభం చేస్తారు నటులందరూ ధనవంతుల్లని మాత్రం అనుకోకు తారలకి మాత్రమే వచ్చినంత డబ్బు ఇస్తారు తక్కిన వాళ్ళకి వాళ్ళ తరహానుబట్టి కొద్దిగానూ గొప్పగానూ ముట్టజెప్పుతారు ఎక్‌స్ట్రా వేషాలు వేసే వాళ్లకి రోజు కూలియేనట పాపం.

ఈ వూళ్లో మాత్రం ఒక చిన్న విశేషం చూశాను అమెరికా అన్ని ఊళ్ళల్లోనూ ఉన్నాయట కాని నాకు ఇదివరకు ఎక్కడా తగలలేదు ఇక్కడ తెల్సు ఇంగ్లండులోనూ అక్కడా గాల్ఫ ఆడుకోడానికి మైళ్ళకొలది పచ్చిక బీళ్ళు ఉంటాయనీ, మైళ్ళ పొడపునా బంతులు కొట్టుకుంటూ వచ్చి ఒకచోట ఒకపిట్టు స్పాంలోకి ఈ బంతిని కొడతారనీ నీకు వ్రాశాను అయితే పట్టణ మధ్య భాగంలో ఇంతంత పెద్ద మైదానాలు ఉండడానికి వీలులేదు గనక ఒక చిన్న స్థలంలో అనేకమైన, వొంపులూ, ఎత్తులూ, పల్లాలూ, బ్రిడ్జిలూ, కొండలూ సెట్టేశ్కా తయారుచేసి ఒక టోయ్ గాల్ఫ గ్రౌండ తయారు చేస్తారు పగటంతా పనులు చేసుకుని రాత్రి వినోదం కోసం జతలు జతలుగా వచ్చి ఈ మినియేచర్ గాల్ఫ లింకుల్లో బంతిఆట ఆడుకుంటారు ప్రజలు ఎంత చక్కగానో తయారుచేశారు వీటిని ఊళ్ళో చాలాఉన్నాయి ఇలాంటివి దీపాలు వెలిగించి పట్టపగలు చేసేస్తారు

రేపటినుంచి ఇంక తిరుగుముఖం పడుతున్నాం రేపు ఇక్కణ్ణుంచి బయలుదేరి గ్రాండ్ కేన్యన్, వాషింగ్టన్ మొదలైన పట్టణాలు చూచుకుని వారం రోజుల్లో న్యూయార్కు చేరుకుంటాం మళ్ళీ అక్కడినుంచి ఆ మర్నాడే బయలుదేరి అట్లాంటిక్ సముద్రం మీదుగానే జర్మనీ వెళతాం నీ ఉత్తరాలు మామూలుగా థామస్ కుక్ అండ్ సన్స్ అడ్రసుకే లండన్‌కి వ్రాయి వాళ్ళు మేము ఎక్కడ ఉంటే అక్కడికి పంపుతారు

ఇవ్వాళ రాత్రే మా హొటేల్‌లో ఒక చిన్న డిన్నర్ పార్టీ అయింది మాతో లండన్‌నుంచి దేశ్‌రాజ్ అని ఒక బ్రోకరు వచ్చాడు, మాకుసాయం చెయ్యడానికి అతనికి ఇక్కడ కొందరు బిజినెస్ పీపుల్ స్నేహితులు ఉన్నారు వాళ్ళని పిలుస్తూ అతన్ని ఎరిగిఉన్న కొందరు ఛోటాస్టార్స్‌ని కూడా ఆహ్వానించాడు పేలీ బ్లేన్‌ను కూడా పిలవమని అడిగితే పిలిచాడు వచ్చింది నాకుబాగా ఉబుసుపోయింది

ఇక్కడ ఆడవాళ్ళు తమసౌందర్యం పెంపుచేసుకోడానికి ఎన్నోతంటాలు పడతారు ముఖ్యంగా తల వెంట్రుకలు కత్తిరించుకోడానికీ, గోళ్ల కత్తిరించుకోడానికిన్నీ, ఎలాంటి తలకాయకి ఎలాంటి బాబ్ ఉండాలో ఏ విధమైన

నాక్కులు ఉండాలో ఈ విద్యలో సిద్ధహస్తులైన హెయిర్ డ్రెసర్లూ, సదరు సెలూనులూ ఇక్కడ అసంఖ్యాకం మేనిక్యూర్ షాప్‌కి వెళ్ళి చేతివేళ్ళ గోళ్లు కత్తిరింపించుకుని సాపు చేయించుకుని రంగులు పులిమించుకుని పోలిష్ చేయించుకోడం ఇక్కడి స్త్రీలందరికీ పరిపాటి తప్పనిసరి కార్యం అందుకే ఇక్కడ మేనిక్యూర్ షాపులు లెక్కలేనన్ని ఉన్నాయి ఆడవాళ్ళ గోళ్ళకి ఎంతో అందాలు దిద్దిస్తుంటారు ఇది చెయ్యటంలో ప్రవీణులైనవాళ్లు టానా వేసికి వేలున్నారు చాలా డబ్బుకూడా తీసుకుంటారు ఒకసారి గోళ్ళు కత్తిరించి సాపుచేసి పోలిష్ చేసినందుకు పదిలేక పదిహేను డాలర్లుకూడా తీసుకుంటారు ఒక డాలరు అంటే ఇప్పుడు దాదాపు మూడు రూపాయిలన్న మాట

బాబా ! చాలా ప్రొద్దుపోయింది రాత్రి మూడు గంటలయింది ఇంక పొద్దునే లేవాలి మళ్ళీ రేపు ప్రయాణంకదా ముగిస్తాను

---



Hotel Mc alpin
New york
4th September 1930

డియర్ వెంకటరావ్,

ఇవ్వాళ సాయంత్రం అయిదు గంటలకి వాషింగ్టన్ నుంచి మళ్లీ న్యూయార్కు చేరుకున్నాం. లాస్ ఏంజిలిస్ లో గత నెల 30వ తేదీని బయలుదేరి గోల్డెన్ స్టేట్ అని పేరుబడ్డ కేలిఫోర్నియా రాష్ట్రం యొక్క పండ్లతోటలూ, కొండలూ, ఎడార్లూ దాటి మన్హాటను ఐలెండులో "గ్రాండ్ సెంట్రల్ స్టేషన్" లో దిగాం. కేలిఫోర్నియాకి గోల్డెన్ స్టేట్ అని పేరెందుకు వచ్చిందో చెప్తా దాదాపు ఎనభై తొంభై సంవత్సరాల క్రితం ఎవరో ఒక సెట్లర్ ఒక మిల్లు కట్టుకుంటూ ఉంటే అక్కడ కాలవలో చిన్న బంగారు ముక్క దొరికిందట. ఇంక ఆ ప్రాంతం అంతా చూస్తే అక్కడక్కడ బంగారు కనబడిందట. చూడునాయనా వెంటనే అమెరికా నాలుగు మూలలనుంచీ తండోపతండాలుగా మహారణ్యాలూ, బ్రహ్మాండమైన నదులూ ఎడార్లూ దాటి జనప్రవాహం ఇక్కడ వచ్చిపడింది. భూమి అంతా తవ్వి తిరగవేశారు. ఎక్కడచూచినా బంగారమే. కల్తీకూడా లేని స్వచ్ఛమైన బంగారపు ముక్కలు ఒకచోట దాదాపు ఆరు మణుగుల బరువుగల ఒక్కటే ఒక్క బంగారం ముద్ద దొరికిందట, బంగారం సంపాదించాలని జ్వర తీవ్రతవల్ల అడివిగా నిర్మానుష్యంగా ఉండే ఈ కేలిఫోర్నియా భాగం నిముషంలో జనంతో నిండిపోయింది కూలి వాళ్ళంతా కోటీశ్వరులయారు

ప్రస్తుతం భూమంతా సస్యశ్యామలం అయింది ఎక్కడచూచినా నారింజ తోటలే బత్తాయితోటలే వేల వేల ఎకరాల పొడవునా నిమ్మతోటలే పంపర పనస – గ్రేప్ ఫ్రూట్ – తోటలే రైలుమీదనుంచి వస్తుంటే వందల మైళ్ళకొద్దీ పండ్లతోటలే కాపు విరగకాచి ఉన్నాయి ఆకు కనపడని కాపు మా రైలు "సంకిస్ట గార్డెన్సు" అనే ఒక తోటలోనుంచి గంటకి 80 మైళ్ళ వేగంతో రెండు గంటలసేపు నడిచింది అంటే ఎంత తోట ఉందో ఆలోచించు ఈ భూ భాగానికి ఏదో ఆకర్షణశక్తి ఉంది అని అనుకుంటాను ఇక్కడి బంగారం లక్షలాది

జనాన్ని ఆకర్షించింది ఎప్పుడో ఇప్పుడో. ధనంకోసమో, కీర్తికోసమో భోగాలు అనుభవించడానికో లక్షలాది జనం లాస్ ఏంజిలిస్‌లోని హాలీవుడ్‌లో వచ్చి పడుతున్నారు ఎక్కడ చూచినా ఆడపిల్లలే వెర్రివేషాలూ వాళ్లూనూ.

కొలొరాడోనది కొండలను దొలుచుకుని ప్రవాహవేగంలో ఒక పెద్ద లోయ ఏర్పడింది. దానినే గ్రాండ్ కేన్యన్ అన్నారు నిజంగా గ్రాండ్ గానే ఉంది సృష్టివైచిత్ర్యాలలో ఇదికూడా ఒక బ్రహ్మాండమైన దృశ్యం ఈ లోయ ఎంత లోతుంటుందంటే పైనుంచి క్రిందికి మైలు అడుగు ఒక దూరంత లోతు ఉంది దాదాపు ఆరువేల అడుగుల లోతు ఉంది ఈ నది ఎప్పుడు ఏర్పడిందో అప్పటినుంచీ అంతస్త్వాతాలను రాచుకుంటూ ప్రవహిస్తూ అలా అలా క్రిందికి దిగిపోయిందన్నమాట ఇంక ఆ కొండలు దూరానికి పిరమిడ్లలాగా, గుడి గోపురాలలాగా, మలిచిన సౌధాలలాగా అనేకమైన ఆకారాలతో అనేకమైన రంగులతో కనబడుతూ ఉంటాయి స్టేషన్‌లో దిగగానే స్టేషన్ హోటల్ వరండా మీద అమర్చిన పెద్ద టెలిస్కోప్‌లోంచి ఆ దృశ్యం అంతా చూశాం అంత విశాలమైన ప్రదేశంలో ఆ కొండరాళ్ళకి అన్నిరకాల రంగులు వెయ్యడం భగవంతునికి సాధ్యం కావాలిగాని మానవమాత్రునికి అసాధ్యం ఎడారి ఇసుకకి కూడా రంగు వేసేదే. దూరాన్ని సూర్యకిరణాలు పడ్డ కొండలు ఇంద్రనీల మణుల్లా మెరిసిపోతున్నాయి కెంపుల్లా, అవి రాళ్లు కావు, కెంపుల కొండలు కొన్ని పచ్చలవి నవరత్నాల కాంతులు ప్రతిఫలిస్తూ మైళ్ళకొలదీ ఆ లోయ మెరిసిపోతూంది నయాగరా జలపాతం ఎదుట నిలబడితే సృష్టిలోని వేగమూ, శక్తీ, బలమూ, గోచరించాయి ఇక్కడి కళా నైపుణ్యమూ, శాంతీ, సౌందర్యమూ కనబడుతున్నాయి సృష్టివైచిత్ర్యంలో మహాద్భుతమైనదీ లోయ. మైళ్ళ పొడవున ఉన్న ఈ కొండల వరుసలు మహారణ్యాలు ఉన్న భూమి మీద తల్లకిందులుగా నిలబెట్టినట్టున్నాయి కొండల్ని మనం క్రిందనుంచి పైకి చూస్తాం ఈ కేన్యన్ని అలా కాదు పైనుంచి కిందికి చూడాలి ఇటువంటి దృశ్యం ఈ భూలోకంలో ఎక్కడా ఉండదని అనుకుంటున్నారు పై భాగం నుంచి క్రిందికి దిగడానికి దారులు ఉన్నాయి నడిచి దిగవచ్చు సాధారణంగా కంచర గాడిదలమీద, గుర్రాలమీద దిగుతారు ఆ గుర్రాలకి ఎంత అలవాటు ఉందో ఒక్క కాలు తప్పుపడిందంటే వేలకొలది అడుగులు క్రిందపడి పిప్పిగుండ అయిపోతాడు మనిషి గుర్రంతోసహా

నీకు సరైన చిత్రం ఇవ్వలేకపోయానేమో ! ఇది ఊహించుకోవలసిందే దీన్నిప్పుడు అమెరికా ప్రభుత్వం జాతీయం చేసి "నేషనల్ పార్కు" గా తయారు చేసింది మైళ్ళ పొడవున ఉన్న ఈ పార్కులో అక్కడక్కడ కర్ర కేబిన్లు కట్టారు హాలీవుడ్ అనుభవించాలనుకున్న అమెరికనులు ఇక్కడికి వచ్చి ఈ కేబిన్లలో బసచేసి ఈ సృష్టి చిత్రాన్ని చూచిపోతుంటారు. కేన్యన్ వద్దా, పార్కులోనూ కొంచెం సేపు తిరిగాం పాతాళంలోకి దిగడానికి చాలా టైము కావాలి మెరిసిపోతూ క్రింద ఒక పెద్ద పాములాగ ప్రవహిస్తున్న కొలొరెడో నదిని చూడగలిగినందుకే సంతోషించాం

రోజంతా ఈ కేన్యన్ చూచి రాత్రి మళ్ళీ బయలుదేరి రెండు రాత్రిళ్లూ రెండు పగళ్లూ ప్రయాణంచేసి "కన్సాస్ సిటీ" అనే చోట రైలు దిగాం ఇది మిసిసిపీ నది ఒడ్డున ఉంది ఊరంతా ఒకసారి తిరిగాం రాత్రి 12 గంటలకి మళ్లీ రైలెక్కి 'సెంటులూయా" అనే జంక్షన్‌లో దిగాం ఇది మిస్సోరీనది మీద ఉంది ఇక్కడ నది అట్టే వెడల్పులేదు ఇక్కడే రైలు మారి బుధవారం ఉదయం మళ్లీ వాషింగ్టన్‌కి బయలుదేరాం గురువారం ఉదయం 7 గంటలకి వాషింగ్టన్‌లో దిగాం అయితే వాషింగ్టన్‌లో మేము కొద్ది గంటలు మాత్రమే ఉన్నాం. యునైటెడ్ స్టేట్స్‌కి రాజధాని నగరం వాషింగ్టన్‌లాంటి నగరంలో కొన్ని గంటలపాటేనా అని అనవచ్చు కాని అక్కడ ఏము ఉంది చూడడానికి ? ప్రభుత్వ భవనాలు తప్పిస్తే ! స్టేషనులోనుంచి ఇవతలికి రావడంతోనే మొట్ట మొదట కనబడ్డది క్రిస్టొఫర్ కొలంబస్ స్టేట్యూ అమెరికా భూభాగాన్ని కని పెట్టిన వానికి అమెరికా రాజధానిలో స్టేట్యూ పెట్టడం ఎంతైనా సముచితంగా ఉంది త్వరిత్వరగా ఊరంతా తిరిగాం అమెరికా పార్లమెంటు భవనం "కేపిటోల్" చూచాం అమెరికన్ పార్లమెంటుని కాంగ్రెస్ అంటారు కదా కాంగ్రెస్ సమావేశాలు ఇక్కడే జరుగుతాయి ఈ భవనం అంతా ఒక్కటే రంగు – తెలుపు నీలాకాశంలోకి చొరుచుకుపోయిన తెల్లటి డోమ్ ఎంతో అందంగా ఉంది

నగరంలో ప్రతీ భాగానికి ఈ గుండ్రని డోమ్ కనిపడుతుంది. చుట్టూ ఉన్న లాన్‌లూ మొక్కలూ భవనానికి తగినట్టుగానే ఉన్నాయి మొత్తంమీద నగరం అంతా చాలా శుభ్రంగా ఉంది ఎగువ సభ సెనేట్‌హౌస్ చూశాం.

అందులోని విశాలమైన పెద్ద పెద్ద హాల్సు దర్శించాం వాషింగ్టన్ మెమోరియల్ కూడా దర్శించాం యునైటెడ్ స్టేట్సు ప్రెసిడెంటు భవనం వైట్ హౌస్ చుటూ ప్రదక్షిణం చేశాం ప్రెసిడెంట్ హూవర్ ఇప్పుడు అందులో నివశిస్తున్నాడు ప్రెసిడెంటు హూవర్ దర్శనం ప్రెస్ రిపోర్టర్లకి దొరికినంత తేలికగా ఇతరులకు లభించదట

ఇక్కడ రెండు గొప్ప స్మారకచిహ్నాలు దర్శించాం ఒకటి అమెరికా స్వాతంత్ర్య నాయకుడు జార్జి వాషింగ్టన్ స్మారకచిహ్నం — ఇరవైరెండు అంతస్తులు 550 అడుగుల ఎత్తున ఒక స్తంభం నిర్మించారు దాని నిర్మాణం యాభై ఏండ్లపాటు సాగించిరట సాధారణమైన స్తంభం అయినా దర్జాగా మాత్రం ఉంది స్థంభం చివరకు ఎక్కడానికి మెట్లుకూడా ఉన్నాయి ఎలెక్ట్రిక్ లిఫ్టుమీదకూడా పైకి ఎక్కవచ్చు రెండోది అబ్రహాం లింకన్ స్మారకచిహ్నం పొటోమక్ పార్కులో తెల్ల పాలరాతితోనే నలుచదరంగా నిర్మించిన చిన్న భవనం 36 స్థంభాలు ఉన్నాయి అప్పటికి అమెరికా సంయుక్త రాష్ట్రాలు 36 ఉన్నాయట ఒక్కొక్క స్తంభం ఒక్కొక్క రాష్ట్రాన్ని సూచిస్తున్నట్టు కట్టారు అబ్రహాం లింకన్‌ని హత్యచేసిన పార్కులోనే దీన్ని నిర్మించారు ఈ మందిరంలోనె లింకన్ స్టేట్యూ పాలరాతితోనే కుర్చీలో కూర్చున్నట్టు ప్రతిష్టించారు

న్యూయార్కులో దిగడంతోనే మన ఓంకారస్వాములవారి శిష్యురాండ్రు మాకు స్వాగతం ఇచ్చారు మళ్ళీ మెకాల్పిన్ హోటేలులోనే ఇదివరకు మేము ఉన్నగదులేమాకుదొరికాయి ఇప్పుడే ఒకడిన్నర్‌కివెళ్లివచ్చాం న్యూయార్కులో రాజాస్ రెస్టారాంటు అని ఒక మద్రాసువాడు ఒక చిన్న హోటేల్ నడుపుతున్నాడు అక్కడ భోంచేశాం అవియల్ సాంబార్ వేసుకని ఆవకాయా అన్నం కూడా తిన్నాం రేపు అమెరికా విడిచిపెట్టేస్తున్నాం కన్ను విప్పితే కనపడే అడ్వర్టయిజుమెంట్లు-కోకాకోలా, లక్కీ స్ట్రయిక్, చెస్టర్‌ఫీల్డు, కేమెల్ సిగరెట్లూ, వర్జీనియా చుట్టలు, లెమన్ స్క్వాష్, రిగ్లీస్ చూయింగ్‌గమ్, షెల్, సెకానీ పెట్రోల్ ఫరాన్స్, ఇపానా టూత్‌పేస్టులూ, ఇంకా ఏవో ఏవో- ఇంక కనపడవు తెల్లారితే మీన మూతికి తగులుతూ సిద్ధపడే, ఆరెంజ్ జ్యూస్, గ్రేప్ ఫ్రూట్, బేకన్, హేమ్ అండ్ ఎగ్స్, ఇంక లభించవుకాబోసు ఎలివేటెడ్ రైల్వే గోలా, న్యూస్‌పేపరు కుర్రాళ్ల అరుపులూ ఇంక వినపడ వనుకుంటాను.

నిత్య దీపావళి బాణాసంచా దీపకాంతులు ఇంక కళ్లకి గుచ్చుకోవు అందమైన అమ్మాయిలు కనబడకేం ప్రపంచం అంతా ఉంటారు కాని మెరిసే దుస్తులతో వెర్రివేషాలు కనబడవేమో! ఉరకలూ పరుగులూ ఉండవు. క్రాస్ రోడ్ల వద్ద గంటలకొద్దీ ఆగడం ఉండదు ప్రతిదానికీ మాటికీ వినబడే ఓకే - అనేమాట ఒకటి వినబడదు ఓకే అంటే ఆల్ కరెక్టు అని అట ఇంగ్లండులో అయితే ఆల్ రైట్ అనో వెరీ రైటో అనో అంటారు

ఇక్కడి న్యూస్‌పేపర్సు చూస్తుంటారు మార్నింగ్ ఎడిషన్ అనీ, ఈవెనింగ్ ఎడిషన్ అనీ, స్పెషల్ న్యూస్ అనీ సప్లిమెంటు అనీ ఎన్నోఎన్నో గంటగంటకీ కొత్తది ఒకటి వస్తుందా అనిపిస్తుంది ఇక్కడివాళ్ళకి ఏదో ఉత్సాహం కావాలి ఎప్పుడూ ప్రతీవాడూ పేపర్లుకొంటాడు మనవాళ్ళకిలాగ ఒక పేపరు పదిమంది చదవరు కాగితాలు ఎంచుకుని ఇంక పేపర్లలో న్యూస్‌పేజీ అంతా కలిపితే ఒకకాలమే ఉంటుందేమో! తక్కినదంతా అడ్వర్టయిజుమెంట్లూ, వాటితాలూకు బొమ్మలున్నూ, అందులో ఆడవాళ్ళకి పనికివచ్చే సామానుల ప్రకటనలే ఎక్కువ రకరకాల టాయిలెట్ వస్తువుల ప్రకటనలు కోకొల్లలు వాటికి తగిన తమాషాయయిన చిత్రాలూ, కార్టూనులున్నూ అడ్వర్టయిజుమెంట్ ఒక గొప్ప విద్య, గొప్ప కళ ఈ విద్యలో వీళ్లు పారంగతులేరా అనిపిస్తుంది ఇంక ఆడవాళ్ళనిమిత్తం ప్రత్యేకంగా మేగజైనులు ఎన్నో చూస్తున్నాం వాటి నిండా టోపీలూ, గౌనులూ, జోళ్లూ, మేజోళ్లూ, అండర్ వేర్లూ వీటినిగురించి తప్ప వేరేమీ కనపడవు

రేపువెళ్ళేటప్పుడు అమెరికాలోని స్కైస్క్రేపర్స్‌కిన్నీ, ఆటోమోబైల్స్‌కిన్నీ "గుడ్‌బై" చెప్తాను

సి

వేంకటరావు.

———



Norddeutscher
Lloyd
Bremen
D Bremen
11th September 1930

సోదరుడు వెంకటరావ్,

అమెరికా, న్యూయార్కు విడిచిపెడితే ఎలా ఉందంటే మతాబా కాంతుల్లోనుంచి ఆముదం దీపం వెలుతురులోకి వచ్చినట్టుంది ఏరోప్లేన్ దిగి ఒంటెద్దుబండి ఎక్కినట్టుంది పెళ్ళి భజంత్రీ శబ్దాల్లోనుంచి వచ్చి నిశ్శబ్దంగా కూర్చున్నట్టుంది తొందరా హడావుడిపోయి స్థిమితంగా ఈజీచెయిర్ మీద ఉన్నట్టుంది ఇప్పుడీ స్టీమరుమీద ఉయ్యాల మంచంమీద ఊగుతున్నట్టే ఉంది ఈగాలికీ, కెరటాలదెబ్బకిన్నీ బ్రిమెన్ అనే ఈ స్టీమరు జర్మన్ నార్డ్ కంపెనీది కొత్తగా కట్టారు ప్రపంచంలో ఇంతకంటె వేగంగా పోయే స్టీమరు ఇంకొకటి లేదు గంటకి ముప్ఫయిమైళ్ళ వేగంతో పోతుంది 46,000 టన్నుల బరువు. అంటే చాలా పెద్దదన్నమాట. నవీనమైన సదుపాయాలన్నీ ఇందులో సమకూర్చారు అతి పరిశుభ్రంగా ఉంది రోజూ ఏదో సినిమా చూస్తున్నాం దీనిలో స్టీమర్లలో మామూలుగా జరిగే కార్యక్రమాలూ, వినోదాలూ ఇందులోనూ తప్ప లేదు అట్లాంటిక్ మహాసముద్రం దాటడానికి వెళ్ళేటప్పుడు మెజిస్టిక్ స్టీమరు మీద ఆరు రోజులు పట్టింది వచ్చేటప్పుడు ఈ బ్రిమెన్‌మీద అయిదు రోజులకే వచ్చేశాం ఇంకొక గంటలో ఈ స్టీమరు ఫ్రాన్సు తీరాన్ని ఉన్న షెర్‌బర్గ చేరుకుంటుంది ఈలోగా ఈ ఉత్తరం వ్రాసి ఇక్కడ పోస్టు చేస్తున్నాను

5వ తేదీ న్యూయార్కులో ఉన్నంతసేపూ షాపింగుతో సరిపోయింది రాత్రి డిన్నర్ అయాక యీ స్టీమరు ఎక్కాం రాత్రి 12-30కి స్టీమరు బయలుదేరింది మాకు వీడ్కోలు ఇవ్వడానికి ఓంకార స్వామిగారి శిష్యురాండ్రు వచ్చారు పాపం సముద్రాన్ని చీల్చుకుని ఈ నాలుగురోజులూ వచ్చేశాం నాకు ఈసారి సిసిక్‌నెస్ ఆట్టే అనిపించలేదు అసలు లేనేలేదు ఇప్పుడు తెల్లవారు జాము 4 గంటలు అయింది రాత్రంతా వినోదాలతో కాలక్షేపం చేశాం తెల్లారితే చాలామంది దిగిపోతారు ఫ్రాన్సులో మేము ఫ్రాన్సులోగాని, ఇంగ్లండులోగాని ఇప్పుడు దిగడంలేదు సరాసరి జర్మనీలోని బ్రిమెన్ అనే ఊరు వెడుతున్నాం

మా స్టీమరు షెర్‌బర్గులో ఆగి తరవాత ఇంగ్లండులోని సౌతేంప్టన్ రేవులో కొంచం సేపు ఆగి, తరవాత బ్రిటిష్ ఛానల్‌లోంచి డోవర్ జలసంధిగుండా ఉత్తరంగా ప్రయాణం సాగించి బ్రిమెన్ అనే రేవు చేరుతుంది, అక్కణ్ణుంచి మేము యూరప్‌లో దాదాపు అన్నిదేశాలూ తిరుగుతాం మొట్టమొదట స్వీడెన్ వెడతాం

అమెరికాలో సెంట్‌లూయీనుంచి నీకొక చిన్న ఫోటోఫ్రేమ్ పంపించాను అది అందే ఉంటుంది న్యూయార్కులో మా హోటేల్లో మా ఫ్లేట్‌క్లార్కుగా పనిచేసే అమ్మాయి నన్ను న్యూయార్కులో కొన్నిచూడవలసినవి తిప్పిచూపించింది పాపం ఎంత మంచిదో ! ఆమె ఫోటో చిన్నది ఒకటి నావద్ద ఉందిలే మిస్ సోఫీ సెగూరా ఆమెపేరు. వచ్చేటప్పుడు నాకొక ప్లేక్లెట్ బహుమతి ఇచ్చింది చూస్తే అది ఒక ఉప్పుపొట్లాం ఏమని అడిగితే చెప్పింది "ఇప్పుడు మీ ఇండియాలో ఉప్పుకోసమేగదా సత్యాగ్రహం చేస్తున్నారు ఉప్పు మీదేశంలో కరువుకదా అందుకు ఉప్పు ఇచ్చా" నంది. "అదికాదు మీదేశాల్లో పేపర్లు ఇలాగే తప్పులు వ్రాస్తాయి మీరూ తప్పు అభిప్రాయంతో ఉంటారు ఉప్పు మాకు కొరతకాదు ఉప్పు ప్రతిమనిషికి అవసరమైన వస్తువు గాలీ, నీరూ ఎంత అవసరమో ఉప్పుకూడా దాదాపు అంతే అలాంటి ఉప్పుమీద ప్రభుత్వం పన్నులు విధించింది ఉప్పుమీద పన్నులు ఉండకూడదని ఈ సత్యాగ్రహం గాంధిగారు నడుపుతున్నారుగాని, కొరతవల్లకా"దనిచెప్పాను రాజకీయాలంటే కొంచం ఇష్టంకాబోసు ! మన స్వరాజ్య ఉద్యమంగురించి ఎన్నో ప్రశ్నలువేసింది అన్నింటికీ సరైన సమాధానాలుచెప్పి ఆమెకు మన ఉద్యమం మీద ఉన్న దురభిప్రాయం కొంత తగ్గించగలిగాను

ఒక్కటిమాత్రం తెలుసుకున్నాను ఈ దేశాలు తిరిగాక ఇక్కడివాళ్ళకి తమ స్వదేశంపట్ల ఉన్న భక్తితాత్పర్యాలు అత్యంతం అని. అమెరికాలోని ప్రజాప్రభుత్వ విధానాలూ, సమస్త విషయాల్లోనూ ప్రజలకి ఉన్న స్వేచ్ఛా, వాక్స్వాతంత్ర్యం ఇలాంటివి మన భారతదేశానికి ఎప్పటికైనా వస్తాయా అనిపిస్తుంది

నీ

వేంకటరావు.

---



Hotel Vier Fahreszeiten
Hamburg
Germany
14th September 1930

డియర్ వెం॰ రావ్,

మళ్ళీ యూరోప్ భూభాగంమీద కాలుమోపాం ఇంగ్లాండు యూరప్ ఖండంలోనిదే అయినా, ఈ జర్మనీ అసలు కాంటినెంటులోనిదే కదా! ఈ హేంబర్గు జర్మనీలో ఉంది మొన్న ఉదయం ఎనిమిది గంటలకి మా బ్రిమెన్ స్టీమరు తిన్నగా జర్మనీలోని బ్రిమెన్ రేవు చేరింది. హార్బరులోనే సిద్ధంగా ఉన్న రైలుబండి ఎక్కి పదకొండున్నరకి బ్రిమెన్ పట్నం చేరుకున్నాం అక్కడ హోటేల్ కొలంబస్‌లోదిగి స్నానం, భోజనం మొదలైనవి చేసుకుని మళ్ళీ మధ్యాహ్నం ఒంటిగంటకి రైలు ఎక్కాం సాయంకాలం నాలుగు గంటలకి హేంబర్గు అనే ఈ పట్నంచేరాం బ్రిమెన్ రేవుకిన్నీ పట్నానికిన్నీ 40 మైళ్ళ దూరం ఉంటుంది పట్నంపక్కనే వెసర్ అనే నది ఉంది అయితే మేము ఏమీచూడడానికి వీలులేకపోయింది హోరున ఒకటే వర్షం! స్టీమరు దిగడంతోనే ప్రయాణీకులందరూ హార్బరులోనూ, రైల్లోనూ ఒకటేత్రాగడం మొదలుపెట్టారు జర్మనీలో మొట్టమొదట చూచించి అదీ హేంబర్గులో ఈ రెండురోజులూ వర్షం అడపాతడపా కురుస్తూనే ఉంది మా హోటేల్ ఒక సరస్సు ఒడ్డునఉంది కిటికీలోంచిచూస్తే ఎదట అంతా పెద్దసరోవరం ఆ నీటి మీద ధారాపాతంగా వర్షంకురవడం ఇదొక తమాషా దృశ్యం

ఊరికి సమీపంగా ఎల్బ్ అనేనది ప్రవహిస్తూంది దాన్నిండా చిన్న చిన్నవీ, పెద్దపెద్దవీకూడా పడవలు ఉన్నాయి ఈ పట్నం పారిశ్రామికంగా చాలా గొప్పదట జర్మనీలో తయారైన సామగ్రి చాలావరకు ఈ రేవుగుండానే ఎగుమతి అవుతుందట వర్షం కురుస్తున్నప్పటికీ ఊరూ పరిసర ప్రాంతాలూ కార్లలో తిరిగాం అటు అమెరికాలోలాగ బ్రహ్మాండమైన భవనాలూలేవు, ఇటు ఇంగ్లండులోలాగ చక్కని అందమైన బంగళాల్లాంటివీ లేవు. ఎక్కడ చూచినా పెద్దపెద్ద గొడౌనుల్లాగ ఉన్నాయి ఇళ్ళు ఎన్నో ఫేక్టరీలు ఉన్నాయి ముఖ్యంగా బీరు తయారుచేసేవి–బ్రూవరీస్ అంటారు–అవి ఎక్కువట ఈరెండు

రోజుల్లోనూ నాకు జర్మనీమీద మంచి అభిప్రాయం కలగలేదు జర్మనీ, ప్రపంచాన్నంతనీ ఎదిరించి మహాసంగ్రామం చేసిన జర్మనీ ఈ యుద్ధాన్ని గురించీ, అప్పుడు జరిగిన సంగతులనుగురించి మనవాళ్ళు చిత్రంగా రకరకాల కథలు చెప్పుకుంటారు కదా! బాంబులు, విమానాలు, నీటిలో అడుగునుంచి పోయే జలాంతర్గాములూ వీటినిగురించి మనవాళ్ళకి ఈ యుద్ధంవల్లనేకదా తెలిసింది మద్రాసురేవుకూడా ప్రవేశించి హైకోర్టుమీదకి గుండుపేల్చిన ఎమ్డెన్ సబ్‌మెరైన్ జర్మనీవారిదేకదా! అటువంటి జర్మనీలో — కైజరు చక్రవర్తి పరిపాలించిన జర్మనీలో ఉన్నాం ఇప్పుడు. మన ప్రభుత్వంవల్ల ప్రమాదం వస్తుందని పైకి ఎక్కువగా ఏమీ అనకపోయినా లోపల మనదేశంలో చాలా మందికి జర్మనీ అంటే ఏదో అభిమానం ఉంది మనుష్యుల్ని చూస్తున్నాను ఎత్తుగా, లావుగా మోటుగా కనపడుతున్నారు. ఆడవాళ్ళలోకూడా నాజూకుతనం కనపడడంలేదు మరి సిటీస్‌లో ఎలా ఉంటారో చూడాలి రాజధానీనగరం బెర్లిన్ వెడతాంగా!

ఇక్కడికివచ్చినరోజు రాత్రి సినిమాకు వెళ్లాము ఏదో సోషల్ పిక్చరే. భాష ఏమీ తెలియలేదు కథకూడా తెలియలేదు సోషల్ పిక్చరైనా చాలామంది మిలిటరీ డ్రస్సులతోనేఉన్నారు. నిండైన మనుష్యులు స్క్రీన్ అంతా ఆవరించి ఉన్నట్టు కనపడేవారు త్రాగడమున్నూ సిగరెట్లు కాల్చడమున్నూ మాత్రమే ఎక్కువగా కనబడ్డది.

హోటేళ్ళల్లోనూ, బయటా మనుష్యుల్ని చూస్తున్నాను గదా ఇంగ్లీషు చాలామందికిరాదు అయినా చాలా మర్యాదగానే ఉన్నట్టున్నారు మా కూడా దేశ్‌రాజ్ అనే ప్రయివేటు సెక్రటరీ అమెరికా అంతా తిరిగాడు యూరపు అంతా మాతో ఉంటాడు ఇతనికి ఇంగ్లీషేగాక ఫ్రెంచిభాషకూడా చాలా బాగా వచ్చు ఇతనుగాక తామస్ కుక్కువాళ్ళు మాతోతిరిగి యూరపు అంతా చూపించ డానికి ఇంకో మనిషిని పంపారు అతను షెర్‌బర్గులో మా స్టీమరు ఎక్కి మాతోనే ఉంటున్నాడు అతన్ని కొరియర్ అంటారు. అంటే గైడ్ అన్నమాట యూరప్‌లో అన్నిదేశాలలోని ముఖ్య ప్రదేశాలూ ఇతనికి బాగాతెలుసు అన్ని భాషలూ క్షుణ్ణంగావచ్చు అతనిపేరు గండాల్ఫో అట. రెండు రోజులే అయింది

గనక ఇంకా ఆతనితో బాగా స్నేహం కుదరలేదు మహారాజులూ, ఇతర దేశాలలోని ధనవంతులూ యూరప్ ఖండంలోని దృశ్యాలు చూడడానికి సంచారం చేస్తే ఇలాంటి గైడ్లు వాళ్ళతో ఉండి, వాళ్ళకి అన్నీ చూపించడమేగాక, వాళ్ళకి కావలసిన ఏర్పాట్లూ, సదుపాయాలూ చేస్తుంటారు

ఇవ్వాళ ఎల్బ్ నదీతీరాన్నే కార్లల్లో తిరిగాం పెద్దపెద్ద స్టీమర్లు కూడా ఈనదిగుండా లోపలికి వస్తాయి సముద్రయానం చేసే పెద్దస్టీమర్లు ఎన్నో ఈ నదిలో ఉన్నాయి చిన్నవి లెక్కేలేదు చుట్టూ ప్రాంతం అంతా తోటలు

ఇక్కడ బీర్ ఎక్కువగా తయారుచేస్తారన్నారు, ఈ బీర్ విస్కీ, బ్రాండీలలాగు ఎక్కువ మత్తుఎక్కించి తూలకొట్టదట. పైగా ఉత్సాహాన్నే గాక బలంకూడా ఇస్తుందట గ్లాసులో పోస్తే కుంకుడుకాయ పులుసులాగ కనపడుతుంది దానికిలాగే నురగకూడాను రుచి చేదుగా ఉంటుందిట బలం కోసం చేదు మేస్తున్నారన్నమాట బార్లీగింజలమొలకలున్నూ, హాప్ అనే తీగ పువ్వులూ పులవబెట్టి బీర్ తయారుచేస్తారట ఈ హాప్స్ వల్లనే దానికి చేదూ, వాసనా వస్తుందట బీర్ వీళ్ళకి ఆహారం అన్నమాట మంచినీళ్లు తాగడం ఉండదు

ఈ సాయంకాలం బయలుదేరి స్వీడెన్ దేశం వెడుతున్నాం అక్కడ్నించి మళ్ళీ వ్రాస్తా

నీ
వేంకటరావు.





Grand Hotel
Berlin
(Germany)
19th September 1930

ప్రియమిత్రుడు వెంకటరావ్,

14 వ తేదీ సాయంత్రం ఆరుగంటలకు హేంబర్గునుంచి మళ్ళీ రైలుమీద బయలుదేరాం రైలు డెన్మార్కుదేశంగుండా పోయింది రాత్రి రైల్లో మా పాస్‌పోర్టులూ, వీసాలూ అన్నీ చెక్ చేశారు, గండాల్ఫ్ ఎన్నింటికీ సమాధానాలు చెప్పేశాడు రాత్రి రెండుగంటలకి జనం అంతా రైలుదిగి వేరే ఒక స్టీమరు ఎక్కారు మమ్మల్నిమాత్రం దిగవద్దన్నాడు గండాల్ఫ్ జరిగిం దేమిటంటే మా రైలుబోగి బోగిఫళంగా ఆ స్టీమరు ఎక్కింది స్టీమరు సముద్రందాటుతూ ఉంది మేం మాత్రం హాయిగా రైల్లో పడుకున్నాం తెల్లారి ఉదయం ఆరు గంటలకి స్వీడెన్ దేశపు ఒడ్డుచేరుకున్నాం. మా రైలుపెట్టె చల్లగా స్టీమరుమీద నుండి భూమ్మీదికి వచ్చేసింది అక్కణ్ణించి మా రైలుబండి ముఖ్యపట్టణం అయిన స్టాక్‌హోమ్‌కు ప్రయాణం సాగించింది పగలంతా ప్రయాణంచేసి సాయంత్రం ఆరుగంటలకి స్టాక్‌హోమ్‌కు చేరుకున్నాం చలి చాలా ఎక్కువై పోయింది. అమెరికాలో వేసుకున్న పలచని బట్టలు జర్మనీ ప్రవేశించడంతోనే మార్చేసి మంచి ఉన్నిబట్టలు వేసుకున్నాం, ఇక్కడ చలి ఆగక ఓవరుకోటుతోనే ఉండిపోయాను.

స్వీడెన్ దక్షిణతీరాన్ని ఉన్న ట్రెల్లెబోర్గ్ నుంచి ఉత్తరంగా ఉన్న స్టాక్ హోమ్‌కి దాదాపు మూడువందలమైళ్ళదూరం ఈ మూడువందలమైళ్ళ ప్రదేశమూ ప్రయాణంచేస్తూ ఉంటే చాలా ఆనందంగా ఉంది కొండలూ. నదులూ పెద్దపెద్ద పొలాలూ, పండ్లతోటలూ ఇటూ అటూకూడా ఎంతో సుంద రంగా ఉంది. కొండలన్నీ పచ్చగా గడ్డిపట్టి ఉంటే వాటిమీద బారెడు పొడవు వెంట్రుకలతో తెల్లని గొఱ్ఱెలు మందలుమందలుగా మేస్తూ ఉంటే తెల్లని మేఘ శకలాలు ఈ పచ్చని కొండలమీదికి విహారం చేయడానికి దిగాయా అన్నట్లు

ఉండేది. ఎటుచూచినా తోటలు, ముఖ్యంగా ద్రాక్ష ఇంకా అక్కడిచెట్లు కూడా చెట్లు చూస్తే మనదేశంలోలాగ విస్తరించి ఉండవు సన్నగా, పొడుగ్గా ఆకాశాన్నంటుకుపోయేంతఎత్తుగా పెరిగిపోయిఉన్నాయి అమెరికాలో స్కైస్క్రేపర్స్ ఎత్తా, ఈ వృక్షాలు ఎత్తా అని ఆలోచించాను నదుల్లో ప్రవహించే నీళ్ళు బురదగానూ నల్లగానూలేవు తెల్లగా, స్ఫటికం కరిగించారా అన్నట్లు మెరిసిపోతూ ఉంటాయి నదులూ, కొండలూ, తోటలూదాటి రైలుపోతూ ఉంటే ఇలా ఎన్నిరోజులైనా కిటికీదగ్గర కూర్చొని ఆ సౌందర్యాన్ని చూడవచ్చు ననిపించింది

ఈ దేశం శీతమండలంలో ఉండడంవల్ల అతి చల్లగా ఉంటుందిట సంవత్సరంలో కొన్ని నెలలపాటు నీరు గడ్డకట్టుకుపోయే ఉంటుందిట అయితే ఆ ప్రమాదం ఇప్పుడు మాకులేదు వర్షాలుమాత్రం కురుస్తున్నాయి అర్కిటిక్ రీజియన్ అత్యుత్తరంగా ఉండడంవల్ల సూర్యకిరణాలు నిలువునా పడవు ఏటవాలుగా పడతాయి అందుచేత ఎండ ఎంతమాత్రమూ తీక్షణంగా ఉండదు. ఇప్పుడు మాకు ఎండకాచినట్లేలేదు

స్టాక్‌హోమ్ స్వీడెన్‌దేశానికి ముఖ్యపట్టణం దీన్ని వెనిస్ ఆఫ్ ది నార్త్ అంటారు వెనిస్ పట్టణంకూడా మేము ఇటలీ వెళ్ళినప్పుడు చూస్తాంకదా వెనిస్ నీటిలో కట్టారనీ, వీధుల్లో నావలమీదే తిరగాలనీ కదా అంటారు ఈ స్టాక్‌హోమ్‌లోకూడా నీరు ఎక్కువగా ఉండడంవల్ల ఆ పేరువచ్చింది. అనేకమైన సరస్సులూ, ఆ సరస్సులమధ్య ఉన్న దీవులూ ఆ దీవులమీద భవనాలున్నూ ఈ దీవుల భూభాగాల్ని కలిపేందుకు పెద్దపెద్ద బ్రిడ్జీలున్నూ, ఎన్నో బ్రిడ్జీలు ఉన్నాయిక్కడ బ్రిడ్జీల నగరం అంటే ఇంకా బాగా ఉండునేమో! ఒకవైపు సముద్రం, ఇంకోవైపు పెద్ద సరస్సున్నూ వీటి మధ్యనే ఈ నగరం ఇక్కడ మాట్లాడే భాష స్వీడిష్ అయినప్పటికీ ఇంగ్లీషుతో వ్యవహారం కొట్టుకుపోవచ్చు అయినా మాకు గండాల్ఫో ఉన్నాడుగా తెలియకపోతే చెప్పడానికి

స్టాక్‌హోమ్ అనేసరికి మనకొకసంగతి జ్ఞాపకంవస్తుంది నోబెల్ బహుమానం ఇక్కణ్ణుంచేకదా ఇవ్వడం ఆ సంస్థ ఈ ఊళ్ళోనే ఉంది ఈ బహుమానం ప్రపంచంలో చాలా గొప్పవాళ్ళకిగాని లభించదు మన రవీంద్రనాధ రాకూర్ ఈ బహుమానం పొందారు నగరం అంతా అక్క

డక్కడ చిన్న చిన్న దీవులమీద వంతెనలతో కలపబడి ఉంది అన్నానుకదా నార్మామ్ అనే భాగం ఊరంతకీ అతి సుందరంగా ఉంది విశాలమైన తిన్నని వీధులూ, మధ్యమధ్య ఉపనదులూ, చక్కని భవనాలూ ఈ ప్రదేశంలో ఉన్నాయి చూడముచ్చటగా ఉంది హడావుడీ, గొడవా, గోలా లేకుండా కింగ్స్‌గేటన్ స్ట్రీట్ చాలా రద్దీగా ఉండి చక్కగా ఉంటుంది సిటీహాల్ అనే చాలా అందమైన భవనం ప్రత్యేకం ఒక ద్వీపంమీద ఉంది. ఇక్కడ చూడవలసినవి కింగ్స్‌పేలస్ ఒకటీ, న్యూ టౌన్‌హాల్ బిల్డింగూ, రాయల్ గార్డెన్సూ, సైన్సు అకాడెమీ బిల్డింగ్సూ మొదలైనవి ఈ అకాడెమీలోకి వెళ్ళి చూడడానికి ఎంతో టైము తీసుకుంటుంది ఇదే ఈ దేశపు నేషనల్ మ్యూజియమ్ జంతు పరిణామాన్ని గురించీ, ఖనిజాలూ, వృక్షాలూ వీటికి సంబంధించిన వస్తువులెన్నో ఉన్నా యిక్కడ

మేము ఇక్కడ గ్రాండ్ హొటేల్‌లో బసచేశాం ఎదురుగా కింగ్స్‌పేలస్ కనపడుతూ ఉంటుంది అమెరికాలోనూ, ఇంగ్లండులోనూ మేము బసచేసిన హొటేల్స్‌తో పోల్చిచూస్తే ఇది వాటికన్న చాలా చిన్నదేకాని చాలా సౌకర్యంగా ఉంది. పనికత్తెలందరూ చాలా అందంగా ఉన్నారు పాలరాతి బొమ్మలా అన్నట్లు ఉన్నారు అందరూ తెల్లవాళ్ళే అయినా రంగుల్లో చాలా తేడాలు కనిపెట్టవచ్చు అమెరికాలోనూ, ఇంగ్లండులోనూ ఉన్న వాళ్ళ తెలుపులో కొంచం ఎరుపుపాలు ఉన్నట్లు ఉంటారు వీళ్ళు తెల్లగా ఉంటూ లోపలి రక్తం గులాబీ రంగుల్ని పైకి ప్రసారం చేస్తూ ఉంటారు మనం మన గ్రంథాల్లో చదువుతూ ఉంటాం రాజకుమార్తెలూ వాళ్ళూ అసూర్యంపశ్యలనే వర్ణనలు ఇక్కడివాళ్ళందరూ అసూర్యంపశ్యలే. ఎండకన్నెరుగని ఇల్లా . నవనవ లాడుతూ ఉంటారు

బాల్టిక్ సముద్రంలో మాలార్ సరస్సు నీరుకలిసేచోట దీవులమీద కట్టిన ఈ నగరం ఎంతో సౌందర్యంగా ఉంటుందనే దీనికి క్వీన్ ఆఫ్ ది బాల్టిక్ అని అంటారు. నగరం అంతానూ, పరిసరప్రాంతాలూ కార్లల్లో తిరిగాం, అప్పు డప్పుడు వర్షం కురుస్తున్నప్పటికిన్నీ నగరమే గాక చుట్టుపక్కలకూడా వృక్షాలతోనూ, వనాలతోనూ, పండ్లతోటలతోనూ, కొండలూ సెలయేళ్ళతోనూ ఎంతో అందంగాఉంది. నగరంలో కాలవలఒడ్డునే ఉన్న రోడూ, కాలవగటూ,

వంతెనలూ ఎంత అందంగా ఉన్నాయని' కాలవల్లో చిన్నచిన్న పడవల్లో మనుష్యులూ ప్రయాణాలుసాగిస్తారు, సరుకుల ఎగుమతులూ, దిగుమతులూ జరుగుతాయి పారిశ్రామికంగాకూడా ఈ నగరం ప్రసిదికెక్కింది

అనేకమైన విద్యాసంస్థలు ఉన్నాయి ఇక్కడ నోబెల్ సంస్థ ఇక్కడిదే అని నీకు తెలుసునుకదా! డాక్టరు నోబెల్ అనే విజ్ఞానవేత్త డైనమైట్‌ను సృష్టించాడు దానివల్ల లెక్కలేనంత ధనం లభించిం దాయనికి కొంతధనంతో ట్రస్టు ఏర్పరచి సైన్సులోనూ, సాహిత్యంలోనూ, శాంతికీ కృషిచేసినవారికి ఏటేటా పెద్ద బహుమానాలు పంచిపెట్టే ఏర్పాటుచేశారు అందుకే స్టాక్‌హోమ్ పేరు చెప్పేసరికి నోబెల్ జ్ఞాపకంవస్తాడు

17 వ తేదీ రాత్రి తొమ్మిదిన్నరకి మళ్లీ స్వీడెన్‌నుంచి తిరుగుప్రయాణం సాగించి ట్రాల్లీబోర్గ్ మీదుగా ఫెర్రీబోటు మీద బాల్టిక్ సముద్రందాటి నిన్న సాయంకాలం 7 గంటలకి జర్మనీ ముఖ్యపట్టణం బర్లిన్ పట్టణంలో దిగాం గ్రాండ్ హోటేల్‌లో బసచేశాం

వచ్చేవారం మళ్లీ వ్రాస్తాను ఇప్పటికి సెలవు.

సి
వేంకటరావు

---



Bristol Hotel
Vienna
(Austria)
26th September 1930

డియర్ వెంకటరావ్,

ముందుగా బెర్లిన్ సంగతి వ్రాస్తా. చాలా విశాలమైన పట్టణంలాగా కనపడుతూంది అమెరికాలోలాగ ఆకాశంమీదికి కాకుండా భూమిమీదికి విశాలంగా పెరిగినట్టుంది నగరానికి మధ్యగా స్ప్రీ అనే నది ప్రవహిస్తూవుంది నదికి రెండువైపులా నగరం పెరిగింది నదీతీరాన్ని మంచి మంచి భవనాలు ఉన్నాయి నదిలో నావలు తిరుగుతూన్నాయి బెర్లిన్‌లో ముఖ్యంగా చూడవలసింది అంటర్ డెన్ లిండెన్ అనే రాజవీధి గవర్నమెంటు ఆఫీసులన్నీ ఈ వీధికి సంబంధించి ఉన్నాయి హైక్లాస్ సొసైటీకి సంబంధించినవాళ్ళు, ప్రభుత్వోద్యోగులూ ఎక్కువగా ఈప్రాంతాన్నే ఉంటారు ఈ అంటర్ డెన్ లిండెన్ అనే వీధి దాదాపు మైలుపొడవు ఉంది. బెర్లిన్‌కి ముఖ్యమైనవీధి ఇదేను. ఊళ్ళోనే ఒక గొప్పపార్కు ఉంది దాన్ని టయర్‌గార్టెన్ అంటారు ఇందులో పూర్వం లక్షలకొలదీ లేళ్ళూ, దుప్పులూ ఉండేవట బ్రాండెన్‌బర్గ్‌గేట్ అని ఒక పెద్ద ఆర్చిలాంటి కట్టడం ఒకటి ఎప్పుడో నూటయాభై సంవత్సరాల క్రితం కట్టారు ఆ గేట్‌లోనుంచే పట్టణంలోనికి ప్రవేశించాలి ఆగేటు దాదాపు 200 అడుగుల వెడల్పు ఉంటూ చాలా ఎత్తుగా ఉంటుంది దాదాపు 80 అడుగులైనా ఎత్తు ఉంటుంది ఆ ఆర్చి కిందనుంచి నాలుగు వరసలు కార్లు ఒకేసారి వెళ్ళవచ్చు. మనుష్యులు నడవడానికి రెండువైపులా చిన్న ఆర్చిలు రెండు ఉన్నాయి బెర్లిన్ వచ్చినవాళ్ళు ఈగేటులోనుంచి వెళ్ళక తప్పదు

టయర్‌గార్టెన్ పార్కు అన్నానే అది ఈగేటు దగ్గర ప్రారంభించి చార్లొటెన్‌బర్గ్ వరకూ విస్తరించి ఉంది. ఈపార్కులో విశేషం ఏమిటంటే ఇందులో ఉన్నన్ని స్టేట్యూలు మరెక్కడాలేవు మేమే వందకిపైగా లెక్కపెట్టాము అనేకమైన నిలువురోడ్లూ, వాటికి మళ్ళీ అడ్డరోడ్లున్నూ ఉన్నాయి ఈరోడ్లపక్కని దగ్గర దగ్గరగానే ఎన్నో స్టేట్యూలు ఉన్నాయి. ఈస్టేట్యూలన్నీ జర్మన్ దేశస్థులవే కాక ప్రపంచంలో గొప్పవాళ్ళవి కూడా ఎన్నో ఉన్నాయి.

నాకు ఒక స్టేట్యూ కనపడ్డది పేరు చదివాను విక్టర్‌హ్యూగో అని ఉంది నిన్ననే కొన్నాను ఒక వెస్ట్‌పోకెట్ సైజు కెమెరా దాంతో ఒక స్నేప్ తీశాను. చూడువుగాని కదూ ' ఈ పార్కు-కూడా అన్నిపార్కు-ల్లాగే సుందరంగా ఉంది ఇంక ఈపార్కు-లో నుంచి బ్రాండెన్‌బర్గ్ గేటుగుండా ఊళ్లో ప్రవేశి స్తే అంటర్ డెన్ లిండెన్ వీధిలో ప్రవేశిస్తాం ఈవీధికి అవతలిచివర ఉంది పూర్వపు రాజభవనం తిరవాత చెప్పుకోతగ్గ వీధి విల్‌హెల్మ్‌స్ట్రాస్ ఇక్కడ గవర్నమెంటు భవనాలు ఎక్కువ ఫేషనబుల్ సొసైటీ ఎక్కువ మంచి హోటేళ్ళు పెద్ద పెద్ద షాపులూ ఇక్కడే ఉన్నాయి అంటర్‌డెన్ లిండెన్ వీధికి అందం తెచ్చింది దానికి రెండువైపులూ ఉన్నఅవెన్యూలు ఆ చెట్లను లైమ్‌ట్రీస్ అంటారు చిన్న చిన్న పువ్వులుపూచి సువాసనలు వెదజల్లుతూ ఉంటాయి ఈవీధికి ఒక కొనను బ్రాండెన్‌బర్గ్ గేట్ ఉంది రెండో కొసను ఒక బ్రహ్మాండమైన స్టేట్యూ ఉంది దాన్ని ఫ్రెడరిక్ ది గ్రేట్ మాన్యుమెంటు అంటారు

మేము ఇక్కడ ఎక్కువగా షాపింగ్ చెయ్యలేదు. చేసేదేదో ఇంగ్లండులోనూ అమెరికాలోనే చేసేశాం కాని రెండురోజులు ఒకే ఒక షాప్‌లో చాలా సామాను కొన్నాం అది జీస్ ఇకాన్ కెమెరాల షాపు అవి జర్మనీలోనే తయారు అవుతాయి కదా మాచిన్న నాయన కెమెరాలూ, కెమెరా సామానులూ చాలా కొన్నారు యథాశక్తి నేనూ ఒక వి పి సైజ్ కెమెరా పదిహేను మార్కు-లకి కొన్నాను ఇక్కడి డబ్బుని మార్కు-లంటారు ఒక మార్కు-దాదాపు మన రూపాయికి సమానం షాపులన్నీ మెషినరీ సామానులతో నిండి ఉంటాయి మందులూ, రంగులూ, ప్రింటింగు యంత్రాలూ, విస్తారంగా తయారు అవుతాయి. స్టీలు సామానులు కత్తులూ, కత్తెరలూ, మంగలి కత్తులూ ఎక్కడచూచినా కనబడతాయి పదిమార్కు-లు ఇచ్చి ఒక చిన్న గ్రామఫోను కూడా కొన్నాను యంత్రసామగ్రి అంతా మహాచౌకగా కనపడుతూంది. ఎక్కడ చూచినా బీరు దుకాణాలూ, వైను షాపులున్నూ బీరు త్రాగనిమనిషి ఉండడు ఎవరితో మాట్లాడుతున్నా, స్త్రీలుకానీ పురుషులుకానీ, ద్రావకం గుప్పున వాసనకొడుతూ ఉంటుంది ఆడవాళ్లు నాజూకుగా ఉన్నట్టు కనపడరని ఇదివరకు వ్రాశాను బహుశా వాళ్ళ తిండివల్లనేమో ఎక్కువగా బంగాళా దుంపలు తింటారు. గోధుమ, ఓట్లు విస్తారంగా పండుతాయట.

బెర్లిన్‌నగరం యూరప్‌ఖండంలో పెద్దపట్టణాల్లో మూడోదట పెద్ద యుద్ధంతరువాత చక్రవర్తిని రాజ్యభ్రష్టుణ్ణిచేసి పంపించేశారు జర్మన్ రిపబ్లిక్‌గా రాజ్యాంగం నడుస్తూఉంది అయితే యుద్ధంలో చావగామిగిలిన సేనానాయకులలో గొప్పవాడైన వాన్‌హిండెన్‌బర్గ్ ప్రెసిడెంటుగా రాజ్యం చేస్తున్నాడు. జర్మనీ అంటేఇక్కడ ఎవరికీ తెలియదు దానికి ఇంకో పేరు ఉంది డూష్‌లాండ్ అని బెర్లిన్‌లోకూడా జనసమ్మర్దం ఎక్కువగానే ఉంది ఇక్కడకూడా భూగర్భంలో రైల్వేలు ఉన్నాయి కార్లూ, ట్రాములూ హమేషా తిరుగుతూనే ఉంటాయి పార్లమెంటు భవనమూ, కైజరు రాజభవనం దూరంనుంచే చూశాము. ఒక కొండమీద బ్రహ్మాండమైన స్టేట్యూ, బిస్మార్క్‌ది, పెట్టారు అక్కణ్ణుంచి చూస్తే బెర్లిన్ నగరమంతా కనపడుతుంది. ఆ కొండ ఎక్కి ఆ స్టేట్యూ చుట్టూ ఒక ప్రదక్షిణంచేసి వచ్చాం

బెర్లిన్‌కి దగ్గరగానే పాట్స్‌డామ్ అనే ఊరు ఉంది అక్కడికి వెళ్ళాం ఇది పూర్వపు జర్మన్ చక్రవర్తుల నివాసస్థానం అందుచేత పెద్దపెద్ద రాజ భవనాలు ఎన్నోఉన్నాయి. చాలా అందమైన పార్కులు ఎన్నోఉన్నాయిక్కడ ఇక్కడే ఉన్న ఒక గొప్ప నక్షత్రశాల చూశాం

జర్మనీగురించి నీకు మంచిఅభిప్రాయం కలగజెయ్యలేదేమో. ప్రజలు మోటుగా కనపడ్డప్పటికీ హృదయాలు మంచివేనేమో. ఎందుచేతనంటే మర్యాదగా మాట్లాడుతున్నారు గౌరవంగానే చూస్తున్నారు పెద్ద యుద్ధం కారణంగా జర్మనీ అనేక నష్టాలకి గురయింది జనం మరణించారు ధనం వ్యయం అయింది. రాజ్యాంగం మారింది. వలసరాజ్యాలు మిత్రరాజ్యాలవాళ్లు పంచుకున్నారు. ఆయుధాలు తగ్గించింది మిలిటరీ తగ్గింది నష్టపరిహారం ఇచ్చుకోవలసి వచ్చింది అయినా యీ పదిసంవత్సరాలలోనూ ఇంతగా కోలుకుందీ అంటే ఎంతో ప్రశంసించాలి.

గడచినరాత్రి జరిగిన ఒక సంఘటననుగురించి వ్రాయకుండా ఉండలేను ఎందుచేతనంటే నాకు ఎంతో మనోవ్యధ కలిగింది ఇక్కడి మన భారతీయ విద్యార్థులను చూచి మేము బెర్లిన్ స్టేషన్‌లో దిగేసరికి మనవాడే ఒకడు మమ్మల్నిచూచి మావద్దకువచ్చి హిందూస్థానీలో మాట్లాడడం మొదలుపెట్టాడు

మనకి తెలియదుగా ఆభాష ఇంగ్లీషులో చెప్పమన్నాను బెర్లిన్‌లో ఇండియన్ రెస్టారెంటు ఒకటి ఉందనీ, మన వంటకాలు సప్లయిచేస్తాననీ చెప్పాడు అడ్రసు ఇచ్చాడు మేముఉన్న గ్రాండ్‌హొటేల్ చాలా గొప్పది బయటినుంచి ఆహారపదార్థాలు తెప్పించుకు తినడానికి వాళ్లు ఒప్పుకోరు హిందుస్థాన్ రెస్టారెంటు ఎలాంటిదో మా దివాణం వెళ్ళతగినదో లేదో ఏమైనా చూచి రమ్మంటే గడచినరాత్రి వెళ్ళివచ్చాను. ఏవో కొన్ని పదార్థాలు చెయ్యమని ఆర్డరుయిచ్చాను కూడా అక్కడ జరిగిందేమిటంటే ఒక్కొక్కళ్ళూ మన ఇండియన్ యువకులు రావడం మొదలుపెట్టారు వచ్చీరావడంతోనే వాళ్ళు శుభ్రంగా తప్పేదుతప్పేడు బీరు సేవించారు ఇంక టేబిలుదగ్గర కూర్చొని ఆదేపనిగా తాగడం; పెద్దపెద్ద కేకలతో ఖబుర్లు, పాటలూ, గోలా చేయడం మొదలుపెట్టారు ఇంకా కొందరు కూడా జర్మన్ అమ్మాయిల్ని తీసుకువచ్చారు వాళ్ళు మర్యాదగా కూర్చొని తాగుతూ కబుర్లు చెప్పుకుంటారెమో ననుకున్నాను హఠాత్తుగా ఒక అమ్మాయిని టేబిల్‌మీదకి ఎక్కించారు ప్రక్కనే గ్రామఫోను మోగుతూ ఉంది, ఆ అమ్మాయి టేబిల్‌మీద డాన్సుచెయ్యడం మొదలుపెట్టింది అంతే అయితే ఫరవాలేదు ఆ అమ్మాయిని వేళాకోళం చేసేవాళ్ళూ, బట్టలు లాగేవాళ్ళూ, జుట్టు పీకేవాళ్ళున్నూ. గిర్రున తిరిగి ఆ అమ్మాయి టేబిలుమీద నుంచి గెంతి ఒకడిఒళ్ళో పడడం సరే తక్కినవాళ్ళు ఊరుకుంటారా ? కొంత సేపటికి అమ్మాయిల సంఖ్య పెరిగింది. ఆ చిన్నగదిలోనే టేబిల్‌చుట్టూ జంటలుజంటలుగా నాట్యంచెయ్యడం మొదలుపెట్టారు

అందులో ఒక ప్రబుద్ధుడు ఒక మూలగా కూర్చొని ఉన్న నా వద్దకువచ్చి ఒక సలాంకొట్టి ఎక్కడినుంచి వచ్చావన్నాడు మద్రాసునుంచి అన్నాను ఇక్కడ సాంబారు దొరకదే అని వేళాకోళంచేసి ఒక గాజుమగ్గునిండా బీరునింపి తీసుకవచ్చి తాగమన్నాడు వద్దన్నాను ఏం ? అలవాటులేదు ఎప్పుడూ త్రాగ లేదన్నాను. అయితే జర్మనీ ఎందుకువచ్చావన్నాడు "What a fool you are ! To have Come to Germany and not drinking beer Without beer what is Germany," అని నన్ను కూకలేశాడు. ఇంతలో రెస్టారెంటువాడు నేను ఆర్డరిచ్చిన సామానుపేకెట్లు తీసుకువచ్చాడు. ఇదీ ఇక్కడ మనదేశపు విద్యార్థులవరస

ఈ ఉత్తరం వ్రాయడం నేను బర్లినులో మొదలుపెట్టేను ఇప్పుడు వియన్నాలో ఉన్నాం 21 వ తేదీ రాత్రి బయలుదేరి జెకోస్లొవేకియా మీదుగా ప్రయాణంచేసి 22 వ తేదీ మధ్యాహ్నం ఒంటిగంటకి వియన్నా చేరుకున్నాం బ్రిస్టల్ హొటేల్‌లో బసచేశాం ఊరుమధ్యగా మంచి రద్దీ అయిన వీధిలో ఉన్నాం చుట్టూ గొప్పగొప్ప షాపులు ఉన్నాయి. ఈ న్నాలుగురోజులూ వియన్నా అంతా బాగా తిరిగిమాశాం నగరం చిన్నదే అయినా చాలా చక్కగా ఉంది ఆస్ట్రియా దేశానికి ఇది ముఖ్యపట్టణం వియన్నా చేతిపనులకి చాలా ప్రసిద్ధికెక్కింది ముఖ్యంగా వెండి బంగారు వస్తువులమీద చక్కని రంగు రంగుల ఎనామిల్ పనులు ఎంతో చక్కగాచేస్తారు ఇక్కడ మేము ఎనామిల్‌తో చేసిన వస్తువులు చాలా కొన్నాం వియన్నా గొప్పవైద్యులకి స్థానంగా ప్రపంచంలో ప్రసిద్ధికెక్కింది మా మహారాజావారు చిన్నప్పుడెప్పుడో గుర్రం మీదనుంచి పడ్డారట నడుం నొప్పిపట్టింది. ఆ నొప్పి యింకా ఉంటూనే ఉంది అందుకు ఇక్కడ ఒకరిద్దరు బ్రహ్మాండనాయకులైన డాక్టర్ల సలహాలు తీసు కున్నారు. నిపుణులు అంటే ఒక విషయం వ్రాస్తున్నాను నేను బెర్లిన్‌లో ఉండగా నా మధ్యవేలుపైన దురదపెట్టింది కొంచం గోకి నలిపివేశాను అది వాచి లోపల పెద్ద కురుపుగా తయారయి చాలా బాధపెట్టింది. కాని ఒక చిన్న ప్లాస్టర్ వేశాను. కనడ్డవాళ్ళందరూ అది చాలా ప్రమాదమనిన్నీ డాక్టరుకి చూపించ మనీ అంటూంటే ఒక స్పెషలిస్టుకి చూపించాను తక్షణం వేలు తీసెయ్యాలి అన్నాడు ఇంకా ఆలస్యంచేస్తే చెయ్యే తీసెయ్యవలసి వస్తుందన్నాడు భయపడి తిరిగివచ్చి మా మిస్ నార్తుతో చెప్పాను ఆమె కురుపు ఓపెన్‌చేసింది చీము పోయింది కురుపు మానుపడుతూ ఉంది ఈ ఉత్తరం వ్రాయగలుగుతూ ఉన్నాను స్పెషలిస్టులు అంత జాగ్రత్త తీసుకుంటారన్నమాట 'అంగవ్రాత ములో చికిత్సకుడు దుష్టాంగమ్ము ఖండించి' పద్యం జ్ఞాపకంవచ్చింది ఏకంగా ఖండించడమేగాని స్పెషలిస్టులు తేలికమార్గం చూడరుకాబోలు అనుకున్నా

వియన్నా చాలా చెడ్డపట్టణంలాగ కనపడుతూ ఉందోయ్! ముఖ్యంగా స్త్రీల విషయంలో వాళ్ళ ప్రవర్తన చాలా అసహ్యకరంగ్గా ఉంటుంది మనకి, ప్రొద్దుపోయాక రోడ్డుమీద నడవటానికి భయంవేస్తుంది. మొన్నరాత్రి ఇలా పేవ్‌మెంటుమీద కొంచం షికారు చేదాం అని బయలుదేరాం హఠాత్తుగా ఒక

అమ్మాయి [illegible] చెయ్యివేసి నవ్వుతూ ముఖంపై పు
మాచింది ఇంకేవో మాటలు మొదలుపెట్టింది వెనక్కి తిరిగి చూచాను
మాలో ఇంకొకణ్ణి ఇంకో అమ్మాయి పట్టుకుంది వాళ్ళని వొదిలించుకోడానికి
చచ్చినంత ని అయింది జనం తోసుకుంటూనే ఉంటారు షాపు విండోస్‌లో
ఏదో చూస్తున్నట్లే ఉంటారు, వీధిమొగలు కాముకుని చూడా ఉంటారు అంటే
వ్యభిచారం ఇక్కడ చాలా ఎక్కువ అన్నమాట ఇంగ్లీషువచ్చిన అమ్మాయి
కూడా తగిలింది, ఎక్కడికైనా తీసుకెళ్ళమనీ, ఒకపెగ్గు విస్కీ ఇప్పించమనీ,
తనగదిలోకే రమ్మనీ, ఆడవాళ్ళంటే నీకు ఇష్టంలేదా అనీ, సుఖించడం తెలియదా
అనీ ఎన్నోఎన్నో మాటలు గలగల లికింది చెయ్యి నానడుంకి ముడవేసికూడా
నడవడం మొదలుపెట్టింది జబ్బులుంటాయని భయపడనక్కరలేదంది చేతి
సంచిలోనుంచి ప్రెంచిలెటరుతీసి చూపించింది ఇంకా మితిమీరి పంట్లాంజేబులో
చెయ్యిపెట్టడానికి ప్రయత్నించింది కొంతచిల్లర ఇచ్చి తప్పించుకొని బయటపడ్డాం
ఇంత అసహ్యంగా ఎవరైనా ప్రవర్తిస్తారా ? దాహాటంగా, సిగ్గూ, లజ్జా వొదులు
కుని ! జీవనోపాధికోసం ఇంకొక వృత్తి లేదా ? ఈరకం మనుష్యులు ఇక్కడ
చాలా ఎక్కువగా ఉన్నారు అయితే ఇంగ్లాండు, అమెరికా దేశాలలోని
పట్నాలలో ఇటువంటి దాడి ఎక్కడా జరగలేదు మామీద

పగలంతా పట్నంలో విశేషాలు చూశాం మంచి ఆర్టుగేలరీ ఉంది,
పెద్దమ్యూజియమ్ ఉంది చాలా చిత్రమైన వస్తువులు ఉన్నాయిక్కడ పార్ల
మెంటు హవుస్, రాజభవనం పైనుంచే చూశాం చాలా పెద్దభవనాలు అవి
ఒక బ్రహ్మాండమైన పార్కువుంది దీన్ని ప్రేటర్ పార్కుఅంటారు దీనికి
చాలాగొప్పపేరు అంత అందంగా ఉంటుందన్నమాట సెంట్‌స్టీఫెన్సు చర్చి
చాలా పురాతనమైనది ఒకటి చూశాం ఈ పట్నంలో ఇంకొక గొప్ప ఆకర్షణ,
బ్రహ్మాండమైన రంకులరాట్నం – జెయంట్ వీల్ అయితే ఇది ఒక గొప్పచక్రం
దానికి కుర్చీలు తగిలించి ఉంటాయి. ఆ కుర్చీలో కూర్చుని ఆకాశంలోకి పోయి
మళ్ళీ క్రిందికి రావచ్చన్నమాట. మనతీర్థాలలో రాట్నాలకి గుర్రాలు అమర్చి
ఉంటే వాటిమీద కూర్చుని గుండ్రంగా తిరుగుతామేగాని ఆకాశంలోకి వెళ్ళం
ఇక్కడి ఈ జెయెంట్ వీల్ ఆకాశంలోకి తీసుకుపోయి తిప్పుతుంది. ఇదొక
పెద్దవింత ఈ వూరు వచ్చిన ప్రతీవ్యక్తి ఈ రంకులరాట్నం ఎక్కకుండా

ఉండదు యూనివర్సిటీ కూడా వెళ్లాం వైద్యానికీ విజ్ఞానశాస్త్రానికీ సంబంధించిన కళాశాలలు ఎన్నో ఉన్నాయిక్కడ ఊరు పరిసర ప్రాంతాలలో ద్రాక్షతోటలు విస్తారంగా ఉన్నాయి ఇక్కడకూడా సారా తయారుచేసే బ్రూవరీలు ఎక్కువగా ఉన్నాయట

మొత్తంమీద వియన్నాలో సరదాగానే గడిపాం వొచ్చాక వివరంగా చెపుతానుకదా రేపు ఇక్కడనుంచి బయలుదేరి భూలోకస్వర్గంగా పరిగణింపబడే స్విడ్జరులాండు వెళుతున్నాం అక్కడినుంచి మళ్ళీ వ్రాస్తాను

సీ
వేంకటరావు

——



Schweizerhof Hotel
Lucerne
Switzerland
2nd October 1930

మిత్రుడు పెమ్మరాజుకు,

నువ్వు దయతో వ్రాసిన జాబుచూసుకుని పరమానందం పొందాను
ప్రస్తుతం స్విడ్జరులాండులో ఉన్నాం ధనవంతులూ భోగులూ, జీవితాన్ని
ఆనందంగా గడపాలని శాసించేవాళ్లూ ఏదేశంలోని సృష్టిసౌందర్యాన్ని అనుభ
వించాలని ఉవ్విళ్లూరితీరో ఆదేశం, స్విడ్జరులాండులో ఉన్నాం ఇప్పుడు. ఆల్ప్స
కొండలమీద ఎత్తైనప్రదేశం ఆల్ప్సుకొండలు యూరప్‌ఖండంలోని కొండలన్నిటి
కంటె ఎత్తుగా ఉంటాయి పేరుబడ్డ మంచుశిఖరాలెన్నో వున్నాయి వీటిమీద
స్విడ్జరులాండుదేశం అంతా కొండలమీదే వుంది మనదేశంలో మనవాళ్ళందరూ
కాశ్మీరును భూలోకస్వర్గం అంటారు ఇక్కడివాళ్లు స్విట్జరులాండుని భూలోక
స్వర్గం అంటారు ప్రపంచం నాలుగుమూలల్నుంచీ సృష్టిచిత్రాన్ని తిలకించే
యాత్రికులు తండోపతండాలుగా వస్తారు ఇక్కడికి స్వర్గంలో నందనవనం
ఉంది వాడని పువ్వులు ఉంటాయి ఇక్కడకూడా అంతే స్వర్గంలో
కామధేనువు ఉంది ఇక్కడ పాడికి లోటులేదు కోరినవన్నీ ఇచ్చే చింతామణి
అక్కడ — ఏకొరతాలేని సమృద్ధి ఇక్కడ అక్కడ అప్సరసలు ఉన్నారు
ఇక్కడో ? ఇంకా చూడాలి !

స్విడ్జరులాండు చేతిపనులకీ, వాచీలూ, గడియారాలూ తయారుచేయడానికీ
పశువుల పెంపకానికీ పేరుపడినా, వ్యవసాయం ముఖ్యమైనదైనా, గవర్న
మెంటుకి యాత్రికులవల్లనే ఆదాయం ఎక్కువ కొండలూ, మంచు శిఖరాలూ,
నదులూ, సరోవరాలూ ఎక్కువ ఈదేశంలో సరస్సులంటే చిన్నచిన్నవి కావు
సముద్రం అంతటి సరస్సులు మైళ్ళపొడవున వుంటాయి శీతోష్ణస్థితి అతిశీతలం
గానూ, అత్యుష్ణంగానూ వుండకుండా ఏకాలంలోనైనా సహించడానికి వీలుగా
వుంటుంది మనదేశంలో పర్వతాలమీదవున్న ఊటీ, సిమ్లా, డార్జిలింగ్ మొదలైన
ప్రదేశాలకి సాధారణంగా టూరిస్టులు వేసవికాలంలో వెళతారు ఇక్కడికి ఏడాది
పొడవునా వస్తారు వేసవిలో ఆకులూ, పువ్వులతో కలకలలాడుతూ ఉంటుంది.

శీతకాలంలో మంచుమీద స్కేటింగ్ చెయ్యడానికీ, స్కై యింగ్ చేయడానికీ ఇతర దేశాలనుంచి వేలాది స్త్రీ పురుషులు వస్తూంటారు కొండశిఖరాలు ఉదయాన్నే మా స్తే మంచుకప్పి వుంటాయి పొదవుచెట్లూ, పచ్చిక బయళ్లూ, పశువులమందలూ ఎక్కడచూచినా అవే

అయిదురోజులైై ఇక్కడికి-లూసర్న్ వచ్చాం గడచిన నెల 27 వ తేదీ రాత్రి తొమ్మిది గంటలకి వియన్నాలో రైలు ఎక్కాం, మర్నాడు మధ్యాహ్నం రెండు గంటలకి స్విడ్జర్‌లాండ్‌లో తెల్‌విల్ లనే ఊళ్లో రైలు దిగాం ఉదయాన్నుంచి మధ్యాహ్నం రెండు గంటలకి రైలు దిగేవరకూ మా రైలు కొండల్లో నుంచీ, కొండ లోయలలోనుంచీ, అడవులలోనుంచీ, నదుల్నీ, సెలయేళ్ళనీ, పర్వతాలనీ దాటి వచ్చింది ఆ ప్రాంతంలో ప్రయాణం చేస్తూచూసిన ఆ ప్రకృతి సౌందర్యాన్ని నే నెలా వర్ణించగలను? ఆకాశాన్నంటుకుపోయే పైన్ వృక్షాల మహారణ్యాలు దాటి వచ్చాం అక్కడక్కడ అప్పుడప్పుడు దట్టంగా ఆవరించిన పొగమంచులోనుంచి పోయాం ఆ పొగమంచులో చిక్కుపడ్డప్పుడు ఏమీ కనపడదు రెండు గజాల దూరంలో మనిషి నిలబడితే కనపడదు అందుకే పొగమంచులో ప్రమాదాలు సంభవిస్తూంటాయని తరుచూ చదువుతూ ఉంటాం ఇంక ఎండకాస్తుంది నీరెండ నీరెండలో దూరాన్నున్న కొండ శిఖరాలమీద ఉన్న మంచుమీద సూర్యకిరణాలు పడినప్పుడు చూస్తే ఆ కొండలు బంగారు జలతారు తలపాగాలు చుట్టుకొన్నాయా అనిపిస్తుంది ఒక్కొక్కప్పుడు వెండి టోపీలు ధరించాయా అన్నట్టు కనపడతాయి దిగువభాగం అంతా దట్టమైన అడవులు రైలు దిగకూడదనిపించింది జీవితాంతం ఈ కొండల్లో కోనల్లో పువ్వుల్లో, ఈ ప్రకృతి సౌందర్యంలో ఇలాగే ఆగకండా తిరుగుతూ ఉంటేనా? మన మేష్టారి పాట "ఆకులో ఆకునై, పూవులో పూవునై ఈ అడవి దాగిపోనా ఎటులైన ఇచటనే ఆగిపోనా" గొంతులో కొట్టాడింది తెల్‌విల్ వచ్చింది రైలు దిగాలి అన్నారు నేను దిగను ఇలాగే ఇంకా పోవాలన్నాను మా చిన్నరాజా గారితో చాలులే! ఇక్కణ్ణుంచి ఇంకా బాగాఉంటుంది కారులో వెడతాంకదా! అన్నారు తెల్‌విల్ నుంచి లూసర్న్‌కి సుమారు యాభై, అరవై మైళ్ళు రైలు దిగి కార్లు ఎక్కాం ఈ అరవై మైళ్ళూ చక్కని రోడ్డుమీద మా కార్లు ఎక్కేకొండా దిగేకొండా, కొండచుట్టూ తిరగడం, సెలయేళ్ళుదాటడం, అడవుల్లో నుంచి దూసుకుపోవడం, లోయల్లోకి దిగజారడం, ఎత్తులు ప్రాకడం ఎంత

సరదాగా ఉండని ? ఆ దృశ్యాలన్నీ నా మనోఫలకంమీద చెరగకుండా ఉండునని మనదేశంవచ్చాక తోచినప్పుడు కళ్ళుమూసుకుని ఆ దృశ్యాలన్నీ ఒక్కొక్కటే పేజీలు తిరగవేసినట్లు తిరగవేసి చూసుకొని ఆనందిస్తా జీవితం అంతా

సాయంత్రం ౯ గంటలకి ఈ వూరు, లూసర్న్, చేరుకున్నాం మా హొటేల్ పేరు స్క్వాయిజర్ హోఫ్ హొటేల్ లూసర్న్ స్విడర్లాండు దేశానికి దాదాపు మధ్యగా ఉంది లూసర్న్ సరస్సు దగ్గరగానే ఉంది స్విట్జర్లాండ్ వచ్చే యాత్రికులందరూ విధిగా లూసర్న్ వస్తారు ఇది చాలా ముఖ్యమైన ప్రదేశం ఈ వూళ్ళో చూడవలసినవి చాలా ఉన్నాయి పెద కెథీడ్రల్ ఒకటి ఉంది చూచాం ప్రతి యాత్రికుడూ వచ్చిచూసేది గ్లేషియర్ గార్డెన్స్ను ఇందులో ముఖ్యంగా చూడవలసినది గ్లేషియర్స్ను.

గ్లేషియర్ అంటే ఏమిటో చెపుతా కొండలమీద మంచు ఒత్తుగా పడుతుంటె గడ్డకట్టిపోతుంది మళ్ళీ పడుతుంది అలాపడ్డ మంచు పేరుకుపోయి పెద్దపెద్ద కొండలలాగ తయారవుతుంది ఎప్పుడో అది దానిబరువుకి ఏప్రక్కకో ఒరిగిపోతుంది ఎత్తునుంచి ఆ మంచుకొండ కొండభాగంగా కిందికి జారుతుంది. పల్లానికో, లోయలోకో అది ప్రవేశిస్తుంది ఆ జారడంలో దానికి వేగం హెచ్చుతుంది జర్రున మైళ్ళ కొలది కొండకొండగానే అతివేగంగా ప్రయాణం సాగిస్తుంది దానినే హిమానీనదం అంటారు అదే గ్లేషియర్ ఒక్కొక్కప్పుడు ఆ వేగానికి గుండ్రంగా తిరుగుతుంది గ్లేషియర్సు చూడడానికి ఎంతో సరదాగా ఉంటాయి మంచుకొండలు కదులుతూ, నీటిమీద తేలుతూ, గుండ్రంగా తిరుగుతూ, లోయల్లో ప్రవహిస్తూ ఉంటే చూడడానికి ఎంత ఆనందంగా ఉంటుందని

ఈ మంచుకొండలు క్రిందికి జారుతున్నప్పుడు ఏ పర్వతమో అడ్డుకుంటుంది అక్కడి ఉష్ణానికి మంచు కరిగి ఏ లోయల్లోనుంచో నీరు నదిలాగ ప్రవహించిపోతుంది ఆల్ప్స్ కొండలలోని చాలానదులు ఈ గ్లేషియర్స్లో నుంచి పుట్టినవే ఇక్కడే ఎన్నో ఉన్నాయి ఇంక మన హిమాలయా పర్వతాలలో ఎన్ని హిమానీనదాలు ఉన్నాయో ! వాటిలోనుంచి ఎన్నినదులు పుట్టాయో !

ఒకప్పుడు వాటి ప్రవాహవేగంయొక్క ఒరిపిడికి ప్రక్కనుఉన్న కొండలు కోసుకుపోతాయి, కొండలలో గుండ్రంగా గుంటలు ఏర్పడతాయి. రాళ్ళని

కూడా ఈ మంచు అరగదీసేస్తుంది గ్లేషియర్స్ ఎప్పుడూ ఒకేబాటను పోవు. వాటిదారి మారుతూఉంటుంది వట్టిపోతూ ఉంటాయికూడా ఒకప్పుడు ఈ గ్లేషియర్స్‌లోని మంచు కరిగి నీరు ప్రవహించిపోయినప్పుడు కొండలమీద సజీవంగా ఉన్న గ్లేషియర్సు వేసిన ముద్రలు మనకి కనపడతాయి అలాగు ఒకప్పుడు హిమానీనదంగా ఉండి, ఇప్పుడు వట్టి రాతిదిబ్బలుగా ఉన్నవే ఈ లూసర్న్‌లోని గ్లేషియర్ గార్డెన్సు ఆ రాతి గుట్టలమీద మంచి పూలవనాలు వేసి యాత్రికులకి వినోదం కల్పించడానికే ఈ గ్లేషియల్‌గార్డెన్సును చక్కగా తయారుచేశారు

గ్లేషియల్ గార్డెన్సులోని రాళ్ళూ, పూలవనాలనేగాక ఒక స్మారక చిహ్నాన్ని కూడా చూశాం ఎప్పుడో ఒకప్పుడు ఆ హిమానీనదంలోపడి ఒక సింహం చనిపోయిందట ఇంకా ఆ సింహాన్నిగురించి ఏవో ఏవో కథలు చెపుతారు. ఆ సింహానికి ఒక మాన్యుమెంట్ కట్టారు. అదొక పెద్ద కట్టడమేమీ కాదు ఒక పెద్ద రాతిబండమీద సింహాన్ని రాతితో చెక్కారు మనదేశంలో దేవాలయాలమీద శిల్పాలతో పోల్చిచూస్తే అదేమీ అంత విశేషమైనదీ కాదు. గార్డెన్ అంతా చూచి తిరిగి వెళ్ళిపోబోతున్నాం అక్కడ పనిచేసేవాడొకడు మమ్మల్ని చెయ్యి ఊపి సౌంజ్ఞచేసి అటువైపు రమ్మన్నాడు ఇంకా ఏదోఉంది కాబోసని వెళ్ళాం ఒక పెద్ద ఇల్లు ఆ ఇంట్లోకి మమ్మల్ని తీసుకువెళ్ళాడు. ఒక గదిలో ప్రవేశించాం ఆశ్చర్యంవేసింది. అది ఒక అద్దాలగది అంటే గోడలన్నీ అద్దాలు పై సీలింగు ఒక పెద్ద అద్దం - కాళ్ళకింద ఫ్లోరింగుకూడా అద్దమే అద్దం అంటే క్రిస్టల్ పేలస్‌లోలాంటి గాజు కాదు అద్దంఅంటే చూచుకునే అద్దం అన్నమాట ఎటుచూచినా మన ప్రతిబింబం కనపడుతూఉంది. అక్కడినుంచి ఇంకొక గదిలోకి వెళ్ళాం అక్కడ ఎటుచూచినా వెయ్యిమంది వెంకట్రావులు కనపడ్డారు కొంచం తలవొంచి చూడమన్నాడు నా ఇమేజెస్ వెయ్యి నన్ను చూశాయి సీలింగ్‌మీద అద్దాలు ఒక పద్మంలాగ అమర్చారు ఆ పద్మంలోకూడా ఎన్నో నీడలు ' రకరకాలుగా కనపడడానికి నాలుగైదు గదులలో రకరకాలైన అద్దాలు అమర్చారు ఒకచోటచూస్తే నేను గడ్డిబొద్దంత లావుగా మరుగుజ్జువాడిలాగ కనపడ్డాను ఇంకొకచోట తాడిచెట్టంత పొడవుగా. సన్నంగా కనపడ్డాను మనం ఇలా కొంచం కదిలితేచాలు మననీడలు వెయ్యీ

కదులుతాయి. వాడు పిలిచి చూపించకపోతే ఈ మయసభను చూడకుండా పోయేవాళ్ళమే చాలా చిత్రంగానూ, ఆశ్చర్యంగానూ ఉంది యాత్రికుల వినోదంకోసం ఎంత డబ్బు ఖర్చుపెట్టి ఈ అద్దాలభవనం కట్టారో దీన్ని లేబరింత్ అంటారు

లూసర్న్ పట్టణం, లూసర్న్ అనే సరోవరతీరాన్ని ఉందిఅని చెప్పాను కదా సరోవరతీరానికి చూడడానికి వెళ్ళాం మైళ్ళపొడవున ఉంది అది పట్నం చుట్టూ సుందరమైన వనాలు ఉన్నాయి యాత్రికులు సరస్సుతీరాలనో, ఆ యా వనాల్లోనో పిక్నిక్‌లు చేసుకుంటూ ఉంటారు ఈ పట్నంలో మేము షాపింగ్ ఎక్కువగా చేశాం, స్విట్జర్‌లాండులో వాచీలూ గడియారాలూ తయారుచేస్తారు గదా ! ఈ వూరంతా గడియారాలషాపులే అంటే గడియారాలు అమ్మేషాపులు మాత్రమే కాదు. గడియారాలు కుటీరపరిశ్రమలాగు ప్రతిఇంట్లోనూ తయారు చేస్తారు • ముందుభాగంలో షోరూమ్ అమరుస్తారు ఒకటి రెండు గదుల్లో రకరకాలైన వాచీలు అమ్ముతారు మేము నాలుగైదు ఫేక్టరీలు చూశాం అచ్చాఫీసుల్లో అక్షరాలు చిన్నచిన్న అరలలోవేసి కావలసిన అక్షరం తీసి పేర్చరూ ? అలాగే అరలలోఉన్న చిన్నచిన్న భాగాలని ఒక్కొక్కటే తీసి కూర్చి. మరలుతిప్పి వాచీకింద తయారుచేస్తారు అమ్మాయిలు ఒక్కొక్క అమ్మాయి రోజుకి ఇరవై ముప్పయి వాచీలు బిగిస్తుందట ఆ బిగించినవాచీలను తిప్పి అబ్జర్వేషన్‌లో పెడతారు హెచ్చుతగ్గులుఏమైనాఉంటే సవరించుకుంటారు

నేనొక రిస్టువాచీ తయారుచేయించాను నాకు నచ్చిన షేప్ చూపించాను నాకు నచ్చిన డయల్ చూపించాను. అక్షరాలు ఎలాఉండాలో, ముళ్ళు ఎలాంటివి ఉండాలో అన్నీ చూపించి చెప్పాను మర్నాడు రమ్మన్నారు మర్నాడువెడితే వాచీ తయారుచేసి సిద్ధంగా పెట్టిఉంచారు అబ్జర్వేషన్‌లో పెట్టి సరిగా తిరుగుతున్న మెషిన్‌కి నేనుచెప్పిన డయల్‌వేసి, నేనుకోరిన కేస్‌లో అమర్చి ఇచ్చారు రెండు పౌనులకి కొన్నాను మా దివాణం రకరకాలైన వాచీలు చాలాకొన్నారు రిస్టువాచీలూ, పెండెంటువాచీలూ, ఉంగరంవాచీలూ, టేబిల్‌మీద పెట్టుకునే గడియారాలూ, గోడకు తగిలించుకునేవీ. సంగీతాలు పాడేవీ, పిట్టకూతలు కూసేవీ, అలారంకొట్టేవీ రకరకాలైనవి ఎన్నోకొన్నారు చాలా చౌకగాకూడా కొన్నారు వాచీలేగాక, వెండిమీదా, బంగారంమీదా ఎనామిల్‌తో పనిచేసిన

వస్తువులుకూడా ఇక్కడ తయారు చేస్తారు వెండిమీద ఆకుపచ్చరంగు ఎనామిల్‌తో ఉన్న బటన్స్ సెట్ ఒకటి కొన్నాను

ఈ ఉత్తరం వ్రాయడం నిన్ననే మొదలుపెట్టినా ఈవేళ తొందరగా ముగించేశాను ఇక్కడ పోస్టుచెయ్యాలని ఎందుకంటే ఇవ్వాళ మధ్యాహ్నం ఇక్కడినుంచి మళ్ళీ ఇంటర్‌లేకెన్ అనే ఊరికి ప్రయాణం అక్కడినుంచి జినీవా వెళతాం జినీవానుంచి మళ్ళీ వ్రాస్తాను

గ్రేట్‌వార్‌లో యూరప్‌ఖండంలో ఉన్న రాజ్యాలన్నీ చిక్కుకున్నాయి కదా ! ఆసియా, ఆఫ్రికా ఖండాలకికూడా పాకిందే అయితే యుద్ధంలోపాల్గొన్న ప్రధానరాజ్యాలు ఫ్రాన్స్, జర్మనీ, ఇటలీ, ఆస్ట్రియాదేశాలకు మధ్యగాఉన్నప్పటికీ స్విట్జర్‌లాండ్‌లో యుద్ధంజరిగే ప్రమాదం రాలేదు స్విట్జర్‌లాండ్ ఏపక్షాన్నీ సైడ్‌చెయ్యలేదు తటస్థంగా ఉండిపోయింది యుద్ధంచేసిన రాజ్యాలుకూడా బలవంతంచేసి ఏదోఒకపక్షానికి లాగలేదు తాటస్థ్యాన్ని గౌరవించాయి అందుకే స్విట్జర్‌లాండ్‌లోని ఏ పట్నమూ చెక్కుచెదరలేదు యుద్ధం పేరుచెప్పి ఒక్క ఆకైనా రాలలేదు దానిసౌందర్యం దానికి ఉండిపోయింది.

ఇవ్వాళ విజయదశమి. మేము ఇక్కడ ఉన్నాం మీరంతా దసరాపండగ చేసుకుంటున్నారని తలుస్తాను మహారాజావారు ఇక్కడ ఉన్నప్పటికీ, పిఠాపురంలో ఉత్సవాలు మామూలుగానే జరుగుతాయికద భేతాళుణ్ణి ఊరేగించడం, జమ్మి నరకడం మొదలైనవన్నిన్నీ !

సీ

వేంకటరావు

---



Hotel Beau - Rivage
Geneva
Switzerland
7th October 1930

మిత్రుడు వెంకటరావుకు,

2వ తేదీ ఉదయం 11 గంటలకి లూసర్న్ నుంచి బయలుదేరాం ఇంటర్ లేకెన్ అనే ఊరికి మోటారుకార్లమీద ప్రయాణం స్విట్జర్‌లాండ్‌లో రైల్వేలు ఉన్నప్పటికీ కార్లమీద ప్రయాణాలే సుఖవృగా ఉంటాయి అడిగాక కొండలమీది నుంచీ, లోయల్లోంచీ, అడవుల్లోంచి ప్రయాణం ఎంతో సరదాగా ఉల్లాసంగా ఉంటుందికదా! స్విట్జర్‌లాండ్ భూతలస్వర్గం అన్నారు అంతా ఒక్కటే ఒక్క నందనవనం అన్నమాట ఇక్కడి పశువులు కామధేనువు ప్రతిమట సిపమే ఎక్కడచూచినా గడ్డిబీళ్ళే మోకాలిబంటి గడ్డిలో తిని ఇష్టంవచ్చినట్టు మేస్తూ సంచరిస్తాయి ఇక్కడి పాడి పశువులు మనదేశంలో పశువుల్లాగ బక్కచిక్కిన ఆవు ఒక్కటీ మచ్చుకైనా కనబడదు ఏనుగుగున్నలలాగు నిగనిగలాడుతూ ఉంటాయి ఒక్కొక్కటి అయిదేసీ ఆరేసీ కుండల పాలు ఇస్తుంటే వాటిని కామధేనువులని అనక ఇంకేమంటాం? పాలని కండెన్స్ చేసేవీ, పిండిగా చేసేవీ, పాలనుంచి మీగడ వేరుచేసి క్రీమ్ తయారుచేసేవీ వెన్నతీసేవీ రకరకాల ఫేక్టరీలు చిన్నవీ పెద్దవీ దేశం అంతా ఉన్నాయి విదేశాలకి విరివిగా ఎగుమతిచేస్తారు రోడ్లమీద పెద్దపెద్ద లారీలు వందలకొద్దీ తిరుగుతూ ఉంటాయి పాలతో తయారైన పదార్థాలని ఇక్కడికీ అక్కడికీ చేరుస్తూ

ఇంటర్ లేకెన్ అనే ఊరు బెర్నీస్ ఓబర్‌లాండ్ అనే ప్రదేశంలో ఉంది ఈ ప్రదేశంలోనే పెద్దపెద్ద మంచు శిఖరాలు ఉన్నాయి ఆ మంచు కొండలమీది శిఖరాలు ఎక్కడానికీ, మంచుముద్దలతో ఆడుకోవానికీ టూరిస్టులు వస్తారు ఇంటర్ లేకెన్‌లో మకాంపెట్టి చుట్టుపట్ల ప్రదేశం అంతా తిరుగుతారు అందుకే మేమూ ఇంటర్ లేకెన్ వచ్చాం విక్టోరియా గ్రాండ్ హోటేల్‌లో బసచేశాం ఇంటర్ లేకెన్‌కి కొంతదూరంలో ఇటువైపు ఒకటీ, అటువైపు ఒకటీ పెద్ద సరస్సులు రెండు ఉన్నాయి, ఎత్తైన రెండు పర్వతపంక్తులకి నడుమగా ఉంది ఆర్ అనే నదీతీరాన్ని ఉంది అంటే ఈ గ్రామంచుట్టూ మంచుకొండలూ,

సరస్సులూ, నదులూ, మైదానాలూ ఉన్నాయన్నమాట ఎంత అందంగా ఉంటుందో ఊహించుకో అసలు జనాభా చాలా తక్కువ, వచ్చిపోయేవాళ్ళే చాలా ఎక్కువగా ఉంటారు

ఊళ్ళో ఎక్కడినుంచైనాసరే-మా హొటేల్ కిటికీలోంచికూడా-ఎదురుగా కనపడేది జంగ్ ఫ్రౌ అనే మంచు శిఖరం దూరంగా-దాదాపు పాతికమైళ్ళదూరం ఉంటుంది — రెండుకొండలకి మధ్యగా తెల్లగా మెరుస్తూ ఈ శిఖరం కనపడుతూ ఉంటుంది. అందులో ముందుగా ఉన్న రెండుకొండలూ నల్లగా ఉంటాయి వెనక తెల్లటి ఈ శిఖరం నల్లగాఉన్న కొండలమధ్య మరింత స్ఫుటంగా కనపడుతూ ఉంటుంది ఇంటర్ లేకెన్ వచ్చినవాళ్ళంవరూ ముఖ్యంగా ఈ శిఖరం చూడడంకోసమే వస్తారు

జంగ్ ఫ్రౌ అంటే ఇంగ్లీషులో యంగ్ హస్బెండ్ అని అర్థం అట. దాదాపు 13,600 అడుగుల ఎత్తు ఉంటుందట ఈ శిఖరంమీదికి ప్రతిరోజూ వందలాది యాత్రికులు వెడుతూంటారు తడిసిన ఇసకలాగ ఉంటుంది మంచు. పిండిపడ్డట్టు పడుతుందిగదా మంచు' ఆ మంచుమీద నడిచీ, దొర్లీ, ఘనీభవించిన చోట స్కేటింగ్‌చేసీ ఆడుకుంటారు అయితే ఇంతఎత్తు శిఖరంమీదికి జనం ఎలా ఎక్కుతారని అడుగుతావు కొండ అడుగునుంచి చాలా ఎత్తువరకూ — అంటే మంచులేనంతవరకూ — ఎలెక్ట్రిక్ రైలు వేశారు. అక్కడినుంచి మంచు ఉంటుందికదా అది రోజూ దారికప్పేస్తుంటుంది, మళ్ళీ కరిగిపోతుంది అందుచేత ఇంకా కొంతదూరంవరకూ కొండ లోపలిభాగం దొలిచి — ఆశ్చర్యం — ఆ గుహలోనుంచి రైలు ఇంకా ఎత్తుప్రదేశానికి పోయేలాగు రైలుమార్గం వేశారు ఆ గుహలోనుంచి రైలు వెళుతుంటే కొంచం భయంవేస్తుందనుకో, గుహ చివరనిఉన్న స్టేషనులో రైలుదిగి ఇవతలికి వచ్చిచూస్తే ఎటుచూచినా మంచు మంచుమీదే నడవాలి. మంచుమీదే ఆడుకోవాలి పిల్లలు ఆ తడిసిన పిండిలాంటి మంచుతో ఇష్టంవచ్చినట్టు బొమ్మలుచేసి ఆడుకుంటారు ఎంత సరదాగా ఉంటుందని అయితే చాలా దట్టమైన జోళ్ళూ, ఫూలుబట్టలూ, ఓవర్ కోట్లూ, గ్లవ్ లేకపోతే మనుష్యులు కొయ్యబారిపోతారు,

శుక్రవారం అంతా జంగ్ ఫ్రౌ చూడడంతోనే సరిపోయింది. తరువాత ఇంక పరిసరప్రాంతాలలో ఉన్న సరస్సులూ, తోటలూ, పార్కులూ, అన్నీ

తిరిగాం ఇక్కడకూడా కొద్దిగా షాపింగ్ చేశాం ఇక్కడా వాచీలూ, చెక్కిన కర్రసామానులూ ఉన్నాయి స్విట్జర్లాండ్‌లో తయారైన మిల్క్ టాఫీలూ, చాకొలేట్లూ జేబులునింపుకొని తింటున్నాం ఏకాఏకాలైనా లెక్కకి లెక్కలేదుకదా!

6 వ తేదీ మధ్యాహ్నం పన్నెండుగంటలకి ఇంటర్‌లేకెన్‌నుంచి జినీవాకి బయలుదేరాం మళ్ళీ కొండమీద మళ్ళీ మా కార్లు కొండలు ఎక్కడం, దిగడం, అడవుల్లోంచీ, లోయల్లోంచీ పోవడం మొదలుపెట్టాయి స్విట్జర్లాండ్ ముఖ్య పట్టణం బెర్న్‌నగరంగుండా వచ్చాం దారిలో లూసాన్ అనే పట్నం ఇంకొకటి తగిలింది దారిలో చాలా కనుమలు కూడా తగిలాయి కనుమ అంటే తెలుసు కదూ? ఇంగ్లీషులో Pass అంటారు. ఇటువైపూ అటువైపూ ఆకాశాన్నంటే పర్వతాలు రెంటికీ మధ్యగా సన్నటిరోడ్డు మైళ్ళపొడవున ఉంటాయి ఇలాంటి కనుమలు, ఒక్కొక్కచోట వెడల్పుగా, ఒక్కొక్కచోట మరీ ఇరుకుగా. సాయంత్రం అయిదుగంటలకి జినీవాచేరుకున్నాం బ్యూ రివేజ్ అనే హొటేల్‌లో మకాం చేశాం జినీవా సరోవరం మా హొటేల్‌కి ఎదురుగానే ఉంది జినీవా స్విట్జర్లాండ్‌కి నైరుతికొనని ఉంది, కిటికీవద్ద నిలబడితే నీటిమీదే ఉన్నంత దగ్గరగా సరస్సు ఉంది ఈ పట్నంలోనుంచే రోన్ అనే నది ప్రవహిస్తూంది జినీవా సరస్సు చాలాపెద్దది దాదాపు 40 మైళ్ళ పొడవు ఉంటుందట. జినీవా నగరంవద్ద ఉన్న భాగానికి లేక్‌లెమాన్ అంటారు ఈ రోన్ నదిమీదా, లేక్‌లెమాన్‌మీదా ఎన్నో బ్రిడ్జీలు ఉన్నాయి నగరంఅంతా జలమయం. భూభాగాలను ఈ బ్రిడ్జిలు కలుపుతాయి ఈ ఒక్కొక్క బ్రిడ్జీమీద నిలబడి క్రింద ఉన్న నీటినీ, దూరంగాఉన్న కొండల్నీచూస్తూ ఎంతసేపైనా ఉండా లనిపిస్తుంది

జినీవా అంటే ఇదివరలో — గ్రేట్‌వార్‌కి పూర్వం — ఎవరికితెలుసు ఎక్కువగా? అక్కడకూడా వాచీలు తయారుచేస్తారనీ, విలువైననగలు అక్కడ తయారవుతాయనీ, చోకొలేట్లూ ఇతరమైన పాలతో తయారయే వెన్న మీగడ మొదలైనవి విరివిగా ఇక్కడ తయారవుతాయనీ, వైద్యం చేయించుకోడానికీ, ఆరోగ్యంకోసమూ టూరిస్టులు వస్తూంటారనీ తప్పిస్తే ప్రస్తుతం దానికివచ్చిన ప్రాముఖ్యం ఎవరూ తలపెట్టరుకదా పెద్దయుద్ధం తరువాత పెద్దరాజ్యాలవాళ్ళు ఒకసంఘం ఏర్పాటుచేసుకుని దానికి లీగ్ ఆఫ్ నేషన్స్ అని పేరుపెట్టారుకదా! ఆ లీగ్ ఆఫ్ నేషన్స్‌కి జినీవా ముఖ్యస్థానం. దీనితోపాటు ఇంకా కొన్ని ప్రపంచ

సంస్థకి ఇది హెడ్‌క్వార్టర్సు ఇంటర్నేషనల్ రెడ్‌క్రాస్‌సంస్థకీ, ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్‌కీ, ఇంటర్‌నేషనల్ ట్రేడ్‌యూనియన్‌కీ ఇంకా ప్రపంచ ఆరోగ్యసంస్థకీ ఇది ముఖ్యస్థానం వీటితాలూకు ఆఫీసులన్నీ ఇక్కడఉన్నాయి

లీగ్ ఆవ్ నేషన్స్ బిల్డింగులోకి వెళ్ళి చూశాను ఇప్పుడు సభలు జరగడంలేదు లోపల ఏమీ పెద్దవిశేషంగా లేదు ఈ సంస్థలతాలూకు ఆఫీసు లున్న బిల్డింగులన్నీ ఒకేచోటదిరిగా ఉన్నాయి నేషనల్ మాన్యుమెంట్ బ్రన్స్‌విక్ సెట్యూ మొదలైనవి చూశాం చాలా అందమైన పార్కు ఒకట ఊళ్లోనే ఉంది దాన్ని పార్క్ మోన్ రిపోస్ అంటారు జినీవాలో చూడటానికి ఆకర్షించే ఏపనాలుగాని, పెద్దపెద్ద చర్చీలుగాని, కట్టడాలుగాని ఏమీ లేవు ఉన్నదంతా ప్రకృతిరామణీయకత సరస్సులూ, కొండలూ, పార్కులూ మాత్రం ఎంతో అందంగా ఉంటాయి అందుకే ఎక్కువగా యాత్రికులు వస్తూంటారు విదేశాలనుంచి ధనవంతులైనవాళ్ళు రెస్ట్ తీసుకోటానికి, ఆరోగ్యంకోసమూ వచ్చి ఉంటూఉంటారు పెద్దయుద్ధంలో ఎటువైపూ చేరకుండా స్విటర్‌లాండ్ తటస్థంగా ఉండిపోయింది కనుక ఏ కూటానికీ చెందనిదేశంలో ఈ లీగ్ ఆఫ్ నేషన్స్‌ను పెట్టాలని, జినీవాలో ఏర్పాటు చేశారనుకుంటాను కెంప్రెసు మలిచి చక్కని కళాఖండాలుగా తయారుచేసే పనివాళ్లు చక్కడ ఎక్కువ ఈ దేశాలవాళ్ళకి అనువైన చాలా ఖరీదైన నగలు తయారుచేస్తారిక్కడ రవ్వలుపొదిగిన బంగారువాచీలు రకరకాలైనవి షాప్‌విండోస్‌లో కనపడుతూ ఉంటాయి

రేపు ఉదయాన్నే ఈఊరు విడిచిపెట్టేస్తున్నాం అంటే భూతలస్వర్గం అనే స్విడ్జర్‌లాండ్‌నుంచి క్రిందికి ఘూడు మిదికి జారిపోతాం ఇటలీక్కి ప్రయాణం తిన్నగా మిలాన్‌కి వెడతాం తరువాత ఇటలీదేశంలోని ముఖ్యమైన నగరాలన్నీ దర్శిస్తాం మళ్ళీవారం వ్రాస్తాను. ఇంక ఉంటాను

సి
వేంకటరావు

---



Hotel Excelsior
Rome, Italy
14th October 1930

ప్రియ సోదరా!

ఇప్పుడు ఇటలీ దేశం పర్యటిస్తున్నాం అప్పుడే రెండు నగరాలు సందర్శించాం, వాటినిగురించి వ్రాస్తా ఈ ఉత్తరం రోమ్ నగరంనుంచి వ్రాస్తున్నా మూడురోజులైంది ఇక్కడికివచ్చి "ఆల్ రోడ్స్ లీడ్ టు రోమ్" అన్నారుకదా! ఒకప్పుడు దాని స్థితి అలా ఉండేదన్నమాట ప్రపంచంలోని రాజ్యాలు అన్నిటికీ తలమానికంగా ఉండేదికదా రోమ్ రోమనులు తూర్పు దేశాలమీదా, పడమటిదేశాలమీదా దండెత్తి జయించారుకదా! ఇంగ్లండుదేశాన్ని కూడా జయించి, అప్పటికి అనాగరికులుగా ఉన్న ఆ దేశప్రజలకి నాగరికత నేర్పింది రోమనులేకదా రోమనుకాంక్వెస్టునాటి చిహ్నాలు ఇంకా ఇంగ్లండులో భద్రపరుస్తున్నారే మహావీరుడైన జూలియస్ సీజర్ ఇక్కడివాడేనని నీకు తెలుసుకదా! ప్రపంచంలో ఏ పట్టణానికీ ఈ రోమ్‌కి ఉన్నంత ఘనత లేదు. దీనికి వచ్చిన ఖ్యాతి ఇంకో పట్టణానికి దేనికీ లేదు వీరాధివీరులు జన్మించారిక్కడ, దండయాత్రలు చేశారు, సామ్రాజ్యాలు స్థాపించారు శతాబ్దాలుగా మహావైభవంగా వెలిగిపోయింది ఈ నగరం మహాభోగం అనుభవించారిక్కడి ప్రజలు చిత్రకళకూ, కవిత్వానికీ, సంగీతానికీ ఇతరదేశాలకి ఒరవడి పెట్టింది. మతానికి అగ్రపీఠంఅయి చక్రవర్తులకిసైతం ఆర్డర్లు జారీచేసింది

జినీవానుంచి 8 వ తేదీ ఉదయం ఎనిమిదిగంటలకి బయలుదేరాం. మా కార్లు అద్భుతమైన సీనరీలగుండా ప్రయాణంచేశాయి మంచుకొండలని దాటుతూ వచ్చాయి, ఆల్ప్స పర్వతాలనుంచి దిగజారుతూ మా కార్లు అనేకమైన నదులనీ, సరస్సులన్నీ దాటుతూవచ్చాయి అనేకమైన లోయల్లోంచి ప్రయాణం సాగించాం. పర్వతాలను దొలిచిన ఎన్నోగుహలలోకి చొరబడివచ్చాం. ఎన్నో

కనుమలుదాటాం ఇటలీ దేశం నెత్తిమీద ఉన్న ఆల్ప్సుకొండలు ఎక్కుతూ, దిగుతూ సమతల భూభాగం ప్రవేశించాం ఇంక మళ్ళీ వ్యవసాయక్షేత్రాలు, ద్రాక్షతోటలున్నూ ఇటలీ అంతా ఒక ద్రాక్షతోట అన్నా తప్పులేదనుకుంటాను ఎన్నోరకాల ద్రాక్షలు, పందిళ్లకు ఎక్కించినవే కాక చెట్లకుఎక్కించినవి, గుబురు గుబురుగా పెంచినవీ కనుచూపుమేరకు ద్రాక్షతోటలే ఇవన్నీదాటి సాయంకాలం 5 గంటలకి మిలాన్ అనే పట్టణం చేరుకున్నాం

మిలాన్ నగరం చాలా పురాతనమైనది ఇటలీదేశమే అతి ప్రాచీనమైన దేశంకదా మిలాన్ నగరంలో చూడడానికి ఏముంది? ఒక్కటే ఒక్కటి మహాద్భుతమైన కెతీడ్రల్ మిలాన్ నగరానికివచ్చే యాత్రికులందరూ ఆ కెతీడ్రల్‌ని సందర్శించడానికే వస్తారు ప్రపంచంలో సెవెన్‌వండర్స్ ఉన్నాయని కదా అంటారు మిలాన్‌లోని ఈ చర్చిని ఎనిమిదో విచిత్రం అని అంటారు. ఈ చర్చిమీద లెక్కలేనన్ని స్టేట్యూలు ఉన్నాయి లెక్కలేనన్ని గోపురాలు ఉన్నాయి వెయ్యిన్నీఒక్క శిలావిగ్రహాలున్నా యని అంటారు అంటే లెక్క పెడితే 1001టి ఉన్నాయని కాదు లెక్కలేనన్ని ఉన్నాయని ఏవైపునుంచి చూచినా గోపురాలే, స్టేట్యూలే, శిల్పాలే ఇంత గొప్ప కళాఖండాన్ని నిర్మించ డానికి ఎంతకాలం పట్టిందో, ఎందరు కళాకారులు పనిచేశారో, ఎంత ధనం వ్యయంఅయిందో ఊహించడం కష్టం మెట్లన్నీఎక్కి లోపల ప్రవేశించాను లోపలగోడలకి రంగురంగుల అద్దాలఅలంకరణాలు, ఫ్రెస్కో పెయింటింగులు మతిపోయిందనుకో దాని గ్రాండ్యర్ దర్శించి, ఒక్క నిముషం కూర్చున్నా, ఏ చర్చిలోకి ఎవరువచ్చినా అక్కడి బెంచీలమీద రెండునిమిషాలసేపు కూర్చుని ప్రార్థనచెయ్యడమో, మౌనంగా ఏదో లోపల మననంచెయ్యడమో, ఇక్కడివా ళ్ళందరికీ మామూలు వాళ్ళకిలాగే నేనున్నా, "రోమ్‌లో ఉన్నప్పుడు రోమన్ లాగే సంచరించు" అని అన్నారుకదా!

ఇటలీ ప్రపంచంలోని గొప్ప చిత్రకారులకీ, శిల్పులకీ పుట్టిల్లు అద్వితీయ ప్రతిభాశాలి అయిన శిల్పి మైకెలేంజెలో ఇక్కడేపుట్టాడు లియనార్డో డా విన్సీ జన్మస్థలం ఇటలీయే. మైకెలేంజెలోవంటి గొప్ప చిత్రకారుడూ, శిల్పీ అంతకు ముందు పుట్టలేదు, అప్పుడులేడు. ఇకముందు పుట్టబోడు అన్నారు నిజమే అతనిశిల్పాల ప్రతులు ప్రతినగరంలోఉన్న గొప్పమ్యూజియమ్ము లన్నింటిలోనూ

ఉంటాయి మైకెలేంజెలో యొక్క చిత్రాలుగాని, శిల్పాలుగాని లేని మ్యూజియం ఉండదు అవిలేని మ్యూజియమ్ మ్యూజియమే కాదు

నగరంలో ఇంకా ఎన్నో స్టేట్యూలు ఉన్నాయి రెండవ విక్టర్ ఎమాన్యుయెల్ మాన్యుమెంట్ ఒకటి చాలా ఆకర్షణీయంగా ఉంది ఈ విక్టర్ ఎమాన్యుయెల్ అసలు సార్డీనియాద్వీపానికి రాజు పందసంవత్సరాలక్రితం సార్డీనియా ప్రభుత్వాన్ని ఇటలీతో కలిపి ఈయన్ని ఇటలీకి చక్రవర్తిగా చేశారట ఈయనపేరిట ఒక గొప్ప ఆర్టుగేలరీకూడా ఇక్కడ ఉంది లియనార్డో డా విన్సీ అనే ఒక గొప్ప శిల్పియొక్క శిలావిగ్రహం, గోవర్ మాన్యుమెంటు మొదలైన స్మారకచిహ్నాలెన్నింటినో చూశాం మొత్తంమీద మిలాన్ నగరంఅంతా రోమన్ కేతలిక్కులకు సంబంధించిన చర్చీలూ, విగ్రహాలూ, స్మారకచిహ్నాలూ, వీటితో నిండిఉంది ఒక్కరోజులో ఎన్నని చూడగలం ? శిలావిగ్రహాలకీ, చిత్రాలకీ ఎంతో ఎంతో చరిత్రఉంటుంది. అదికూడా ముందుగానే తెలిసిఉంటే ఇంకా ఎంతో ఆనందం కలుగుతుంది

మర్నాడు 10 వ తేదీనే ఉదయం పదిగంటలకి మళ్ళీ ప్రయాణం సాగించాం మధ్యాహ్నం రెండుగంటలకి వెనిస్‌నగరంలో దిగాం సముద్రంమీదే రైలుమార్గం వేశారు సముద్రందాటి వెనిస్ భూభాగంమీద కాలుపెట్టాం ప్రక్కనే ఉన్న కాలవలో కొన్నివందల చిన్నతెప్పలు ఉన్నాయి మమ్మల్ని ధామస్ కుక్ ఏజెంటు ఆ తెప్పలమీద ఎక్కించాడు కాలవలో ప్రయాణం సాగించాం కాలవకి రెండువైపులా పెద్దపెద్ద భవనాలున్నాయి మాకు అడ్డంగా కూడా కొన్నికాలవలు ఉన్నాయి అంటే ఊరంతా జలమయం అన్నమాట రోడ్లన్నీ కాలవలన్నమాట వేరే రోడ్లూ, ఖాళీస్థలాలూ, పార్కులూ ఇక్కడ కనపడలేదు రిక్షాలమీదా, బళ్ళమీదా మనం ఎలా ప్రయాణంచేస్తామో ఇక్కడి వాళ్ళు ఈ నావలమీదే ఒకచోటనుంచి ఇంకొకచోటికి ప్రయాణం చేస్తారు ఎదురుగాఉన్న ఇంట్లోకి వెళ్ళాలనుకో ఈ తెప్పమీదే దాటాలి ఊళ్లో ఏదైనా ఆఫీసుకుగాని, షాపుకుగాని వెళ్ళాలనుకో ఈ తెప్పమీదే వెళ్ళాలి. దీనికి "గండోలా" అంటారు ఈ గండోలాలో కూర్చోవడం చాలా సరదాగాఉంది ఈ నావ అంతాకలిపితే పన్నెండూ, పదిహేను అడుగులకంటె ఎక్కువ పొడవు ఉండదు నాలుగు అడుగులకంటె వెడల్పు ఉండదు మహాఅయితే నలుగురు,

తప్పితే ఐదుగురుకంటె ఎక్కువమంది కూర్చోడానికి చోటుఉండదు ఒక్కడే ఒడవవాడు గెడతో గెంటుకుపోతాడు కొన్నింటికి చిన్న తెరచాపలుకూడా ఉంటాయి ఊగిసలాడుతూ సర్రుమని నావ వెడుతూఉంటే నీటిమీదే కూర్చుని జారుతూ ఉన్నట్టుంటుంది కొందరు అలవాటుఉన్నవాళ్లు వేగంగా పోతున్నా నావమీద నిలబడి బేలన్సు చేస్తూంటారు

మేము స్టేషనునుంచి గండోలామీద కాలవలో ప్రయాణంచెస్తూ కొన్ని బ్రిడ్జిల కిందనుంచివెళ్ళి గ్రాండుకెనాల్‌లో ప్రవేశించాం గ్రాండ్‌కెనాల్ అంటే వెనిస్ నగరానికి రాజవీధి అన్నమాట చాలా వెడల్పుగా ఉంటుంది రెండు వైపులా బ్రహ్మాండమైన భవనాలుఉన్నాయి మేము ఉన్న "గ్రాండ్‌హోటేల్" కూడా ఈ గ్రాండ్‌కెనాల్‌మీదే ఉంది అక్కడికి గండోలా సరాసరివెళ్ళి మెట్ల దగ్గర ఆగింది మేము నావలోనుంచి హోటేల్‌లోనే కాలుపెట్టాం

ఇక్కడ మోటార్ టాక్సీలుకూడా ఉన్నాయి అవికూడా గ్రాండ్ కెనాల్‌లోనూ, ఇతర జలమార్గాలలోనూ తిరుగుతూ ఉంటాయి టాక్సీ అంటే మోటారుకారు అనుకునేవు చక్కని చిన్నబోట్‌కే మోటారుఅమర్చి కారుకంటె వేగంగా పోనిస్తారు మోటారుకార్లకి లాగే దానికీ టాప్, ఎక్కని అద్దాలూ లోపల ఎరుపులూ అన్నీ ఉంటాయి

మా హోటేల్‌కి ఎదురుగానే అంటే ఆవలిఒడ్డున ఒక బ్రహ్మాండమైన కెథీడ్రల్‌ఉంది, దానిపేరు సెంట్‌మార్క్స్ కెథీడ్రల్ పాలరాతితోనిర్మించారు ఎండలోనూ, వెన్నెలలోనూ ధగధగమెరుస్తుంది ఈ కెథీడ్రల్‌మీద స్టేట్యూలూ డోమ్‌లూ ఉన్నాయి ఆ డోములకి బంగారం పూతపూసేరో ఏమో అవి మెరుస్తూ ఉంటాయి ఈ కెథీడ్రల్‌కూడా ఒక గొప్ప కళాఖండంగా భావిస్తారు వెనిస్ నగరంలో పూర్వం చాలా గొప్ప చిత్రకారులూ, శిల్పులూ ఉండేవారట ఫ్రెస్కోలూ, పెయింటింగులూ, శిలావిగ్రహాలూ ఎక్కడకువెళ్లినా కనపడ తాయి ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన చిత్రకారులు గియార్గోన్, టేషియన్, టింటొరెట్టో, విక్టర్ కార్పేక్సియో మొదలైనవారి చిత్రాలు వందలకొలది చర్చీలలోనూ, పెద్దపెద్ద భవనాలలోనూ కనపడుతున్నాయి. సెంట్‌మార్క్స్ కెథీడ్రల్ లోపల అంతా ఒక చిత్రశాలలాగు ఉంటుంది. క్రైస్తవమతానికి చెందిన చరిత్రలోనిఘట్టాలు ఎన్నో చిత్రించారు గోడలమీద. గ్రాండ్‌కెనాల్‌మీదే

సెంట్ మార్క్స్‌కి దగ్గరిగానే డోజెస్ పేలస్ అని ఒక బ్రహ్మాండమైన భవనం ఉంది అంటే డ్యూక్స్ పేలస్ అన్నమాట [illegible] ఒక చిత్రశాలే

నగరంలో భూభాగం తక్కువ అన్నాముకదా ఒక్కచోటే నగరానికి ఎంతో అందం తెచ్చే భూభాగం ఉంది పైగా అందులో ఇక్కడ చాలా ఎత్తయిన రెండు సంభాలు ఉన్నాయి [illegible] ఉన్నాయి [illegible]లో జనం నడుస్తూ ఉంటారు [illegible] ఉంది [illegible] పావురాలు యాత్రికులూ, అక్కడి ప్రజలూ వేసిన గింజలు తింటూ ఉంటాయి [illegible] పావురాలు [illegible] ఎగిరిపోవు సరదాకి కొందరు వాటిని పట్టుకొని [illegible], వాటితో మాట్లాడి విడిచి పెడుతుంటారు

మానవునికి చిత్రవిచిత్రమైన వాదాలు ఉంటాయి లేకపోతే సముద్రములో నగరం నిర్మించడమే [illegible] సిటీలో [illegible]తెంత పునాదులు వేశారో గ్రాండ్ కెనాల్ సముద్రంలోనుంచి వచ్చే నీటిపాటుకి ఉప్పొంగేది అన్నమాట సముద్రం పాటుపోటులతో పాటు [illegible] నీళ్ళు పైకి ఉబుకతాయి, తీసివేస్తూంటాయి పోటులో ఉప్పొంగేడు [illegible] నీరు ఎత్తుగా ఉంటుంది మేడల మెట్ల మీదికి [illegible] నీరు ఉబుకుతుంది అందుకే దీన్ని ఫ్లోటింగ్ సిటీ అన్నారు సముద్రం పోటుతో ఉప్పొంగేడు గ్రాండ్ కెనాల్‌లోని నీరు ఇతర వీధులకికూడా ధారాళంగా ప్రవహిస్తూ ఉంటుంది అయిదారు శతాబ్దాలకి ముందు ఈ నగరం ఎంతో వైభవంగా ఉండేదన్నమాట ఇప్పుడుకూడా వేసవికాలంలో ఎందరో యాత్రికులు వస్తూపోతూంటారు. శీతకాలంలోమాత్రం వి రీతమైనచలి పిండిలాంటి మంచుపడుతూ ఉంటుందట అయితే కాలవలు గడ్డకట్టుకుపోవు సముద్రంనీరూ, ఉప్పునీరూ అవడంవల్ల గడ్డకట్టదు [illegible] మంచు ఇసకలాగు అడుగువెత్తున పడి మళ్ళీ కరిగిపోతుంది ఇక్కడి ధనవంతులైన ప్రజలు, శీతకాలంలో ఇటలీలోని ఇతర పట్టణాలకి పోతూఉంటారు శీతకాలంలో గండోలాలకి ఎక్కువ పనిఉండదు [illegible] ఏదో [illegible] స్టేస్తారు గ్రాండ్ కెనాల్‌లోకి పెద్దపెద్ద స్టీమర్లుకూడా వస్తున్నాయి అంటే అది ఎంతో లోతుగా ఉందన్నమాట. ఇక్కడ పెద్దపెద్ద స్టీమర్లుకూడా ఏడతారట. మంచి వ్యాపారం కూడా జరుగుతుంది

ముఖ్యంగా మేము ఇక్కడ చూచింది ఒక గ్లాస్‌ఫేక్టరీ అతి నాజూకూ, సున్నితమూ అయిన గాజు కళాఖండాలు ఇక్కడ తయారుచేస్తారు ఇక్కడి గాజుఫేక్టరీ ప్రపంచంలో చాలా పేరుపడ్డది వందలకొలది ఆర్టిస్టులు ఇందులో పనిచేస్తున్నారు. మామూలు ఇసకతోనేకదా గాజు తయారవుతుంది సిలికాతో అనేకపదార్థాలు కలిపి గాజుగా తయారుచేస్తారు సిలికా అంటే ఇసకనుంచి అనేకమైన చక్కని రంగురంగుల గాజువస్తువులు తయారయే ప్రోసెస్సు అంతా చూశాం ఇక్కడ గాజుసామానులే గాక పింగాణీ వస్తువులుకూడా మామూలు ఉపయోగానికే కాక అలంకారానికికూడా తయారవుతున్నాయి వాటి మీద రంగురంగుల చిత్రాలు ఎందరో ఆర్టిస్టులు స్త్రీలూ, పురుషులూకూడా చిత్రిస్తున్నారు

కెనాల్స్‌మీద బ్రిడ్జీ లన్నానే! ఒక బ్రిడ్జి చాలా తమాషాగా ఉంది దానికి అంతస్తులు ఉన్నాయి వాటిమీద శిల్పాలు ఆఫీసులకు పోయేవాళ్లు ఈ బ్రిడ్జీల కిందనుంచి గండోలాలమీద అడ్డదారులని పోతుంటారు వర్షంపడుతుంటే ఆ బ్రిడ్జీలక్రింద ఆగుతూంటారు చాలాముఖ్యమైనది రియాల్టోబ్రిడ్జి బ్రిడ్జ్ ఆఫ్ సైస్ అనేది ఇంకొకటి ఉంది అంటే నిట్టూర్పుల బ్రిడ్జి అట అంటే అక్కడికి రావడంతోనే అమ్మయ్య ఇంక వచ్చేశాంఅని నిట్టూరుస్తారేమో!

ఒక గొప్ప క్లాక్‌టవర్ ఒకటి యజావద ఉన్నది అది పదిహేనవ శతాబ్దంలో కట్టారట ఆ టవర్‌మీద ఒక పెద్ద కంచుగంట అమర్చారు ఒక అందమైన మూర్ ప్రతిమ ఆ గంటను మ్రోగిస్తున్నట్టు పెట్టారు ఊరంతా గంట శబ్దం వినబడుతూ ఉంటుంది.

పగలంతా ఇక్కడికీ అక్కడికీ గండోలాలమీద తిరిగాం మళ్ళీ ఆ రాత్రే రోమ్‌నగరానికి ప్రయాణం రాత్రి 10 గంటలకి స్టేషనుకి వెళ్ళడానికి గండోలాలు ఎక్కాం చక్కగా వెన్నెలకాస్తూంది కెనాల్సన్నీ నీళ్ళతో నిండిఉన్నాయి మధ్యాహ్నమే వానజల్లు పడి ఆకాశం నిర్మలంగా ఉంది మాముందు ఒకలాంచీలో కొందరు అమ్మాయిలు ఆడుతూ పాడుతూ వచ్చారు నావల్లో తిరిగే యాత్రికులని ఎంటర్‌టెయిన్ చెయ్యడానికి ఇలాంటి పార్టీలు ఎన్నో ఉన్నాయట ఇక్కడ గండోలావాళ్ళు మా గండోలాలన్నీ ఆ లాంచి

మటూ పోయేలాగు గెడలు వేశారు. ఆవెన్నెట్లో, తెళ తెళ లాడే సిటీ మీద నావలో కూర్చుని, క్రిక్రినే ఇంకొక నావలో చక్కని అమ్మాయిలు పాడుతూ, ఆడుతూ మా వెంట వస్తూంటే ఎంత ఆనందంగా ఉందని ।

మొత్తం మీద వెనిస్ అనే ఈ ఫ్లోటింగ్ సిటీ ప్రపంచంలోని నగరాలకి చాలా విభిన్నంగా ఉంది సముద్రంలో మేడలు కట్టడం, సీటిమీద నడకలు సాగించడం చాలా చిత్రంగా ఉంది చూడాలెగాని చెపితే నమ్మ దనుకుంటా

12వ తేదీ ఆదివారం ఉదయం తొమ్మిది గంటలకి రోమ్‌లో దిగాం ఇక్కడ హోటేల్ ఎక్సెల్సియర్‌లో ఉన్నాం రోమ్‌లో ఈ రెండు రోజులూ తెగతిరిగాం ఎంతో పురాతనమైన పట్నంకదా! దీని ప్రతిభా, ప్రభావం క్రీస్తుకి ముందే ప్రపంచం అంతటి మీదా ఉండేదికదా। పట్నం అంతా పెద్ద పెద్ద స్టేట్యూలతోనూ, గొప్ప పాలరాతి భవనాలతోనూ నిండి ఉంది, ఊరు చుట్టూ ఎప్పుడో క్రీస్తుకు పూర్వంకట్టినవి, పడిపోతూ పడిపోతూఉన్న ప్రాకారపు గోడల వరకూ కూడా వెళ్లి చూశాం బ్రహ్మాండమైన భవనాలు ఉన్నాయి నగరంలో త్రిమూర్తులు పాంపే, సీజర్, క్రేసస్ పరిపాలించిన ఈ దేశాన్ని ఇప్పుడు ముసోలినీ అనే నియంత పరిపాలిస్తున్నాడు ఎక్కడికైనా వెళ్లు. ఏగది అయినా చూడు. ఆయన ఫోటో లేని ఇల్లుగాని, హోటేలుగాని, గది గాని లేదు అయితే ఆయన పేరు ఎవ్వరూ ఉచ్చరించ కూడదు గూఢచారులు ఎక్కువట మా వెంటనే ఉన్నారట కూడా మాకేం తెలుసు?

ఈ మేడలూ, భవనాలూ చూస్తుంటే నాకు మహావీరులైన సీజరూ, ఆంటొనీ మొదలైన వాళ్ల జ్ఞాపకం రావడంలేదు రోమ్‌ని పరిపాలించిన నీరో చక్రవర్తి జ్ఞాపకం వస్తున్నాడు అతనితోపాటు నోరి నరసింహశాస్త్రిగారి "మండు భగ భగ రోము పురమా, మండు భగ్గున రాజధానీ" అన్న గేయం జ్ఞాపకం వస్తూంది రోము నగరాన్ని సరదాకి తగల బెట్టించినా ఆయన గొప్ప సంగీత ప్రియుడట. ఆయన పిడేలు వాయిస్తే, ప్రక్కనఉన్న టైబరు నదిలో నీళ్లు కూడా పొంగేవట టైబరు నది అంటే దాన్ని చూడకుండా ఉండగలమా? మనం ఫోర్తు ఫారమ్‌లో చదువుకోలేదూ హొరేషస్ పద్యం। ఆ నది ఆవలి ఒడ్డువరకూ కూడా వెళ్లి బ్రిడ్జిమొగని నిలబడి, "ఏకైక వీరుడై ఇక్కడే కదా హొరేషస్ శత్రుసేనల్ని సంహారం చేసింది ఇక్కడే ఈ విధంగా నిలబడి

ఉంటాడు ఈ విధంగా యుద్ధంచేసి ఉంటా" డని ఊహించుకున్నాం అయితే అప్పటి బ్రిడ్జి ఇదికాదు ఇప్పటి బ్రిడ్జి చక్కగా కట్టారు అయితే ఇక్కడ ఒక శిలాఫలకం మీద హొరేషన్ శత్రువుల్ని ఎలా అరికట్టిందీ రోమ్‌ను ఎలా రక్షించిందీ చెక్కి అతని జ్ఞాపకార్థం ఉంచారు

కేథలిక్ క్రైస్తవులకి ముఖ్యస్థానం ఈ రోమే కదా! అందుకే వాళ్ళకి రోమను కేథలిక్కు లనే పేరువచ్చింది వాళ్ళచర్చిని కెతీడ్రల్ అనీ, బేసిలికా అనీ అంటారు ప్రపంచంలో కెల్లా గొప్ప కెతీడ్రల్ ఈ రోములోనే ఉంది దాన్ని సెంట్‌పాల్స్ కెతీడ్రల్ అంటారు చర్చికి ముందు విశాలమైన ఆవరణ ఉంది. కొన్ని వేల మంది అక్కడ నిలబడవచ్చు మధ్యలో ఒక ఫౌంటెన్ ఉంది. లోపలికి వెళ్ళిచూశాం అగరువత్తుల సువాసనలతో రకరకాలైన కొవ్వువత్తుల స్టాండులతో, వెండి బంగారు సామానులతో వెలిగిపోతూ ఉంది లోపల గోడలకి ఎన్నో ఫ్రెస్కోలు చిత్రించారు. అద్దాలమీద ఎన్ని రంగులతోనో, ఎన్నో బొమ్మలు చిత్రించారు క్రీస్తు జీవిత చరిత్ర అంతా ఆ చిత్రాలలో కనపడుతుంది. ఆ చిత్రాలన్నీ ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన చిత్రకారులు రచించినవే కొద్దిగా తెరిచి ఉన్న ద్వారంలో నుంచి యాత్రికులు లోపలికి అతి నిశ్శబ్దంగా ప్రవేశిస్తారు ఆ విగ్రహాలకి మోకరించి నమస్కరిస్తారు బెంచీల మీద కొంచం సేపు మౌనంగా కూర్చుని లోలోనసే ప్రార్థనలు చేసుకుంటారు ఆస్తికుడైన ప్రతి మానవుడికీ, ఏ మతానికిచెందిన వాడైనాసరే, ఒక చిత్రమైన భక్తిభావం ఏర్పడుతుంది లోపలికి ప్రవేశించి ఇదంతా చూస్తుంటే

ఇక్కడనే ఉన్న వేటికన్ చూశాం. ఇది పోప్ యొక్క నివాస స్థలం సెంట్‌పీటర్సు బేసిలికాకి ప్రక్కనేఉంది ఒక చిన్న కొండ మీద. రోమ్ రాజకీయంగా ప్రపంచాన్ని పరిపాలించడమే గాక, మత సంబంధంగా కూడా ప్రపంచాన్ని పాలించింది పోప్ ఆజ్ఞ ప్రపంచంలోని చక్రవర్తులందరూ శిరసావహించవలసినదే, హిస్టరీ మేస్టారు చెప్పేవారు కదా పోప్ వద్ద రెండు పెద్ద తాళం చెవులు ఉండేవని! ఒకటి స్వర్గానికి తాళంచెవి. రెండోది నరకానికి ఆరోజుల్లో చక్రవర్తుల్ని భయపెట్టేవారట ఈ తాళం చెవులు చూపించి. పోప్‌కి అనువైన వాళ్ళందరికీ స్వర్గద్వారాలు తెరిచే బంగారు తాళం చెవి చూపించేవారట వ్యతిరేకు లందరికీ నరక ద్వారా

నికి ప్రత్యేకంగా చేయించిన పెద్ద ఇనపతాళం చూపించే వారట, చక్రవర్తులు [illegible] తాళాలు మోచి పోయి పోప్‌కి దాసోహం అనేవారట పోప్‌గారి భవనానికి ఉన్నంత అందం, వైభవం ఇతర ఏ చక్రవర్తి భవనానికీ లేదంటే నమ్మండి ఇక్కడ ఉన్న మ్యూజియమ్‌లోని వేలాది చిత్రాలు చాలా [illegible]మైనవి లోక ప్రసిద్ధి చెందిన ప్రాచీన చిత్రకారులు మైకెలెంజిలో మొదలైన వాళ్లు చిత్రించినవీ, చెక్కినవీ వేలాది శిలాఖండాలున్నాయి క్రైస్తవ గ్రంథాలకీ చిత్రాలకీ ఇది ఒక నిధి అన్నమాట. నిలబడి చూడటానికి టైము లేక పోయింది మ్యూజియమ్‌లో ఒక్క ప్రదక్షిణంచేసి చూశాం, అంతే

పట్నంలో చూడవలసినవి చాలా ఉన్నాయ్. ఒక పెద్ద ఫౌంటెన్ ఒకటి ఉంది. దాన్ని ఫౌంటెన్ 'ట్రెవీ' అంటారు నాలుగువైపులూ ఏవో ఏవో బొమ్మలు ఉన్నాయి వాటిలోనుంచి నీరుచిమ్ముతూ ఉంటుంది చుట్టూ పెద్ద పెద్ద ధారలలో నుంచి కూడా నీళ్లు పడుతూ ఉంటాయి ఇది చూడడానికి వచ్చిన వాళ్లందరికీ ఒక ఆచారం ఉంది మూడు కోయిన్స్ ఆ నీళ్లల్లోకి విసిరిపడేస్తారు ఇది ఎందుకు వచ్చిందో తెలియదు మనవాళ్లు గోదావరిలో డబ్బులు పడెయ్యరూ? ఆలా అనుకుంటాను

పెద్ద పెద్ద భవనాలు జస్టిస్ పేలస్, కింగ్స్‌పేలస్, గవర్నమెంట్ హవుస్, ప్రిన్సెస్ పేలస్, కేపిటోల్ మొదలైనవి చాలాదర్జాగా కనపడుతున్నాయి. సెంట్ పీటర్సుకాక పేంథియన్ అని ఇంకొక గొప్ప చర్చిఉంది అది చాలా పురాతనమైనది అతి ప్రాచీనమైన శిల్పకళ ఈ మాన్యుమెంటు మీద చూడ వచ్చు. అనేకమైన మాన్యుమెంట్లు నగరం నిండా ఉన్నాయి విక్టరీ మాన్యుమెంట్, మాన్యుమెంట్ కార్లో ఆల్బర్టో, ఇంకా ఎన్నో ఎన్నో చూశాం టైబర్ నది ఒడ్డునఉన్న సెంట్‌ఏంజెలో కేసిల్ చూడతగ్గది. పెలాటినో అనే కొండ ఎక్కాం, ఇక్కడినుంచి చూస్తే రోమ్‌నగరం అంతా చక్కగా కనబడుతుంది. పాత ఇళ్లూ, కొత్త భవనాలూ, గుళ్లూ గోపురాలూ, కోటలూ కందకాలూ అన్నీ బాగా కనిపడతాయి ఈ కొండమీదే ఒక బ్రహ్మాండమైన స్టేట్యూ వుంది—గారిబాల్డీ స్టేట్యూ. ఫోటోతీశాను చూదువుగానిలే గారిబాల్డీ గొప్ప ఇటాలియన్ జనరల్ వంద సంవత్సరాల క్రితం జరిగిన సంగ్రామంలో ఇటలీని శత్రువులనుంచి

విముక్తి చేశాడట మాతృదేశాభిమాని, యుద్ధ వీరుడు ఇటాలియన్‌లకి ఇతనిమీద చాలా గౌరవభావం

ఇంక రెండు ప్రదేశాలని గురించి వ్రాయాలి ఒకటి ఫోరమ్ రెండోది కోలోషియమ్ ఇవి రెండు చాలా ప్రాచీనమైనవి ఫోరమ్ అంటే పూర్వం ప్రజలందరూ కలుసుకునే చేరీసావడి యుద్ధానికిగాని, రాజ్యాంగానికిగాని ప్రజల అభిప్రాయాలు ఇక్కడ్డించే బయలుదేరేవి పురాతనమైన సభాస్థానం అన్నమాట, రానురాను అది ఒక పెద్ద బజారుగా తయారయింది దాని శిథిలాలు గవర్నమెంటు జాగ్రత్త పరుస్తున్నారు ఇక్కడికి వచ్చే యాత్రికు లందరూ ఈ ఫోరమ్ శిథిలాల్ని తప్పక చూస్తారు

రెండోది కోలోషియమ్ అనే గుండ్రని కట్టడం అతి ప్రాచీనమైనది క్రీస్తుకు పూర్వమే కట్టారట దీని శిథిలాలు తప్పక చూడవలసిందే, ఎందు కంటే రోమను ఉచ్చస్థితిలో ఉన్నప్పుడు ఎలాంటి వినోదాలతో కాలక్షేపం చేసేవారో ఈ కొలోషియమ్ కొంత తెలియజేస్తుంది మనం సినిమాలలోనూ అక్కడక్కడ బొమ్మల్లోను చూస్తుంటాము ఈ రోమ్‌లో రాక్షసుల్లాంటి మానవులు ఉండేవారు వాళ్లని గ్లేడియేటర్లు అంటారు వాళ్లు కత్తులు బళ్లాలూ పుచ్చుకొని పోట్లాడుకుని ఒకణ్ణి ఒకడు చంపుకుంటూ ఉంటే ఇక్కడి రోమనులు అతిసరదాగా చూచేవాళ్లు పందేలు వేసేవారు అడవి ఎద్దుల్ని మానవుని మీదికి ఉసికొలిపి ఇద్దరిలో ఎవరో ఒకరు చనిపోవడం చూచేవారు, మనుష్యులమీద సింహాలని విడిచిపెట్టేవారు ఆండ్రోకిల్స్ అండ్ ది లయన్ కథ మనం ఎరుగుదుముకదా. చాలా ఎత్తుగా గుండ్రంగా గోడలుకట్టి లోపల గేలరీల లాగు మెట్లు ఎర్పాటు చేసిఉన్నాయి దాని ఎత్తు, అది దాదాపు నూటాయాభై అడుగులైనా ఉంటుంది లోనికి జనంవెళ్లడానికి అడుగుఅంతస్థులో ఎన్నో ద్వారాలు ఉన్నాయి పైన చాలా అంతస్తులు ఉన్నాయి అప్పట్లో ఎనభై వేల మందిజనం కూర్చునేవారట. మధ్యగా ఉన్న గుండ్రని ఖాళీ స్థలంలో–ఎరీనాలో–ఈ జంతువుల్ని మనుష్యుల్ని విడిచిపెట్టేవారు. జనంఅంతా ఆ గేలరీ మెట్లమీద కూర్చుని భయంకర దృశ్యం తిలకిస్తూ ఆనందించేవారు. నాకు చాలా ఆశ్చర్యం వేస్తుంది ఇటాలియన్‌ల గురించి ఆలోచిస్తే వాళ్లు ఎంతో గొప్పకవులూ, ఎంతో

గొప్ప శిల్పులూ, కళాప్రియులూ. అయివుండీ మళ్లీ అంతటి క్రౌర్యమూ, అమానుషమూ అయిన దృశ్యాలు చూసి ఎలా ఆనందించే వారా అని !

చాలా పెద్ద ఉత్సాహం అయిపోయింది ఇప్పుడే క్రిందనుంచి పైకి గది లోకివచ్చాను క్రింద బ్రహ్మాండమైన విందు జరుగుతూ ఉంది నిన్నా మొన్నా ఇక్కడ రోమ్‌లో ఇంటర్నేషనల్ అగ్రికల్చర్ కాన్ఫరెన్సు జరిగింది ప్రపంచ రాజ్యాలన్నిటినుంచీ ప్రతినిధులు ఈ నగరం వచ్చారు మన భారతదేశంనుంచి కూడా ప్రతినిధులువచ్చారు ఇవ్వాళ మధ్యాహ్నమే మనదేశంనుంచి వచ్చిన విజయరాఘవాచారిగారూ మామహారాజావారూ కూడా ఇక్కడ కలుసు కున్నారు ఇటలీ ప్రభుత్వం ఏర్పాటుచేసింది ఆ కాన్ఫరెన్సు దీని సందర్భంగా, నానారాజ్య ప్రతినిధుల గౌరవార్థం మేము ఉన్న ఈ హోటల్ లోనే గొప్పవిందు జరిగింది ఈ బాంకెట్‌కి వచ్చినవాళ్లనందరినీ ముస్సోలినీయే రిసీవ్ చేసుకున్నాడు బేంకెట్ హాలువద్ద నిలబడి వచ్చిన వెయ్యిమందిని అతి ధులతోనైనా కరచాలనం చేశాడు రోమ్‌లోని గొప్పవాళ్లందరూ పాల్గొన్నారు గొప్పపదవులలో ఉన్న ఉద్యోగులందరూ తమ భార్యలతో హాజరయ్యారు వచ్చే వాళ్లనందరినీ చాటుగా మెట్లమీద నిలబడి చాలాసేపు చూచాను రోమ్ నగరంయొక్క ఇలైట్ అంతా వచ్చిందన్నమాట వాళ్లతయారీ, వాళ్ల దుస్తులూ, వాళ్ల ఆభరణాలూ చూస్తుంటే కళ్లు మిరుమిట్లు కొలిపాయి లోనికి ప్రవేశించడంతోనే వాళ్ల ఓవర్‌కోట్లూ, చేతిలో ఏమైనా ఉంటే అవీ ఇవన్నీ తీసుకోడానికి పదిమందైనా ఉన్నారు వాళ్ల కోట్లూ సామానులూ ఎవరివి వాళ్లవి కలిసిపోకుండా ప్రత్యేకంగా ఉంచి తిరిగివెళ్లిపోయేటప్పుడు మళ్లీ ఎవరివి వాళ్లకి ఇచ్చిపంపించేస్తారు ఈ పనికికూడా ఎంతోమర్యాద అయిన వాళ్లని నియోగిస్తారు. ఆడవాళ్ల ఓవర్‌కోట్లు ఒక్కొక్కటి ఎంతోవిలువ అయినవి ఉంటాయి. కొన్ని వందల లీరాల విలువఅయిన వన్నా ఉంటాయి అన్నట్టు ఇక్కడి డబ్బుకి లీరా లని అంటారు

మెరిసిపోయే బట్టలూ, ఆభరణాలూ ధరించి, చక్కగా తయారు అయినప్పటికీ అసల్ను ఇక్కడి స్త్రీలు చాలా అందమైనవాళ్లని అనుకుంటున్నా రంగు బొత్తిగా పాలిపోయినట్లు తెల్లగా కాకుండా కొంచం పసుపు పాలు ఉన్నట్లు చక్కగా ఉన్నారు శరీరాలలో మంచి వొంపులూ, తగిన ఒడ్డు పొడ

వులతో మంచి ఆరోగ్యంగా ఉన్నట్టుఉన్నారు ముఖాలల్లోకూడా కళ ఉట్టిపడు తున్నట్టు కనపడుతున్నారు పెద్ద విశాలమైన నల్లనికళ్లూ-పిల్లి కల్లు వాళ్ళుతక్కువ చక్కనిపొడవైన తీర్చినముక్కూ, ఇంతఎందుకు రోములో చక్కని శిలా విగ్రహాలు లేవూ, అలాగ తీర్చిదిద్దినట్లు ఉంటారు ఏమైనా ఈ విందుకువచ్చిన చాలా గొప్పఅందమైన ఆడవాళ్ల దర్శనభాగ్యం దూరాన్నుంచైనా కలిగింది. రిసెప్షనూ, త్రాగడం, భోజనాలూ అయాయి ఇంక డాన్సు చెయ్యడం మొదలు పెట్టారు జోడీలు జోడీలుగా ఆర్కెష్ట్రా సంగీతం చక్కగా ఇక్కడికి వినబడు తూంది తెల్లవార్లూ ఉంటుందేమో, నేను ఇప్పుడేపైకివచ్చి ఈ విషయం వ్రాసి ముగిస్తున్నా చాలా రాత్రి అయింది రేపు మళ్లీ ఇక్కణ్ణుంచి వెళ్లి పోతున్నాం, నేపుల్సునగరానికి

సి,

వేంకటరావు





Casino de Paris
Monte carlo
France
22nd October 1930

డియర్ పెమ్మిరాజు,

రోమ్ నుంచి నేను వ్రాసిన ఉత్తరం అందే ఉంటుంది ఇటలీలో ఇంకా రెండు మూడు నగరాలు దర్శించాం 16వ తేదీని పది గంటలకి రోమ్‌లో బయలుదేరి నేపుల్స్ నగరం మధ్యాహ్నం రెండు గంటలకి చేరుకున్నాం హోటల్ ఎక్సెల్సియర్‌లో బసచేశాం నేపుల్స్ ఎక్కడఉందో నీకు తెలుసునుగా ఇటలీలో నైరుతిగా సముద్రం ఒడ్డున ఉంది ఫస్టుక్లాసైన బీచ్ ఉంది బీచ్ ఒడ్డునే ఉంది మాహోటల్ మాహోటల్‌లోంచి చూస్తే ఎదురుగా సముద్రం ఉంచప్నమాట సముద్రం కొంచంలోపలికి చొరుచుకువచ్చి ఒక 'బే' గా ఫార్మ్ అయింది. దాన్ని నేపుల్స్‌బే అంటారు నేపుల్స్ వెసూవియస్ పర్వతానికి దగ్గరగానే ఉంది పాంపే పట్టణం వెసూవియస్‌కి నేపుల్స్‌కి మధ్యగా ఉంది.

ఒకప్పుడు నేపుల్స్ నగరం మహావైభవంగా ఉండేదట ఆ చిహ్నాలు ఇప్పుడూ కనపడుతున్నాయి రాజభవనాలూ, కోటలూ, వీథులూ పూర్వం గొప్పస్థితిలో ఉండి ఇప్పుడు స్మృతి చిహ్నాలుగా ఉండిపోయాయి ఎంత అందంగానూ, ఎంత వైభవంగానూ ఉండకపోతే, "సీ నేపుల్స్ అండ్ డై" అనే మాట వస్తుంది ? అయితే ఇప్పుడు ప్రపంచంలో అందమైన నగరాలలో అగ్రస్థానం పారిస్ నగరానిదని అంటున్నారు నేపుల్స్‌లో రెండు రోజులు ఉండి అంతాచూశాం పట్నం శుభ్రంగానే ఉంది రోమ్‌లో లాగు పెద్ద పెద్ద భవనాలు లేకపోయినా, పురాతనమైనవైనా ఇళ్లు చక్కగానే ఉన్నాయి. ఇక్కడా ఒక పెద్ద చర్చి ఉంది. దాన్ని రాయల్ చర్చి అంటారు పాత కోట, రాజభవనం మొదలైన భవనాలు ఉన్నాయి. కొండ మీద ఒక కోట ఉంది. సముద్రం ఒడ్డున ఒక కోట ఉంది ఒక యూనివర్సిటీ కూడా ఉంది. ఇక్కడ కూడా గారిబాల్డీకి ఒక పెద్ద మాన్యుమెంటు కట్టారు ఊరు తిరిగి ఇవన్నీ చూశాం.

అయితే నేపుల్స్‌నగరం రావడం ఎందుకంటే వెసూవియస్ అగ్నిపర్వతాన్ని చూడడంకోసం

మాహోటేల్ మంచి చోట ఉంది బీచ్‌ని ఉన్నదన్నాను కదా ' నాగది ముందుకిటికీలోనుంచి చూస్తే చక్కగా సముద్రం కనపడుతుంది నీటి మీదే ఉన్నంత దగ్గరగా ఉంది సముద్రతీరాన్నే చక్కని రోడ్డు, శుభ్రమైన పేవ్ మెంటూ ఉన్నాయి దానిక్రింద ఇసుక బయలూ, తరవాత కెరటాలతో సముద్రమున్నా ఆ సముద్రతీరాన్ని ఇసకలో ప్రొద్దుటిపేళా, సాయంత్రమూ పిల్లలు ఆడుకుంటారు పెద్ద వాళ్లు షికార్లు చేస్తారు నా గదిలో ఇంకొక కిటికీ లో నుంచి చూస్తే దూరంగా వెసూవియస్ అగ్నిపర్వతం కనపడుతూ ఉంటుంది మేము వెళ్లిన రోజు రాత్రి భోజనాలు చేసిన 'తరవాత కిటికీతీసి చూసేసరికి అగ్నిపర్వతం నిప్పులు కక్కుతూ కనపడింది ఆలాగేచూస్తూ కొంతసేపు నిలబడ్డాం. పొగతోనూ, మంటలతోనూ ఎప్పుడూ వెలిగిపోతూ ఉంటూ అప్పుడప్పుడు మంటలూ పొగా ఉవ్వెత్తుగా ఆశిఖరంలో నుంచి చాలా ఎత్తు వరకూ ఎగిరిపడుతూంటే చూస్తూ నిలబడ్డా ఆయాదేశాల్లో అగ్నిపర్వతాలు ఉంటాయని జాగ్రఫీ పుస్తకాల్లో చదువుకున్నాం కాని ఇప్పుడు ప్రజ్వరిల్లుతూ ఉన్న ఈ సజీవ అగ్నిపర్వతం చూస్తుంటే సంతోషమూ, ఆశ్చర్యమూ, భయమూ కూడా కలిగాయి.

సృష్టి అతిచిత్రమైనది జలపాతాలు చూశాం కేన్యన్లు చూశాం గ్లేషియర్లు చూశాం. ఇప్పుడే అగ్నిపర్వతాన్ని చూస్తున్నా కొండ శిఖరాలు తెల్లని, చల్లని మంచు కిరీటాలు ధరించి ఉండడం చూస్తుంటే హాయిగాఉంది ఇక్కడి వెసూవియస్ శిఖరం, ఎర్రగా కోపంతో బుసలుకొడుతూ నిప్పులు కక్కుతూ ఉండడం చూస్తుంటే భయం వేస్తుంది అసలు ఇలాగ కొండశిఖరాల లోనుంచి నిప్పులు ఎందుకురావాలి?

అసలు భూమి పొగలతోనూ, వాయువులతోనూ చుట్టబడిన ఒక పెద్ద అగ్నిగోళమని కదా అభిప్రాయం దానికి పైభాగం చల్లబడిపోయి, ఘనీభవించి భూమిగా తయారైంది అయితే భూగోళం యొక్క గర్భం ఇంకా చల్లబడలేదు. చాలా భాగం నిప్పుగానే ఉండిపోయింది. సముద్రంలో నుంచి నీరు ఎక్కడి నుంచో భూగర్భంలోనికి చొరబడటం వల్లనో, భూగర్భంలోని అగ్నిలో ఏవైనా

మార్పులు రావడంవల్లనో, నిప్పుపైకి ఉబికి, నీళ్లూ నిప్పూ, రాళ్లూ రప్పలూ ద్రవపదార్థంగా ఏర్పడి 'లావా' గా తయారవుతుందట అది ఏ కొండ శిఖరాన్నో బ్రద్దలుచేసుకుని మహావేగంతో, మంటలుకక్కుతూ పైకి ఉబికి క్రింద పడుతుంది ఆ లావా కొండపైభాగాన్ని డి క్రిందికి జారుతూ చల్లారిపోతుంది ఆ లావా ఎంత ఉధృతంగాపైకి వస్తుందంటే ఎనిమిదీ ఓదిమైళ్ల దూరంలో ఉన్న పట్నాలుకూడా దగ్ధపటలం అయిపోయేటంత వేగంగా ఎన్నో నగరాలు ఇలా దగ్ధం అయిపోయాయి అందులో వెసూవియస్‌కి దగ్గరగా ఉన్న పాంపే నగరం ఒకటి

చల్లారిన లావాలో అనేకమైన ఖనిజాలు ఉంటాయట ముఖ్యంగా గంధకం ఎక్కువగా ఉంటుందట లావాను వేరు చేసి అనేక పదార్థాలుగా తయారుచేస్తున్నారు శాస్త్రకారులు అగ్నిపర్వత ప్రాంతాలలో వ్యవసాయం చాలా సారవంతంగా జరుగుతుందట వెసూవియస్ ప్రాంతం అంతా ద్రాక్ష తోటలు చాలా విస్తారంగా ఉన్నాయి లావా మట్టిని ప్రత్యేకమైన కొన్ని పంటలకి ఎరువుగా కూడా ఉపయోగిస్తారట

మేము గురువారం మధ్యాహ్నం కార్లమీద బయలుదేరి వెసూవియస్ వల్ల దగ్ధం అయిన పాంపే పట్టణం యొక్క శిథిలాలు చూశాం. ఒకప్పుడు ఎంతో వైభవంగా ఉండిన పట్నం ఇప్పుడు రాళ్లూ రప్పలతో గుట్టలు గుట్టలుగా పడి ఉంది. ఎప్పుడు ఇది ధ్వంసం అయిందో ! ఇప్పటికీ దాన్ని క్లియర్‌చేయడం కాలేదు ఇంకా అక్కడక్కడ నిలిచిఉన్న స్థంభాలనీ, పడిపోతూ ఉన్న సీలింగ్సునీ చూస్తే అవి ఎంతెంత పెద్దభవనాలో ఊహించవచ్చు ఒక్కరాత్రిలో హఠాత్తుగా ఉబికి వచ్చిన జ్వాలలకి కాలిపోయిన నగరంలో ఎన్ని లక్షలమంది అగ్గిపాలయేరో ! పాంపే శిథిలాలను చూచిన తరవాత వెసూవియస్ పర్వత పాదం వద్దకు వెళ్లాం

అక్కడ ఒక చిన్న రైలుస్టేషను, పర్వత శిఖరంమీదికి సరాసరితీసుకుపోతుంది ఒక్కటే రైలుపెట్టి, ఎలక్ట్రిక్ పవర్‌వల్ల నడుస్తుంది. రైలుబండి కొండ ఎక్కుతుంటే క్రిందభాగం అంతా ఇటూ అటూ ద్రాక్షతోటలు పర్వతం ఎక్కుతుంటే ఒక్కొక్కప్పుడు మాపెట్టి ఏటవాలుగా కూడా ఎక్కుతుంది. అప్పుడు క్రిందికి జారిపోతుందేమో అని భయం వేస్తుంది కాని అంతపనిచేసిన

దొరలు జారకుండా ఏర్పాటు చెయ్యరా  రైలుదిగి వందగజాలు నడిచి సరాసరి క్రేటరు వద్దకే వెళ్లాం, క్రేటర్ అంటే అగ్నిజ్వాలవచ్చే శిఖరద్వారం అన్న మాట మంటలుపైకి వస్తూనేఉన్నాయి బుస్సుమని బుసలుకొడుతూనే ఉంది ఆకాశం అంతా పొగలు ఐవరించి మబ్బుకమ్మినట్టుంది అప్పుడప్పుడు లావా పైకి ఉవ్వెత్తుగా ఉబుకుతూనేఉంది భగవంతుని సృష్టిలో ఇదొక విచిత్రం, లావారాళ్లి ముక్కలు రెండు జేబులో పెట్టుకున్నానులే ' వచ్చాకనీకుచూపిస్తాను. ఈ అగ్నిపర్వతం చూడడానికే ఈ నేపుల్స్ వచ్చాం ఏ యాత్రికులైనా అందుకే వస్తారు, దాని జ్వాలలూ, ఉధృతం చూశాం దానివల్ల ధ్వంసంఅయిన నగరం చూశాం. ఇప్పటికి చూచిన సృష్టివైచిత్ర్యాలలో ఇదొకటి కొత్తది ఒక్క నమస్కారంచేసి తిరిగివచ్చేశాను

ఇక్కడ సముద్రం లోపలికి చొరుచుకువచ్చి అఖాతం ఏర్పడింది ఈ అఖాతం తీరాన్నే నేపుల్స్ నగరం ఉండడంవల్ల ఈ సముద్రాన్ని బే ఆఫ్ నేపుల్స్ అన్నారు ఇక్కడ చాలా పెద్ద హార్బరుఉంది తూర్పు దేశాలనుంచి వచ్చే పోయే స్టీమర్లు చాలావరకూ ఇక్కడకూడా ఆగుతూ ఉంటాయి. మధ్యధరా సముద్రంలో ఉన్న హార్బర్లలో ఇది ఒక పెద్దహార్బరు.

"మేకరోని" అనే ఆహారపదార్థం ఇక్కడ విరివిగా తయారవుతుంది వెర్మిసెల్లీ అనేది ఇంకొకటి. అంటే సేమ్యా అన్నమాట, మనదేశంలో సేమ్యా చెయ్యరూ చీపురుపుల్లల కంటే సన్నంగా ? అదేఇంకా చాలా లావుగా పొడవుగా చుట్టలు చుట్టలులాగ తయారు చేస్తారు పిండితో దీన్ని మేకరోని అంటారు. దీన్ని ఉడకబెట్టి కూరలూ, ఆకులూ నంజుకుని తింటారు. తెల్లగా పొడవుగా లావుపాటి దారాలలాగు ఉన్న ఈ మేకరోని ప్లేటులో పెట్టుకుతినడం అలవాటు ఉంటేగాని కష్టం అవిజారిపోతూ ఉంటాయి. స్పూన్ మీదగాని ఫోర్కుమీద గాని నిలబడవు సన్నటి రెండు పుల్లలు పెడతారు వాటికిచుట్ట బెట్టి నోటికి అందిస్తారు ఇటలీ దేశంలో అన్ని పట్నాలలోనూ మేము మేకరోని తింటూనే ఉన్నాం.

ఇక్కడ ఎవరూ మంచినీళ్లు త్రాగినట్టు కనబడలేదోయ్ మాభోజనాల టేబిల్సుమీద ఒక్కొక్క మనిషికి రెండేసి పెద్ద సీసాల వైన్ పెడుతున్నారు దానినే వాళ్లు మంచినీళ్ల లాగు తాగుతారు. వైన్ అంటే మరేమీకాదు. పులవ

పెట్టిన ద్రాక్షరసం, ఫెర్మెంటు అవడంవల్లా, అందులో బ్రాందీయో, ఆల్కహాలో కలవడంవల్లా కొంతసేపటికి ఉత్సాహం ఇవ్వడమేకాక కొంచెం మత్తు కూడా ఎక్కిస్తుందట. మా వాళ్లెవరూ మానకుండా ఒకరోజున ఎర్రగా జలజలా మెరిసే వైన్ ఒక గ్లాసుడు తాగేసాను, సోడాతో దీని తమాషా చూదాం అని. నాకేమీ అనిపించలేదు. ఈ వైన్సులో అనేక రకాలైనవి ఇక్కడనే నేపుల్స్‌లో తయారు చేస్తారట. మామూలుగా మంచినీళ్లలాగా తాగే ఎర్రటి వైను, తెల్లటి వైనూకాక, షాంపేన్ లసీ, షెర్రి లసీ, పోర్టుఆసీ ఇంకా ఎన్నో రకాలు ఈ వివరేదెస్ అన్నీ అనేక వాటుల ద్రాక్ష రసాలు పులవబెట్టి బ్రాంది మొదలైనవి కలిపి తయారు చేస్తారు. చెప్పాలంటే ఇక్కడి స్త్రీలేమిటి పురుషులేమిటి మంచినీళ్లెవరూ త్రాగరని. ఈ వైన్ అనిపించబడే ద్రాక్షరసమే వాళ్లకి దాహం తీరుస్తుంది బలం ఇస్తుంది నరాలకి ఉద్రేకం కలిగిస్తుంది

నేపుల్స్‌లో చూడవలసిన కోటలూ, చర్చిలూ అన్నీ దర్శించాం 18వ తేదీ శనివారం ఉదయం అక్కణ్ణించి మళ్లీ బయలుదేరి ఫ్లారెన్స్ నగరం వచ్చాం ఫ్లారెన్స్ ఇటలీ మధ్యగా ఉంది. అందుచేత మళ్లీ మార్సైలు రోమ్ మీదుగా రావాలి అక్కడ మధ్యాహ్నం ఒక గంటసేపు ఆగి సాయంకాలం అయిదుగంటలకి ఫ్లారెన్సు చేరుకున్నాం మార్సైలుమార్గానికి రెండువైపులూ ద్రాక్షతోటలుతప్ప వేరేమి కనపడలేదు ఇక్కడ కూడా ఒక ఎక్సెల్షియర్ హోటేల్ ఉంది అందులో బసచేశాం.

ఫ్లారెన్సు అంటే సిటీ ఆఫ్ ఫ్లవర్సు అట ఆర్నో నదీతీరాన్ని ఉంది రోమ్‌కీ, ఇటలీకీ బోలెడంత చరిత్ర ఉందికదా ! అది ముందుగా కొంచెం అయినా తెలిసిఉంటే ఇక్కడ ఇంకా ఆనందించడానికి అవకాశం ఉండేది అయితే ఈ దృశ్యాలూ, ఇక్కడి కెతీడ్రల్సూ చర్చీలూ, శిల్పాలూ, స్మారక చిహ్నాలూ చూస్తుంటే ఆశ్చర్యంగా ఉంది వీళ్ళు మానవులా దేవతలా అని ! ఫ్లారెన్సు నగరం యూరపు ఖండానికేకాక యావత్ప్రపంచానికే శిల్పకళా ఖజానా అన్న మాట ఖజానాలో ధనం ఉంటుంది ఇక్కడ అమూల్యమైన శిల్పకళా ఖండాలు ఉన్నాయి నగరం నగరం అంతా ఒక కళాఖండం అన్నమాట పూర్వకాలంలో ఇక్కడి ప్రజలు ఎంతటి కళాపిపాసువులూ కళోపాసకులూ, కాకపోతే ఈ నగరం ఇంతటి ప్రపంచ ప్రఖ్యాతికాంచిన కళాఖండాలకి నెలవు అవుతుంది?

ఇక్కడి చిత్రాలమీదా, స్టేట్యూలమీదా వ్రాసిన వాటినిబట్టి చూస్తే గొప్ప గొప్ప కవులూ, గొప్పగొప్ప గాయకులూ, గొప్ప శిల్పులూ, చిత్రకారులూ ఈ ఫ్లారెన్సులో పుట్టారనీ ఇక్కడనివసించారని తెలుస్తూవుంది డాంటీ అనే గొప్ప ఇటాలియన్ కవి జన్మస్థలం ఇదేనట డికెమరాన్ కధలు వ్రాసిన బొకేషియో అనే కవి ఇక్కడే పుట్టాడట అఖండ ప్రజ్ఞాశాలి అయిన శిల్పి మైకెలేంజిలో జన్మించింది ఇక్కడేనట లలిత కళలకు పుట్టినిల్లయి, మహాద్భుతమైన సంస్కృతికి నిలయం కావడానికి ఈ ఫ్లారెన్సు భూభాగానికి ఏదో ప్రత్యేకత ఉండాలి

ఇక్కడ ముఖ్యంగా చూడవలసినవి ఉఫిజీగేలరీ ఒకటి- రెండోది పిట్టీ పేలెస్ ఇక్కడే చూశాం 'బాటిసిల్' అనే చిత్రకారుని అద్వితీయమైన పెయింటింగ్సు లందులో ముఖ్యమైనవి-నన్నే కాదు-ప్రపంచాన్నంతనీ ఆకర్షించినవి "స్ప్రింగ్" అనేది ఒకటీ, "బర్త్ ఆఫ్ వీనస్" అనేది రెండోది రాఫేల్ చిత్రించిన "మడోన్నా" అసలు చిత్రాన్ని చూశాం ఉఫిజీ గేలరీలో "గోటో" చిత్రించిన మడొన్నా అద్భుతంగా ఉంది పిట్టి పేలస్‌లో రాఫేల్ చిత్రాలు ఎన్నో ఉన్నాయి ఇక్కడి రేఫేలే రోమ్‌లోని వేటికాన్‌లోనూ, సెంట్‌పీటర్స్ కెతీడ్రల్‌లోనూ ఉన్న గోడలమీది ఫ్రెస్కో పెయింటింగ్సు చిత్రించాడట ఇక్కడనే ఒక చర్చిలో ఇద్దరు మహావ్యక్తుల గోరీలు ఉన్నాయి ప్రపంచంలో అద్వితీయ చిత్రకారుడనీ శిల్పి అనీ పేరుకెక్కిన మైకెలేంజెలోది ఒకటి రెండోది 'గెలీలియో'ది గెలీలియో అంటే నీకు తెలుసుకదా టెలిస్కోప్ కనిపెట్టాడనీ, లీనింగ్ టవర్ ఆఫ్‌పైసా మీదినుంచి ఎన్నో శాస్త్రానికి సంబంధించిన విషయాలు, ముఖ్యంగా భూమి గుండ్రంగా ఉందని కనిపెట్టాడనీ చదువుకున్నాం,

ఇంక ఊళ్లో కూడా చూడవలసినవి చాలాఉన్నాయి ఊరంతా ఒక శిల్పకళా ఖండం అన్నానుకదా। ఒక చర్చి చూశాం దాని తలుపులమీద చెక్కడపు పని ఎంతో చిత్రంగాఉంది మైకెలేంజిలోవంటి గొప్పశిల్పే అన్నాడట ఈ గేట్‌నుచూసి ఇది చర్చికి ద్వారం అనడంకంటె స్వర్గానికే ద్వారం అంటే బాగుంటుం దని, ఊళ్లోనే ఒక పెద్దడోమ్‌ఉంది దానికి ప్రక్కగానే గోటోటవర్ అనే గంట స్థంభం చూశాం. సాధారణంగా కెతీడ్రల్స్ ప్రక్కని గంట స్థంభాలు ఉంటూ ఉంటాయి. ఈ గొటోస్ గంట స్థంభం ప్రపంచంలో చాలా పేరుపడ్డది

ఇంత అందమైన గంట స్తంభం ప్రపంచంలో మరెక్కడాలేదు గొట్టో డి బాండేన్ అనే శిల్పిదీనిని డిజైన్‌చేసి, కట్టి, చెక్కి మహాద్భుతమైన కళాఖండంగా తయారుచేశాడు దీని శిల్పకళ మీద ఎందరో కవులు పద్యాలు వ్రాశారట ఫ్లారెన్సు పూచిన రాతిపుష్పం అని ఎవరో కవిఅన్నారట ప్రపంచ విఖ్యాతికొంచిన స్టేట్యూలు ఈ పట్నం అంతటా ఉన్నాయి అద్వితీయమైన శిల్పకళా ఖండం అని ఖ్యాతి గడించిన 'డేవిడ్' పాలరాతి విగ్రహం ఇక్కడేఉంది మైకెలేంజిలోని అమరుణ్ణిగా చేసింది ఈ విగ్రహమే ఈ విగ్రహం ప్రతులే ప్రపంచంలోని గొప్పమ్యూజియము లన్నింటిలోనూ కనబడుతుంటాయి ఇంకొక పెద్ద టవర్ చూశాం దానిమీదా ఒక గొప్ప ఒంటిముల్లు గడియారం ఉంది పనిచేస్తూనే ఉంది అయిదువందల ఏళ్ల క్రితం దీన్ని కట్టారట

మొన్న మధ్యాహ్నం ఫ్లారెన్సు విడిచిపెట్టేశాం పైసా నగరం మీదుగా వచ్చాం ది లీనింగ్‌టవర్ ఆఫ్‌పైసా చూశాం సెవెన్ వండర్స్ ఆఫ్ ది వరల్డ్‌లో ఇదొకటి పైకి ఎక్కి చూడడానికి టైము లేకపోయింది అక్కడి నుంచి మా రైలు సముద్రం ఒడ్డునే కొన్ని వందలమైళ్లు నడిచి జెనోవా అనేపట్నం చేరుకుంది సాయంత్రం 6 గంటలకి హొటేల్ కొలంబియాలో బసచేశాం రాత్రి ఉండి ఉదయం అక్కడి నుంచి బయలుదేరి నిన్న సాయంత్రం నాలుగు గంటలకీ ఈ వూరు-మాంటికార్లో-వచ్చాం

ఈ మాంటీకార్లో అనే ఊరు చాలాచిత్రమైంది ప్రపంచంలోని దేశదేశాల ధనికుల్ని ఇక్కడచూడవచ్చు ఎందుకు వస్తారు ఈ ధనికు లిక్కడికీ అంటే జూదం ఆడడానికి ఫ్రాన్సుదేశానికి ఆగ్నేయంగా ఉంది మధ్యధరా సముద్రం ఒడ్డునేఉంది సముద్రం ఒడ్డునే పెద్దకొండలు ఉన్నాయి కొండల మీద మెట్లుమెట్లుగా చాలాఅందమైన భవనాలు కట్టారు ఏ ఇంట్లో నుంచి చూచినా ఎదురుగా సముద్రం కనపడుతూ ఉంటుంది సముద్రం ఒడ్డున నిలబడి తలఎత్తిచూస్తే కొండ ఎత్తునా పచ్చని చెట్ల మధ్య తెల్లని బంగాళాలు చక్కగా కనపడతాయి ఊరంతా చాలా సుందరంగా ఉంటుంది అందమైన గడ్డిలానులూ, పువ్వుల మొక్కలూ, గులాబీలూ, ఎన్నో రకాల పువ్వులూ

చక్కగా పెరుగుతా యిక్కడ ఊరంతా పామ్ వృక్షాలు ఎక్కువ మొనాకో అనే ప్రదేశం మూడు భాగాలుగా ఉంది అందులో మాంటికార్లో ఒక భాగం

మేము హోటేల్-డి-పారిస్ అనే హోటేల్‌లో బసచేశాం ఇది చాలా హైక్లాస్ హోటేల్, దేశదేశాల నుంచి వచ్చిన కోటీశ్వరులు ఇక్కడ విడిది చేస్తుంటారు ముఖ్యంగా జూదం ఆడడానికి వస్తారు క్రొత్తగా పెళ్లిఅయిన దంపతులు హనీమూన్ కోసం కూడా వస్తుంటారు సముద్రం ఒడ్డున ఉండడం వల్ల కొందరు యూరపులోని అతిశీతల ప్రదేశాల్నుంచి ఆరోగ్యం కోసం కూడా వస్తుంటారు, మనదేశంలో వేసవిలో చల్లని ప్రదేశాలైన సిమ్లా, డార్జిలింగ్, లాంటి పట్నాలకి ధనవంతులు ఎలాగు వెళతారో అలాగే యూరప్‌లోని ధన వంతులు శీతకాలంలో చలిభరించలేక సమశీతోష్ణంగా ఉండే మధ్యధరా సముద్ర తీరాన్ని ఉన్న పట్టణాలకి వస్తుంటారు ఊళ్ళో జనాభా చాలాతక్కువ టూరిస్టులే చాలా ఎక్కువ డబ్బుకి విలువలేదు ఇక్కడ ఎందుచేతంటే, డబ్బుని ఏం చెయ్యాలో, ఎలాగ ఖర్చుపెట్టాలో తెలియని కోటీశ్వరులు జూదం సరదా అనే నెపంతో నీళ్లు పారబోసినట్లు ధనాన్ని ధారపోస్తూ ఉంటారు ఆడవాళ్లూ, మగవాళ్లూ కూడా మతిపోయినట్లు తిరుగుతారు ఈ జూదం పిచ్చితో

వీళ్లని చూడడానికి మేము వేరేపని గట్టుకుని ఎక్కడికీ వెళ్లనక్కర లేకపోయింది. ఎందు చేతనంటే 'కేసినో' అనే ఆ జూదపు భవనం మా హోటెల్‌కి ఎదురుగానే ఉంది నా గదిలో నుంచే వచ్చేపోయే వాళ్లని కేసినో మెట్లు ఎక్కుతుంటేనూ, దిగుతుంటేనూ చూడవచ్చు, కేసినో ఒక చక్కని భవనం. పాలరాతి భవనంలాగు శుభ్రంగా తెల్లగాఉంది భవనానికి ఎదురుగా చిన్న పార్కుఉంది ఆ పార్కులో పెద్దపెద్ద సిల్కు గొడుగులు రంగురంగు లవి పాతిపెడతారు ఆ గొడుగుల నీడలో దొరలూ దొరసానులూ కూర్చుని కబుర్లు చెప్పుకుంటారు, తాగుతారు, సరదాగా కాలక్షేపం చేస్తారు

కేసినోలోకి జనం విరివిగా రాత్రివేళ వస్తారు తెల్లవార్లూ వచ్చే కార్లూ పోయే కార్లున్నూ మగవాళ్లంతా డ్రెస్‌సూట్సు తప్పకండా వేసుకుంటారు. డ్రెస్‌సూట్లు అంటే ఇదివరకు వ్రాశానేమో ప్రత్యేకమైన నల్లటిరంగు గుడ్డతో కుడతారు. దానికి ప్రత్యేకమైన షర్టు ఉంటుంది. షర్టు ముందు భాగం చాతీమీద అట్టకంటే దళసరిగా ఉంటుంది. కఫ్సుకూడా చాలా దళసరిగా చేస్తారు వాటి

బటన్స్ ప్రత్యేకం నల్లని బౌ మెడ చుట్టూ ఉంటుంది జోళ్లు పేటెంటు లెదరువి వేసుకోవాలి తెల్లటి గ్లవ్స్ వేసుకుంటారు పశ్చిమదేశాల్లో డిన్నర్లకీ, డాన్సు లకీ వేసుకుండే డ్రెస్ ప్రత్యేకంగా ఉంటుంది అలాంటి డ్రెస్‌తోనే కేసినోకి అందరూ వస్తారు వచ్చే వాళ్లందరూ ధనవంతులేమో, వాళ్ల దుస్తులు అమూల్య మైనవి కావడానికి సందేహం ఏముంటుంది?

ఇంక ఆడవాళ్లు అది ఫ్రాన్సుదేశం ఫేషన్లకి పుట్టినిల్లు జనం అమెరికా నుంచీ, ఇతర దేశాలనుంచీ డబ్బుపోగొట్టుకుని సరదా తీర్చుకోడానికి వచ్చే నవనాగరిక యువతులూ, వాళ్ల దుస్తులూ అలంకారాలూ ఎంతషోకుగా, ఉంటా యో చెప్పాలా? అమూల్యమైన సిల్కులూ, జరీలూ నేలజీరాడేలాగు కుట్టిన రకరకాలైన గౌనులతో మెరిసిపోతూ ఉంటారు కొందరు నిజమైన రత్నాలే గౌనులకి కుట్టిస్తారు కంఠాలకి అమూల్యమైన వజ్రాలహారాలో, విలువకట్ట లేని ముత్యాల సరాలో! ఎత్తు మడమల జోళ్లకూడా మెరుస్తున్నాయంటే జోళ్లకి కూడా నవరత్నాలు తాపించారా అన్నట్టు ఉంటాయి తలమీద టోపీలు ఎన్ని రకాలో! ఎన్ని వందల వందల మంది స్త్రీలో అన్ని వందల రకాల టోపీలూ ఉన్నాయన్నట్టుంటుంది. ఒకరి టోపీ మాదిరి టోపీ ఇంకొకరు ధరించినట్టు కనపడదే! ఒకరు వేసినబట్టలాంటిది ఇంకొకరు ధరించినట్టు కనపడదే! అక్కడకి వచ్చే వేలాది స్త్రీలలోనూ ప్రతి దానికీ ఒక ప్రత్యేకత కనపడుతుంది ముక్కు రంధ్రాల్లోంచివచ్చే ఉచ్ఛ్వాసానికే గజగజ వణికిపోయే అతిసన్నని, అతిమెత్తని బొచ్చుకోట్లు-ఫర్స్ అంటారు—ఎన్నోరకాల జంతులవి-ఎంత చక్కగానో ఉంటాయి-వాటితో కుట్టిన కోట్లు ధరించీ, మెడకు చుట్ట బెట్టుకునీ వస్తారు పెద్ద చేట లంతంత విశాలమైన టోపీలు ధరించిన వాళ్లూ వస్తారు చిన్నచిన్న టోపీలు ధరించిన వాళ్లూవస్తారు వాటికెంత షోకు చేస్తారని! రంగురంగుల పిట్టల ఈకలు, రకరకాల పువ్వులు వీటితో టోపీలు అలంకరిస్తారు.

ఇంక పై మెరుగుల సంగతి చెప్పాలా! ముఖాలకి రాసుకునే పూతలూ పౌడర్లూ, రంగులూ, వెర్రివేషాలకి అంతు ఎక్కడిది? చేతులలో రకరకాల ఉబ్బినచేతి సంచులు-నోట్లకట్టలతోనో, చెక్కుబుక్కులతోనో, టోయ్‌లెట్ పెట్టెల తోనో నిండి ఉంటాయి, వాళ్లు పూసుకునే విలువైన అత్తరుల సువాసనల కేసినో ప్రాంతమేకాక ఊరంతా పాకిపోతాయి మనదేశంలో చల్లని పట్టణాలలో మహారాజులకీ, ధనవంతులకీ వేసవిలో నివసించడానికి ప్రత్యేకంగా స్వంత

బంగళాలు ఉన్నట్టు, ఇక్కడ కూడా చాలా మంది మల్టీ మిలియనేర్సుకి స్వంత బంగళాలు ఉన్నాయి

జూదం అంటే ఏమిటి ? లోపల ఏమి ఆటలు ఉంటాయి పేకాటా, అష్టాచెమ్మా, పచ్చీసూ, లాంటివేకాదు మన వైపు తీర్థాలలో రింగుల ఆటలేదూ అలాంటివే ఎన్నో రకాల ఆటలు వేలమీద పందాలు వేస్తారు తెల్లవార్లూ జరుగుతుంది ఎన్నివందల గేలన్లవైన్ హరించి పోతుందో, ఎన్నివేల సిగరెట్లు బూడిద అవుతాయో, ఎన్నెన్ని లక్షల రూపాయలు మాయం అయి పోతాయో చెప్పలేం లోపలికివెళ్ళే వాళ్లు చకచకాపైకి మెట్లెక్కిపోతారు ఇవతలికి వచ్చేవాళ్లు తల వెళ్లాడేసుకుని, కాళ్లీడ్చుకుంటూ, మందంగా మెట్లుదిగి కార్లలో కూలబడతారు.

నిన్నా ఇవాళా మాంటికార్లో దృశ్యాలు చూశాను కొండలన్నీ తిరిగాను చక్కని బంగళాలూ, పూలవనాలూ చూశాను సముద్రతీరాన్ని ఉన్న చక్కని బాటపై నడిచాను క్రింది నుంచి కొండ ఎత్తు వరకూ ఉన్న భవనాల అందం తిలకించాను మాంటికార్లో చాలా అందమైన పట్నం, ధనవంతుల నగరం, వినోద స్థలం, ఆరోగ్య ప్రదేశం అని తెలుసుకున్నాం

ఈ ఉత్తరం ఇక్కడే పోస్టుచేస్తున్నా ఇంక కొంత సేపటిలో ఇక్కడి నుంచి మళ్లీ ప్రయాణం మా ఐటినెరెరీలో ఆఖరి నగరానికి ప్రయాణం— పారిస్‌కి. రేపు ఉదయం పారిస్ నగరం చేరుకుంటాం నెలరోజులపాటు ఉంటాం అక్కడ ఇంక సెలవు

ని
వేంకటరావు





Hotel Claridge
Champs Elysses
Paris
30th October 1930

డియర్ వెంకటరావ్,

ఈ ఉత్తరం పారిస్ నగరం నుంచి వ్రాస్తున్నానని పై అడ్రసుబట్టే తెలుస్తుంది పారిస్ ప్రపంచంలోని నగరాలన్నింటికంటె అందమైనదని ప్రఖ్యాతి ఉంది కదా ఎప్పుడో "సీ నేపుల్స్ అండ్ డై" అన్నారు ప్రస్తుతం "సి పారిస్ అండ్ డై" అని అంటున్నారు పారిస్ ఫ్రాన్సు దేశానికి ముఖ్యపట్టణం ఫ్రాన్సు దేశం చిరకాలం నుంచి యుద్ధాల పాలవుతూ వచ్చింది యూరపు ఖండంలో ఏ దేశాలవాళ్లకి చిన్నతగాదా వచ్చినా అందులో ఫ్రాన్సు చిక్కుకోక తప్పలేదు ఎన్నోమార్లు ఇంగ్లీషువారికీ ఫ్రెంచి వారికీ శతాబ్దాల తరబడి యుద్ధాలు జరిగేవి సరిహద్దుల్లో ఉన్న జర్మనీతో, హాలెండుతో, ఇటలీతో ఆస్ట్రియాతో ఎప్పుడూ ఏదో యుద్ధమే అయినా ఎలాంటి కష్టపరిస్థితులనైనా అధిగమించి రాజ్యాన్నీ వ్యక్తిత్వాన్నీ నిలబెట్టుకుంటూనే ఉంది ఫరాసులు సోమరులనీ, విలాస ప్రియులనీ అనుకోడం పొరపాటు ఇతర రాజ్యాలతోనే గాక స్వదేశంలో స్వప్రజలలోనే గొప్ప యుద్ధాలు జరిగాయి పదహారవ లూయీ చక్రవర్తిగా ఉన్నప్పుడే దేశంలో దారుణమైన తిరుగుబాటు వచ్చింది చక్రవర్తినీ, కుటుంబాన్నీ, నోబుల్సునీ, డ్యూక్సునీ, వాళ్ల అనుయాయుల్నీ లక్షల కొలది మనుష్యుల్ని ప్రజలు చంపేశారు ఫ్రెంచి రివల్యూషనుకు దారి తీసినది దేశంలోని ప్రజానీకం దారిద్ర్యం అనుభవించడమున్నూ, చక్రవర్తులూ నోబుల్సూ, విచ్చలవిడిగా ధనం విలాసాలకు ఖర్చుపెట్టడమున్నూ, ప్రజాసామాన్యం మీద వాళ్లు భరించలేనంతటి పన్నులు విధించి బాధపెట్టటమున్నూ కారణాలు తిండిలేక, గుడ్డలేక ప్రజలు మలమల మాడిపోతూఉంటే, రాజులు విలాసాలకూ, విందులకూ వెచ్చిస్తుండేవారు అందులోనూ చక్రవర్తి భార్య మారీ ఆంటియోనెట్, అపురూపసుందరి ప్రజలను పీడించి తెచ్చినధనాన్ని ఆమె ఆభరణాలకీ, విలువలేని దుస్తులకీ, పానీయాలకీ, డాన్సులకీ, జూదాలకీ, విలాసాలకీ వృధాగా ఖర్చుపెట్టేదని తెలుసుకదా! ఆమె భోగలాలసతయే ఫ్రెంచి రాజుల పతనానికి కారణం అయింది. పాపం తన భర్తనూ, తన బిడ్డల్నీ ప్రజలు

తన కళ్ల యెదటనే చంపారు చివరికి తానుకూడా ప్రజల క్రోధాగ్నికి ఆహుతి యిపోయింది ప్రజల హయాంలోనే మళ్లీ మహావీరుడైన నెపోలియన్ ఉద్భవించాడు వారినదేశ గౌరవాన్ని చక్కగా తీర్చడానికి ఎన్నయినా యుద్ధాలు చేశాడు ఇటలీ, ఈజిప్టు, ఆస్ట్రియా మొదలైన దేశాల్ని జయించాడు ఫ్రెంచి ప్రజలు నెపోలియన్‌ను సార్వభౌముణ్ణిగా చేశారు అయితే నెపోలియన్ దుస్సాహసాలవల్ల దేశం నష్టపోయింది చాలా సైన్యం నాశనం అయిపోయింది జననష్టం అపారంగా జరిగింది అయినప్పటికీ ఎప్పటికప్పుడే దేశం కోలుకుంటూ వచ్చింది. పరిశ్రమలు వృద్ధి చేసుకుంది ఇనుమూ, ఉక్కు ఫేక్టరీల్ను పెంచుకుంది దేశం మళ్లీ సుభిక్షంగా ఉండేలాగు చేసుకుంటూనే ఉంది 1914-18 నాటి పెద్దయుద్ధంలోనూ చిక్కుకుంది ఎంతో నష్టపోయింది అయినా విజయం సాధించింది మిత్రరాజ్యాలతో కలిసి ఫ్రాన్సునడిగడ్డమీదనే అంటే వర్సేల్సులో, జర్మనీతో సంధి కుదుర్చుకుంది. సంధివల్ల యుద్ధంలో అన్యాక్రాంతం అయిన ప్రదేశాలేగాక నష్టపరిహారంగా చాలా ధనాన్నీ, ఆల్సేస్-లోరెయిన్ ప్రదేశాలనీ సంపాదించింది ప్రస్తుతం ఇక్కడి ప్రజల్లో శాంతీ తృప్తీ, సమృద్ధీ, ఆనందం కనపడుతున్నాయి.

అమెరికా స్వాతంత్ర్య యుద్ధం తరువాత అక్కడినుంచి వచ్చిన దేశీయులే ఫ్రెంచి వారికి స్వాతంత్ర్య కాంక్షను పెంపొందించారని ప్రతీతి పారిస్ ఇంత అందంగా తయారుకావడానికీ, ఫ్రాన్సు దేశంలో రహదార్లూ మొదలైనవి బాగు పడడానికీ నెపోలియన్ కారణం అంటారు దానిని మించి ఫ్రెంచి వారి సౌందర్యపిపాస కూడా పారిస్ సౌందర్యానికి కారణం అయివుంటుంది చక్కని భవనాలూ, విశాలమైన వీధులూ, పూలతోటలూ, వృక్షవీధులూ చక్కని దుస్తులు ధరించిన ప్రజలూ, ఆనందం తొణికిసలాడుతున్న ముఖాలూ బలేగా ఉందిలే నగరం.

రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం అన్నారే అది ఫ్రెంచి వారికి కూడా వర్తిస్తుంది వీళ్లకీ ప్రపంచమంతా అలుముకు పోదామనే కాంక్ష ఉండేది. ముఖ్యంగా తూర్పు దేశాలలో విస్తరించారు. ఎందుకూ?-ఇంగ్లీషు వారికంటే ముందుగానే వచ్చారు కదా ఫ్రెంచివారు ఇండియాకి! ఆగ్నేయాసియా అంతా ఆక్రమించుకున్నారు, ఆఫ్రికాలో ఎన్నో రాజ్యాలు సంపాదించారు. ఉత్తర, దక్షిణ

అమెరికాలకి వలసపోయారు ఇంత ఎందుకూ మనకి ముప్ఫయి మైళ్లదూరంలో ఉన్న యానాం ఫ్రెంచి వాళ్లదే కదా! సిల్కు బట్టలూ అవీ చౌకగా తెప్పించేవాళ్ళం అక్కణ్ణుంచి

ఫ్రాన్సు కూడా పారిశ్రామికంగా ఎంతో గొప్పది ఇనుము, ఉక్కు ఫ్యాక్టరీలూ, వాటితో చేసే మెషినరీ సామాను ఫ్యాక్టరీలూ, బట్టల మిల్లులూ విరివిగా ఉన్నాయి ఇనుమూ బొగ్గు గనులూ కూడా ఎక్కువగా ఉన్నాయి దేశంలో వ్యవసాయం కూడా ఎక్కువే ఆహారధాన్యాలు సమృద్ధిగా పండుతాయి, వైన్సు ఇక్కడా చాలా ఎక్కువ ఫ్రెంచి వైన్సు చాలా ప్రసిద్ధి, సిల్కు ఉత్పత్తి విరివిగా చేస్తారు. అన్నిటినీ మించి ఫ్రాన్సులో తయారయే పెర్ఫ్యూమ్సుకి ఎక్కడాలేని ఘనతఉంది శతాబ్దాల నుంచీ వీళ్లు యుద్ధాలలో చిక్కుకుంటు న్నారు ఎన్నో నష్టాలకి పాలవుతున్నారు మళ్లీ కోలుకుంటున్నారు

మేము 22వ తేదీని బయలుదేరి 23వ తేదీ ఉదయం పదిన్నర గంటలకి పారిస్ నగరం చేరుకున్నాం మామూలుగా ఊరంతా ఒకసారి ప్రదక్షిణం చేశాం, ప్లేస్ డి లా కాంకోర్ అనే నాలుగు బాటల కూడలి గుండా షాజ్ ఎలీజ్ అనే రోడ్డులో ప్రవేశించి ఆ వీధిలోనే ఉన్న హొటేల్ క్లారిడ్జిలో బస చేశాం ఈ హొటేల్ చాలా గొప్పది ఇండియా నుంచి వచ్చే మహారాజులు ఇక్కడే బసచేస్తుంటారు

పారిస్ నగరం నిజంగా అందమైనదే, అందులో ఇప్పుడు మేము ఉంటున్న షాజ్ ఎలీజ్ అనే ఈ రాజవీధి ఎంతో అందంగా ఉంటుంది రాజ వీధి అని ఎందుకంటున్నానంటే, ఈ షాజ్ ఎలీజ్‌లానే గవర్నమెంటు భవనాలూ, ప్రెసిడెంటు నివాస గృహం ఉన్నాయి ఈ వీధిలోనే హైక్లాస్ హొటేల్సూ, షాపులూ ఉన్నాయి షోరూములలో అమ్మకం వస్తువులు రకరకాలుగా ప్రదర్శి స్తారు విశాలమైన రోడ్డు రెండు వైపులా ఒకే ఎత్తున ఉన్న వృక్షాల అవె న్యూలు అవి వసంతకాలంలో తెగపూచి సువాసనలు వెదజల్లుతూ ఉంటాయట రోడ్‌కి ఇరువైపులా ఈ చివరనుంచి ఆ చివర వరకూ పూలమొక్కలు విరగ పూచి ఉంటాయి. చెత్తా, చెదారం, కాగితం ముక్కలూ సిగరెట్లు, పీకెలూ రోడ్ల మీద కనపడవు ఈ వీధికి చివర నాలుగు వీధుల కూడలి ఉంది దాన్ని ప్లేస్-డి-లా-కాంకోర్ అంటారు. ఈ సర్కిల్ చుట్టూ అందమైన శిలావిగ్రహాలు

ఉన్నాయి మధ్యగా ఈజిప్టుదేశపు పిరమిడ్‌లాంటి స్తంభం ఉంది. ఈ నాలుగు వీధుల మొగ కూడా చూడతగినదే రెండో కొనని ఆర్క్ డి ట్రయంఫ్ అనే పెద్ద ఆర్చి ఉంది. ఈ ఆర్చిగుండా వచ్చేపోయే కార్లకి లెక్క ఉండదు ఈ ఆర్చి వద్దనే అజ్ఞాత యోధునిస్మారక చిహ్నం ఉంది ప్రతి రోజూ ఎవరో పూలచక్రాలు సింగారిస్తారు ఆ శిలాఫలకం మీద

మేము ఉన్న ఈ క్లారిడ్జెస్ హోటేల్ చాలా ధనవంతులకే గాని సాధ్యం కాదన్నాను కదా! పారిస్‌లో జీవితం ఎలా ఉంటుందో తెలుసుకోడానికి వేరే ఎక్కడికీ వెళ్లనక్కరలేదు మా హోటేల్‌లోనే చూడవచ్చు ఉదయం 8 గంటల నుంచి వస్తూంటారు డైనింగ్ రూములోకి బ్రెక్‌ఫాస్టు కోసం తరవాత మధ్యాహ్నం 1 గంటవరకూ ఏదో వినోదంగానే కాలక్షేపం చేస్తారు స్త్రీ పురుషులు మధ్యాహ్నం లంచ్ అయిన తరువాత ఏ కొద్దిసేపో కనపడరు కాని, నాలుగు గంటల నుంచి తండోపతండాలుగా వస్తారు టీ కోసం అక్కడే ఆటలూ పాటలూ డాన్సులూ మొదలు పెడతారు సాయంకాలం 7 గంటల వరకూ మంచి రద్దీగా ఉంటుంది వచ్చేపోయే షోకిల్లాలతో రాత్రి 8 గంటల నుంచి డిన్నర్‌కి తమాషా దుస్తులు ధరించి వస్తారు స్త్రీ జనం మగవాళ్లకి ఎప్పుడూ ఒకేరకం డిన్నర్ సూటు దానిలో మార్పేమీ ఉండదు వడ్డించే బట్లరులు కూడా తోకకోట్లు తొడుగు కుంటారు ఒక్కొక్కప్పుడు ఫేషనబుల్ జెంటిల్ మన్‌కీ బట్లరుకీ బట్టల్లోతేడా కనపడదు ఎటొచ్చీ బట్లరు చేతిమీద ఒక తువాలు లాంటిది ఉంటుంది అదే తేడా భోజనానంతరం రాత్రి తెల్లవార్లూ డాన్సు చేస్తారు కొందరు బయటికి పోతూంటారు కొత్తజోడీలు వస్తుంటాయి

పారిస్ పగలంతా నిద్రపోతుంది రాత్రిళ్ళు జాగరణ రాత్రిళ్లే ప్రజల రాకపోకలు రాత్రిళ్లే కార్ల సందడి ఎక్కువ పేవ్‌మెంట్సు రాత్రిళ్లే క్రిక్కిరిసి ఉంటాయి. షాపింగ్ కూడా రాత్రిళ్లే. వీళ్లు నిశాచరులైనా రాక్షసులు కారు దేవతలూ, అప్సరసలులాగే కనపడతారు వీళ్ల దుస్తులూ అలంకారాలూ వేషాలూ చూస్తూంటే నిజంగా వీళ్లకి మతులు పోయాయా లేక మనమే ఏమీ తెలియని అజ్ఞానంలో ఉన్నామా అనిపిస్తుంది

పారిస్‌లో నిముష నిముషానికీ ఫేషనులు మారుతుంటాయని ప్రతీతి, కథలు కూడా ఎన్నో వింటూఉంటాం. ఇంటికి పోతున్న ఒకాయనని మిత్రుడు

ఒకడు ఆపుచేసి మాట్లాడుతుంటే తాను వెంటనే వెళ్లిపోవాలనీ తన భార్యకి వెంట
నే గౌను అందించాలనీ, ఆలస్యంచేస్తే ఫేషను మారిపోతుంది గనుక మళ్లీ
కుట్టించవలసి వస్తుందనీ అన్నాడని కథలు చెపుతారు నిజమే, ఒట్టిలు ప్టే
టైలరింగ్ షాపులూ డిజైనర్ల కంపెనీలూ ఇక్కడ ఎన్నో ఉన్నాయి జోళ్ల
డిజైనులు మారుతూంటాయి అండర్‌వేర్స్ పీటి డిజైనులు మారుతూంటాయి
గౌనులూ, బ్లౌజులూ, షర్టులూ డిజైనులు చెప్పకుండానే మారతాయి ఫే..
షన్లు మార్పుచేసే సిద్ధహస్తులు ఇక్కడి కోకొల్లలు డిజైనర్లలో ఆడ
వాళ్లే ఎక్కువ మంది శిరోజాల పోషణకీ, శిరోజాలంకారాలకీ ఎన్నో
ఎన్నో షాపులు శరీరపోషణకి, ఎన్ని మలాములూ, ఎన్ని పూతలు ! అయితే
మన ప్రబంధాలలో కూడా వర్ణన లున్నాయనుకో మన పూర్వకాలపు వనితలు
ఎలా కైసేసుకొనేవారో ! ఇక్కడిది పద్ధతిపేరు

ఒకటి జ్ఞాపకం వచ్చిందోయ్ ! మనవాళ్లు ఫ్రెంచ్‌కట్ అని మీసాలు
కత్తిరించుకుని షోకుచేస్తుంటారు మనదేశంలో ఇక్కడ చూస్తున్నా, ఆ విధంగా
ఎవరైనా మీసాలు కత్తిరించు కుంటున్నారేమోనని అచ్చే ! లేదు క్లీన్‌గా
తీసేసిన వాళ్లేగాని, సగం సగం కత్తిరించుకున్న వాళ్ళు కనబడడంలేదు మరి
ఆ పద్ధతి మీసం ఇక్కడ మారిపోయింది కాబోసు మనల్నిపట్టుకొని ఇంకా
వదలడంలేదు మనదేశంలో ఆడవాళ్ళ జాకెట్ల ఫేషన్లన్నీ ఎప్పుడో మారి
పోయిన పారిస్ వనితల పాతబడిన బ్లౌజుల అనుకరణమే ననుకుంటా

పారిస్‌లో రాత్రిళ్ళు వీధులన్నీ కలకలలాడుతూ ఉంటాయి కెఫేలు,
అంటే మనవైపు కాఫీ హోటేళ్ళ లాంటివి జనంతో తెల్లవార్లూ కిటకిటలాడుతూ
ఉంటాయి అనేకమైన నైటుక్లబ్బుల్లో తెల్లవార్లూ త్రాగుతూ డాన్సులుచేస్తూ
కాలక్షేపం చేస్తారు ఇక్కడ నైట్‌క్లబ్బుల్ని కేబరేలు అంటారు ఈ కేబెరేలు
అన్ని అంతస్తులవాళ్ళకీ సరిపడేవి ఉన్నాయి ప్రపంచంలో అన్ని దేశాల
సంస్కృతులవీ ఉన్నాయి పర్షియన్ కేబెరే ఉందనుకో, అక్కడ పర్షియాదేశంలో
ధనవంతులు ఏలాంటి పరుపులూ, దిండ్లూ మస్లందులూ వాడతారో ఇక్కడ
కూడా అలాగే ఏర్పాటు చేస్తారు పర్షియాదేశంలోని ఆహార పదార్థాలలాంటివే
ఇస్తారు. నౌకర్లూ, బట్లర్లూ, అలాంటి దుస్తులే వేసుకుంటారు, ఆహ్వానాలూ,
మర్యాదలూ పర్షియాదేశంలోలాగే జరుపుతారు , నృత్యాలూ, డాన్సులూకూడా

అంతే అలాగే. ఇటాలియన్ కెబెరేలు, ఈజిప్షియన్ కేబెరేలూ, ఇంగ్లీషు, చైనా, జపాను మొదలైనదేశాలపేర్లను ఎన్నో ఎన్నో కెబెరేలు

ఈ కెబెరేలలో జరిగేది ఏమిటని? మంచి వయసులోఉన్న ఆడపిల్లల్ని జాగ్రత్తపెడతారు అతిధులు ఆడవాళ్లూ మొగాళ్లూకూడా వాళ్ళతోకలిసి త్రాగుతారు, తింటారు, డాన్సులుచేస్తారు నిన్ననే మజీక్ అనే పర్షియన్ రెస్టారాంటుకి వెళ్లాను రికి-కాల రల్నికంబళ్ళమీద జంబాడు. దిపులమీద మెరిసిపోయే దిండ్లూ, బాలీసుఃమీద కూర్చుని టీ తాగివచ్చా, అక్కడ ఉన్నంతసేపూ ప్రతివాడూ ఒక పాదుషాలా ఉంటాడు

కేఫేలన్నీ పేవ్‌మెంట్లమీదనే ఉంటాయి, టెబిల్సువద్ద కుర్చీలలో కూర్చుని స్త్రీ పురుషులు ఆనందంగా టీ సేవిస్తారు నువ్వు ఒంటరిగావెళ్లి కుర్చీలో కూర్చునేసరికి ఒక చక్కని అమ్మాయి నీప్రక్కనేవచ్చి కూర్చుని చక్కగా టోయలెట్ చేసుకుంటుంది నువ్వే పలకరించి టీ ఇప్పిస్తే సరేసరి నీతో సరసాలాడుతూ కబుర్లు చెబుతుంది సిగరెట్ ముట్టించి నువ్వు పలకక పోతే తానేపలకరించి స్నేహం కలుపుకుంటుంది నీతో షికారుకు వస్తుంది నీతో ఏపనికైనా సిద్ధపడుతుంది ఇదంతా డబ్బు కోసం ఇలాంటి యువతులు పారిస్ నగరంలో లెక్కలేనంత మంది ఉన్నారు వీళ్ళని ప్రభుత్వం ఏ చిక్కులూ పెట్టకుండా బాగాచూస్తుంది హెల్త్‌డిపార్టుమెంటు వారు ఎప్పటి కప్పుడు పరీక్ష చేసి ఆరోగ్యవంతురాలనీ, వ్యాధులులేవనీ సర్టిఫికెట్లు జారీచేస్తారు ఆ సర్టిఫికేట్లు చేతి సంచులలో ఉంచుకుని దారి వెంటపోయే వాళ్ళని ఎదుర్కొని చూపిస్తారు మనదేశంలో వ్యభిచారం ఉన్నప్పటికీ ఎవరి ఇంట్లో వాళ్ళు పడిఉంటారే కాని ఇలా వీథిబడి, మనుష్యుల్ని పిలిచీ, ఎదుర్కొనీ బలవంతంచేసే సిగ్గుమాలిన స్త్రీలను ఎక్కడా చూడం

పారిస్‌లో వ్యభిచారానికి ఉన్న సదుపాయాలు ఇంకెక్కడా లేవనుకుంటాను. ప్రభుత్వమే లైసెన్సులు ఇస్తుంది సర్టిఫికెట్లు జారీచేస్తుంది, శరీరం శుభ్రంగానూ, ఆరోగ్యంగానూ ఉంచుకోడానికి క్లినిక్‌లు ఏర్పాటు చేసింది ఇవి కాక రబ్బరు తొడుగులులాంటి సాధనాలెన్నో దేశంలో తయారవుతున్నాయి వీధుల్లో విచ్చలవిడిగా తిరిగే యువతులుగాక వేలకొలది వ్యభిచారగృహాలు ఉన్నాయి వాటి గుమ్మంముందు ఎర్రదీపం వెలిగించి ఉంటుంది, అది వేశ్యా

గృహం అని తెలియచెయ్యడానికి ఎర్రదీపం సంకేతం అన్నమాట ఇదిగాక బహిరంగంగా సంచరించే పార్కులూ వాటిలో వ్యక్తపిచ్చిలా బౌలివార్డులూ రాత్రివేళ క్రిక్కిరిసి ఉంటాయి [illegible] ఠాకట్లల్లో చలవరాతి బెంచీలమీద యువతీమణులు కూర్చుని ఒందుకోసమె వచ్చిన మగవాళ్ళనందాలు తీరుస్తూంటారు ఎంత అసహ్యమైనవనో, వాళ్ళ పిచ్చి ఎంత జుగుప్సాకరమో ఆలోచించు. వెలవెలదులు మనదేశంలోనూ ఉన్నారు కాని ఇంత ఆగడం ఎక్కడా లేదు

సంగీతం అంటే అందరికీ ఇష్టమే ఇక్కడ మరీ ఎక్కువ రోడ్ పేవ్మెంటుమీద ఒక అబ్బాయో అమ్మాయో ఏదో ఇన్స్ట్రుమెంటు వాయిస్తూ అద్భుతంగా పాడుతుంటే జనంమూగుతారు ఏదో రాళారోళి పాటకాదు చాలా బాగానే పాడతారు ఆగిన జనం ముగ్ధులైపోతారు, భేష్ భేష్ అని అభినందిస్తారు జేబులోనుంచి కొన్ని పైసలు తీసి వాళ్ళకి ఇచ్చిపోతారు

పారిస్లో ఇలాంటివి తప్ప ఇంక చూడవలసినవి లేవాఅని అడుగుతావను కుంటా, లేకేమి? మేమువచ్చి ఒకవారంరోజులేగా అయింది నెలరోజులు ఉంటాం ఇక్కడ ఇంకా ఏమీ చూడలేదు నెమ్మదిగా చూస్తాం ఊళ్లో ఎక్కడ నిలబడిచూచినా దూరంగాకనబడేది ఐఫెల్టవర్ ఏదో ఒకరోజున ఆ టవర్ శిఖరం ఎక్కకుండా ఉంటానా?

మళ్లీ వారం వ్రాస్తా

పి

వేంకటరావు.





Hotel Claridge
Paris
6th November 1930

పెమ్మరాజా !

మొన్నను ఒకరోజు రాత్రి డిన్నర్ అయిన తరవాత ఏమీ తోచకపోతే క్రిందికి వెళ్లి పేవ్‌మెంటు మీదనైనా నిలబడితే కాలక్షేపం అవుతుందని వచ్చా. మా వీధి వెంటవెళ్ళేవాళ్లు చాలా ఫేషనబుల్ ప్రజలని 'చెప్పానుకదా' ఇటొక ఫర్లాంగూ అటొక ఫర్లాంగూ పచారీ చేస్తూంటే కాఫీ తాగాలని అనిపించింది 'లిడో' అని ఒకచోట వ్రాసిఉంది అక్కడ కాఫీ దొరుకుతుందేమోనని లోపలికి వెళ్లాను తీరా చూస్తే లోపల అదొక స్విమ్మింగ్ పూల్ పూల్ చుట్టూ చిన్న చిన్న టేబిల్సూ కుర్చీలూ ఉన్నాయి కొందరు స్త్రీపురుషులు అక్కడ కూర్చుని టీలూ కాఫీలూ సేవిస్తున్నారు కొందరు మామూలు లోంజి సూట్లు వేసుకునే ఉన్నారు కొందరు మాత్రం బేదింగ్ లాగులు తొడుక్కుని ఉన్నారు కొందరు అమ్మాయిలూ అబ్బాయిలూ పూల్‌లో స్నానాలు చేస్తూ నీట్లో మునుగుతూ తేలుతూ, మొగ్గలేస్తూ ఆడుకుంటున్నారు ఆడవాళ్లు బేదింగ్ డ్రెస్ వేసుకున్నారు గాని అది ఎలా ఉందంటే ఏదో ఆచ్ఛాదన ఉందన్న పేరుకుమాత్రమే, అక్కడ ఉద్యోగి ఒక అమ్మాయివచ్చి అడిగింది స్నానం చేస్తావా అని, కాఫీ ఇమ్మన్నాను పక్క కుర్చీలో కూచుని వాళ్ల ఈదులాటలు చూస్తూ కాఫీ తాగుతూ ఉంటే కొందరు ఆ నీళ్లల్లోంచి పైకివచ్చి ఒళ్ళుకూడా తుడుచుకోకుండా డాన్సు చెయ్యడం మొదలుపెట్టారు మళ్లీ నీట్లోకి దూకడం, పైకిరావడం, గంతులేయడం, ఇదీ వరస ఇదొక ఆనందం వాళ్లకి ఇలాంటి లిడోలు నగరంలో అనేకమైనవి ఉన్నాయట

అయితే నిన్న లూవ్ మ్యూజియం చూశానోయ్ ! ఇందులోని శిల్పాలూ, చిత్రాలూ, ఇతరవస్తువులూ చాలా అపురూపంగా ఉన్నాయి ఇప్పటికి ఎన్నో మ్యూజియమ్‌లూ, ఎన్నో ఆర్టు గేలరీలూ చూశానుగాని, ఈ లూవ్ మ్యూజియమ్‌కి ఒక ప్రత్యేకత ఉన్నట్టు కనపడుతూంది. ఎందుచేతనంటే, ఇక్కడ ప్రదర్శించిన కొన్ని వస్తువులు మరెక్కడా కనపడలేదు ఎంతో అపురూప

మైనవిన్నీ, అమూల్యమైనవిన్నీ అసలు ఇదొక ప్రఖ్యాతమైన రాజభవనం ఫ్రాన్సు చక్రవర్తులు నివసించే వారట అతిసుందరంగా కట్టిన ఈ అందమైన మార్పులు చేస్తూవచ్చారట నెపోలియన్ చక్రవర్తిగా ఉన్నకాలంలో ఈ పేలస్‌ని మ్యూజియమ్‌గా మార్చారట ఇక్కడి స్తంభాలూ, గోడలూ, గదులూ అయిదారువందల సంవత్సరాల క్రితం కట్టినా ఎంతో అందంగా విశాలంగా ఎత్తుగా ఉంటూ అప్పుడే కట్టారా అన్నంత క్రొత్తగా ఉన్నాయి నెపోలియన్ అనేక దేశాలు జయించాడు కదా! ఆయా దేశాల్లో తనకు అపు రూపమైనవిగా కనపడ్డ కళా ఖండాలన్నిటినీ తీసుకువచ్చి ఈ లూవ్‌లో పెట్టేవాడట అంటే తన దండయాత్రలలో కొల్లగొట్టిన వస్తువులనన్నిటినీ ఇక్కడ భద్రపరిచే వాడన్నమాట ఈ ఆచారం నెపోలియన్ తరవాతకూడా సాగుతూనే వచ్చిందట కాని దేశంలో విప్లవం వచ్చినప్పుడు ప్రజలే చాలావాటిని ధ్వంసం చేశారట ఆ ఉద్రేకంలో తెలియదు చూడూ రాజులమీద ఉండే పగవల్ల వాళ్ల భవనాలూ, వాళ్ల అపురూపమైన సామగ్రీ నాశనం చేసేదాకా కసితీరలేదన్నమాట ఇక్కడ అతి ప్రసిద్ధమైన శిల్ప కళా ఖండాల ప్రతులు అక్కడక్కడ దేశాల్లోని మ్యూజియములలో కనపడుతూనే ఉన్నాయి అసలువి మాత్రం ఇక్కడ ఉన్నాయి ప్రపంచ ఖ్యాతించిన "మోనా లిజా" చిత్రం ఇక్కడనే ఉంది లియానార్డో డా విన్సీ ఈ చిత్రాన్ని చిత్రించాడు. ఆయన చిత్రించినదే 'ది లాస్ట్ సప్పర్' అనేది లియనార్డో డా విన్సీ ఫ్లారెన్సులో ఉండేవాడు చిత్ర కారుడేగాక, కవీ గాయకుడూ, శిల్పీ, విజ్ఞానవేత్తా కూడాను ఇతని చిత్రాలు ఎన్నో ఉన్నాయి ఇక్కడ "లాంగియో కోన్డా" అనే చిత్రం అతను ఎంత ప్రతిభాశాలో తెలియ జేస్తూఉంది. మైకెలేంజిలో చిత్రాలుకూడా ఎన్నో ఉన్నాయి అతడు తయారు చేసిన శిలా విగ్రహాలూ, చిత్రాలూ ప్రపంచంలో ఎంతో పేరుకెక్కాయి. డేవిడ్ శిలా విగ్రహం ఇక్కడకూడా ఉంది.

వీనస్ గ్రీకుల ప్రణయదేవత. ఎందరెందరో చిత్రకారులు ఆమెను రక రకాలుగా చిత్రించారు. సముద్రం నురగలలోంచి వీనస్ పుట్టిందని ప్రతీతి లియనార్డో చిత్రించిన వీనస్ చిత్రం ఎంతోబాగా ఉంది. వీనస్ కంచు విగ్రహం ఎంత చక్కగా ఉందని! వీనస్ విగ్రహాలకి పారిస్ ప్రజలు ముగ్ధులై పోతూ ఉంటారు. అసమానమైన చిత్రాలూ, శిల్పాలూ ఇతర వస్తువులూ ఉన్నాయి కనకనే లూవ్ మ్యూజియమ్‌కి అఖండ ఖ్యాతి వచ్చింది.

పారిస్ నగరంలో అక్కడక్కడ చూస్తున్నా ముఖ్యమైన సెంటర్లు ప్లేస్...డి లా...కాంకోరేగాక ఇంకా అందమైన వీధులు చాలా ఉన్నాయి అందులో 'క్వే డి ఆర్సే' అనే ఎంబాంక్‌మెంటు ఒకటి ఈ రోడ్‌లోనే ఫ్రాన్స్ దేశపు విదేశ వ్యవహారాల ఆఫీసు ఉంది షాజ్ ఎలీజ్‌లో ఉన్న ఎలీజ్ పేలస్ ఒకటి చాలా అందంగా ఉంటుంది వెన్‌డోమ్ అనే ప్రదేశం ఒకటి చక్కగా ఉంటుంది ఇక్కడే చాలా ఎత్తయిన ఉక్కు స్తంభం ఉంది నెపోలియన్ విగ్రహం ఈ స్తంభంమీద అమర్చారు నెపోలియన్ మాన్యుమెంట్ అంటారు దీన్ని ఫ్రాన్స్‌దేశానికి రాజ్యాలు సంపాదించి గొప్ప పేరు ప్రతిష్టలు తెచ్చిన మహావీరునికి స్మారకచిహ్నం సముచితమే నగరం మధ్యలో ఉండడం మరీ బాగాఉంది. రోజూ చూస్తూనే ఉన్నాను

బొలివార్డులూ, కొలనేడ్‌లూ, క్వేలూ, కాంకోర్‌లూ వీటన్నింటినీ చక్కగా ఉంచుతారు రోజూ ఇవి ఎక్కడో ఒకచోట తగులుతూ ఉంటాయి ఇదిగాక ఒక చక్కని పార్కు ఉంది ఇక్కడ కింగ్స్‌గార్డెన్ అంటారు దాన్ని అప్పుడే రెండు మూడుసార్లు వెళ్లాను సీన్ నది పారిస్ నగరంగుండా ప్రవహిస్తూ ఉందికదా నది ఒడ్డున ఉన్న రోడ్‌పక్కని పాతపుస్తకాల షాపులు లెక్కలేనన్ని ఉన్నాయి ఇన్ని పాతపుస్తకాల షాపులు నేనెక్కడా చూడలేదు అనేక భాషలలోనివి కనపడతాయి ముఖ్యంగా ఫేషన్ మేగజైనులు గుట్టలు గుట్టలుగా పడేస్తారు సెక్సు గురించిన కథల పుస్తకాలూ, విగత వస్త్రాలతో ఉన్నవాళ్ల ఫోటోలూ, బొమ్మలూ, మేగజైనులూ, వీటికి లెక్కాపత్రంలేదు

సీన్‌నది నగరంగుండా ప్రవహిస్తూంది అన్నాను కదా దానిమీద చాలా బ్రిడ్జీలు ఉన్నాయి నది మధ్యలో ఒకద్వీపం ఉంది ఆ ద్వీపంమీదే కట్టారు నోటర్‌డామ్ కెతీడ్రల్ ఈ కెతీడ్రల్ ప్రపంచంలో చాలా పేరుపడ్డది, చాలా అందంగా ఉంది కెతీడ్రల్‌లోనికి వెళ్లడానికి నదిమీద ఒకబ్రిడ్జీఉంది అదిదాటి వెళ్లాలి ఈ కెతీడ్రల్‌ని పన్నెండో శతాబ్దంలో కట్టారట యూరప్ ఖండంలో గోతిక్ ఆర్ట్ ననుసరించి కట్టిన చర్చిలలో చాలా అందమైనదిగా పరిగణిస్తారు దీన్ని మనం చదువుకున్నాం—విక్టర్ హ్యూగో వ్రాసిన హంచ్‌బేక్ ఆఫ్ నోటర్ డామ్ అనే నవల గూనివాడు ఈ చర్చి స్తంభాలమీదా, సీలింగులమీదా ప్రచ్ఛన్నంగా నివసించేవాడనీ జిప్సీ అమ్మాయిని ఎత్తుకువచ్చి ఈ చర్చిలోనే దాచాడనీ, అందుకే అతన్ని శిక్షించారనీ, చివరికి ఆ అమ్మాయిగోరీలోనే అతని

శిల్పాలు కూడా దొరికాయనీ చదువుకున్నాం. హంచ్‌బేక్ ఆఫ్ నోటర్‌డామ్ సినిమా కూడా చూశాం. మొన్నను నోటర్‌డామ్ వెళ్లాను. చర్చికి ముందు ఖాళీస్థలంలో మొక్కలూ పువ్వులూ ఎంతో అందంగా ఉన్నాయి. ఇంత బ్రహ్మాండంగానూ, సుందరంగానూ నిర్మించిన ఈ దేవాలయం పెయింటింగ్సునీ చూస్తూంటే, ఆ రోజుల్లో ప్రజలకీ, మతాధికారులకీ, రాజులకీ మతంమీద ఎంత విశ్వాసం, ఎంత దీక్ష ఉండేవో వ్యక్తం అవుతుంది. లోపలి స్తంభాలు, [illegible]. బ్రహ్మాండమైన నిర్మాణం నన్ను ముగ్ధుణ్ణిచేశాయి.

పశ్చిమ దేశాల్లో ట్వీడ్ గుడ్డ ఎక్కువగా వాడతారు ఆడవాళ్లూ మగవాళ్లూ కూడా. ఆడవాళ్లయితే డిన్నర్ గౌనులూ ఈవెనింగ్ గౌనులూ సిల్కు, టపేటా, క్రేప్ సిల్కులతో తయారైనవి వేసుకుంటారు. మామూలుగా ట్వీడ్‌స్కర్టు మీద సిల్కు బ్లౌజు వేసుకుని దానిపైన ట్వీడ్‌కోటు, వేసుకుంటూ ఉంటారు. పారిస్‌లో ఎక్కువగా సిల్కు బట్ట వాడుతున్నట్టు కనబడుతూంది—శీతకాలంలో కూడా, అందులోనూ తెల్లటి మెరిసే సిల్కుమీద ఇక్కడివాళ్లకి మక్కువలాగు కనపడుతూంది. ఇంకొకటి, ఇక్కడ కుట్టుపనివాళ్లకి ఉన్న ఘనత మరెవ్వరికీలేదు. ఫేషన్ అంటే ఏమిటి? మంచిరకం గుడ్డ, శరీరానికి తగినట్టు కట్ చెయ్యడం, చక్కగా అతుకులు కుట్టడం, తగినట్టు షేప్ తీసుకురావడం ఇవే ఫేషన్‌కి ముఖ్యమైనవికదా. సరియైన కుట్టుపనే ఫేషన్‌ని తీసుకువస్తుంది. ఈ విద్యలో ప్రముఖులైనవాళ్లు వేలాది ఉన్నారు ఇక్కడ. నాణ్యమైనగుడ్డతో నిపుణుడైన టైలర్ తయారుచేస్తే అదే ఫేషన్. ఎప్పుడూ ఒకేరకంగా కాక చిన్నచిన్న మార్పులు కత్తిరింపులలోనూ, రంగులు మార్చడంలోనూ, రెండేసి మూడేసి రంగులు మేచ్‌చేసి కలిపికుట్టడంలోనూ ఫేషన్ మారుతూఉంటుంది. ఈ ఫేషన్‌లు దుస్తులలోనేగాక, ఆభరణాలలోనూ మారుతూ ఉంటాయి. ముఖ్యంగా తలమీద ధరించే టోపీలు రకరకాల ఫేషన్‌లవి కనపడుతూఉంటాయి. కొన్ని వెర్రిగాఉంటాయనుకో, ఇంక ఇక్కడ ఆడవాళ్లు చాలా ప్రాధాన్యం ఇచ్చేది తల వెంట్రుకల పోషణకీ, కత్తిరింపుకీ, అలంకారాలకిన్నీ. ఏరంగు శరీరానికి ఏరంగు వెంట్రుకలు అందమో ఆ రంగువేసి మెరుగుపెడతారు. ఏముఖానికి ఏ స్టయిలు బాగాఉంటుందో నిపుణులైన హేర్‌డ్రెస్సర్లు చెపుతారు. ఉంగరాల జుట్లూ, వంకరలుతిరిగి బుజాలమీదికి జారేజుట్లూ, క్రాపింగ్‌జుట్లూ, ఇవన్నీ

ముఖం, తలా షేప్‌నుబట్టి రకరకాలుగా క్రాప్ చేయించుకుంటారు ఈ పని చెయ్యడంలో సిద్ధహస్తులున్నారిక్కడ హేర్ డ్రెసింగ్‌కే కాక తలవెంట్రుకల పోషణకి కూడా ఎన్నో షాపులూ కంపెనీలూ ఉన్నాయి

వేలిగోళ్ళు కత్తిరించి రంగులు పులిమే మేనిక్యూర్ షాపులసంగతి చెప్ప నక్కరనేలేదు వేలాది షాపులు కనపడుతున్నాయి గోళ్ళమీద మరకలూ, మకిలీపోగొట్టి తెలుపుచేయడం, రకరకాలైన షేపులు వచ్చేలాగు, వేళ్ళకి అను వుగా ఉండేటట్లు గోళ్ళు కత్తిరించడం సన్న ఆకురాయిలాంటిదానితో హెచ్చు తగ్గులు లేకుండా అరగదీయడం, వార్నీషులూ, రంగులూ పులమడం ఇదీ మేనిక్యూరిస్టులు చేసేపని ఇదికూడా ఒకగొప్ప విద్య చేతివేళ్ళగోళ్ళకేగాక కాలి వేళ్ళగోళ్ళకుకూడా ఈ అలంకారాలు చేస్తారు.

శరీరం మృదువుగానూ. అందంగానూ ఉండడానికి ఇక్కడివాళ్ళు పడే పాట్లు ఇన్నీఅన్నీకాదు శరీర వ్యాయామం ఒకటీ, ఆహార నియమం రెండోది ఇంక పైపూతలకీ మెరుగులకీ ఉపయోగించే పదార్థాలకి లెక్కలేదు చమురులూ, క్రీములూ, సబ్బులూ, పౌడర్లూ, ఒకరకమా ఎన్నోరకాలు కళ్ళకి కాటుక మనవాళ్ళకిలాగ ముఖం అంతా పాకేటట్టు వేలుతో కాటుక పులమడంకాదు కను బొమ్మలమీది వెంట్రుకలకి తగినట్టు దిద్దడానికి రంగు పెన్సిల్సులాంటివి ఉంటాయి కనురెప్పలకి ఉండే వెంట్రుకలు కుచ్చులుకుచ్చులుగానూ పొడవు గానూ కనపడేలాగు చేయడానికి మస్కారా అనే కాటుక వ్రాస్తారు అడుగు రెప్పలమీదా, పైరెప్పలమీదాకూడా లేత నీలంరంగు వేస్తారు ఇదంతా కనుగుడ్డు తళుక్కుమని మెరిసేటట్టు కనపడడానికి చేసే హంగామా అన్నమాట ఈ తంటాలన్నీ శుభ్రతకోసమూ కొంత సౌందర్యంకోసమూ అయినప్పటికీ కొందరు ఫేషన్ అనుకుని వేసేవేషాలు వెర్రితలలువేసి కోతుల్లాగా తయారు అవుతారు సహజమైన అందానికీ తెచ్చిపెట్టుకున్న పూతమెరుగులకీ మరి తేడాలేదూ

బాస్టిల్ అనే పాతకోట ఒకటి చూశాను చక్రవర్తులకాలంలో ఈ కోటలో తిరుగుబాటు దారుల్నీ, రాజకీయ ఖైదీలనీ రాజద్రోహుల్నీ బంధించి చెరపెట్టే వారట ఇదికట్టి దాదాపు అయిదువందల సంవత్సరాలైందట నిరంకుశులైన ప్రభువుల క్రౌర్యాన్ని తెలియజేసే చిహ్నం అని ప్రజలు దీనిని చాలా అస

హ్యాంచుకునే వారట ఫ్రాన్స్‌దేశంలో విప్లవం చెలరేగి ప్రభువులమీదా రాజుల మీదా కసి తీర్చుకోడానికి ప్రజలు తిరుగుబాటుచేసినప్పుడు ప్రజలే ఆ బాస్టిల్ జైలుని బద్దలుగొట్టి, లోపలికి చొరుచుకునివెళ్లి ఖైదీల నందరినీ విడుదలచేసి కోటను పడగొట్టి నాశనం చేశారట. ఇప్పుడు పారిస్ దర్శించే యాత్రికులంతారూ ఎచ్చిచూస్తూంటారు పూర్వపు రాజుల క్రౌర్యాన్ని తెలియచేసే ఒక స్మృతి చిహ్నంగా ఉండిపోయింది ఇది

కవిత్వం అంటేనూ, లలితకళలంటేనూ ఎంతో ఇష్టంగాఉంటూ జీవితం విలాసంగా గడపాలనే ఫ్రెంచి ప్రజలు ఘోరమైన కార్యాలు చేశారే, అంత సున్నితమైన మనస్సులు కలవాళ్లుఎంతో దారుణమైన హింసాకాండలకు తల పెట్టారే, దీనికి కారణం ఆలోచిస్తే అప్పటి పరిస్థితులే వాళ్ళని అలా చేయించి ఉంటాయనుకుంటాను. పాపం' పదహారవ లూయీ చక్రవర్తినీ, ఆయన భార్య రాణీ మారీ అంటియోనెనీ చంపారే, పాపం అంతటి చక్రవర్తుల్ని బలిపీఠం ఎక్కించవలసిన అవసరం ఉందాఅని ' పోనీలే మనకెందుకు ఏమైనా ప్రజలు స్వాతంత్ర్యప్రియులు అమెరికాకు స్వాతంత్ర్యం వచ్చిందంటే సంతోషించారు మనదేశంలోనూ ఫ్రాన్స్‌పాలనక్రింద యానాం పాండుచేరీ మొదలైన పట్నాలు ఉన్నాయి మనమూ స్వాతంత్ర్యంకోసం బ్రిటీషువారితో పోట్లాడుతున్నాం ఫ్రెంచివారు మనదేశం విడిచిపెట్టి ప్రజలకి ఒప్పచెప్పి వెళ్లిపోతారా అనేదే మనం చూడవలసి ఉంది

పారిస్ నగరం విడిచిపెట్టి ఇరవైమైళ్ళ దూరంవరకూ కార్లలో వెళ్ళాం నగరం వెలుపలకూడా చాలా అందంగా ఉంది రోడ్లు చక్కగా ఉన్నాయి తోటలూ, పొలాలూ అందులో అక్కడక్కడ చిన్నచిన్న బంగాళాలూ చాలా సుందరంగా ఉన్నాయి ధనవంతులూ జమీందార్లలాంటి డ్యూక్‌లూ నగరం వెలుపలనే కాపురాలు ఉంటూంటారు కార్లు ఉంటాయోమో రోజూపట్నంలోకి వచ్చి పోతూంటారు మొన్ననొకరాత్రి పారిస్ నగరం వెలుపలగా ఉన్న వృక్ష వీధులన్నీ—ది గ్రేట్ ఆవెన్యూస్—కార్లలో తిరిగాం

ఇంగ్లండుల్లో కంట్రీసైడ్ చాలాచూశాం ఇక్కడ ఫ్రాన్సు దేశంలోనూ, ఎక్కువగా చూడకపోయినా, చూసినంతలో కంట్రీలో కాపురం చాలా సౌఖ్యం గానూ, అందంగానూ ఉండేటట్టు కనబడుతూంది. సంసారానికి కావలసిన

సరుకులన్నీ సమృద్ధిగానూ, చౌకగానూ దొరుకుతాయట ఇక్కడకూడా ద్రాక్ష తోటలు ఎక్కువే ద్రాక్షరసంతో షాంపేన్ అనే వైన్ ఇక్కడ తయారవు తుంది షాంపేన్ అనేపేరు దానికి ఎందుకువచ్చిందంటే ఫ్రాన్సులో షాంపేన్ అనేది ఒకజిల్లా, ఆ జిల్లాలో తయారవుతుంది కనక ఆ జిల్లాపేరు వచ్చింది. ఇది చాలా విలువైన వైన్‌గా పరిగణిస్తారు, జలజల మెరుస్తుంది

పారిస్ నగరానికి దాదాపు పన్నెండుమైళ్ల దూరంలో వార్సేల్సు నగరం ఉంది ఈ పేరు మనం ఎన్నోసార్లు విన్నాం ఎందుచేతంటే పెద్ద యుద్ధంలో జర్మనీవారికిన్నీ, మిత్రరాజ్యాలకిన్నీ సంధికుదిరి యుద్ధం విరమించడానికి ఇక్కడే సంతకాలు చేశారు వార్సేల్సు సంధి అని అంటారుకద్దా ఈ సంధిని అనుసరించి జర్మనీ ఫ్రాన్స్‌దేశానికి చాలా ఎక్కువ నష్టపరిహారం ఇచ్చు కోవలసివచ్చింది నగరం చాలా అందంగాఉంది పెద్దపెద్ద భవనాలు ఉన్నాయి ఒకప్పుడు ఫ్రాన్స్‌దేశపు చక్రవర్తులకి వార్సేల్సే రాజధానిగా ఉండేదట. బ్రహ్మాండమైన పేలస్ ఉంది ఇక్కడ రాయల్‌పేలస్ అంటారు దీన్ని

పారిస్ నగరంలో చరిత్రకు సంబంధించిన దృశ్యాలేకాదు, వైజ్ఞానిక ప్రభావం వ్యక్తపరిచే నిర్మాణాలుకూడా ఉన్నాయి అందులో ఐఫెల్ టవర్ ఒకటి దీన్ని అలెగ్జాండర్ ఐఫెల్ అనే ఫ్రెంచి ఇంజనీరు కట్టాడు, ఆయన బ్రిడ్జీలనిర్మాణంలో ఘనుడట ఈ టవర్ రాతితోనూ, సున్నంతోనూ కట్టింది కాదు ఇనపగర్డర్లతో కట్టాడు. ఆయనకి ఉన్న ఇంజనీరింగ్ కౌశలం అంతా అందులో కనపడుతుంది బ్రహ్మాండమైన కట్టడం. మేఘమండలం దాటి ఆకాశంలోకి పొడుచుకు పోయింది 985 అడుగుల ఎత్తుఉంది ఏడువేలటన్నుల బరువుంటుందట 1889వ సంవత్సరంలో పారిస్ నగరంలో జరిగిన ఎగ్జిబిషన్‌లో ప్రదర్శన నిమిత్తం ఈ ఇనప గోపురం నిర్మించాడట చుట్టూ చక్కని పార్కు, అందులో అందమైన గడ్డిబయళ్లూ, ఆమధ్య ఈ గోపురం నాలుగు పాదాలమీద నిలబడి పైకి పోను పోను, సన్నంగా ఉంటుంది. ఈ ఇనప గోపురం, క్రింది నుంచి మనుష్యులు కాలినడకనే పైకిఎక్కవచ్చు కాని ఎలక్ట్రిక్ లిఫ్టుమీద స్తంభం మూడువంతులకిపైగా వెళ్ళాక అదొక మజిలీ, ఆ మజిలీలో లిఫ్టుదిగి గోపురంచుట్టూ తిరిగి అంత ఎత్తుమీదనుంచి పారిస్ నగరాన్నంతనీ చూడవచ్చు ఆ దృశ్యం ఎంతబాగా ఉందని! సీన్ నదీ, వీధులూ అన్నీ చిన్నచిన్న పాము

ళ్లాగ కనపడతాయి పెద్దపెద్ద భవనాలన్నీ అగ్గిపెట్టెలతో కట్టిన బొమ్మరిళ్లలాగ కనపడతాయి. ఆ మజిలీదాటి ఇంకొక లిఫ్టుమీద ఇంకాపైకి, శిఖరాగ్రం చేరు కోవడానికి మేఘాలనికూడా దాటిపైకిపోయాం. శిఖరం అంతస్తుమీద ఒకేసారి 50 మంది మనుష్యులు నిలబడడానికి చోటుఉంది మనకీ భూమికీ మధ్య మేఘాలు ప్రయాణాలు సాగిస్తాయి మేఘాలు తెరపి ఇచ్చినప్పుడు భూమి కనపడుతుంది. మేఘాలకి పైగానిలబడి మన కాళ్లకిందనుంచి మేఘాలుపోతుంటే మనకి ఎంత బడాయిగా ఉంటుందో ఆలోచించుకో అమెరికాలోని లిబర్టీ స్టేట్యూ ఎత్తు 300 అడుగులేకదా, దానికి మూడురెట్లు ఉంది ఇది మనదేశంలో కుతుబ్‌మినార్ కంటే కూడా చాలా ఎత్తన్నమాట దీనిమీద హమేషాగా ఫోటోగ్రాఫర్లు కాచు కుని కూర్చుంటూను వచ్చే యాత్రికుల ఫోటోలు తీస్తారు ఆ టవర్‌ని బ్యాక్ గ్రౌండ్‌గా ఉంచి. నేను తీయించుకోలేదులే, అలిసిపోయి క్రిందికి దిగి వచ్చిన వాళ్ళందరూ దానిచుట్టూ ఉన్న గడ్డి బయళ్ళలో విశ్రాంతి తీసుకుంటూ, చిరుతిళ్లు తింటూ ఉంటారు కొందరు అక్కడికి పిక్‌నిక్‌లు చేసుకోడానికికూడా వస్తారు.

ఇక్కడ ఇప్పుడిప్పుడే చలి ప్రారంభిస్తూఉంది మనకి ఎక్కువగానే ఉంటుందనుకో' నవంబరు నెలకదా! రాత్రిళ్ళు పొడవుగా ఉంటున్నాయి. పగలు తక్కువ సాయంకాలం అయిదుగంటలకే ప్రొద్దుపోతూఉంది ఉదయం 7-30 గంటలకి గాని సూర్యోదయం కావడంలేదు చలి ఇప్పుడే ఎక్కువగా ఉంటూఉంది కదా శీతాకాలంలో అయితే వీళ్ళు ఎలాగ భరిస్తారు అని అనుకుంటూ ఉంటాను

ఇక్కడ మాహోటేల్లో బసచేస్తూ ఇండిపెండెంట్ స్టేట్సు తాలూకు ఇద్దరు మహారాజులు ఉన్నారు వాళ్ళ చిత్రచర్య చూస్తూంటే చాలా జాలి వేస్తుంది వాళ్ళు పగలు ఎక్కడా కనపడరు ఎలా కనపడతారు? రాత్రంతా తాగి తందనాలాడి పగలంతా నిద్రపోతారు. సాయంకాలం చక్కగా డ్రెస్‌చేసు కుని క్రిందికి దిగుతారు వాళ్ళకి లోటేమిటి ఊళ్ళో? బ్రోకర్లకి కరువులేదే ఎవ రినో లంకించుకుని ఏ కెబెరేకో తీసుకుపోతారు అక్కడ తినడం, త్రాగడం, దొర్లడం, తెల్లవార్లూ. తెల్లవారుతూఉంటే తిరిగి వస్తారు. కార్లోనుంచి దిగలేరే పాపం అలిసిపోయి కాదు ఒళ్ళుతెలియక డ్రైవరూ, రిసెప్షనులో ఉన్నవాళ్లూ, సాయంబట్టి మోసుకొచ్చి లిఫ్టులో పడేస్తారు అక్కణ్ణుంచి మోసుకెళ్లి గదిలో మంచంమీద పడేస్తారు

ఇక్కడి ఆహారం నాకునచ్చిందోయ్ ఎలాగూ ఫ్రెంచివాళ్ళు గొప్ప భోగం అనుభవిస్తారులే! పంటలు రకరకాలైనవి చేస్తారు ఫ్రెంచి వంటకాలు చాలా ప్రసిద్ధికెక్కాయికదా! అమెరికాలోనూ, ఇంగ్లండులోనూ ఉన్న గొప్ప గొప్పహొటేళ్ళల్లోనూ, ధనవంతుల ఇళ్ళల్లోనూ వంటకి ఫ్రెంచివాళ్ళనే పెట్టు కుంటారు వంటకాల పేర్లన్నీ ఫ్రెంచిభాషలోనే ఉంటాయి

ఊరంతా ఒకటీ ఉలిపికట్టెదొకటీ అన్నట్టు, ప్రపంచానికంతకి విరుద్ధంగా ఒకటి ఇక్కడ కనపడుతూంది మనదేశంలోనేమి, అమెరికా ఇంగ్లాండుల్లో నైతేనేమి మనుష్యులూ మోటారు కార్లూ, రోడ్డుకి ఎడమవైపుగా నడుస్తాయి మనం వెడుతుంటే ఎదురుగావచ్చేకారు మనకి కుడివైపున వస్తుంది ఇక్కడ ఫ్రాన్స్‌లోమాత్రం దానికి విరుద్ధం ఇక్కడ ఎడమవైపున కాక రోడ్డుకి కుడి వైపున నడుస్తాయి కార్లు ఎదురుగావచ్చేవి మన ఎడమచేతికి దగ్గరగావస్తాయి. కొత్తగా ఈ దేశంవచ్చే మోటారు డ్రైవర్లు కొంత తికమకపడతా రనుకో; ఇక్కడి ట్రాఫిక్ రూల్సు ఆవిధంగా పెట్టేరు పారిస్‌లో చాలాపెద్దవైనవీ, అందమైనవీ మోటారుకార్లు కనపడతాయి

ఇంకఉంటాను, మళ్ళీవారం వ్రాస్తానులే!

నీ,

వేంకటరావు.



Hotel Claridge
Paris
13th November 1930

ప్రియమిత్రుడు పెమ్మరాజుకు,

ఈ దేశాలనుంచి నేను వ్రాసే ఆఖరి ఉత్తరం ఇదే నీకు ఎందుచేతంటే వచ్చేవారం మేము తిరిగి స్వదేశానికి ప్రయాణం అవుతున్నాం మళ్లీ త్వరలో మీఅందరి మధ్యా ఉంటాం దాదాపు ఏడుమాసాలు కావొస్తోంది మిమ్మల్ని విడిచి పెట్టి వెళ్ళి ఇంతపెద్దకాలం మనం ఎప్పుడూ చూచుకోకుండా ఉండలేదు మళ్ళీ త్వరలోనే మనం కలుసుకుంటాంఅని చాలా సంతోషంగా ఉంది అయినా ఈ వియోగమే బాగాఉందా అని అనిపిస్తోంది రాయప్రోలువారు అన్నారు, "సరస సాంగత్య సుఖవికాసముకన్న, దుస్సహ వియోగభరమె మధురము సకియ" అని ఏమైనా వచ్చే 19వ తేదీని ఇక్కడ్నుంచి బయలుదేరతాం డిసెంబరు 7వ తేదీని పిఠాపురంలో ఉంటాం

పారిస్ సంబరాలన్నీ దాదాపు చూడడం అయిపోయింది మొన్నను ఒక రాత్రి చాలా ఆశ్చర్యకరమైన ప్రదర్శనం చూశా పారిస్‌లో నాటకాలలాంటివి ప్రదర్శిస్తూ ఉంటారు. ఒక ప్రదర్శనశాలని "ఫాలీస్ బెర్‌జేర్" అంటారు. అక్కడ రోజుకి రెండు ప్రదర్శనలు ఇస్తూంటారు ఒకటే నాటకం, రోజూ రెండుసార్లు అలా ఆరునెలలు అదే ఆడతారు ఈ ఫాలీస్ బెర్‌జేర్ ప్రదర్శనం ప్రపంచంలో చాలా పేరుకెక్కింది పశ్చిమదేశాలు ఇంగ్లాండు, అమెరికా నుంచీ, తూర్పుదేశాలు ఆస్ట్రేలియా జపాన్ మొదలైన వాటినుంచీ ప్రత్యేకంగా ఈ ప్రదర్శనం చూడడానికే పారిస్ వస్తూంటారు దీనికి టిక్కెట్టు ఖరీదు చాలా ఎక్కువ మేము ఒక్కొక్క టిక్కెట్టుకి పదేసి పౌనులు ఇచ్చాం ఇక్కడ చూచిందేమిటంటే డాన్సు, ఒక సీనులో తెరఎత్తేసరికి ఒకేసారి వందమందికి తక్కువ కాకుండా అమ్మాయిలు అందరూ ఒకేమాదిరి దుస్తులు ధరించి నృత్యం చేశారు ముందు రకరకాల వాద్యాలతో పెద్ద ఆర్కెస్ట్రా మోగుతూవుంటే

ఈ ఏంచమందీ స్టేజి అంతా అలుముకుపోయి, రకరకాలైన పోజులతో భంగిములు చూపిస్తూ అందరూ ఒకేవిధంగా నాట్యంచేస్తారు బేలెట్ డాన్సు అంటారు దీన్ని వాళ్ళ చురుకుదనం, వాళ్ళ కదలికలలో సిమెట్రీ, చూస్తూంటే ఎంత ట్రెయినింగ్ ఇచ్చిఉండాలో అనుకున్నా ఇంకొక సీనులో తెరఎత్తేసరికి స్టేజి అంతా ఒక పెద్ద సరోవరంలాగ కనపడుతుంది. నిజంగా నీళ్ళు' నీళ్ళ కదలడం, చిన్నచిన్న అలలు కొట్టుకోడంకూడా స్పష్టంగా కనపడింది ఆనీటిమధ్యలో ఒక పెద్ద తామరమొగ్గ, ముడుచుకునేఉండి సన్ననిగాలి వీచింది మొగ్గ కదిలింది వెనుకనుంచి సూర్యోదయం అవుతూఉంది తామరమొగ్గ రేకులు ఒక్కొక్కటే విచ్చడం మొదలుపెట్టింది ఆ పువ్వుమధ్యలో ఒక అమ్మాయి కూర్చునిఉంది ఆమె పాటపాడడం మొదలుపెట్టింది సూర్యుడు ఈవైపునుంచి ఆవైపుకి మెల్లగా జరిగిపోయాడు తామర రేకులు ఒక్కొక్కటే ముడుచుకు పోయాయి చీకటి పడింది సీనుముగిసింది

ఇంకొక సీనులో ఆక్రొబేటిక్సు అంటారే ఆ డాన్సు ఇద్దరు అమ్మాయిలూ ఒక మగవాడున్నూ, వాళ్లిద్దర్నీ నిమ్మకాయలు ఎగరవేసినంత తేలికగా ఆడించాడు బొటనవ్రేళ్ళమీద నిలబడి గిర్రునతిరుగుతూ ఎంతఎత్తు ఎగురుతారని వీళ్లు, ఎన్నిమొగ్గలు వేస్తారని' ఇలా చెయ్యి ట్టుకుని లాగేసరికి అమాంతంగా అమ్మాయంతా అతని అరిచేతిలోకి వచ్చేస్తుంది సర్కస్ పిట్లలాంటి వీళ్ళ నాట్యంచూస్తూంటే వీళ్ళు ఇంతతేలికగా గాలిలో ఎగిరిపోతున్నారే, దూదిపింజెలకంటే తేలికావీళ్ళు అనిపిస్తుంది

ఇంకొకసీను తెరఎత్తారు ఒక అరణ్యం కనపడ్డది లోపలినుంచి సంగీతం, దానిలో అప్పుడప్పుడు నెమలి అరుపులు స్టేజిమీదికి కాదు – అడవిలొకి – జరజరామని ఒక పెద్ద నెమలిపిట్ట వాలింది ఈ ప్రక్కనుంచి ఆప్రక్కకి మేఘాలు ప్రయాణం చేస్తున్నాయి నెమలిపిట్ట పాడడం మొదలుపెట్టింది నృత్యం చెయ్యడం ప్రారంభించింది ఈ నెమలిపిట్టగా నృత్యంచేసిన ఆమెపేరు జోసెఫైన్ బేకర్ అట సన్నంగా ఉంది నీగ్రో అమ్మాయట ఆమే పాడింది ఆమే నృత్యంచేసింది ఈమె పాటకోసమే ప్రజలంతా ముగ్ధులైపోతారు ప్రపంచంలో గొప్పగా సంగీతం పాడేవాళ్లల్లో ఈమె రెండోదో మూడోదోనట ఎంతచక్కగా పాడిందని। ఆపాటలో నెమలికంఠస్వరం అక్కడక్కడ విన

బడుతూ ఉంటే, మేఘాలు పట్టంగా సాగుతూపోతూంటే ఇంతలో వెళ్లాడుతూఉన్న తోక ఒక్కసారి పైకిలేచి పురివిప్పి ఆడుతూంటే మాటంగా ఉన్న చెట్టుమీదినుంచి ఇంకొకనెమలి దిగింది ఇంక ఇద్దరూ చేసిన నాట్యం ఎంత చక్కగా ఉందో చెప్పలేను

అన్నిటికంటె నాకు మహా ఆశ్చర్యం కలిగించింది తుఫానుసీను ఏం ఏర్పాట్లు చేశారోగాని నిజంగా స్టేజిమీద పెద్దపెద్ద కెరటాలతో నిజం సముద్రమే తరవాత ఉరుములూ మెరుపులూను, వెంటనే వాన నీళ్ళలేచి కెరటాలు విరిగి పడడం, గాలివానకి చెట్లువిరిగిపడడం నీటిలో చిన్న తెప్ప ఇటూఅటూ కొట్టుకుని బోర్లాపడడం ప్రళయంవస్తే ఎలా ఉంటుందో అదంతా స్టేజిమీద అయిదు నిముషాల్లో చూపించారు ఇదంతా నిజమా స్వప్నమా అని అనిపించింది సీనుకీ సీనుకీమధ్య ఏర్పాట్లు రెండునిముషాల్లో జరిగేవి రివాల్వింగ్ స్టేజిఅట. ముందు గానే అన్ని ఏర్పాట్లూ అన్నిసీనులకీ చేసిఉంటాయట ఒకసీను అయిపోవడం తోనే రెండో సీనుకి ఏర్పాట్లు స్టేజిమీద అక్కడే చేయకుండా ఇంకొక స్టేజి స్టేజి పళంగా వచ్చి ఉంటుంది

ఇంకొక విషయంగురించి వ్రాయాలి గ్రేట్ వార్ నవంబర్ 11వ తేదీని విరమించారు కదా, ప్రతినవంబరు 11వ తేదీనీ ఆర్మిస్టిస్ డే ఉత్సవాలు ప్రతి దేశంలోనూ జరుపుతారు మొన్న 11వ తేదీని ఇక్కడ కూడా ఉత్సవం జరి గింది మా షాజ్ఎలీజ్ వీధి గుండానే ఊరేగింపువచ్చింది ఆ ఊరేగింపులో, కాల్బలమూ, ఫిరంగీదళం, అశ్వదళం, సైన్యానికిచెందిన అన్నిశాఖల తాలూకు యుద్ధసామగ్రీ, నేవీకి సంబంధించిన యుద్ధనౌకలూ, జలాంతర్గాములూ విమా నాలూ, వీటన్నిటినీ రెండుమైళ్ళ పొడవున ఊరేగించారు బాండ్ వాద్యాలు విన బడుతూఉంటే సైనికులు ఆవాద్యాలకి అనుగుణంగా నడుస్తూఉంటే వీధికి రెండు వైపులాఉన్న పేవ్ మెంట్సుమీద ఇసకవేస్తే రాలకుండా క్రిక్కిరిసిఉన్న జనమూ, మేడలమీదా, బాల్కనీస్‌మీదా నిలవబడ్డజనమూ జేజేలు కొట్టుతూఉంటే ఎంతో ఉత్సాహంగానూ, సరదాగానూ ఉంది ఈ ఊరేగింపుఅంతా ఆర్క్ ఆఫ్ ట్రయంఫ్ గుండా సాగిపోయింది అక్కడ ఉన్న అజ్ఞాతవీరుని స్మృతి చిహ్నం మీద లెక్కలేనన్ని పూలచక్రాలు వేశారు

పశ్చిమదేశాల్లో పేరుపడ్డదేశాలు అన్నీ చూశాం మొదట ఇంగ్లాండు - మన పరిపాలకులదేశం చరిత్రాత్మకమైన కోటలూ, భవనాలూ చూశాం.

మనస్సుకి ఆహ్లాదంకలిగించే చక్కని దృశ్యాలూ, పూలవనాలూ, సరోవరాలూ చూశాం ప్రజలతోనూ కలిసిమెలిసి తిరిగాం ప్రభువులనీ, మధ్యతరగతి వాళ్ళనీ బీదవాళ్ళనీ, చూశాం వాళ్ళ ఆచారవ్యవహారాలు తిలకించాం వాళ్లు కూడా మనకంటేఎక్కువగా పూర్వాచారాలను పాటిస్తారు మూఢాచారాలనుకూడా పాటిస్తారు పాతపుక్కిటి పురాణగాథలను వాళ్లూ నమ్ముతారు చదవడం వ్రాయడం వచ్చినవాళ్ళ సంఖ్య ఎక్కువగానే ఉండవచ్చు కాని సంస్కారం? మనదేశంలో పల్లెటూళ్ళల్లో ఉన్న కరణాలూ మునసబులూ, ఉంటారే వాళ్ళమాత్రం తెలివితేటలుకాని ప్రజ్ఞగాని ఉన్నట్టుకనిపడదు ఇక్కడ ఒక సామాన్యుణ్ణి తీసుకో, మనదేశంలో ఒకసామాన్యుణ్ణి తీసుకో పోల్చిచూస్తే అన్నివిధాలా మనవాడే మెరుగనిపిస్తాడు ఆర్థికంగా వాళ్లు మనకంటే హెచ్చుస్థాయిలో ఉన్నారు మనల్నీ ఇతరవలస రాజ్యాలనీ కొట్టుకుతింటున్నారు కనుక ఆడాళ్లూ మగాళ్లూకూడా ధనం సంపాదిస్తారు ఎంతఉన్నప్పటికీ కుటుంబంలోనూ, సంసార జీవితంలోనూ మనవాళ్ళకంటే ఎక్కువసుఖం అనుభవిస్తున్నారంటే నేను నమ్మ లేకపోతున్నాను ఆయితే ఇతర దేశాలవాళ్ళకంటే ఇంగ్లీషు వాళ్లే కొంచెం మంచివాళ్లలా కనపడుతున్నారు

అమెరికా వెళ్లాం దానికి చరిత్రలేదు, కొత్త దేశం వాళ్ళకి సర్వవిధాలా అభివృద్ధి సాధించాలని ఉబలాటం ఊరికే ఆకాశంలోకి పెరిగిపోతున్నారు ధనంతో మునిగిపోతున్నారు ప్రతివిషయంలోనూ వేగంఎక్కువ విశ్రాంతీ సావధానంగా పనులుచేసుకోవడంలేదు వివాహాలు చేసుకోవడంకూడా ఎంత తొందరగా చేసుకుంటారో అంత తొందరగానూ విడాకులు ఇచ్చుకుంటారు

యూరప్‌లో స్వీడెన్, స్విట్జర్‌లాండ్ మొదలైన దేశాలలో ప్రజలు శాంతంగా, చక్కగా ఏకొరతాలేకుండా సుఖంగా జీవితాలు గడుపుకుంటున్నారని అనుకుంటూ జర్మనీ, ఇటలీ, ఫ్రాన్స్ మొదలైనదేశాలు యుద్ధాలలో చిక్కుకుని, నష్టాలపాలై తిరిగి స్వస్థత చేకూర్చుకోడానికి సర్వవిధాలా పోటీపడుతూ యూరప్‌లో ఒకరికి ఇంకొకరు తీసిపోకుండా ఉండడానికి పాటుపడుతున్నారని పిస్తుంది చరిత్రకు సంబంధించినవీ, మతానికి సంబంధించినవీ, దృశ్యాలేమిటి, కళాఖండాలేమిటి ఎంతో ఆనందం ఇచ్చాయి ఫ్రాన్సుదేశంగురించి చాలామంది

తప్పులభిప్రాయపడతారు ప్రజలలో నీతి, నియమం లేకపోలేదు అయితే పారిస్‌లోమాత్రం ఆవిధంగా సంచరించడం ప్రభుత్వం పోఁసీవల్ల ననుకుంటా ఫ్రాన్సుదేశంలో పల్లెపట్టులలో నివసించడం చాలా సౌకర్యంగా ఉంటుందట

ఏమైనా, మన సంప్రదాయాలూ, మన సంస్కృతులూ, మన సంస్కారాలూ ఉత్తమమైనవనే నమ్మకం నాకు కలుగుతూఉంది వాళ్ళవద్దనుంచి నేర్చుకోవఁ సినవి చాలాఉన్నాయనుకో' వాళ్ళు కాలం వృధాపుచ్చరు ఎవరిపని వాళ్లు చేసు కుంటారు వ్యాపారంలో మోసంతక్కువ స్వదేశాభిమానం మిక్కుటం

ఈ దేశాలల్లొ స్త్రీలకి సౌందర్య పిపాస ఎక్కువ అందంగా కనపడాలని ఎన్నో పైపూతలూ, మెరుగులూ పెట్టుకుంటారు ఆభరణాలమీద కంటే దుస్తులమీద ఎక్కువ ఖర్చు పెడతారు అందరికి వ్రాయడం, చదవడం వస్తుంది చాల మందికి సంస్కారం తక్కువ వివాహం కావడానికి ముందే ఏదో ప్రతివాళ్ళూ సంపాదింమకుని స్వంత సొమ్ము దాచుకుంటారు ఏదో వృత్తి చేస్తుకుంటారు మన దేశంలోలాగా పూర్తిగా భర్త సంపాదనమీద ఆధారఁడి ఉండరు ముఖ్యంగా నగరాల్లో ప్రతి ఆడదీ ఏదో పనిచేసి సంపాదిస్తే నేగాని గడవదు జీవితం సుఖంగా గడపాలనే ఆశతో ఉంటారు శరీర వ్యాయామం చేస్తారు ఏవేవో ఆటలు ఆడతారు ఈత ఈదడం అందరికీ వస్తుంది గుర్రపు స్వారీ చేస్తారు చాలమంది శారీరకంగా సౌష్టవంగా ఉంటారు వరుణ్ణి ఎంచుకోవడంలో స్త్రీలకి స్వతంత్ర్యం ఉంది ప్రౌఢా వివాహాలవల్ల, స్వయంవరం వల్లా సంసారాలు సుఖంగానే జరుగుతున్నట్టు కనపడుతూంది. కొత్త కోడలు మొగుడికీ కుటుంబానికీ బానిసగా ఉండదు, అయితే స్త్రీకి ఏదేశంలోనైనాసరే, ఇల్లు సరిచేసుకోవడం, వంటచేసుకోవడం, పిల్లల్ని కనడం పెంచడం తప్పడం లేదు. అయితే ఇళ్లల్లో మగ్గిపోక, తరుచూ బయటికిపోయి, ఏ సముద్ర తీరాలనో, ఏ పార్కులలోనో, ఏ సరోవర ప్రాంతాలలోనో వినోదంగా కాలక్షేపం చేస్తారు మనదేశంలోలాగే పల్లెటూరి పడుచులకీ నగరాల్లో ఉండే నారీమణులకీ నాగరికతలో అన్ని విధాలా తేడా ఉన్నట్టే ఈ దేశాల్లోకూడా అంతే.

మా యీ యాత్రని సైట్‌సీయింగ్ టూర్ అన్నారు రామణీయకమైన దృశ్యాలు చూశాం, ప్రకృతి సౌందర్యం తిలకించాం మ్యూజియములూ, కళా ౦డాలూ దర్శించాం రకరకాల మానవుల్నీ, జంతువుల్నీ, జంతువుల్లాంటి

మానవుల్నికూడా చూశాం, జన్మతరించింది ఇవన్నీ నామనస్సులో ముద్రలు వేసిఉన్నాయి ఎంతో ధనవంతులకిగాని లభ్యంకాని అనుభవం సంపాదించా ఈ ఆనందం, ఈ అనుభవం జీవితాంతంవరకూ మాసిపోకుండా మననం చేసు కుంటూ కష్టమూసుకుని ప్రపంచం అంతా చూస్తా ఇంతటి మహాదృష్టం కలి గించిన మా మహారాజావారినీ, నాతల్లి మహారాణీవారినీ, యువరాజావారినీ, రాజ కుమార్ గారినీ ఎల్లప్పుడూ తలుచుకుంటూ వారి యావత్కుటుంబానికి జీవితాంతం కృతజ్ఞణ్ణయిఉంటా

గాంధీగారు నడిపిస్తున్న ఉద్యమంలో జయంపొంది మనకీ స్వరాజ్యం వస్తే అర్థికంగా మనమూ బాగుపడతాం ఇతరదేశాలలో తలెత్తుకు తిరుగుతాం సైన్సులో మనమూ కృషిచేస్తాం మనమూ ఫేక్టరీలు కట్టుకుంటాం. మాంచె స్టర్‌నుంచి మనకి గుడ్డలు రానక్కరలేదు జర్మనీ నుంచి కత్తులూ కరార్లూరావు, చైనానుంచి సిల్కులు దిగవు. మనమే సకలసంపదలతోనూ తులతూగుతాం

నాయనా! ఈ పారిస్‌లో వచ్చే 19 వ తేదీని బయలుదేరి మార్సేల్సు వెళ్ళి అక్కడనుంచి 22వ తేదీని బొంబాయికి బయలుదేరివచ్చే 'మలోజా' అనే స్టీమరుమీద తిరిగివస్తాం పిఠాపురం డిసెంబరు 7వ తేదీకి చేరుకుంటాం స్వదె శానికి తిరిగివెడుతున్నాం అంటే ఉన్న ఆనందానికి అంతులేదు 'జగతియందు కలదె నాదు జన్మభూమివంటిది, సకల దేశములకు రాణి నాదు జన్మభూమి, నాదు జన్మభూమి" అనేపాట నన్ను ఆనందంలో ముంచేస్తూంది మళ్లీ మన జన్మస్థలం పిఠాపురం, మన కుక్కుటేశ్వరస్వామి దేవాలయం మన కుంతీమాధవస్వామి కోవెల, మన సూర్యారాయ పుస్తక భాండాగారమూ, మనమున్నూ.

వందే మాతరమ్

సీ
వేంకటరావు